# సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

# శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

# అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి

గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరవిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

# వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2990100028581

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

http://www.new.dli.ernet.in

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!



మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# పారిజాతాపహరణము

## జగన్నాథ విజయముతో తులనాత్మకానుశీలనము



పి. హెచ్. డి. పట్టముకొరకై
బెంగుళూరు విశ్వవిద్యాలయమునకు
1973 జనవరిలో సమర్పింపబడిన
సిద్ధాంతవ్యాసము

చన్నాప్రగడ తిరుపతిరావు
బెంగుళూరు విశ్వవిద్యాలయము
విశ్రాంతాంధ్రోపన్యాసకుడు

# కృ త జ్ఞ త లు

అయాచితంగా అప్లికేషన్ లేకుండా తమకళాశాలలో ఆంధ్రోపన్యాసక పదవిని నాకు పిలిచి ఇచ్చి, ఆవిధంగా బెంగుళూరు నివాసం, దానివల్ల కన్నడభాషా పరిచయం, బెంగుళూరు విశ్వవిద్యాలయంలో పరిశోధనచేసే అవకాశం కలిగించిన బెంగుళూరు ఆచార్యపాఠశాలా కాలేజి స్థాపక ప్రధానాచార్యులు దివంగత శ్రీ యన్. అనంతాచార్‌గారికీ—

విశ్వవిద్యాలయంలో తెలుగుభాషా విభాగం ఏర్పడకముందే తెలుగులో పి. హెచ్. డి. చేసే అవకాశం నాకు కలిగించిన అప్పటి కన్నడ భాషా విభాగాధ్యక్షులు ఆచార్య జి. యస్. శివరుద్రప్పగారికీ—

పరిశోధనలో నాకు మార్గదర్శకులుగా వ్యవహరించిన ఆచార్య తంగిరాల వేంకట సుబ్బారావుగారికీ—

తమ అమూల్యమైన సూచనలతో వ్యాసానికి జీవంపోసిన దివంగతులు శ్రీమాన్ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, పుట్టపర్తి నారాయణాచార్యులు ఆచార్య తిమ్మావఝుల కోదండరామయ్యగార్లకీ—

దీన్ని పి. హెచ్. డీ. కి అర్హంగా ఆమోదించిన తీర్పరులు కీర్తిశేషులు ఆచార్యులు దివాకర్ల వేంకటావధాని, జి. యన్. రెడ్డిగార్లకీ—

గ్రంథ ముద్రణకు ఆర్థికసహాయం చేసిన తిరుమల తిరుపతి దేవస్థానం అధికారవర్గానికీ—

గౌరవ పూర్వకంగానూ–

ముప్పైఏళ్ళుగా అసూర్యంపశ్యగా అటకమీదపడిఉన్న దీన్ని వెలుగులోకి తేవలసిందేనని పట్టుబట్టి సాధించిన నాకుమార్తె చి. సౌ. డా. జయలక్ష్మికీ—

ముద్రణ సమయంలో నాకు గౌరవశ్రద్ధలతో ఆతిథ్యసపర్యలుచేసిన మా (అన్నగారి) కోడళ్ళు చి. సౌ. ఉమాలక్ష్మి, చి. సౌ. భాస్కరలక్ష్మి కల్యాణిలకూ—

ఆశీఃపూర్వకంగానూ

—తిరుపతిరావు

# పరిమితులు

ఇది బెంగుళూరు విశ్వవిద్యాలయానికి ముప్పైఏళ్ళనాడు తెలుగులో పి. హెచ్. డి. డిగ్రీకై సమర్పింపబడిన తొట్టతొలి సిద్ధాంతవ్యాసం తులనాత్మక విమర్శలో నాకు మార్గదర్శకాలు కాదగిన గ్రంథాలు తెలుగులో ఏమిలేవు. హిందీలో రెండు మూడు వచ్చాయి కనుక నాకునేనే ఒక ప్రణాళికను ఏర్పరచుకోవలసి వచ్చింది. దివాకర్లవారి 'నన్నయ భారతం' ఒకవిధంగా సంస్కృత తెలుగు భారతాల తులనాత్మకానుశీలన ధోరణిలోనే నడిచింది. అంచేత వీలైనంతవరకు దాన్ని ఆదర్శంగా తీసుకున్నాను. ఇప్పుడుచూస్తే ఈవ్యాసం కొంత అసమగ్రం అన్నట్టు కనిపిస్తోంది. ముఖ్యంగా వక్రోక్తి ధ్వని అనే దృక్కోణాలతో పరిశీలన జరగలేదు. ఇప్పుడు చేసే ఓపికలేదు.

పరిశోధకులుగా, విమర్శకులుగా లబ్ధప్రతిష్ఠులైన పండితులు పెద్దల అభిప్రాయాలను కొన్నింటిని ఖండించవలసి వచ్చింది. ముఖ్యంగా విశ్వనాథవారి 'భజనపరుల' లో ఒకడినైన నేను, వారికొన్ని అభిప్రాయాలను ప్రామాణికంగా ఉదాహరించుతుంటూనే, మరికొన్ని అభిప్రాయాలతో ఏకీభవించలేక పోవటం నాకే బాధాకరంగా ఉన్నది. ఐనా అభిమాన దురభిమానాలకు అతీతంగా నిజమని నమ్మినదాన్ని 'నిర్మొగమాటం'గా ప్రకటించటం పరిశోధకుడి ధర్మం అని నమ్మినందున అలా చెయ్యక తప్పిందికాదు

రచన సరళ గ్రాంధికభాషలో, గ్రాంధికశైలిలోనే సాగింది. సాధారణంగా తెలుగుపండితు లందరికీ సంస్కృతం క్షుణ్ణంగానే వచ్చిఉంటుందనే నమ్మకంతో సంస్కృత శ్లోకాలకు తెలుగు అనువాదం ఇవ్వలేదు. అలాగే కన్నడభాషా పరిచయం ఉండటం అరుదుగనుక వారు కన్నడ మూలాన్ని సొంతంగా చదువుకొని కొంతవరకు అర్థంచేసుకోవటానికీ ముఖ్యంగా భాషాశైలి తెలియటానికీ, ఉపయోగపడుతుందనే ఉద్దేశంతో కన్నడ మూలంలోని సంస్కృత పదాలను, సమాసాలను, తెలుగు ప్రత్యయాలు మాత్రంచేర్చి అలాగే ఉంచటం,కన్నడ పదాలకు జ్ఞాతులైన తెలుగు పదాలనే ఎన్నుకోవటం, పద్యాలలోని పదాల క్రమాన్ని చాలవరకు అలాగే ఉంచటం జరిగింది. నేటి పండితుల అవసరాలనుబట్టి సంస్కృత శ్లోకాలకు అనువాదం ఇవ్వటం,గ్రంథమంతటినీ వ్యావహారికభాషలోకీ వ్యావహారికశైలిలోకీ అనువదించటం అవసరమె ననిపిస్తోంది. కాని ఇప్పుడాపని చెయ్యలేను. యథాతథంగానే ముద్రిస్తున్నాను.

ప్రాశాక ఒకతరం గడిచాక వెలువడుతున్న దీన్ని ఒకరిద్దరు ఉపయోగించుకో గలిగినా ధన్యుడనే.

— తిరుపతిరావు

# విషయసూచిక

## చతుర్థ ప్రకరణము – కథాంశ సమన్వయాదికము



అనుబంధములు :



తెలుగుకావ్యములు :

# ప్రమేయము

## కర్ణాటాంధ్రములు కవలపిల్లలు

ఆదికవుల నాటినుండి ఈ ఉభయభాషా సాహిత్యములమధ్య ఆదాన ప్రదానములు సాగుచుండెడివి. ఈ పరస్పర ప్రభావమునుగూర్చి కూలంకషమైన పరిశోధనలు జరుగుట సాహిత్యవికాస సమ్యగవగాహనకు అత్యవసరము.

ఆబాలగోపాలము ప్రీతిపాత్రుడైన నాయకుడు శ్రీకృష్ణుడు. అతని లీలలలో పారిజాతాపహరణ మొకటి. ఈపట్టున ఆతడు శృంగార వీరమూర్తిగా సాక్షాత్కరించుచున్నాడు. హృదయమును ఆకట్టుకొనుటలో ఈ రెండు రసములకు గలశక్తి అపారము. కనుకనే సంస్కృతాంధ్ర కర్ణాటకవులు పలువురు ఈ ఇతివృత్తమునుగొని కావ్యరచన గావించియున్నారు. కన్నడ భాషలో ఈ కథను గ్రంథస్థము గావించినవారిలో జగన్నాథ విజయ కావ్యరచయితయైన రుద్రభట్టు ముఖ్యుడు. తెలుగులో పారిజాతాపహరణమను పేరిటనే రసవత్తరమైన ప్రబంధమును రచించిన తిమ్మన ప్రధానుడు.

పారిజాతాపహరణ కావ్యమును, జగన్నాథ విజయమందలి పారిజాతహరణ కథాభాగముతో తులనాత్మక పరిశీలన గావించుట ఈ సిద్ధాంత వ్యాసముయొక్క ధ్యేయము.

ఈ ఉభయ కావ్యములకును, తత్కర్తలకును ఈ ఉభయభాషా సాహిత్యములలోగల స్థానమును, వీనికి మూలము లనదగిన సంస్కృతాంధ్ర కర్ణాటక కావ్యములకును వీనికిని గల సంబంధమును, కథా సంవిధాన రసపోషణాదులలో వీనికిగల సామ్యవైషమ్యములను ఎక్కువ తక్కువలను సవిమర్శముగ నిరూపించుట ఈ సిద్ధాంతవ్యాసపు ప్రమేయము.



# పారిజాతాపహరణము

## జగన్నాథ విజయముతో తులనాత్మకానుశీలనము

## ప్రథమ ప్రకరణము

### తిమ్మన, రుద్రభట్టుల వంశకాల స్థలాదికము

పారిజాతాపహరణ, జగన్నాథ విజయ కావ్యద్వయమునకు గల పరస్పర సంబంధమును, తులనాత్మకానుశీలనమును గావించుటకుముందు తత్కావ్యకర్త లైన తిమ్మన, రుద్రభట్టుల వైయక్తిక విశేషములను కొలదిగ ప్రస్తావించుట ఉచితము.

తిమ్మన వంశము :

పారిజాతాపహరణ కావ్యకర్త సారసారస్వతాభినంది నంది తిమ్మయ కవీంద్రుడు. తిమ్మకవి తన వంశమును గూర్చి పారిజాతాపహరణ కావ్యము చివర ఒక సీస పద్యములో చెప్పుకొని యున్నాడు.

కౌశిక గోత్ర విఖ్యాతుఁ డాపస్తంబ
సూత్రుఁ డార్వేల పవిత్ర కులుఁడు
నంది సింగామాత్యునకును దిమ్మాంబకుఁ
దనయుండు సకల విద్యావివేక
చతురుఁడు మలయమారుత కవీంద్రునకు మే
నల్లుండు కృష్ణరాయ క్షితీశ
కరుణా సమాలబ్ధ ఘనచతురంతయా
నమహాగ్రహార సన్మానయుతుఁడు

తిమ్మయార్యుండు శివపరాధీనమతి య
ఘోర శివగురు శిష్యుండు పారిజాత
హరణమను కావ్యమొనరించె నాంధ్ర భాష
నాదివాకర తారాసుధాకరముగ. — పారి. V. 108.

అశ్వాసాంత గద్యలలో కూడ తన గోత్రమును, తండ్రి పేరును తెలిపి కొనియున్నాడు. (ఇది శ్రీమదుమామహేశ్వర వరప్రసాదలబ్ధ సార సారస్వతాభి నంది నందిసింగయామాత్య పుత్ర, కౌశిక గోత్ర పవిత్ర సుజన విధేయ తిమ్మయ నామధేయ ప్రణీతంబైన పారిజాతాపహరణంబను మహా ప్రబంధంబు....) వీనివలన తిమ్మన అరువేల శాఖకు చెందిన బ్రాహ్మణుడనియు, కౌశిక గోత్రుడనియు; 'నంది' గృహ నామము గలవాడనియు, తిమ్మాంబా సింగయామాత్యుల కుమారుడనియు. మలయమారుత కవికి మేనల్లుడనియు తెలిసినది.

తిమ్మన తన తాత, ముత్తాతల పేర్లు చెప్పికొనలేదు. ప్రసిద్ధుడగుటచే తన మేనమామ మలయమారుత కవిని మాత్రము పేర్కొనినాడు. 'మలయి మారుత కవి' యనునది బిరుద నామము. ఈతని నిజ నామము ఘంట సింగయ. ఈతడు తన మేనమామయైన నంది మల్లయతో చేరి వరాహ పురాణము, ప్రబోధ చంద్రోదయము, 'కవుల షష్ఠము' అను నామాంతరము గల భాగవత షష్ఠ స్కంధము అను గ్రంథములను రచించియున్నాడు. ఈ జంట కవులు ప్రబోధ చంద్రోదయములో తమ వంశావళిని ఒక సీస పద్యములో చెప్పికొని యున్నారు.

కలఁడు కౌశిక గోత్ర కలశాంబురాశి మం
    దారంబు సంగీతనంది నంది
సింగమంత్రికిఁ బుణ్యశీల పోతమ్మకు
    నాత్మసంభవుఁడు మల్లయ మనీషి
యతని మేనల్లుఁ డంచిత భరద్వాజ గో
    త్రారామ చైత్రోదయంబు ఘంట
నాగధీమణికిఁ బుణ్యచరిత్ర యమ్మలాం
    బకుఁ గూర్మితనయుండు మలయ మారు

తాహ్వయుఁడు సింగనార్యుండు నమృతవాక్కు
లీశ్వరారాధకులు .... ....

— ప్రబోధ చంద్రోదయము (అవతారిక)

దీనివలన ఈక్రింది వివరములు తెలియుచున్నవి. కౌశిక గోత్రములో నంది సింగయ మంత్రి జన్మించెను. ఆతనికి 'సంగీత నంది' అను బిరుదము కలదు. సింగయ భార్య పోతమ్మ. వీరి కుమారుడు మల్లయ్య— జంట కవులలో నొకడు. ఈ మల్లయ సోదరి అమ్మలాంబకు భారద్వాజ గోత్రీయుడైన ఘంట నాగయకు కుమారుడు మలయమారుత బిరుదాంచితుడైన సింగయ- జంట కవులలో రెండవవాడు. జంట కవులు తెలిపిన వివరముల నాధారముగ గొని తిమ్మన వంశమును మరికొంత వెనుకవరకు కనిపెట్టు ప్రయత్నములు సాగినవి. వానిలో చాగంటి శేషయ్యగారు కూర్చిన వంశవృక్షము సంభావ్యముగా నున్నది. [ఆంధ్రకవి తరంగిణి Vol. VII పుట 224]. అది ఇట్లున్నది.

(సంగీతనంది) నంది సింగమంత్రి I = భార్య పోతమ్మ




ఈ వంశవృక్షము వలన నంది సింగయలు ఇద్దరైనారు. వారు సుమారు రెండు తరముల వ్యవధానము గలవారు. ఒకే ఇంటిపేరిటివారైనను వారికి గల బాంధవ్యమెట్టిదో మనకు తెలియదు.

ముత్తమునకు తిమ్మనది పండిత వంశము. ఆతని మేనమామ ఘంట సింగయ 'మలయమారుత కవి' బిరుదాంచితుడైన ప్రౌఢ కవి. ఆతని మేన మామ నంది మల్లయ కూడ కవియే. వీరిరువురును బహు గ్రంథకర్తలు. మల్లయ తండ్రి నంది సింగయ మంత్రి సాహిత్య వైదుష్య మెట్టిదో మనకు తెలియదు. ('ఆనంద రంగరాట్ఛందము నంది సింగన 'వామన పురాణము' నుండి 2 పద్యములను, 'బలరామ విజయము' నుండి ఒక పద్యమును ఉదహరించినది. III 171, 175, 176.) ఆ సింగన తిమ్మనకు తండ్రియో ముత్తాతయో కావచ్చును. అతడు 'సంగీత నంది' అను బిరుదము నందిన సంగీత విద్వాంసుడు కూడ. ఇట్లు తిమ్మన పుట్టుకతోనే సంగీత, సాహిత్యము లకు వారసుడైనాడు.

'ముక్కు' శబ్ద విచారము :

తిమ్మన ఇంటి పేరు 'నంది' అని పారిజాతాపహరణము వలన తెలియు చుండగా, అది యేలనోగాని అతడు 'ముక్కు తిమ్మన' అను పేరిట ప్రసిద్ధుడైనాడు. అనేక చాటు పద్యములలోను, గ్రంథములలోను ముక్కు తిమ్మన అను పేరే కానవచ్చుచున్నది. ఇదికాక కృష్ణరాయల గయా శాసనములో కూడ ఈ శాసనము 'ముక్కు తిమ్మయ వ్రాసెను' అని శిలాక్షరముగ నున్నది. ఈ 'ముక్కు' తిమ్మనకు లభించిన పౌరుష నామమని ఒక దంత కథ వ్యాపించి యున్నది. ముక్కును వర్ణించుచు తిమ్మన రచించిన ఒక పద్యము వలన ఆతనికి ముక్కు తిమ్మన అను ప్రసిద్ధి కలిగినట్లు చెప్పుదురు. కాని ఇది కేవలము కట్టుకథ. నమ్మదగినది గాదు.

'ముఖ' శబ్దమునకు వికృతి 'ముక్కు'. రాయలవారి ఆస్థానములో ప్రధాను డగుటచే ఆయనకు 'ముక్కు' అని పేరేర్పడి యుండునని ఒక ఊహ. 'ముక్కు' ఇంటిపేరు గలవారు నేడును ఉన్నారు. తిమ్మన ఆ వంశమునకు చేరినవాడగునాయుని మరొక ఆలోచన. కాని 'ముక్కు' వారు యాజ్ఞవల్క్యుల లోను, తెలగాణ్యులతోను, వేగినాటివారిలోను మాత్రమున్నారు. వారు క్రమముగా భారద్వాజ, ఆత్రేయ, కౌండిన్య గోత్రీకులై యున్నారు. తిమ్మన తాను కౌశిక గోత్రజుడననియు, ఆర్వేల వాడననియు చెప్పికొనియున్నాడు గదా.

చివరకు మిగిలినది ఇంకొక ఊహ. తిమ్మనకు ముక్కు కొంత పొడవుగా నుండెడిదేమో; లేక అతడు ముక్కుతో మాట్లాడెడివాడేమో. ఆ కాలమున విజయనగరములోను, తత్పరిసరములలోను తిమ్మన నామధారులు చాలమంది ఉండెడివారు. వారందరిలో మన తిమ్మనను గుర్తించుటకై అతనిని ముద్దుగా ముక్కు తిమ్మన అని పిలచెడివారేమో. అతడు కూడ సరసుడు కనుక ఆ పౌరుష నామము నంగీకరించినట్లు ఉపర్యుదాహృత శాసనమే తెల్పుచున్నది గదా.

**తిమ్మన జన్మస్థలము :**

తిమ్మన జన్మస్థలమును గూర్చిన నిశ్చయాత్మకమైన సాక్ష్యాధార మేదియును లేదు. తిమ్మన జన్మస్థానము గన్నవరమని, గణపవరమని, గుంటూరు మండలమని, నెల్లూరు ప్రాంతమని పలువురు పండితులు పలు విధములుగా ఊహించిరి. కాని దేనికిని బలమైన సాక్ష్యాధారములు లేవు.

తిమ్మన తిరుమలదేవివారి అరణపు కవియని జన శ్రుతి కలదు. ఆమె శ్రీరంగ పట్టణాధీశుడైన కుమార వీరశ్యామల రాయని కుమార్తె. కనుక తిమ్మన జన్మస్థానము శ్రీరంగ పట్టణ సమీపవర్తియై యుండవలెను. ప్రస్తుతపు మైసూరు రాష్ట్రము నందలి కోలారు జిల్లా చిక్కబళ్ళాపురము తాలూకాలో చారిత్రిక ప్రసిద్ధి గల 'నంది' అను గ్రామము కలదు. శ్రీకృష్ణదేవరాయల కొలువునందలి అష్టదిగ్గజ కవి ప్రశంస గలదిగా ప్రసిద్ధమైన నంది దుర్గ శాసనము ఈ గ్రామ సమీపముననే గలదు. ఊళ్ళ పేర్లే ఇంటిపేర్లుగ పరిణమించుట సాధారణము. తిమ్మన తమ ఊరివాడే అని ఆ ఊరినారు నమ్ముచున్నారు. తిమ్మన వంశీయులమని చెప్పికొనువారును అచట నేటికిని కలరు. కనుక తిమ్మన జన్మస్థానము 'నంది' గ్రామమే అని నమ్మదగియున్నది.

**తిమ్మన కాలము :**

తిమ్మన విజయనగర సింహాసనాధీశ్వరుడగు శ్రీకృష్ణ దేవరాయల (క్రీ. శ. 1510-1530) కొలువులోనుండి ఆయనకు తన కావ్యము నంకితమొసంగినవాడగుటచే అతడును ఆ కాలపు వాడనుట నిశ్చయమే. కాని అతని జీవితకాల వ్యాప్తిని గూర్చి ఇదమిత్థమని చెప్పలేకున్నాము.

తిమ్మనకు అంతఃపురమునందు గల చనవు, స్వాతంత్ర్యములను బట్టియు, అంతఃపుర వ్యవహారములలో గైకొనిన చొరవనుబట్టియు ఆతడు పారిజాతాపహరణ రచనా కాలమునాటికి తగుపాటి వృద్ధుడై యుండవలెను. రామకృష్ణుడు తిమ్మనను 'తాతా' అని పిలచుట కూడ ఈ ఊహకే బలమిచ్చు చున్నది. పారిజాతాపహరణ రచనా కాలమగు 1516 నాటికాతడు ఏబదికి పైబడిన వాడనుకొనినచో అతడు 1460 ప్రాంతమున జన్మించి యుండును. ఇట్లు తిమ్మన కొంచెము కుడి ఎడమగా 1460-1530 సంవత్సరముల మధ్య జీవించెనని నమ్మవచ్చును.

**పారిజాతాపహరణ రచనా కాలము :**

తిమ్మన పారిజాతాపహరణమును రచించిన కాలమును తెలిపియుండ లేదు. కాని ఆ సమయమును గుర్తించుటకు అవసరమైన ఆధారములను మాత్ర మొసంగియున్నాడు.

పారిజాతాపహరణ అవతారికా భాగములోను, ఆశ్వాస అద్యంత పద్యములలోను కృతిపతి యగు కృష్ణరాయల విజయ ప్రశంసలు కలవు. రాయలు ఆయా దుర్గములను జయించిన తేదీలు ఆయనయే లిఖింపజేసిన శిలాశాసనముల వలన తెలియుచున్నవి. కనుక తిమ్మన పేర్కొనిన, పేర్కొనక విడచిన రాయ విజయముల వలన పారిజాతాపహరణ రచనా కాలమును గుర్తింప వీలగుచున్నది.

అవతారికా భాగమునందలి 'మునుకొని కొండవీడు' (I 21), 'ఉదయాద్రి సాధించె' (I 23) అను పద్యముల వలన కృతి సమర్పణ వేళకు రాయల పూర్వ దిగ్విజయ యాత్ర సాగుచున్నట్లును, ఉదయగిరి, వినుకొండ, కొండవీడు, బెల్లముకొండ, దేవరకొండ, జల్లిపల్లె, అనంతగిరి, కంబము మెట్టుల విజయము జరిగియున్నట్లును తెలియుచున్నది. కాని గ్రంథమందెచ్చటను సింహాచల విజయము గాని, పొట్నూరి జయస్తంభ స్థాపనముగాని పేర్కొనబడి యుండలేదు. పైగా 'ఉదయాద్రి' పద్యము చివర

బలనికాయము కాలిమట్టులనె యడఁచుఁ
గటకమును నింకననుచు నుత్కల మహీశుఁ
డను దినమ్మును వెఱచు .... .... " — (పారి. I 23)

అను భవిష్యత్కాల ప్రయోగము వలన రాయలు నేడో రేపో కటకము పైకి దండెత్తిపోనున్నాడని కూడ సూచితమగుచున్నది. కనుక తెలంగాణా దుర్గముల విజయానంతరము, సింహాచల విజయమునకు పూర్వము పారిజాతాపహరణ కృతి సమర్పణ జరిగియుండవలెనని ఊహింపగలుగు చున్నాము.

కొండవీటి విజయానంతరము రాయలు శా. శ. 1437 యువ ఆషాఢ బ. ౧౨ లకు సరియగు 8-7-1515వ తేదీన అమరావతి కేగి అమరేశ్వరుని సన్నిధిని తులాపురుష మహాదానము చేసినట్లు ధరణికోట శాసనము (**South India Inscriptions Vol. VI. No. 248.**) చెప్పుచున్నది. 'మౌక్తికి తులాభార ప్రదానోన్నతా' (V 107) అను సంబోధనలో దీనిని తిమ్మన సూచించి యున్నాడు. అమరావతి నుండి రాయలు 25-7-1515 తేదీకి విజయనగరమునకు విచ్చేసి శా. శ. 1437 యువ కార్తిక బ. ३లకు సరియగు 25-10-1515 తేదీన తిరుమల వేంకటనాథుని సేవించుకొనినాడు. (తిరుమల శాసనము **T. T D. Insc iptions Vol. III No 76**) మరల కొన్ని దినములు విజయనగరములో విశ్రాంతి గైకొని తిరిగి కళింగదేశ విజయార్థమై బయలుదేరి శా. శ. 1437 యువ పుష్య శు ౧౫ లకు సరియగు 20-12-1515వ తేదీన అహోబిలేశ్వరుని సేవించుకొన్నాడు. (**Local Records Vol. 15. P. P. 314-33.**) ఈ పర్యాయపు దండయాత్రలోనే రాయలు వరుసగా కొండపల్లి, అనంతగిరి, జల్లిపల్లె, కంబముమెట్టు మొదలగు తెలంగాణపు దుర్గములను జయించుచు ఏకథాటిని సింహాచలము వరకేగి యున్నాడు. సింహాచలమును రాయలు శా. శ. 1438 ధాతచైత్ర బ. ౧౨ లకు సరియగు 29-3-1516వ తేదీన సాధించినాడు. [సింహాచల శాసనము **South India In criptions Vol. VI No. 694**] కనుక పారిజాతాపహరణ కృతి సమర్పణ 20-12-1515 — 29-3-1516 తేదీలకు మధ్య జరిగి యుండవలెను.

కాని ఈ మధ్యకాలమున రాయలు విజయనగరమునకు వచ్చియుండక పోవుటవలన యుద్ధ యాత్రా మధ్యమున కృతి స్వీకరణోత్సవము జరుగుట ఎట్లని శంకించి విద్వాంసులు ఈ కృతి స్వీకరణోత్సవము దిగ్విజయ యాత్రకు పూర్వమో, అనంతరమో జరిగియుండునని ఊహించుచున్నారు.

కాని అట్లు జరుగుటకు ఆటంకమేమియు లేదు. కృష్ణరాయలు తనవెంట జైత్రయాత్రలకు కవులను గూడ తీసికొనిపోవుచుండువాడు. అట్లు తిమ్మన రాయల యుద్ధ యాత్రలలో పాల్గొనుచున్నట్లు రాయ వాచకము చెప్పుచున్నది. కనుక జైత్రయాత్రా మధ్యమున తిమ్మన కృతిసమర్పణ గావించుటకుగాని, రాయలు స్వీకరించుటకుగాని ఎట్టి ఆటంకమును లేదు.

ఇది ఇట్లుండ, ఈ జైత్రయాత్రా మధ్యమందే వసంతోత్సవము సంప్రాప్తమగుచున్నది. ప్రతి సంవత్సరము వసంతోత్సవమును వైభవముగ జరుపుట విజయనగర ప్రభువులకు ఆచారముగా వచ్చుచుండినది. కృష్ణరాయలు ఈ వసంతోత్సవ సమయమున నూతన కావ్య శ్రవణము గావించుచుండువాడు.

"ప్రతి వర్ష వసంతోత్సవ
కుతుకాగత సుకవి నికర గుంఫిత కావ్య
స్మృతిరోమాంచ విశంకిత
చతురాంతఃపుర వధూప్రసాదనరసికా". — పారి. I 139.

పై మాటకు శాసన ప్రమాణము కూడ నున్నది.

" .... ప్రతివర్ష ప్రవర్తిత కనక వసంత మహోత్సవేన .... " అని రాయలు పొగడబడి యున్నాడు. [T. T. D. Inscriptions Vol. III No. 68. Page 162.] కనుక అనువర్షము అనూచానముగ వచ్చుచుండిన ఆచారమును విడువకుండ వసంతోత్సవము నాచరించుటయు, ఆ ఉత్సవ కార్యక్రమములో నొక ముఖ్యాంశమైన కృతి స్వీకరణోత్సవమును గూడ జరుపుటయు జైత్రయాత్రా మధ్యముననే జరిగియుండుట సహజమే యగుచున్నది. ఆ కృతి పారిజాతాపహరణమే యగుటకును ఎట్టి ఆక్షేపణయు లేదు.

వసంతోత్సవమెప్పుడు జరుపబడుచుండెడిదో కనుగొనుట ఈ సందర్భమున అవసరమగుచున్నది. ఈ పండుగ పూర్వము చైత్ర శు. ౧౫ నాడాచరింపబడుచున్నను ఇటీవల ఫాల్గుణ శు. ౧౫ నాడు హోలీ పండుగగా ఆచరింపబడుచున్నదనియు విలియం మోనియర్, ఆప్టే నిఘంటుకారులు తెలుపుచున్నారు. కృష్ణరాయల కాలమందు కూడ ఈ పండుగ ఫాల్గుణ శు. ౧౫ నాడే జరుపబడుచుండెడిదని ఊహింప వీలగుచున్నది.

నేడుకూడ కన్నడ దేశమున ఫాల్గుణ శు. ౧౫ దినము కాముని పండుగ యను పేర వసంతమ్ములు చల్లుకొను పండుగ, చాల ముఖ్యమైన పండుగలలో నొకటిగ ఆచరింపబడుచున్నది. కృష్ణరాయల కాలమున కూడ కాముని పండుగయే వసంతోత్సవమని చరిత్ర పరిశోధకులు నమ్ముచున్నారు.

ఇట్లు శా. శ. 1437 యువ ఫాల్గుణ శు ౧౫ లకు సరియగు 17-2-1516 తేదీన పారిజాతాపహరణ కృతి సమర్పణ ఉత్సవము జరిగియుండునని ఊహించుటకు వీలగుచున్నది.

కృతి సమర్పణ దినమును నిశ్చయించిన పిమ్మట ఆ యుత్సవ మెచ్చట జరిగియుండెనో కూడ ఊహించుటకు ప్రయత్నింతము.

కంబముమెట్టు విజయమువరకు గల చరిత్రను తిమ్మన అవతారికా భాగములో కీర్తించియున్నాడు. సింహాచల విజయము 29-3-1516 తేదీన జరిగినట్లు గుర్తించియున్నాము. సింహాచల విజయమునకు ముందు రాయలు రాజమహేంద్రవరమును జయించినట్లు సింహాచల శాసనమే తెలుపుచున్నది. [South Indian Inscriptions Vol VI No. 694. సింహాద్రి విజయానంతరము రాయలు రాజమహేంద్రవరమునకు 'తిరిగి విచ్చేసినట్లు' T.T.D Inscriptions Vol III No. 80 (TT No. 78) తెలుపుచున్నది.] కనుక సింహాచల విజయమునకు సుమారు 40 దినముల పూర్వమగు 16-2-1516 తేదీన రాయలు రాజమహేంద్రవరమును జయించి, ముందునకు విజయయాత్రను సాగించు ప్రయత్నములో అచ్చటనే విడిసి యుండెనని ఊహించుటకు వీలగుచున్నది.

ఇట్లు ప్రథమాంధ్ర మహా కావ్యమవతరించిన పవిత్ర గోదావరీ తీరమందే మార్కండేయ క్షేత్రమున ప్రథమాంధ్ర ప్రబంధము అవిష్కృతమై యుండునని నమ్మెదము.

## అష్ట దిగ్గజములు :

రాయల ఆస్థానమున అష్ట దిగ్గజ కవులున్నట్లు సమకాలీన గ్రంథస్థమైన ఆధారమేమియును లేదు. కాని అంతకంటె బలమైన శాసన ప్రమాణము కలదు.

రాయల నందిదుర్గ శాసనములోను, ['యస్యాష్టౌ కవి దిగ్గజాః పృథు యశో ధారా జగచ్ఛోభనాః' — **Journal of the Madras Oriental Manuscripts Library,** 1949. సంపుటి 2; సంచిక 3; పుట 44.] కడప మండలము నందలి తిప్పలూరు గ్రామ శాసనము వలనను ['శ్రీకృష్ణ దేవ రాయల మహారాయలవారు అష్టదిగ్గజ కవీశ్వరులకు ధారవోసి యిచ్చిన తిప్ప లూరు అగ్రహారమందు చొమ్మర్లు ఇచ్చు పన్ను ఈ గ్రామమున నున్న శివ, విష్ణువుల దేవాలయములయొక్క ఆరగింపులకు సమర్పించిరి'. [శా. సం. 282 **of** 1937-38.] రాయల కొలువులో అష్ట దిగ్గజ కవులుండెడివారని రూఢి యగుచున్నది. కాని ఆ అష్ట దిగ్గజ కవుల పేర్లు మాత్రము ఆ శాసనములు తెలుపుట లేదు. అందుచేత వారెవరై యుందురను విషయమున పండితులలో ఏకాభిప్రాయము కుదురలేదు. కాని వారిలో తిమ్మన ఒకడను విషయమై మాత్రము పండితులందరు ఏకాభిప్రాయులై యున్నారు.

అష్ట దిగ్గజములలో పెద్దన ఐరావత స్థానీయుడని పండితులందరు ఏక కంఠముగ పలుకుచున్నారు. జనశ్రుతిని బట్టియు, పెద్దన రచితములైన చాటువులను బట్టియు, ఆంధ్ర కవితా పితామహ బిరుద, కవి గండపెండేర ప్రదానములను బట్టియు, కలివాచిసీమ నాయంకర నియామకమును బట్టియు కృష్ణరాయలకు పెద్దన యెడల విశేషమగు అభిమానమున్నట్లు స్పష్టము. రాయల దృష్టిలో తిమ్మనకు ద్వితీయ స్థానమే యుండెననుట యథార్థమే కావచ్చును. కాని వయస్సు వలననో, పాండిత్యము వలననో, మృదు హృద యము వలననో లేక ఈ యన్నింటివలననో ప్రజాసామాన్యములో మాత్రము ప్రథమ గౌరవము తిమ్మనకే లభించుచుండెడిదని తోచుచున్నది. రాయలకు సమకాలికుడో లేక కొలది కాలము తరువాతివాడోయగు 'రాయ వాచక రచ యిత' రాయలవారి కొలువులోని కవుల పేర్లను ముమ్మారు పేర్కొనినాడు. ఒకసారి "ముక్కు తిమ్మన మొదలైన కవీశ్వరులు" [పుట 89] అని తిమ్మన ఒక్కని పేరే చెప్పినాడు. మరి రెండుసార్లు [పుటలు 89, 116] "ముక్కు తిమ్మన్న, అల్లసాని పెద్దన్న, మాదయగారి మల్లయ్య" అని తిమ్మన పేరునే మొదటిదిగా పేర్కొనినాడు. మూడు మారులును తిమ్మన కొసంగబడిన ప్రాధా న్యము కేవల యాదృచ్ఛికమై యుండదు. ఇట్లు రాయల కొలువులోని కవు

అందరలోనికి విశేషముగ ప్రజానురాగమునకు పాత్రుడైనవాడు తిమ్మనయే యని ఊహింప వీలగుచున్నది.

**పంచ కావ్యములు :**

సంస్కృత కావ్యకోటి నుండి ఐదు కావ్యముల నెన్నికచేసి వానిని పంచ కావ్యములని సంస్కృత పండితులు వ్యవహరించుచున్నారు. ఆంధ్రమున కూడ పంచ కావ్యముల నెన్నిక చేయవలెనను ఆలోచన ఆంధ్ర పండితులలో కలిగినది. కాని ఆ ఎన్నిక విషయములో ఏకాభిప్రాయము కుదురలేదు.

కాని పండితులలో అధిక సంఖ్యాకులు మాత్రము కల్పవృక్ష పంచకములో పారిజాతమునకు గల స్థానమును ఆంధ్ర కావ్య పంచకమున పారిజాతాపహరణమున కిచ్చుచున్నారనుట దాని విశిష్టతకు తార్కాణమై యున్నది.

**ప్రథమాంధ్ర ప్రబంధము :**

'మను చరిత్ర' ప్రథమాంధ్ర ప్రబంధమని పండితులలో ఒక వాడుక యేర్పడి యున్నది. ఈ అభిప్రాయమును తొలిసారిగా వెల్లడించినవారు శ్రీ తంజనగరం తేవప్పెరుమాళ్ళయ్యగారని తెలియుచున్నది. వారు మనుచరిత్ర పీఠికలో ఈ అభిప్రాయమును వెల్లడించినది మొదలుగ పండితులు గతానుగతికముగ మనుచరిత్ర ప్రథమాంధ్ర ప్రబంధమని చెప్పుచు వచ్చుచున్నారు. ఇందలి నిజమారయుదము.

పారిజాతాపహరణమున కటక విజయముగాని, పొట్నూరి జయస్తంభ స్థాపనముగాని చెప్పబడి యుండలేదని గుర్తించియున్నాము. మనుచరిత్ర యందీ రెండు సంఘటనలేగాక వీనికి తరువాత చాలకాలమునకు జరిగిన కలుబరిగి విజయము కూడ పేర్కొనబడి యున్నది. కలుబరిగె దాడి రాయల దైత్రయాత్రల యందు కడపటిది. అందువలన తేదీలతో నిమిత్తము లేకయే మనుచరిత్రము పారిజాతాపహరణమునకంటె తరువాత రచింపబడినదని సులభముగా చెప్పవచ్చును. ఈ విషయమును చారిత్రిక పరిశోధకులైన పండితులు ఎందరో ప్రకటించియే యున్నారు. ఐనను ఇంకను కొందరు పండితులకు మనుచరిత్రయే తొలి రచన యను భ్రాంతి వదలకున్నది.కనుకనే పారిజాతాపహరణ, మనుచరిత్రల మధ్య పోలికలేవైన నున్నచో తిమ్మనను

పెద్దన అనుకరించినాడని చెప్పవలసి యుండగా, తద్విపరీతముగా వీరు తిమ్మనయే పెద్దనను అనుకరించినాడని తలంచుచున్నారు. " .... పాటున కింతు లోర్తురె .... .... దీనినిబట్టి ముక్కు తిమ్మన్న తన పారిజాతాప హరణమ్ములో నొక పద్యము భట్టుమూర్తి తన వసు చరిత్రలో నొక పద్యము వ్రాసికొనిరి" అని శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు సెలవిచ్చిరి. (కావ్య పరిమళము పుట. 21)]. కనుక ఈ ఉభయ గ్రంథముల ముందు వెనుకలను గురించి నొక్కి వక్కాణింపవలసి వచ్చినది,

ప్రథమాంధ్ర ప్రబంధము మనుచరిత్ర కాదు. పారిజాతాపహరణమే 'ప్రథమాంధ్ర ప్రబంధము'.

**తిమ్మన కృతులు :**

తిమ్మన కృతులలో నేడు మనకు లభించుచున్నది పారిజాతాపహరణ మొక్కటి మాత్రమే. దానిలోనైన అతడు అప్పటికి తాను రచించియుండిన ఇతర కృతుల పేర్లు తెలిపి యుండలేదు. కాని పారిజాతాపహరణము వంటి చక్కని శయ్యతో మృదుమధుర శైలిలో రచింపబడిన కావ్యము కవియొక్క తొలి రచనయై యుండదు. అంతటి ఉత్తమ కవిత యలవడుటకు ముందు ఎంతో కవితా రచనాభ్యాసముండి తీరవలెను. కొన్ని కావ్యములను రచించి యుండవలెను. కృష్ణరాయ క్షితీశ కరుణా సమాలబ్ధ ఘన చతురంతయాన మహాగ్రహార సన్మానములు ఊరక లభించునవి కావుగదా!

తిమ్మన రచనలుగా 1) పారిజాతాపహరణము కాక ఈక్రింది గ్రంథ ముల పేర్లు తెలియవచ్చుచున్నవి.

2) వాణీ విలాసము :— అనంతరంగరాట్ఛందములో తిమ్మన రచిం చిన 'వాణీ విలాసము' లోనిదని ఒక పద్యముదాహృతమైనది.

"దేశ్యయతికి ఉదాహరణము.
తెఱవా తరువాతను గ
చ్చఱనీ నాయకుఁడు వచ్చుఁ డగు నెట్లంటే
మఱువక విను కలఁగాంచిన
తెఱఁగెల్ల నటంచుఁ దేటతెల్లముగాగన్"—అ.రం.ఛం. III 183.

3) త్రిస్థలీ దండకము :- అప్పకవిచే రెండుసార్లు ఉదాహరింపబడి యున్నది. ["విజయనగర హేమకూటంబున న్నిల్చి" — అప్ప కవీయము III 364, IV 73.] త్రిస్థలి అనగా కాశీ గయా ప్రయాగలు. తిమ్మన గయా యాత్ర చేసినట్లు అతడు రచించిన 'కృష్ణరాయల గయా శాసనము' వలన తెలియుచున్నది. ఈ శాసన కాలము 2-7-1521. ఈ యాత్రా సమయము ననే ఇది రచింపబడి యుండును. అనగా నిది పారిజాతాపహరణ రచనానంతర కృతి యన్నమాట.

4) శృంగార గజ రత్నాకరము :- 'ఇదియొక గజ శాస్త్రము. విజయ నగరము అనెగొంది రాజ్యముగా ప్రారంభమైనది. అనెగొంది యనగా 'ఏనుగుల నివాసము' అని యర్థము. తననాటికి అశ్వశాస్త్రము మాత్రమే యుండి తెలుగున గజ శాస్త్రము లేకుండుటచే తిమ్మన ఈ గ్రంథమును రచించి ఆ లోటును తీర్చినాడు' అని శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు తెలిపినారు. ('సమగ్ర ఆంధ్ర సాహిత్యము'— భారతి 1956 డిశంబరు.) కాని దీనికి ఆకరమును మాత్రము నేను కోరినను వారు 'తెలుప లే'మనినారు.

5) కళావతీ పరిణయము : తిమ్మన రచితమగు 'కళావతీ పరిణయము'ను తాము ఎచ్చటనో చూచియున్నట్లు శ్రీమాన్ రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారు చెప్పినారు. కాని దాని ఉనికిని నాతో సంభాషణా వశమున స్మరింప వీలై నది కాదు.

తిమ్మన కీర్తిని అజరామరము చేయుటకు పారిజాతాపహరణ మొక్క టియే చాలియున్నది.

**తిమ్మన చాటువులు :-**

తిమ్మన చెప్పినట్లుగా ప్రసిద్ధములైయున్న కొన్ని చాటు పద్యములు గలవు. వేర్వేరు తావులందున్న వానిని ఒకచోట నిబంధించుట మంచిదను భావముతో వానినిచట కూర్చుటయైనది.

1) కృష్ణా తీరమున మూడింట్ల తురకలతో యుద్ధము ముగిసిన పిమ్మట రాయలవారు ముక్కు తిమ్మన్న మొదలగు కవీశ్వరుల దిక్కుజూచి "నేటి విజయం ఏ రీతు" అని అడిగినందులకు ముక్కు తిమ్మన్న చెప్పిన పద్యం

నరసింహ కృష్ణరాయా
దురమున నీపేరు పేరఁ దురకలఁ ద్రుంచెన్

కరిరాజ వరదుఁ డని నీ
కరిఘటములు నిన్నుఁ జూచి గ్రక్కునఁ దిరిగెన్.
— [రాయ వాచకము. పుట 89.]

2) రాయలవారి ఉత్కల విజయమును తిమ్మన ఇట్లు పొగడినాడు :

"రాయగ్రామణి; కృష్ణరాయ! భవదుగ్ర క్రూర ఖడ్గాహిచేఁ
గాయంబూడ్చి కళింగ దేశ నృపతుల్ 'కానిర్ఝరీ పోషణీ
మాయాభీకుముటూరు లోటు కుహుటూ మాయాసటాజాహిరే
మాయాగ్గేయమడే' యటంద్రు దివి రంభాజారునిన్ యక్షునిన్".
— [ఆంధ్ర కవుల చరిత్రము; రెండవ భాగము పుట 33.]

3) ఒకప్పుడు అన్యాపదేశమునకు ఉదాహరణముగా పద్యము చెప్పు డని రాయలవారు కోరగా తిమ్మన చెప్పిన పద్యము :

"స్థాన విశేష మాత్రమున తామరపాకున నీటిబొట్టు! నిన్
బూనిక మౌక్తికంబనుచుఁ బోల్చిన మాత్రన యింత గర్వమా?
మానవతీ శిరోమణుల మాలికలందునఁ గూర్చ వత్తువో?
కానుకలియ్యవత్తువొ? వికాసము దెత్తువొ? విల్వ దెత్తువో?"
— [ చాటుపద్య మణిమంజరి భాగము పుట. 154]

4) మహాశిరః ప్రధాని తిమ్మరుసయ్యపై తిమ్మన చెప్పిన పద్యము :

"ఏతెంతురు తము తామే
దాతల సన్నిధికి నర్థి తతులుర్వి పిక
వ్రాతమునకుఁ జూత మహీ
జాతమ్మంపినదె కమ్మ? సాళువ తిమ్మా!"
— [సమగ్ర ఆంధ్ర సాహిత్యం XI సంపుటము. పుట 89.]

5) "నానాసూన వితాన వాసనల .... " (వసు. ) అను పద్యము తిమ్మన చాటువే యని వాడుక కలదుగాని అది నమ్మదగిన మాట గాదు.

ఇచ్చటనే తిమ్మనపై చెప్పబడిన ఒక చాటు పద్యమున కూడ కూర్చి యుంచుట యుచితము. ఇదియొక 'జానపద కవి' తిమ్మనపై చెప్పినది :

"మాకొలది జానపదులకు
నీ కవనపు లోతులబ్బునే కూపనట
ద్వేకములకు గగన ధునీ
శీకరముల చెమ్మ నందిసింగయ తిమ్మా!"

పై పద్యము నందలి మూడవ పాదమున గల 'గగన ధునీ' అనుదానికి 'నాకధునీ' అని రాయలవారు సంస్కరణను సూచించిరట. [ఆంధ్ర కవుల చరిత్రము 2వ భాగము. పుట 41.]

## తిమ్మనను గూర్చిన కథలు :-

పండితులకును, పామరులకును సమముగ అభిమానపాత్రులైన మహా కవులలో తిమ్మన ఒకడు. ఆతనిని గురించిన కథలు అనేకము వ్యాప్తిలో నున్నవి.

1) తిమ్మన ఒకప్పుడొక క్షౌరకుని పనితనమునకు మెచ్చుకొని వాని కేదైన బహుమతి నీయదలచెనట. వాడు తనకొక పద్యమును వ్రాసి ఇమ్మని కోరగా తిమ్మన ఒక సుందరీమణి యొక్క ముక్కును వర్ణించు ఈ పద్యమును వ్రాసి వాని కొసగినాడట.

"నానా సూనవితాన వాసనల నానందించు సారంగ మే
లా నన్నొల్లదటంచు గంధఫలి బల్కాకతపం బందియో
హానాసాకృతిఁ బూని సర్వసుమన స్సౌరభ్య సంవాసియై
పూనెం బ్రేక్షణ మాలికా మధుకరీ పుంజంబు లిర్వంకలన్."

ఆ క్షౌరకుడీ పద్యమును పదిమందికి చూపించి సంతోషించుచుండగా భట్టుమూర్తి చూచి వానికి నాలుగువేల వరహాలిచ్చి ఆ పద్యమును వానివద్ద కొని తన వసు చరిత్రలో చేర్చుకొనినాడట. తరువాత భట్టుమూర్తి రాయల వారి సభలో తన వసు చరిత్రను చదివి వినిపించునపుడు రాయ లీయొక్క పద్యమునకే ప్రత్యేకించి మూడువేల వరహాలిచ్చి మెచ్చెనట. అప్పుడు వికట కవి యగు రామకృష్ణుడు "పాపము భట్టుమూర్తికీ వ్యాపారములో వేయి వర హాలు నష్టము వచ్చిన"దని పలికెనట. అదేమని రాయలు ప్రశ్నింపగా అతడు

జరిగిన వృత్తాంతమును చెప్పి భట్టుమూర్తిని అవమానపరచెనట. నాటినుండి తిమ్మనకు ముక్కు తిమ్మన యను పౌరుష నామ మేర్పడినదట.

ఈ కథకు బొత్తిగా కాళ్ళు లేవని పండితులందరును ఏకగ్రీవముగా త్రోసిపుచ్చినారు.

2) తిమ్మన ఒకనాడు తన మందిరమున తూగుటుయ్యెలపై కూర్చుండి యుండగా వికట వినోదియగు రామకృష్ణు డరుదెంచి "తాతా, ఊతునా?" యని ప్రశ్నించెనట. ఊయల నూచెదనని అతడడుగుచున్నాడని తలచి తిమ్మన "ఊ" యనెనట. రామకృష్ణుడు తన శ్లేష చమత్కృతిని ప్రాయోగికముగ ప్రదర్శింపగోరి ఉమిసెనట. కుపితుడైన తిమ్మన తన కాలికి గల కొయ్య పాంకోడును రామకృష్ణునిపై విసరెనట. అది తగిలి రామకృష్ణుని నోట యందలి పన్నొకటి విరిగెనట. 'విపన్ను'డైన రామకృష్ణుడు తన తొఱ్ఱి పంటిని లోకమునకు చూపుటకు సిగ్గుపడి దుప్పికొమ్ముతో కృత్రిమపు పన్నొకటి నిర్మించుకొని ధరించెనట. తరువాత నొకప్పుడు రాయలవారు "రవి గానని చోఁ గవి కాంచునే గదా" అని యొక సమస్యనీయగా భట్టుమూర్తి దాని నిట్లు పూరించెనట.

"అరవి వీరభద్ర చరణాహతి డుల్లిన బోసి నోటికిన్
నేరఁడు రామకృష్ణకవి నేరిచెఁబో మన ముక్కు తిమ్మరాట్
క్రూర పదాహతింగనిన కొక్కిరి పంటికి దుప్పి కొమ్ము ప
ల్గారచియించె నౌర, రవి గానని చోఁ గవి కాంచునే గదా".

ఇట్లు అందరను వెక్కిరించు రామకృష్ణుడు జీవితములో ఒక్కసారి తానుకూడ ఇతరుల వెక్కిరింతకు పాత్రమైనాడుట.

3) ఒకప్పుడొక భట్టుకవి తిమ్మన నిట్లు ప్రశంసించెనట.

"మాకొలది జానపదులకు
నీ కవనపు లోతులబ్బునే కూపనట
ద్భేకములకు నా కధునీ
శీకరముల చెమ్మ నందిసింగయ తిమ్మా".

పద్యమునకు సంతోషించిన తిమ్మన వెంటనే తన చెవులకు గల కుండలములలో నొకదానిని తీసి భట్టుకవికి బహుమతి యొసంగెనట. ఒంటి చెవి కుండలముతో సభ కరుదెంచిన తిమ్మనను గాంచి రాయలు కారణ మడుగగా తిమ్మన కారణమును తెలిపి ఆ పద్యమును చదివి వినిపించెనట. రాయలవారు పద్యపు మూడవ పాదమునందుగల 'గగన ధునీ' పదమును 'నాక ధునీ' అని మార్చినచో మరింత బాగుండునని సూచించిరట. రాయల వారి సంస్కరణకు మెచ్చుకొని తిమ్మన తన రెండవ చెవికిగల కుండలమును తీసి రాయలవారికే బహుమతి చేసెనట.

## రుద్రభట్టు :-

కన్నడ భాషలో రుద్రభట్టు అను కవివరుడు "జగన్నాథ విజయము" అనునొక ప్రౌఢ చంపూ కావ్యమును రచించియున్నాడు. ఈ కావ్యమును ఆధారముగ గొనియే నంది తిమ్మన 'పారిజాతాపహరణ' కావ్యమును తెలుగులో రచించినాడని కొందరు పరిశోధక పండితులు తెలుపుచున్నారు. ఇట్టి కవి పేరును, కావ్యము పేరును ఆంధ్రులకు పరిచితములైనవి.

రుద్రభట్టు ప్రసిద్ధ కన్నడ కవులలో నొకడు. ఇతడు చాల ప్రౌఢ కవి. భట్ట శబ్దము వలన ఇతడు బ్రాహ్మణుడని తెలియుచున్నది. ఇంతకుమించి ఇతని వంశ గోత్రాదులను గురించి ఇంతవరకేమియు తెలియరాకున్నది.

రుద్రభట్టు ద్వార సముద్రమును పాలించిన హొయ్సల వంశీయుడైన వీరబల్లాలుని కాలమైన 1172-1219 ప్రాంతమున జీవించినవాడని కన్నడ సాహిత్య చరిత్రకారులు నమ్ముచున్నారు.

## రుద్రభట్టు నివాసము :-

రుద్రభట్టు నివాస స్థలమును గురించి స్పష్టముగ ఏమియు తెలియుట లేదు. లక్ష్మీశ కవియు, రుద్రభట్టును మిత్రులను కథ సత్యమైనను కాకున్నను రుద్రభట్టు కూడ లక్ష్మీశుని నివాసమైన 'దేవనూరు'నకు చెందినవాడే యని ఊహించుటకు కొంత అవకాశమున్నది. రుద్రభట్టు తన ఆశ్వాసాంత గద్య ములలో తాను "లక్ష్మీకాంత శ్రీపాద భక్తి యుక్తుడనని చెప్పికొని యున్నాడు.

'దేవనూరు'లో లక్ష్మీనారాయణ దేవాలయము కలదు. 'లక్ష్మీనారాయణు'నకే 'లక్ష్మీకాంతు' డనియు పేరు కావచ్చును. లక్ష్మీశుడు కూడ తన జైమిని భారతములో ఈ దేవుని 'లక్ష్మీకాంతు' డని పలుమారులు పేర్కొని యున్నాడు. రుద్రభట్టున కాశ్రయదాత యని ఊహింపబడిన వీరబల్లాలుని రాజధాని యగు ద్వారసముద్రమునకు ఈ దేవనూరు సమీపముననే యున్నది. కనుక రుద్రభట్టు చిక్కమగళూరు జిల్లాకు చెందిన 'దేవనూరు' నివాసి యని ఊహించుటకు వీలగుచున్నది.

## రుద్రభట్టు రచనలు :-

రుద్రభట్టు రచనలలో 'జగన్నాథ విజయ' మొక్కటి మాత్రమే ప్రస్తుతము లభించుచున్నది. 'సాల్వ' అను కవి తన 'రస రత్నాకర' అను అలంకార గ్రంథమున రుద్రభట్ట రచితమైన 'రస కలికె' అను గ్రంథము నుండి కొన్ని పద్యముల నుద్ధరించినాడు. ఇంతకుమించి రుద్రభట్టు రచనలుగ గ్రంథముల పేర్లయినను తెలియవచ్చుట లేదు.

జగన్నాథ విజయము ప్రౌఢ శైలిలో రచింపబడిన చంపూ కావ్యము. ఇది అష్టా దశాశ్వాసయుతమైన మహా కావ్యము. ఇందు శ్రీకృష్ణుని జననము నుండి సాల్వ వధ వరకు గల శ్రీకృష్ణుని చరిత్ర యందు గల ఏకోత్తర శత కృత్యములు కీర్తితములైనవి. ఈ గ్రంథమునకు విష్ణు పురాణము మాతృక. ఆ విషయమును కవియే 'కతె విష్ణు పురాణం' (జ. వి. 1 21) అని తెలిపి యున్నాడు. విష్ణు పురాణము నందలి 5, 6 అంశములందలి ఇతివృత్తమే జగన్నాథ విజయపు ఇతివృత్తము. ఇందలి 12వ ఆశ్వాసము నందలి చివరి 89 గద్య పద్యములు, 13వ ఆశ్వాసము నందలి 173 గద్య పద్యములు, 14వ ఆశ్వాసము మొదటి 5 గద్య పద్యములు- మొత్తము 267 గద్య పద్యములందలి కథ తెలుగు కవి తిమ్మన రచించిన 'పారిజాతాపహరణ' కావ్యమందలి కథతో కుడి ఎడమగా సరిపోవుచున్నది. కనుకనే తిమ్మన జగన్నాథ విజయము ననుసరించియే పారిజాతాపహరణ రచన గావించెనని కొందరు పరిశోధక పండితులు తెలుపుచున్నారు.

## కన్నడ కవులలో రుద్రభట్టు స్థానము :-

రుద్రభట్టునకు పూర్వము గల కన్నడ సాహిత్యమంతయు జైన

మతానుసారియైనదే. రుద్రభట్టునకు పూర్వము ఒకరిద్దరు బ్రాహ్మణ కవు లున్నను వారు లౌకిక శాస్త్ర గ్రంథములను రచించినవారేగాని వైదిక (హిందూ, అథవా బ్రాహ్మణ) మత ప్రతిపాదకములగు కావ్యములను వ్రాసిన వారు కాదు. వైదిక మత గ్రంథ రచనకు రుద్రభట్టే మొదటివాడు. ఇట్లాతడొక నూతన యుగ ప్రవర్తకుడయ్యెనని చెప్పవచ్చును.

రుద్రభట్టు చాల ప్రౌఢ కవి. పూర్వకవుల ప్రభావము రుద్రభట్టుపైనను, అతని ప్రభావము ఆతని తరువాతి కవులపైనను చాలా కలదని కన్నడ సాహిత్యవేత్త లనుచున్నారు. ఇతని 'జగన్నాథ విజయ' మందలి తొలి ఐదు పద్యములకును 'పంచ పాషాణములు' అని పేరుపెట్టి ఎవరో పండితుడు సంస్కృతములో వ్యాఖ్యానము రచించియున్నాడు. పూర్వము 'వర పరీక్ష'లో రుద్రభట్టు పద్యములకు అర్థము చెప్పగలిగి యుండుట ఒక ముఖ్యాంశముగా నుండెడిదట. భట్టాకలంకుడు తన శబ్దాను శాసనమునం దును, మల్లిఖార్జునుడు సూక్తి సుధార్ణవము నందును, అభినవవాది విద్యా నందుడు తన కావ్యసారము నందును, సాల్వుడు తన రసరత్నాకరము నందును రుద్రభట్టు పద్యములను ఉదాహరించి యున్నారు. దేవ కవి "రుద్ర భట్టునందు నిండియున్న పదప్రగల్భ గుణము"ను ప్రశంసించినాడు. ఇవి యన్నియు కన్నడ సాహిత్య చరిత్రలో రుద్రభట్టునకును అతని కావ్యమున కును గల విశిష్ట స్థానమును నిరూపించుచున్నవి. ఐనను ఆధునిక కన్నడ సాహిత్య విమర్శకులు రుద్రభట్టును మహాకవియని అంగీకరించుట లేదు.

## వ్యక్తి స్వభావము :

రుద్రభట్టు, తిమ్మనల వ్యక్తిగత చరిత్రను గూర్చి మనకేమియు తెలి యదు. ఐనను వారి మానసిక సృష్టియైన కావ్య స్వభావమును బట్టి వారి మన స్స్వభావమును కొంతవరకు ఊహించుట కవకాశమున్నది.

**"Style is the Man"** అని ఆంగ్లమున నొక సూక్తి కలదు. తదను గుణముగ పరిశీలించినచో తిమ్మన మృదు స్వభావుడనియు, రుద్రభట్టు ఆడం బర పరాయణు డనియు ఊహింప వీలగుచున్నది. తిమ్మన కోమలములైన ధ్వనులను, సరళములైన పదములను, అక్లిష్ట బంధయుతములైన సమాసము

లను ఉపయోగించును. రుద్రభట్టు రచనలో రూక్షాక్షరములు హెచ్చు; కఠిన పదములు అధికము; సమాస నిర్మాణము జటిలము. తిమ్మన సుకుమార రసములైన శృంగార, హాస్య, శాంత రసములను పోషించినంతగ ప్రౌఢ రసములైన రౌద్ర, వీర, భయానక, బీభత్స రసములను పోషింపలేకపోయినా డనుట యథార్థము. తిమ్మన చేసిన యుద్ధ వర్ణన ఉండవలసినంత వీరరస స్ఫూర్తిని కలిగించునదిగ లేదు. అందుగూడ శృంగారమే తొంగిచూచు చున్నది. అది యాతని సుకుమార హృదయమును సూచకముగ నున్నది. రుద్రభట్టు రచనలో హాస్యరస పోషణ అత్యల్పము. శృంగార రసపోషణ కొంత కలదు. కాని వీర, రౌద్ర రసములే ప్రాధాన్యము వహించుచున్నవి. అవి యాతని సొంత నేలలు. ఇది యాతని రాజస ప్రవృత్తికి ద్యోతకముగ నున్నది. తిమ్మన సాత్త్విక కవి యనియు, రుద్రభట్టు రాజస కవియనియు చెప్పవచ్చును.

రుద్రభట్టు, తిమ్మనల ఆశ్వాసాంత గద్యలను పరిశీలించినచో వీరి మనఃప్రవృత్తులందలి భేదము స్పష్టము కాగలదు.

రుద్రభట్టు గద్య ఇట్లున్నది :

"ఇదు సమస్త కమలభవాండ మాలాఘటీ ఘటితారఘట్ట ఘటనా స్వతంత్ర నిజస్వరూప నిరూపణ చకిత సకలామ్నాయ తంత్ర, లక్ష్మీకాంత శ్రీపాద భక్తి యుక్త, సుకవీంద్ర రుద్ర ప్రణీత జగన్నాథ విజయ మహా ప్రబంధదొళ్ .... "

తిమ్మన గద్య ఇట్లున్నది :

"ఇది శ్రీమదుమామహేశ్వర వరప్రసాద లబ్ధ సరస సారస్వతాభినంది, నంది సింగయామాత్య పుత్ర, కౌశిక గోత్ర పవిత్ర, సుజన విధేయ, తిమ్మయ నామధేయ ప్రణీతంబైన పారిజాతాపహరణంబను మహా ప్రబంధంబునందు .... .... ".

సకలామ్నాయ తంత్రములు నిరూపింపలేని పరమేశ్వరుని నిజ స్వరూప మును నిరూపించుట వలన వానిని (సకలామ్నాయ తంత్రములను) చకిత పరుపజాలిన వాడనను రుద్రభట్టు ప్రగల్భోక్తితో తనకు లభించిన సరస

సారస్వతము పరమేశ్వర వరప్రసాదమను తిమ్మన వినయోక్తి పోల్చి చూడ దగియున్నది. [తిమ్మన గద్య అతని సొంతముకూడ కాదు. తనకు పూర్వుడైన నంది మల్లయ గద్యను తిమ్మన యథాతథముగ స్వీకరించినాడు. "శ్రీమదుమా మహేశ్వర వరప్రసాద లబ్ధ సరస సారస్వతాభినంది, నంది .... యామాత్య పుత్ర .... " అనునది నంది మల్లయ గద్యయందలి పద బంధమే.] పర మేశ్వరుని పేర్కొనుటలో గూడ "సమస్త కమల భవాండమాలా ఘటీఘటి తార ఘట్ట ఘటనా స్వతంత్రు" డని రుద్రభట్టు రూక్షాక్షర సంయోజన మొన రింపగా, తిమ్మన 'శ్రీమదుమామహేశ్వరు'డని మృదుమధురముగా చెప్పి యున్నాడు. 'మాలాఘటీ' 'అరఘట్ట' అను అపురూపములైన పదములను ప్రయోగించుటలో రుద్రభట్టునకు గల వ్యామోహము కూడ గమనింపదగి యున్నది. చివరకు రుద్రభట్టు తనను తాను సుకవీంద్రుడనని చెప్పికొను టయు, తిమ్మన తాను సుజన విధేయుడనని మాత్రమే చెప్పికొనుటయు వారి వారి మనోధర్మము లందలి భిన్న స్వభావములను స్పష్టపరుప జాలియున్నది. రుద్రభట్టు ఆత్మస్తుతి పరాయణుడు; తిమ్మన తద్విముఖుడు.

ఆత్మస్తుతి యనునది మన కవులకు అపరిహార్యమైన ఒక ప్రాచీనాచార ముగ నున్నది. ఇట్టి 'కవి సంప్రదాయము' నుజ్జగించి స్వీయ ప్రశంస గావించుకొనక తిమ్మన నిజముగా ప్రశంసనీయుడైనాడు. 'కుకవినింద' గావింపకపోవుటవలన కూడ మరింత ప్రశంసనీయుడైనాడు. కులగోత్రాది కము గాక అతడు తనను గురించి చెప్పికొనినది తాను "కృష్ణరాయ క్షితీశ కరుణా సమాలబ్ధ ఘన చతురంతయాన మహాగ్రహార సన్మానయుతుడ" ననియు, 'శివ పరాధీనమతి' ననియు మాత్రమే. [చూ. పారి. V 108.] ఈ పద్యమందలి 'సకల విద్యావివేక చతురు' డను విశేషణము తిమ్మనకు కాక, అతని మేనమామ మలయమారుత కవికే చెందునట్లున్నది.] వీనిలో మొదటి విశేషణము తన కాశ్రయదాతయు, పోషకుడును నగు శ్రీకృష్ణ రాయ క్షితీశుని యెడ కృతజ్ఞతా ప్రకటనమునకై ఉద్దేశింపబడినది. రెండవ విశేషణము తాను 'శివ భక్తుడ' నని మాత్రమే సూచించునుగాని తన కవితా పాండితీ ఘనతలను ప్రకటించునది కాదు.

ఇక రుద్రభట్టు యొక్క ఆత్మస్తుతి గ్రంథారంభము నందలి దేవతా స్తుతితోనే ప్రారంభమైనది. ఇది యాతడు గావించిన సరస్వతీ స్తుతి.

"కెసరొళ్ పుట్టిదుదంతు మల్లదె రజః సంలీఢమెంతుం జడా
వసథం ఛీః మధుప్రసంగి ఖరదండం మత్తెను త్తజ్జమం
బిసుటత్యుత్తమ మింతుటెందు పిరిదుం సంతోషదిం వాణిబం
దు సమంతిర్కె సౌరభదవోల్ జిహ్వాగ్రదొళ్ రుద్రనా".

— జ. వి. I 6.

("పద్మము బురదలో పుట్టినది; అదియుగాక రజస్సంలీఢము, జడా వసథము, ఛీ, మధుప ప్రసంగి, ఖర దండము కూడ" అని వాణి పద్మమును వదలి 'ఇది అత్యుత్తమ' మని మిక్కలి సంతోషముతో సౌరభము వలె రుద్రుని జిహ్వాగ్రమందు నివసించుగాక.)

ఈ భావమునే ఆతడు మరియొకసారి తాను 'వచస్సుందరీ నిత్య నివా సుడ' నని (I 22) చెప్పికొనినాడు. తన కవిత్వమును గూర్చి రుద్రభట్టిట్లు చెప్పికొనుచున్నాడు :

"ఇనియళసోంకినంతె, పొస మావిన పూవిన జొంపదంతె, చం
దనరస దణ్పినంతె, ననె యేరిద మల్లిగె యంతె, పూర్ణచం
ద్రన సిరియంతె, బందెసప తెంకణ తంబెలరంతె, రుద్రభ
ట్టన కవితారసం మనమ నిర్కుళి గొళ్వుదు సజ్జనర్కళా".

— జ. వి. I 16.

(ప్రియురాలి స్పర్శవలె, క్రొమ్మావి పూగుత్తి వలె, చందన గంధపు చల్లదనము వలె, పూచిన మల్లెవలె, పూర్ణచంద్రుని సిరివలె, దక్షిణ శీతల మారుతమువలె రుద్రభట్టు కవితారసము సజ్జనుల మనస్సులకింపు గొల్పును.) ఈ స్వీయ కవితా ప్రశంసను విమర్శకు లంగీకరింపలేదు. "కవియొక్క ఈ మాట అర్థ సత్యమే. ఎందుకనగా అతనిది ద్రాక్షాపాకము కాదు; నారికేళ పాకము". (కవియ ఈ మాతు అర్ధసత్య ఏకందరె అతనదు ద్రాక్షాపాకవల్ల; నారికేళ పాక)— శామరాయ—జనప్రియ కన్నడ సాహిత్య చరిత్రె. పుట. 204.]

తనకు నూతనరీతి కవిత చెప్ప నేరుపు (పొసతన పేళ్వ తిర్దుదటివు) కలదనియు,విద్వజ్జనులు తన కవితను పొగడుదురనియు (ఈతెఱదిం బుధర్పొ గళల్), దేవ చూడామణి ముకురుడైన విష్ణువే తన కవితను స్వీకరించినా

టనియు, తన కావ్యము "అనవద్యం రీతిచోద్యం, సకల విబుధ హృద్యం" (I 22) అనియు, 'వైష్ణవ కావ్య రసార్ణవం' (XVIII 113) అనియు చెప్పుకొనినాడు. ఇతడు తనకు 'కవిరాజు', 'కృతి శారదాభ్ర చంద్రాతప' అను విశేషణములు వాడుకొని యున్నాడు. ఇవి ఈతని బిరుదులై యుండునని పండితులు భావించుచున్నారు.

తిమ్మన రుద్రభట్టువలె ఎచ్చటను వాచ్యముగ స్వీయ కవితా ప్రశంస గావించుకొనకపోయినను మనస్సునందు గూఢమగు అభిమానము గలవాడే. అందుచేత కొన్ని తావులందు వ్యంగ్యముగ స్వీయ కవితా ప్రశంస గావించుకొనినాడు. తిమ్మన తన కావ్యము 'ఆదివాకర తారా సుధాకరముగ' (V 108) నుండగలదని చెప్పికొనిన జాతకము వలన అందు శాశ్వతముగ నుండగల ఉత్తమ కవిత గలదని ధ్వనించుచున్నది. ఇంతకంటె గడుసరి నేర్పొకటున్నది. కథామధ్యమున ఏదో సందర్భమును కల్పించుకొని అన్యాపదేశముగ ఇతరుల కవిత్వమునో, వాగ్ధోరణినో ప్రశంసించువానివలె- తన కవితను, వాగ్ధోరణిని ప్రశంసించుకొనుట. [పింగళి సూరనార్యుని 'చలువగల వెన్నెలల' (కళా. I 190), 'శబ్ద సంస్కారము' (ప్ర. భా. II 3), 'పొసగ ముత్తెపు సరుల్' (కళా. I 188) అను పద్యము లీపద్ధతికి చక్కని ఉదాహరణలు.]

శ్రీకృష్ణుని నిద్రనుండి మేల్కొలుపు వైతాళికులు "మృదు గీతామృత రచన" గావించిరట (II 55). ఇది తిమ్మన తాను రచించిన వైతాళిక గీతములను గురించి చెప్పికొనిన మాటయే గదా. అమరావతి కేగుచు మార్గమునగల వింతలను కృష్ణుడు సత్యకు "సరసస్మిత వచన రచన చాతురి మెఱయన్" (II 84) వర్ణించి చెప్పినాడట. నిజమున కిది తిమ్మన స్వీయ సరసస్మిత వచన రచన చాతురీ ప్రశంసయే. తిమ్మన కవిత యంతట 'స్మితము' కూడ వ్యాపించియే యున్నది.

పుణ్యక వ్రతావసానమున నారదుడు శ్రీకృష్ణుని స్తుతించు సందర్భమున తిమ్మన అనేక చిత్ర కవితారీతులు గల పద్యములను రచించి యున్నాడు. వానికి ముందు వెనుకల నిట్లు కలదు.

"సుర వాచంయమి పలికెఁ జతుర వాచా ప్రౌఢిన్" — (V 91)

"అని చిత్రగతుల నవ్విభుఁ గొనియాడి"— (V 102)

ఇచ్చట నారదుని పేరుమీదుగా తిమ్మన తన 'చతుర వాచా ప్రౌఢి'ని, తన కవితా కన్యయొక్క 'చిత్ర గతుల'నే ప్రశంసించుకొనుచున్నాడనుట స్పష్టము. వాగ్రచన యందతడు చూపిన నియమ పాలన తత్పరత వలన తిమ్మన 'వాచంయమి వరుడు' అనుటయు నిర్బాధమే.

సింగభూపాలుని వర్గీకరణము ననుసరించి తిమ్మన వినీతోదాత్త కవియు, రుద్రభట్టు ప్రౌఢోద్ధత కవియునని చెప్పదగియున్నారు.

"కవయస్తు ప్రబంధారస్తే భవేయుశ్చతుర్విధాః
ఉదాత్త ఉద్ధతః ప్రౌఢో వినీత ఇతి భేదతః"
— రసార్ణవ సుధాకరము—భావకోల్లాసము III 94.

మత స్వభావము :-

మన ప్రాచీన వాఙ్మయమంతయు దాదాపుగ మతము నాశ్రయించినదే; మత ప్రచారమున కుద్దేశించినదే. సామూహిక దృష్టితో పరిశీలించినపుడు మన కుపలబ్ధమగుచున్న ప్రాచీనాంధ్ర వాఙ్మయమంతయు వైదిక మత సంబద్ధ మైనదే. కన్నడములో మాత్రమీస్థితి వేరుగా నున్నది. ప్రాచీన కర్ణాట వాఙ్మయము చాలవరకు జైన మతానుసారియైనది. కన్నడ సాహిత్య చరిత్ర యందలి తొలి యుగము జైన యుగమను పేరిటనే వ్యవహృత మగుచున్నది.

వైదిక మతము లేక హిందూ మతము అని సామూహికముగా చెప్పబడుచున్న మతమందు కూడ పరల అంతర్భేదము లున్నవి. ఉపాస్య దేవత లేక ఇష్ట దేవత ననుసరించి శైవ, వైష్ణవ, శాక్తేయాది మతములును, జీవాత్మ పరమాత్మలకు గల సంబంధమును గురించిన విశ్వాసమును బట్టి ద్వైతాద్వైత విశిష్టాద్వైత మతములును కలవు. సాధనా మార్గములందును భక్తి, జ్ఞాన, కర్మ, యోగ సంప్రదాయము లున్నవి. రుద్రభట్ట తిమ్మనల మత సంప్రదాయ స్వభావములను వారి గ్రంథములనుండి తెలియవచ్చిన విధముగా గుర్తింతము.

రుద్రభట్టు పేరు వలన శైవుడైనట్లు కనుపించుచున్నాడు. కాని అతడు వ్రాసిన కావ్యము 'జగన్నాథ విజయము' కృష్ణ మహిమా ప్రతిపాదకము.

అతడే తన కావ్యమును 'వైష్ణవ కావ్య రసార్ణవం' (౧౮-113) అని చెప్పి కొనినాడు. అందుచేత ఆతడు శివ, కేశవులందు సమాన భావము గలవాడని స్పష్టమగుచున్నది. గ్రంథ ప్రారంభమున విష్ణువును, శివుని, బ్రహ్మను ముగ్వురను ఒక్కొక్క పద్యములో స్తుతించికూడ అతడు తనకు మూర్తి త్రయము నెడగల సమ దృష్టిని వెల్లడించి యున్నాడు. మూర్తిత్రయైక్య భావ మాతని గ్రంథములో పలుతావులందు కన్పించుచున్నది.

బాణాసుర నిగ్రహ కథా సందర్భమున శివుడు విష్ణువుతో నిట్లను చున్నాడు :

"ద్వయ భావం నమగిల్ల; బల్లవరె నానుం నీను మీమాతు ....
ఏకమూర్తియె మూర్తిత్రయ వాయ్తు .... (౧౮-66.)

(మనకు ద్వయ భావము లేదు. ఈమాట నేనును, నీవును కూడ ఎఱిగిన వారమే .... ఏకమూర్తియే మూర్తిత్రయమైనది.)

ఈ క్రింది పద్యములో గూడ ఈతనికి గల శివ కేశవాద్వైత భావన తెలియుచున్నది. ఇది బాలకృష్ణుని వర్ణన :

"నొసలొళ్ కణ్ణుళ్ళ మనో
జసూదనం పెఱవనావ నానెదలెందీ
వసుమ తిగె సూచిపందది
నెసెదం హరి నొసల కణ్ణోలెసె పదెలెలెయిం." (III 45)

('నొసట కన్నున్న మనోజ సూదనుడు పెఱవాడెవడు? నేనే గదా' అని ఈ వసుమతికి సూచించు అందముతో- నొసట కన్నువోలె యొప్పెడి పట పట్టము (బాలురు ధరించు ఆభరణ విశేషము)తో హరి యొప్పి యుండెను.)

ఇట్లు మూర్తిత్రయా భేదమును తెలుపు పద్యములు చాల కలవు.

త్రిమూర్త్య భేద భావము, అద్వైత భావన, విష్ణు పారమ్య విశ్వాసము అనునవి రుద్రభట్టు మత తత్త్వము నందలి మూడు ముఖ్యాంశములు. వీనిలో ప్రధానమైనది విష్ణు భక్తి యనుట కాతని గద్యయే సాక్షి. ఆశ్వాసాంత గద్య

లలో రుద్రభట్టు 'లక్ష్మీకాంత శ్రీపాద భక్తియుక్తుడ' నని చెప్పికొని యున్నాడు.

తిమ్మన శబ్దము తిరుమల శబ్ద వికృతి. ఇది వైష్ణవతా ద్యోతకము. ఐనను తిమ్మన తాను 'శివ పరాధీనమతి' ననియు తన కవితా శక్తి 'ఉమా మహేశ్వర వరప్రసాద లబ్ధ' మనియు చెప్పికొనినాడు గదా.

తిమ్మనకు గల శైవాభిమానమును ఈ క్రింది సందర్భములలో గుర్తింప గలము.

1) సత్యా కృష్ణులకు అమరావతిలో విడిదిగా నొసంగబడిన వైజయంత మును దిక్పాలకుల భార్యలందరు అలంకరించినట్లు వారందరను పేరుపేరున తెలిపిన తిమ్మన ఈశానుని ఇల్లాలి పేరెత్తలేదు. ఉమాదేవిచేత పరిచారికా కృత్యములు చేయించుటకు ఆ ఉమామహేశ్వరారాధకునకు మనస్కరింప లేదు (III 41).

2) శ్రీకృష్ణుని చేతిలో పరాజితులైన దేవతా వీరులెల్లరు మూర్ఛితులయి నట్లో, భూపతిలయినట్లో చెప్పిన తిమ్మన రుద్రుని కట్టి అవనతిని కలిగింపక అతని జటా మండల మంచలి శశి ఖండములు మాత్రమే నేలపై రాలినట్లు తెలిపినాడు (V 13).

తిమ్మన మేనమామయు, అతని మేనమామయు నైన 'జంట కవులు' కూడ తాము 'ఈశ్వరారాధకుల' మని చెప్పికొనియున్నారు. ఈ ముఫ్వురకును గురువు అఘోర శివాచార్యుడు. అతడు దక్షిణామూర్తి ఉపాసకుడు. తిమ్మన కూడ దక్షిణామూర్తి జప పరాయణుడై యుండును. ఐనను వీరి శైవము విష్ణు భక్తికి అడ్డు వచ్చినదికాదు. వైష్ణవ గాథలైన వరాహ, భాగవత పురాణములను, పారిజాతాపహరణమును వీరు రచించుటయే ఇందులకు సాక్షి. తిమ్మన కూడ శివ, కేశవ భేదమును నమ్మినవాడే. ఇంద్రుడు ప్రయోగించిన పాశుపతాస్త్రము కృష్ణుని అర్ధ శరీరములో లీనమైనదని తిమ్మన కల్పించినాడు. ఇది హరిహర నాథ భావము ననుసరించి చేయబడిన కల్పన యనుట స్పష్టము. అట్లే అదితి కృత శ్రీకృష్ణ స్తుతి యందలి ఈ క్రింది పద్యము వలన తిమ్మన కూడ మూర్తి త్రయాభేదమును నమ్మినవాడని తెలియుచున్నది.

"సర్గ మొనర్తు బ్రహ్మయన, సత్కృపఁ బెంతు జనార్దనుండు నా
భర్గుఁ డనంగఁ గ్రమ్మఱఁగఁ బారణ సేయుదు విజ్జగంబు నై
సర్గిక లీల నొక్కమఱి సౌఖ్యము నొందుదు కేవలంబు దో
రర్గళ భూషణీకృత రథాంగ నినుం గొనియాడ నేర్తునే" (III 27)

జంట కవులు అద్వైత మత స్థాపకమగు ప్రబోధ చంద్రోదయము నాంధ్రీకరించి యున్నారు. వారి పరంపర లోనివాడే యగు తిమ్మనయు అద్వైతియే యగుట సహజము. తిమ్మన కావ్యములో మాత్రము ఈ ఆధ్యాత్మిక తత్త్వ సంబంధములైన భావములు అంతగా కనుపింపవు. కృష్ణుని 'గుణాతీతుడు', 'చిన్మయుడు' అని (౩-86) చేసిన వర్ణనలో కొంత అద్వైత భావచ్ఛాయ గోచరించుచున్నది.

అదితి కృత స్తోత్రము నందలి ఈక్రింది భాగము వలన తిమ్మనకు యోగశాస్త్ర పరిచయ మున్నట్లు తెలియుచున్నది.

"జాలంధరోడ్డ్యాణ మూలాఖ్య బంధత్రయీ బంధు సంధుక్షిత స్పర్శసస్పర్శ నిర్గ్రంథిత గ్రంథి షట్కాంతరోన్నిద్ర కద్రూసుతశ్రీ ముఖ జ్వాల వల్లీ పరిస్రంస ముణేందు నిష్యంద సర్వాంగ నిష్పంద యోగీంద్ర హృద్వేదికావాస .... " (III 38).

ఐనను రాజయోగమునకంటె భక్తి యోగమే తిమ్మనకు ఎక్కువ ప్రీతిపాత్రమైనదనుటకు అతడు నారదుని చేతను, అదితి చేతను చేయించిన భగవన్నుతి యను "భక్త గణాధీసుఁ డనంగ నవ్విభుఁడు లోకఖ్యాతిఁ బెంపొందఁడే" (V 87) అను వాక్యమును తార్కాణము లగుచున్నవి.

రుద్రభట్టు, తిమ్మనల మత స్వభావమును గురించి ఇంతవరకు చేసిన పరిశీలన యొక్క సారాంశమిది :

రుద్రభట్టు పేరు శైవమును సూచించుచుండగా అతడు తాను వైష్ణవుడనని తెలుపుకొనినాడు. తిమ్మన పేరు వైష్ణవమును సూచించుచుండగా అతడు తాను శైవుడనని తెలుపుకొనినాడు. ఇరువురును త్రిమూర్త్యభేద భావము గలవారే. ఇరువురును అద్వైతులే. ఇరువురును భక్తిమార్గానుయాయులే. ఈ లక్షణ త్రయమును సమీకరణము గావించి కృష్ణ మహిమా కీర్తనము గావించినవారే.

పంత కథలు :

తిమ్మన తన కావ్యారంభమున కృతిపతి యగు కృష్ణరాయలు తనను కావ్య రచన గావింపుమని ప్రార్థించినట్లు చెప్పికొనలేదు. పారిజాతాపహరణ, మను చరిత్రలను రచింపుడని తిమ్మన, పెద్దనలను రాయలు ఏకకాలమందే అర్థించినట్లు రాయ వాచకము చెప్పుచున్నది (పుట 15). కాని తిమ్మన ఏలనో ఆ విషయమును తెలిపి యుండలేదు. అందుచే రాయలచే అభ్యర్థింప బడకయే తిమ్మన స్వప్రేరణతోనే కావ్య రచనము పూనుకొని యుండునని విమర్శకులు ఊహించుచున్నారు. తిమ్మనకీ కావ్యమును రచింపవలసిన అవసరము రాయలవారి అంతఃపుర వ్యవహారము వలన కలిగినదని ఒక కథ లోకమున ప్రచారములో నున్నది. ఈ కథను కొందరు పరిశోధకులు నమ్ముట లేదు. కాని నమ్మకుండుటకు కారణము కనుపింపదు. దీని సత్యాసత్యముల మాట యెట్లున్నను, కథ రమ్యమైనదగుటచే ఇచట పొందుపరుప బడుచున్నది.

రాయల వారొకనాటి రాత్రి చాల ప్రొద్దుపోవు వరకు రాజకార్య వ్యాపృతుడై యుండి అర్ధరాత్రానంతర వేళకు తిరుమలదేవివారి అంతః పురమునకు దయచేసిరట. పతి రాకకొరకు చాలసేపటివరకు ప్రతీక్ష చేయు చుండిన తిరుమలదేవి నిద్రావిష్టురాలై పాన్పుపై పవళించినదట. ఒంటరిగ శయనించు ఇల్లాలు తలగడవైపు పాదములు, పాదముల దిక్కుగ తల యుంచుకొని పవళింపవలెనను అంతఃపుర మర్యాద ననుసరించి ఆమె అట్లే వ్యత్యస్తముగ పవళించినదట. ఆ తరువాత రాయల వారరుదెంచి ఆమెను నిద్ర లేపకయే ఆమె ప్రక్కనే సవ్యముగ పవళించిరట. అంతలో గాఢనిద్రా ముద్రితురాలై యున్న రాణివారి పాదము రాయలవారి శిరసును ముట్టుగొన్న దట. ఆమె అసావధానతను అపరాధముగా భావించి, రాయలు కుపితుడై అంతఃపురమును విడచివెళ్ళి మరల ఆమెను దర్శింప డయ్యెనట. అందుచే చింతాక్రాంతురాలై యున్న తిరుమలదేవిని ఆమె పుట్టినింటి అరణపు కవియైన తిమ్మన దర్శించి, నడచిన వృత్తాంతమును తెలిసికొని, ఆమె కాపురమును చక్కదిద్దుటకై పూనుకొని, అబుద్ధిపూర్వకమైన ఆమె అపరాధమును క్షమిం చుట రసికుడైన రాయనికి ధర్మమను నీత్యుపదేశమును కాంతాసమ్మితముగ చేయు తలంపుతో పారిజాతాపహరణ కావ్యమును రచించెనట. గ్రంథ ప్రారంభమున శ్రీకృష్ణుడే శ్రీకృష్ణదేవరాయలై జన్మించెనని ప్రశంసా రూప

ముగ వర్ణించి కృష్ణునియందు రాయల ఆరోపమును ధ్వనింపజేసి, పిమ్మట అనూలకమగు సత్యా పాదప్రహార వృత్తాంతమును కల్పించి తన కావ్యమున ప్రవేశపెట్టినాడట. తరువాత తిమ్మన రాయలకు కావ్యమును చదివి విని పింపగా, సూక్ష్మగ్రాహి యగు రాయలు అనూలకమగు తిమ్మన కల్పనకు కారణము నూహించి, తన తప్పిదమును గ్రహించి, తిమ్మనను సత్కరించి, తిరుమలదేవిని యథాపూర్వముగ ఆదరించినాడట.ఇది బహుళముగ వ్యాప్తిలో నున్న కథ. [తాపీ ధర్మారావు— 'పారిజాతాపహరణ పీఠిక' —అకాడమీ ప్రచురణ. పుట VIII.]

2) పై కథనే స్వల్పముగా మార్చి చెప్పుటయు కలదు. రాయలకు తిరుమలదేవిపై కోపము వచ్చుటకు కారణము ఆమె పాద మాతని తలకు తగు లుట కాక ఆమె రాయల పటమున్న దిక్కుగా పాదములుంచి పరుండటయే యని కొందరందురు. మిగత కథ సామాన్యమే. [**K. A.** నీలకంఠ శాస్త్రి — **History of South India — P.** 412].

3) పై కథలకు విరుద్ధముగ వీరేశలింగంగారు మరియొక కథను చెప్పుచున్నారు. తిమ్మన రచించిన పారిజాతాపహరణమును విని, రాయలు 'పాటల గంధి .... ', 'జలజాతాసన .... ' అను పద్యములు అసహజములుగ నున్నవనియు, "లోకమున భార్యాభర్తలలో నిట్టి వినోదములు జరుగుట స్వభావ విరుద్ధ" మనియు పలికెనట. కవి యప్పుడేమియు ప్రత్యుత్తరమీయ కుండెనట. కాని అటుపిమ్మట కొలది దినములకే రాయలకు ప్రణయ కల హము సంభవించినపుడు భార్యవలన తనకిట్టి గౌరవమే సంప్రాప్తముకాగా ఆనందించి సభకు వచ్చి పుస్తకములోనెల్ల ఈ భాగమే అత్యంత రమ్యముగా నున్నదని శ్లాఘించెనట. [ఆంధ్ర కవుల చరిత్రము- 2వ భాగము. పుట 41]

రాయలకు అంతఃపురమున జరిగిన మర్యాద యెట్టిదో పంతులుగారు తెలుపలేదు. శ్రీ గురజాడ శ్రీరామమూర్తిగారు మరియొక కథనిట్లు తెలుపు చున్నారు.

4) శ్రీకృష్ణుడు సత్య పాదములకు మ్రొక్కెనని తిమ్మన చేసిన కల్పన స్వభావ విరుద్ధముగ నున్నదని రాయలు తిరుమలదేవితో పలికెనట. ఆమెయు

పురుష స్వభావమును రాయలవారి స్వానుభవము లోనికి తెచ్చుటకై ఒక యుక్తి పన్నెనట. తన పరిచారికలలో మిక్కిలి అందగత్తెయైన ఒకదానిని మేలైన వస్త్రాభరణాదులతో అలంకరించి రాయలకు చూపి, "ఇది మా పిన తల్లి కూతురు. నన్ను చూచుటకై వచ్చినది" అని తెలిపెనట. రాయలు నమ్మెనట. పిదప ఆ వేషధారిణి హావభావములను, విలాస చేష్టలను గమనించిన రాయలు దానికి తనపై మనసు కలిగెనని భ్రమించెనట. తరువాత నొకనాడు రాయలు తనకు రాణివారును, ఆమె సోదరియు చేరి అభ్యంగస స్నానము గావింపవలెనని కోరెనట.అట్లే స్నానము గావింపజేయుచు మధ్యలో ఏదో నెపమున రాణి ఆవల కేగెనట. అప్రయత్నవశమున ఇట్లు లభించిన ఏకాంతమును ఉపయోగించుకొను ఆశతో రాయలు 'మరదలి'తో సరసము ప్రారంభించెనట. వెంటనే అది భయమును, కోపమును నటించుచు 'అక్కా'ను పిలుచుచు పెద్దగా కేకలు వేయసాగెనట. కథ అడ్డము తిరిగినందులకు చకితుడైన రాయలు రాణికి సంగతిని తెలుపవలదని, తన మర్యాద కాపాడు మని దాని పాదములు పట్టుకొని బ్రతిమాలసాగెనట. దీనినంతటిని పొంచి యుండి గమనించుచునేయున్న రాణి చట్టున ప్రవేశించి, 'అయ్యో, మహా ప్రభువులు దాసీదాని పాదములు పట్టుకొనుచున్నారేమి?' అని ప్రశ్నించి పరిహసించెనట. రాయలు సమాధానమునకై తబ్బిబ్బు పడగా, ఆమె నవ్వుచు యథార్థమును తెలిపి "పురుష స్వభావమెట్టిదో, తమ కిప్పటికైన తెలిసినదా?" అని ప్రశ్నించెనట. రాయలు తిమ్మన మనస్తత్త్వ వేత్తృత్వమును ప్రశంసించె నట [కవి జీవితములు].

ఈ దంత కథలలో దేనియందెంత నిజమున్నదో తిమ్మనకే తెలియవలె, తిరుమలదేవికే తెలియవలె, రాయలకే తెలియవలె. ఇప్పుడు దేవున కొక్కనికే తెలియవలె. సత్యాసత్యముల మాట ఎట్లున్నను ఈ కథలన్నియు తిమ్మన అసాధారణ మనస్తత్త్వ పరిజ్ఞానమును ఏకగ్రీవముగ ఉద్ఘోషించుచున్నవి.

జగన్నాథ విజయమును గూర్చియు ఒక దంత కథ వ్యాప్తిలో నున్నది. రాజశేఖర విలాసమను చంపూ కావ్యమును రచించి ఖ్యాతి నార్జించిన షడక్షరి దేవుడను జైన కవితో స్పర్థించి రుద్రభట్టు జగన్నాథ విజయ కావ్య మును రచించెనట. పండితులీ ఉభయ కావ్యములను పరిశీలించి రాజశేఖర

విలాసమే శ్రేష్ఠమని నిర్ణయించిరట. పాండిత్య స్పర్థలో పరాజితుడైన రుద్ర భట్టు తన బిరుదులనెల్ల విజేతయైన షడక్షరి దేవునకు సమర్పించుకొనవలసిన వాడయ్యెనట. అయినను షడక్షరి దేవుడు రుద్రభట్టును కరుణించి ఆతని బిరుదుల నాతనికి మరల నొసంగెనట. జైనుని వలన బ్రాహ్మణునకు కలిగిన ఈ అవమానమును విని, రుద్రభట్టు మిత్రుడైన లక్ష్మీశుడను బ్రాహ్మణ కవి జైమిని భారతమను కావ్యమును రచించి, విద్వాంసులను మెప్పించి 'కవిచూత వన చైత్ర' అను బిరుదమును సంపాదించి బ్రాహ్మణ గౌరవమును కాపాడె నట. [S. G. నరసింహాచార్య, జగన్నాథ విజయ—'పీఠికె'].

ఈ కథకు బొత్తిగా కాళ్ళు లేవు. ఇందు పేర్కొనబడిన కవులు ముగ్గు రును సమకాలీనులు కారని మనము లోగడ చెప్పికొని యున్నాము. కనుక ఈ కథ కేవలము కట్టుకథ యనుటలో ఎవరికిని సందేహము లేదు. అయినను ఈ మూడు గ్రంథముల యోగ్యతా తారతమ్యమును గురించి పండితులకు గల అభిప్రాయమును మాత్రము ఈకథ వెల్లడించుచున్నదని మనము భావించుచో తప్పు కాబోదు.



# పారిజాతాపహరణము

## జగన్నాథ విజయముతో తులనాత్మకానుశీలనము

## ద్వితీయ ప్రకరణము

## మాతృకా నిర్ణయము

ప్రాచీనాంధ్ర వాఙ్మయమంతయు ప్రాయికముగ సంస్కృత మాతృకమే. కనుకనే పారిజాతాపహరణమునకు గూడ మాతృక ఏదో సంస్కృత పురాణమో, కావ్యమో ఐయుండునని ఊహించుట సహజమగుచున్నది.

పారిజాతాపహరణ కథ శ్రీకృష్ణ నాయకము. శ్రీకృష్ణుని చరిత్ర ప్రధానముగ హరివంశ, విష్ణు పురాణ, భాగవతములలో కీర్తితము. ఈ మూడు పురాణములును ప్రాచీన మహా కవులచే తెనిగింపబడినవి. పారిజాతాపహరణమునకు మాతృకను వెదకు పండితుల దృష్టిని ముందుగా భాగవతమే ఆకర్షించినది. శ్రీమాన్ ఉత్పల వేంకట నరసింహాచార్యులవారు సంస్కృత భాగవత దశమ స్కంధము నందలి మూడు శ్లోకములను గ్రహించి తిమ్మన ఒక ప్రబంధముగా పెంచి వ్రాసెనని తలంచిరి [పారిజాతాపహరణము—పీఠిక—వావిళ్ళ ప్రచురణ 1918]. ఆచార్యులవారు గుర్తించిన మూడు శ్లోకములును ఇవి :

"చోదితో భార్యయోత్పాట్య పారిజాతం గరుత్మతి
ఆరోప్య సేంద్రాన్ విబుధాన్ నిర్జిత్యోపాయన త్పురమ్.

స్థాపితం సత్యభామాయా గృహోద్యానోపశోభనః
అన్వగుర్భ్రమరాస్స్వర్గాద్యద్గంధాలస లంపటాః.

యయాచ చానమ్య కిరీట కోటిభిః
పాదౌస్స్పృశ న్నచ్యుత మర్థసాధనమ్

సిద్ధార్థ ఏతేన విస్మృహ్యాతే మహాన్
అహెూ సురాణాంచ తమో ధిగాఢ్యతామ్"
— భాగవతము దశమ స్కంధము. శ్లో. 39-41.]

తరువాత శ్రీ నాగపూడి కుప్పు సామయ్యగారు 'పారిజాతాపహరణము' నకు సంస్కృత హరి వంశము మూలమని తెలిపి కథా సంవిధానమునందును, భావము లందును, పద బంధములందును గల కొన్ని సాదృశ్యములను, కొన్ని భేదములను కూడ చూపిరి. [పరిమళోల్లాస పీఠిక— అనుబంధములు 'ఉ', 'ఊ'లు పుటలు XIII—XIX. సం॥ 1929]. పిదప శ్రీ మూసి రామ మూర్తి శాస్త్రిగారు శ్రీ కుప్పు సామయ్యగారు చెప్పినదానినే పునరుద్ఘాటించిరి. [సురభి వ్యాఖ్యా పీఠిక—పుటలు 10-13. సం॥ 1933]. శ్రీ టేకుమళ్ల అచ్యుతరావుగారు కూడ ఈ విషయమును గూర్చి మరికొంత విపులముగ తెలిపిరి [విజయనగర సామ్రాజ్యమందలి ఆంధ్ర వాఙ్మయ చరిత్ర—సంపుటి 2. పుటలు 221-241].

ఇటీవల ఆంధ్ర పండితులలో ద్రావిడ భాషా సాహిత్యముల తుల నాత్మక దృష్టి హెచ్చినది. ప్రతి ప్రాచీనాంధ్ర కావ్యమును గీర్వాణముతో ముడిపెట్టుట వారికి నచ్చలేదు 'ప్రతిదానిని గీర్వాణముతో ముడి పెట్టనిది మనకు తృప్తిలేదు' అని శ్రీ పుటపర్తి నారాయణాచార్యులుగారు పరిహసించిరి. వారు అన్యభాషలలో పారిజాతాపహరణమునకు మాతృకలను వెదుక సాగిరి. శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులవారు 'హరి కథాసారము' అను కన్నడ గ్రంథము పారిజాతాపహరణమునకు మాతృక యని సెలవిచ్చిరి. ['తిమ్మన'—విజ్ఞాన సర్వస్వము Vol. 4. పుట 820]. శ్రీ బి. వేంరావు అనువారు కన్నడ భాషలో రుద్రభట్టు అను కవి రచించిన జగన్నాథ విజయ మను కావ్యము పారిజాతాపహరణమునకు మాతృక యని ప్రకటించుటేగాక తెలుగు, కన్నడము లందలి కొన్ని పద్యములకు సాదృశ్యమును గూడ ఉదాహరించిరి. ['పారిజాతాపహరణమునకు మూల గ్రంథము'— భారతి- 1952 డిసెంబరు]. తరువాత శ్రీ కె. సుబ్బరామప్ప, శ్రీ నిడుదవోలు వేంకట రావు మొదలగు పండితులు కూడ అదే అభిప్రాయమును పునరుద్ఘాటించుచు వచ్చిరి.

ఇట్లు భాగవతము, హరి వంశము, హరి కథాసారము, జగన్నాథ విజయము అను గ్రంథములను పారిజాతాపహరణమునకు మాతృకలుగ వేర్వేరు పండితులు వేర్వేరు విధములుగ భావించుచు వచ్చినారు.

హరి కథాసార మరీచిక :-

పారిజాతాపహరణమునకు హరివంశము మూలమను వాదమును శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులవా పరిహసించి త్రోసిపుచ్చిరి. "తిమ్మన కావ్యమునకు కన్నడములో హరి కథాసారము మూల గ్రంథము. కొన్ని కన్నడ పద్యముల నీతడు మక్కికి మక్కిగా తెనిగించిన పట్టులు నున్నవి" అని వారనినారు. ఆ మాట నాధారము చేసికొని "అల్లసాని పెద్దనగారుకూడా హరికథా సారం తెలుగులో రచించినట్లు లాక్షణికులు కొన్ని పద్యాలు ఉదాహరిస్తున్నారు. తెలుగులో పెద్దనగారూ, తిమ్మనగారూ వ్రాసిన కావ్యాల నుండి కన్నడ కవి అనువదించాడేమో పరిశోధించాలి" అని ఆరుద్రగారు ఒక క్రొత్త సమస్యను లేవదీసినారు [సమగ్రాంధ సాహిత్యం—సంపుటి VII. పుట 164].

'పరిశోధింపగా' కన్నడములో 'హరి కథాసార' మను పేరుగల గ్రంథమే లేదు. 'హరికథామృత సార' మను గ్రంథము మాత్రమున్నది. కాని దానిలో పారిజాతాపహరణ కథ లేదు. పైగ ఆ గ్రంథమును రచించిన జగన్నాథ దాసు 18వ శతాబ్ది (1727-1809) నాటివాడు. తిమ్మనకు ఇన్నూరేండ్లకు పైగ ఈవలివాడు.

ఈ విషయమును గూర్చి నేను శ్రీ నారాయణాచార్యుల వారికి ఒక లేఖ వ్రాసితిని. "మీరు పేర్కొనిన 'హరి కథాసార' మను గ్రంథము ఏ కవి వ్రాసినది? దాని వివరములు తెలుపుడు" అని. దానికి వారు దయతో సమాధాన మొసంగినారు. పారిజాతాపహరణమునకు హరి కథాసారము మూలమనుట పొరపాటనియు, జగన్నాథ విజయమే మూలమై యుండవచ్చుననియు వారు తమ అభిప్రాయమును తెలిపినారు. ['జగన్నాథ విజయము' 'జగన్నాథ దాసు' (హరి కథామృతసార కర్త) అను పేర్లలోని సామాన్య భాగమైన 'జగన్నాథ' శబ్దమే ఈ పొరపాటునకు కారణమై యుండవచ్చును].

"హరి కథాసార" వాదమును లేవదీసిన శ్రీ నారాయణాచార్యులవారే దానిని నిరాకరించుటతో ఆ వాదమంతయు నిర్మూలమైనది. కనకదాసు రచించిన హరి భక్తిసారము తిమ్మన రచనకు మాతృకయై యుండునని ఒకరూహించిరి. కాని అది ముక్తకప్రాయములైన 110 భక్తి పద్యముల లఘు కావ్యము. పైగ కనకదాసు 1550 ప సం॥ వాడు. తిమ్మనకు ఒక తరము తర్వాతివాడు. కనుక ఈ ఊహ నిరాధారమైనది.

పారిజాతాపహరణము-జగన్నాథ విజయము
కథాంశ సాదృశ్యములు :

పారిజాతాపహరణ కావ్యమునకు మూల గ్రంథము జగన్నాథ విజయమే యనుటకు ప్రధాన కారణము ఈ ఉభయ కావ్యములందలి కథాంశ సాదృశ్యమే. అట్టి సదృశ కథాంశము లేవియో గమనింతము.

శ్రీ బి. వెం. రావుగారిట్లు వ్రాసియున్నారు. "నారదాగమనము, రుక్మిణీ సమక్షమున నాతడు పారిజాత ప్రసూనమును శ్రీకృష్ణున కొసఁగుట, కృష్ణుడు దానిని రుక్మిణి కొసగుట, తత్ప్రసవధారణమున నామెకు నపూర్వ శోభ సమకూరుట, నారదుఁడా యవకాశమును గొని సత్యభామనుపాలంభించుట, తద్దాతిక యావృత్తాంతమును సాత్రాజితి కెఱింగించుట, ఆమె కుపితయై కోప గృహమునఁ బరుండుట, కృష్ణుఁడు ముని సేవకై ప్రద్యుమ్నుని నియోగించి సత్యా మందిరమున కరుగుట, యామె చెలికత్తెను జేసన్న నివారించి కృష్ణుఁ డామెకుఁ దాళ వృంతముతో విసరుట, అతని కరము పారిజాత పరిమళమును వెదజల్లుట, విస్మితయై సత్య తలయెత్తి పరిశీలించి మఱల కినిసి పరుండుట, కృష్ణుని సాంత్వనము, నాకలోకమునుండి పారిజాత తరువునే తెచ్చి యామె కొసఁగఁ గృష్ణుఁడు ప్రతినఁ బూనుట, గరుడ స్మరణము, స్వర్గ ప్రయాణము, ఇంద్రోపేంద్ర యుద్ధము, ఇంద్రప్రయుక్త వజ్రమును గృష్ణుఁడు చేతితోఁ బట్టుట— దాదాపు 200 పద్యములలో రుద్రభట్టు వర్ణించిన ఈ ప్రధాన విషయములను గ్రహించి ముక్కు తిమ్మన 509 పద్యములతోఁ గూడిన పారిజాతాపహరణమును రచించి యున్నాఁడు."

నిజమే. ఈ కథాంశములలో ఈ రెండు కావ్యములకును గల పోలిక కొట్టవచ్చినట్లుగ కనిపించుచున్నది. కనుక కాలక్రమమును బట్టి ముందటి

గ్రంథమైన జగన్నాథ విజయమును తరువాతి గ్రంథమైన పారిజాతాపహరణ మనుసరించినట్లు భ్రమ కలుగుట సహజమే. కాని సంస్కృత హరి వంశము నందీ కథాంశములు— కృష్ణుడు వజ్రమును పట్టివేయుట అనునొక్కటి తప్ప మిగిలినవి అన్నియు సరిగా ఇట్లే చెప్పబడి యున్నవి. తిమ్మన తన కావ్యము నకు హరి వంశము మాతృక యను విషయమును సూచించిగూడ నున్నాడు. తిమ్మన జనమేజయునిచే వైశంపాయనునితో నిట్లు పలికింపజేసినాడు :

"హరివంశ కథలెల్ల నాను పూర్విగ నిట్లు
విని కృతార్థుడనైతి మునివరేణ్య .... " (I 36).

అట్టిచో తిమ్మన జగన్నాథ విజయమును గాక, అతడు చెప్పికొనిన విధముగనే హరి వంశమునే అనుసరించి యుండెనని నమ్ముట న్యాయమై యున్నది.

తిమ్మనయే స్వయముగ సూచించిన విషయమును మన పండితు లేల నమ్మకుండిరని ఈ సందర్భమున ప్రశ్న ఉదయించుట సహజము. దీనికి కార ణము ఆచార్య పింగళి లక్ష్మీకాంతముగారు మరొక సందర్భములో చెప్పి నట్లుగా "హరివంశ మనగా తెలుగు హరి వంశము మాత్రమే యని భ్రమించి సంస్కృత పురాణమును చూడకుండుట వలన దొరలిన ప్రమాదమిది". తెలుగులో ఎఱ్ఱన రచించిన హరి వంశమందలి పారిజాతాపహరణ కథ తిమ్మన తెలిపిన కథకంటె చాల భిన్నముగ నున్నది. కనుకనే తిమ్మన తెలిపినను ఈ విషయమును చాలకాలము వరకు గుర్తింపలేకుండిరి.

తిమ్మన కావ్యమునకు సంస్కృత హరి వంశము మూలమను విషయ మును పరిశోధకులైన కొందరు పండితులు గుర్తించి ప్రకటించిన తరువాత కూడ కొందరు వారి మాటను నమ్మకున్నారు. దీనికి కారణము ఆధునిక పండితులకు ప్రాచీన పండితుల యెడల ప్రబలిన "ప్రతివానిని గీర్వాణముతో ముడిబెట్టనిది మనకు తృప్తి లేదు" అను పరిహాస ధోరణియే.

ఈ ఉభయ వాదములందలి సత్యాసత్యములను నిర్ణయింప బూను టకు ముందు జగన్నాథ విజయమునకును, పారిజాతాపహరణమునకును గల మరికొన్ని కథాంశ సాదృశ్యములను—శ్రీ బి. వెం. రావుగారుగాని, వారి

వాదమునే అనుసరించిన ఇతర పండితులు గాని చెప్పక వదలినవానిని కూడ ఇప్పుడే గుర్తించుట న్యాయము.

1) ఈ ఉభయ కావ్యములందును పారిజాతాపహరణమునకు పూర్వమే కృష్ణుడు షోడశ సహస్ర కన్యలను పరిణయమైనట్లు చెప్పబడి యున్నది. భాగవత, విష్ణు పురాణముల ననుసరించి పారిజాతాపహరణమునకు తరువాతనే ఈ వివాహము నడచినది.

2) "అదితి దర్శనమును, ఇంద్ర సత్కారమును తిమ్మన కల్పితములు" అని శ్రీ బి. వెం. రావుగారు పొరపడినారు. కాని రుద్రభట్ట కావ్యములో కూడ ఈ విషయము లున్నవి. సందర్భము మాత్రము కొద్దిగా మారి యున్నది.

కాని ఈ పై రెండు కథాంశములు కూడ హరివంశ మందున్నవే. కనుక ఈ కథాంశములను తిమ్మన జగన్నాథ విజయము నుండియే గ్రహించినాడని నిశ్చయాత్మకముగా చెప్పుటకు వలను పడకున్నది.

ఇప్పుడు హరి వంశమునకు భిన్నముగను, ఈ కావ్య ద్వయమునకు సామాన్యముగను నున్న కథాంశములేమైన కలవేమో పరిశీలింతము.

1) హరి వంశము ననుసరించి అదితి కుండలములను కృష్ణుడు దేవేంద్రుని కొసగాగా అతడు అదితికి సమర్పించెను. జగన్నాథ విజయ, పారిజాతాపహరణములు రెండింటిలోను కృష్ణుడే స్వయముగా అదితికి సమర్పించినట్లు కలదు.

2) హరి వంశములో అదితి శ్రీకృష్ణుని స్తుతింపలేదు. రుద్రభట్ట, తిమ్మన లిరువురి కావ్యములందును దీర్ఘమైన స్తుతి కలదు.

3) హరి వంశము ననుసరించి పారిజాతాపహరణమునకై అమరావతి కేగు కృష్ణుడు తనవెంట సాత్యకి, ప్రద్యుమ్నులను గొనిపోయినాడు. మన కావ్య ద్వయమునందు శ్రీకృష్ణుడు వారిని వెంటగొనిపోలేదు.

4) హరి వంశము ననుసరించి ఇంద్రోపేంద్రులకు యుద్ధము జరుగు సమయమున సత్యభామ కృష్ణుని పార్శ్వస్థయై లేదు. మన కావ్యములు రెంటి యందును ఆమె ఆ సమయమున కృష్ణుని ప్రక్కనే యున్నది.

5) హరి వంశానుసారము యుద్ధము రెండు దినములు జరిగినది. కాని మన కావ్య ద్వయము ననుసరించి ఒక్క దినముతోనే ముగిసినది.

6) హరి వంశము యుద్ధములో దేవేంద్రునకు దిక్పాలురు తోడైనట్లు చెప్పుట లేదు. మన కావ్య ద్వయమందును ఈ సంగతి చెప్పబడినది.

7) జయంతుడును, ప్రవరుడను బ్రాహ్మణ వీరుడును దేవేంద్రునకు యుద్ధమునందు తోడ్పడినట్లు హరి వంశము చెప్పుచుండగా, మన కావ్య ద్వయములో వారి పేరైన లేదు.

8) యుద్ధ మధ్యమున శ్రీకృష్ణుడు బిల్వోదకేశ్వరుడను శివుని పూజించి నట్లును, ఆ శివుడు కృష్ణునకు యుద్ధమున విజయము లభించునట్లు వర మొసంగినట్లును హరి వంశమున కలదు. మన కావ్య ద్వయమున ఆ ప్రసం గమే లేదు.

9) గరుడుని భారమునకు పారియాత్ర పర్వతము క్రుంగిపోవుటయు, శ్రీకృష్ణుడా పర్వతమునకు వరము లొసంగుటయు హరి వంశమున చెప్పబడి నవి. మన కావ్య ద్వయమా విషయము తెలుపుట లేదు.

10) శ్రీకృష్ణుడు దారుక సారథికమగు తన రథమును యుద్ధ మధ్య మున ద్వారక నుండి అమరావతికి తెప్పించుకొనినట్లు హరి వంశము చెప్పు చున్నది. మన కావ్య ద్వయమున ఆ సంగతి లేదు.

11) దేవేంద్రుడు శ్రీకృష్ణునిపై వజ్రాయుధమును ప్రయోగింపగా, అతడు దానిని ఒడిసిపట్టి నిర్వీర్యము గావించినట్లు మన కవులిద్దరును చెప్పి నారు. హరి వంశమున ఈ మాట లేదు.

12) అదితి కశ్యపుల మాధ్యస్థము వలన యుద్ధము ముగిసినట్లు హరి వంశము చెప్పుచున్నది. మన కావ్య ద్వయము ఈ మాటను చెప్పుట లేదు.

13) పుణ్యక వ్రతాచరణము కొరకే శ్రీకృష్ణుడు పారిజాతమిమ్మని దేవేంద్రు నర్థించినట్లును, ఆ వ్రతము ముగియగనే కృష్ణుడు తిరిగి పారిజాత మును దేవేంద్రున కప్పగించినట్లును హరి వంశము చెప్పుచున్నది. మన కావ్య ద్వయము అట్లు చెప్పుట లేదు.

హరివంశమునకు భిన్నముగను, జగన్నాథ విజయ పారిజాతాపహరణము లందు సమానముగను నున్న ఈ కథాంశములు స్థూల దృష్టికి జగన్నాథ విజయానుసరణ వాదమును సమర్థించునవిగనే కనుపించుచున్నవి. కాని నిజము వేరుగా నున్నది.

రుద్రభట్టు జగన్నాథ విజయమునకు సంస్కృత విష్ణు పురాణము మాతృక. ఆ విషయము నాతడే 'కతె విష్ణు పురాణం' అని చెప్పికొని యున్నాడు. [జ. వి. 1 21] పై చెప్పబడిన హరివంశ విరుద్ధ కథాంశములన్నియు విష్ణు పురాణమున సరిగా ఇట్లే చెప్పబడి యున్నవి. అట్టిచో తిమ్మన ఈ కథాంశములను జగన్నాథ విజయమునుండి గాక, దానికి మాతృక యగు విష్ణు పురాణము నుండియే గ్రహించెనని ఏల చెప్పరాదు?

"తిమ్మన తన కావ్యమునకు విష్ణు పురాణము మాతృక అని చెప్పికొని యుండలేదు గదా?" అని ఒక ఆక్షేపణ కలుగవచ్చును. రుద్రభట్టు తన కావ్యమునకు మాతృక విష్ణు పురాణమని చెప్పికొనినను, విష్ణు పురాణముతో బాటుగ హరి వంశమును కూడ ఆతడనుసరించినట్లుగనే, తిమ్మన కూడ తాను హరి వంశము ననుసరించినట్లు సూచించినను విష్ణు పురాణమును కూడ అనుసరించి యుండుటలో అసహజ మేమియును లేదు. రుద్రభట్టు, తిమ్మన లిరువురును హరివంశ, విష్ణు పురాణములను రెండింటిని ఎవరికివారుగా అనుసరించి రచించిన కావ్య ద్వయము మధ్య సాదృశ్యము లుండుటయు సహజమే గదా!

## రుద్రభట్టు సొంత కల్పనలు - కథాంశములు :

జగన్నాథ విజయ, పారిజాతాపహరణము లందు సమానముగా నున్న కథాంశము లన్నియు హరి వంశమునందో, విష్ణు పురాణమునందో ఉన్నవే యగుటచే అవి తిమ్మన జగన్నాథ విజయము ననుసరించినాడను వాదమును సమర్థింపలేవు. రుద్రభట్టు సొంతముగా చేసిన కల్పనలను వేనినైన పారిజాతాపహరణ మందు చూపగలిగినప్పుడే ఈ వాదము నంగీకరింప వీలగును. కనుక అట్టి సాక్ష్యము లేమైన లభింపగలవేమో చూతము.

రుద్రభట్టు హరివంశ, విష్ణు పురాణ కథల ననుసరించుచునే కొన్ని నూతన కథాంశములను కల్పించియున్నాడు. వానిలో కొన్ని రమ్యమైనవి కూడ కలవు. కాని వానిలో నొక్కదానినైనను తిమ్మన గ్రహింపలేదు.

1) కోపాగారగతయైన సత్య కన్నీటిని కృష్ణుడు తన దోసిటబట్టి వక్షఃస్థలమునకు రుద్దుకొనెనని రుద్రభట్టు చెప్పినాడు. దీనికి మూలమైన హరి వంశ శ్లోక మిట్లున్నది :

"అథోరసి పతత్తోయం శ్రీవత్సాంకోంబుజేక్షణః
ప్రియానయనజం దేవః పరిమృజ్యేద మబ్రవీత్".

— (హరి. ౬౬-26)

ఇదే సందర్భమున తిమ్మన 'సుసుఁ జెక్కులఁ జాలుకొనంగ జాఱు కన్నీరు కరంబునం దుడిచి' (౧-134) అని మాత్రమే చెప్పినాడు. కన్నీటిని ఉరమునకు పులుముకొనుటను చెప్పలేదు.

నిజమున కీశ్లోకమునకు నీలకంఠీయము 'ఉరసి ప్రమృజ్యేతి స్నేహాతిశాయ సూచనం' అని వ్యాఖ్యానము చేసియున్నది. కాని తిమ్మన కాలము నాటికి నీలకంఠీయ వ్యాఖ్య ఇంకను పుట్టియుండలేదు. శ్లోక పూర్వార్థమందున్న 'ఉరసి' అను పదమును, ఉత్తరార్థమందు గల 'పరిమృజ్య' అను పదముతో చేర్చుకొనుటకంటె, వెంటనే గల 'పతత్'తో చేర్చుకొనుటే సహజమును, సరళమును నైన అన్వయము. అప్పుడు కన్నీరు సత్య కన్నుల నుండి జారి ఆమె ఉరమునందే పడుచున్నదను సహజమైన అర్థమేర్పడుచున్నది. ఈ అర్థద్వయము నందలి స్వారస్యము మాట ఎట్లున్నను సహజముగా స్ఫురించునది మాత్రము తిమ్మన స్వీకరించిన అర్థమే. నీలకంఠీయ వ్యాఖ్య పుట్టియుండక పోవుటయు, రుద్రభట్ట కావ్యమును చూచియుండక పోవుటయువలననే తిమ్మన రెండవదైన ఈ దూరాన్వయపు టర్థమును గ్రహింపలేక పోయినాడు.

2) పారిజాతాపహరణ వార్తను వినగనే దేవేంద్రుడు యుద్ధ సన్నద్ధుడైనట్లు హరివంశ, విష్ణు పురాణములు రెండును తెలుపుచున్నవి. అతడెవ్వరితోడను సంప్రతించినది లేదు; అతని కెవ్వరును భావి కార్యవిధానమును గూర్చి సమ్మతి నొసగినదియు లేదు. కాని ఈ సందర్భమున "పరమేశ్వరుడైన

శ్రీకృష్ణునితో వైరము వలదు. పారిజాతము నాతనికి సమర్పించుమని బృహస్పతి ఇంద్రున కుపదేశించినట్లును, దేవేంద్రు డాతని యుపదేశమును తిరస్కరించినట్లును రుద్రభట్టు కల్పించినాడు.

హరి వంశమందలి బృహస్పతి ఉపదేశ మిందులకు పూర్తిగా భిన్నముగా నున్నది. "నీవు సపుత్రకుడవై కృష్ణునితో యథాశక్తి పోరాడుచుండుము. నేనింతలో న్యాయమును చేకూర్చు ప్రయత్నము గావింతును" అని బృహస్పతి ఇంద్రునకు సమ్మతి నొసంగియున్నాడు. [హరి. 72 అధ్యా.]

తిమ్మన బృహస్పతి పేరైన ఎత్తలేదు.

3) శ్రీకృష్ణునితో యుద్ధమునకు సిద్ధమగుచున్న ఇంద్రునకు నారదుడు "పరమేశ్వరుడైన శ్రీకృష్ణునితో విరోధము వల"దని ఎన్నోవిధముల బోధించినట్లును, ఇంద్రుడాతని యుపదేశమును తిరస్కరించినట్లును హరి వంశము చెప్పుచున్నది. (హరి—69, 70, 71 అధ్యా.) రుద్రభట్టు దీనికి కేవలము విరుద్ధముగా నారదుడే ఇంద్రుని యుద్ధమునకు ప్రోత్సహించినట్లు కల్పన గావించి యున్నాడు.

ఈ సందర్భమున నారదుడు ఇంద్రుని కొలువులో నున్నట్లైన తిమ్మన చెప్పలేదు.

4) నారదుని కలహ ప్రియత్వమును రుద్రభట్టు మరియొకసారి ఇట్లు చిత్రించినాడు. శ్రీకృష్ణుని ధాటికి తట్టుకొనలేక దిక్పాలురును, ఇతర దేవతా వీరులును కకావికలై పారిరి. అప్పుడు నారదు డాకాశమున నిలచి ఇంద్రుని, దేవతలను యుద్ధమునకు పురిగొల్పినట్లు రుద్రభట్టు కల్పన.

ఈ సందర్భమున హరివంశ, విష్ణు పురాణములలో నారదుని పేరైన లేదు. ఇక తిమ్మన

.... .... రణాశనమౌని నింగిపై
కుతుక రసాతిరేకమునఁ గుంచియ వీచి నటించె నయ్యెడన్'.
— పారి. V 29.

అని మాత్రమే చెప్పినాడుగాని,* ఇంద్రుని పోరునకు ప్రోత్సహించినట్లు చెప్ప లేదు.

5) శ్రీకృష్ణుడు దేవేంద్రుని వజ్రాయుధమును పట్టివేసినంతనే దేవేంద్రుడు పలాయనము చిత్తగించెనని విష్ణు పురాణము చెప్పుచున్నది.

"క్షిప్తం వజ్ర మథేంద్రేణ జగ్రాహ భగవాన్హరిః
స ముమోచ తదా చక్రం శక్రం తిష్ఠేతి చాబ్రవీత్
ప్రణష్ట వజ్రం దేవేంద్రం గరుడక్షత వాహనమ్
సత్యభామా బ్రవీద్వీరం పలాయన పరాయణమ్'

— విష్ణు. 30, 69, 70.

రుద్రభట్టిచ్చట కులిశము ప్రతిహతమై నంతట వెనుదీయక అఖండలుడు మదపుటేనుగును ముందునకు త్రోలెను అను కల్పన చేసెను.

అమూలకమైన ఈ కల్పన తిమ్మన రచనలో లేదు. తన ముఖ్యత రాస్త్రము నిర్వీర్యము కాగనే దేవేంద్రుడు ఐరావతమును దిగి 'నేనపరాధిని' అనుచు శ్రీకృష్ణునికి సాగిలబడి మ్రొక్కెననియే తెలిపినాడు (V. 38).

6) వీని యన్నింటికంటె తలమానిక మనదగిన కల్పన యొకటి రుద్రభట్టు చేసినాడు. ఇంద్రోపేంద్రులు పోరాడుకొనుచుండగా వారి అర్ధాంగులు మాత్ర మూరకుండనేల ? అని తలచినాడు. ఎట్లును సత్యభామ శ్రీకృష్ణుని పార్శ్వస్థయై ఉండనే ఉన్నది. శచీదేవిని కూడ యుద్ధ రంగమున కవతరింప జేసినాడు. శచీ, సత్యలకు ద్వంద్వ యుద్ధమును కల్పించినాడు. ఐనను ఆడువారు ఆయుధములతో పోరాడుకొనుట అంత సుందరముగ నుండదని కాబోలు, అంతకంటె వాడియైన వాగ్బాణములతో కారాడుకొండనినాడు. వారి వాగ్యుద్ధ క్రమ మిట్లున్నది.

"సత్యభామె సోపహాస వచనదిం శచిగిం తెంచళ్
కులగోత్ర వైరియుం బల
దల ననుమెం దమరపతియ నొల్లదె పోదర్

* ఇది తిక్కన ననుసరించి చెప్పినది. ' .... నారదుఁడు వేడ్కంగుంచె సారింపఁగన్' (విరాట. III 183).

కులగోత్ర వీరభటరుం
బలనాథరుమొంతు మమరరే నోడువరే. (౧౩-78)

నినగుళ్ళదం నిళిం పా
వనిజమనెనగిత్తె నీనిదల్తు విచిత్రం
తనగిల్లద పరిభవమం
దనుజారి బలారిగిత్త నెనగిదు చిత్రం. ( -79)

ఎనెకేళ్ద కట్టేవముం నోవుమళవిగళియె శచి ఇంతెం దళ్.
రథచరణ పాణి బలముం
మథియిసె, జంభారిగాయ్తు గీర్వాణహతి
వ్యథె, యీ గీర్వాణాది
వ్యథెయం మత్తెకె తంగి పడెదపె యెనగం. ( -80)

దివిజర్సోలె, సురద్రుమం నినగె సార్దత్తెందు బేఱొందు రూ
ప విలాసం, పెఱతొందుదేసి, పొసతొందున్మాన మాగిర్పుద
ర్పవిదేం పింగితెయుప్ప వింద్ర తరుకై సార్దత్తె, మేణ్కాణల
క్కు వుపేంద్రేంద్ర రొళిగమెక్క తుళదిందం గెల్లసోలంగళిం
( -81)

వ. ఎనలతి చతురె సత్యభామె యింతెందళ్
భంగమొడర్చె నిన్నవచనం నినగక్కె, విరోధి యాడుదే
కాంగదెనోడు కాళగవుపేంద్ర మహేంద్రరొళప్ప గెల్ల సో
లంగళనెంబ యాదియినుపేంద్ర నొళాదుదుగెల్ల వింద్రనొళ్
సంగళి సిత్తు సోలనఱివంతుటె కాళగవీ మహేంద్రనా. ( -82)

వ. ఎనె తదీయ చతురోక్తిగతి కుపితెయాగి
సిడిలెనొప్పంగెళస్త్రం మరవగదె గడం నిన్న కాంతంగె కాయ్పుం
గెడెగొండైరావతేభం మదధిపతిగె వాహం, త్వదధీశంగె గృధ్రం
గడ, దేవేంద్ర త్వమస్మత్పతిగె పదవి, గోపాలకత్వం గడం ని
న్నొడెయం, నిన్నేతఱొళ్మతిగె దొరె భవద్వల్లభం సత్యభామె
( -83)

వ. ఎందుపౌలోమి నుడియ లామడియ వమ్రకమ దిం విరాకరిసలెందు
అసుర యమదండ మెనలు
ర్విసువ మహాగదెయ విళిపి వజ్రమ వ భివ
ర్ణి సిదపె కేవణదొళ్కి
లిసలల్లదె వజ్రవంత దేనాయుధమే. ( -84)

నాగాంతకనీ గరుడం
నాగనదైరావతం పరాజితవంతా
నాగేంద్రనదం బణ్ణిసి
నాగారియ నకట గృధ్రనెం దెణెపువుదే. ( -85)

నుడి దిర్నొందిసి గోపనెందు హరియం, గోపత్వముంటెంత దెం
దొడె గోవాచక మప్పనాక మహి ముఖ్యానేక వస్తూ త్కర
క్కొడెయం మత్ర్పియ నెందు నిమ్మనుడి నిందాస్తోత్ర వాయ్తెక్కె కే
ళ్వొడె మత్కాంత కృత ప్రసాద మెవలం త్వత్కాంత నింద్రత్వముం
( -86)

వ. ఎందు సత్రాజిత తనూజె నుడియె పౌలోమి కనల్దు
ఒందు నిటలాక్షి మిగిలుం
టెందు హరం తాళ్దిదం స్వయం ప్రభుతెయ నెం
దందు సహస్ర విలోచన
దిందెసెవింద్రం హరిప్రసాద స్పృహనే. ( -87)

వ. ఎనె సత్రాజితె ముగుళ్నగె నక్కు
ఉసిరల్బేడిద నక్కె, కేళ్దటివె నింద్రంగెమ్మ భాపంగె నే
త్ర సహస్రం దొరెకొండ దుస్థితియ, నాహాస్యోక్తియం తిర్కె, రం
జిసుగుం కణ్బల వెంబొడీ యవయవం హీనాధికం లేసమా
ణ సదాలాప మున్మణికాడుగె సహస్రాక్షం సరోజాక్షనొళ్.
( -88)

వ. ఎందు నుడియె తత్సంవాదదొళ్ సత్యభామెయిం శచీదేవి గాద వాక్పరాజయముం .... ....

సత్యభామ సోపహాస వచనములతో శచి కిట్లనియె; "అమరులు కుల గోత్ర వీరభటులును, బలనాథులు సగుటచే కులగోత్ర వైరియు, బల దళనుడు నగు అమరపతి నొల్లక తొలగిపోయిరే కాని, లేనిచో వారు పారిపోవు వారా? నీకున్న నిలింపావనిజమును నీవు నాకొసగుటలో వింత లేదు. కాని తనకు లేని పరాభవమును దనుజారి బలారి కిచ్చుటయే నాకు చిత్రముగా నున్నది."

అన విని కట్టేవయు, నోవును అలవిమీరగ శచి ఇట్లనియె : "రథ చరణ పాణి సుర బలమును మథియించుటచే జంభారి కెట్లును గీర్వాణ హతి వ్యథ కలుగనే కలిగినది. చెల్లీ, నీవు నాకు మరల నీ గీర్వాణ హతి వ్యథనేల కలిగిపతువు? దివిజులు పరాజితులై సురద్రుమము నీకు చేపడినదని ఇంత లోనే ఒక వింత విలాసము, ఒక క్రొత్త సొబగు, ఒక నూతన గర్వము, దర్పము వెల్లడించుచున్నావు. కాని యుద్ధ మప్పుడే ముగిసినదా? ఇంద్ర తరువు నీకు చేజిక్కినదా? ఉపేంద్రేంద్రుల యుద్ధమున గెల్పోటములను ఇక ముందు చూతుము గదా".

అనుటయు నతి చతురయగు సత్యభామ ఇట్లనియె: "అక్కా, నీ వచనము నీకే విరోధియై భంగమును చేకూర్చుచున్నది గదా! 'ఏకాంగ యుద్ధములో ఉపేంద్రేంద్రుల గెల్పోటములను చూచెదము' అనిగదా నీవంటివి? సరి, క్రమాన్వయము వలన ఉపేంద్రునకు గెల్పును, ఇంద్రునకు ఓటమియును సంక్రమించుచున్నవి గదా! ఇంక నీ మహేంద్రుని యుద్ధము సంగతి తెలిసిపోవుచున్నది గదా."

అనుటయు తనీయ చతురోక్తి కతికుపితయై, "నా భర్తకు వజ్రమాయుధము; నీ కాంతునకు కొయ్య గద గదా ఆయుధము. నిప్పులు గ్రక్కు ఐరావతేభము మదభిపతికి వాహనము; త్వదధీశునికో గృధ్రము గదా వాహనము. అస్మత్పతికి దేవేంద్రత్వము పదవి. నీయొడయనికి గోపాలకత్వమే పదవి గదా! సత్యభామా, మత్పతికి భవద్వల్లభుడు ఏ తెరగున సరిపోల గలడు?"

అని పౌలోమినుడువుటయు నానుడుల ననుక్రమమున నిరాకరింప బూని, "అసుర యమ దండమో యన భయంకరమగు మహా గదను కొంచె

పరచి, వజ్రము నభివర్ణించుచున్నావు. ఆభరణములలో కీలించుట కుపయో గించునదేగాని వజ్రమొక ఆయుధమా? ఈ గరుడుడు నాగాంతకుడు. ఐరావతమో, అదియొక నాగము. పరాజితమగు నాగేంద్రమును పొగడి నాగారిని, అక్కటా, గృధ్రమని హీనపరుపనగునే? హరిని గోపకుడని నిందించి పలికితివి. ఆయనయందు గోపత్వముండుట నిజమే. ఎట్టి గోపత్వ మనగా గోవాచకమైన నాకమహీ ముఖ్యానేక వస్తూత్కరమునకు మత్ప్రియుడొడయడు. అక్కా, ఇట్లు నీమాటలు నిందా స్తోత్రమైనవి. నిజమునకు త్వత్కాంతుని ఇంద్రత్వము మత్కాంతకృత వరప్రసాదమే గదా".

అని సత్రాజిత్తనూజనుడువుటయు పౌలోమి కనలి, "ఒక్క నిటలాక్షి మిగులుగా నున్నదని హరుడు స్వయం ప్రభుతను దాల్చెను గదా! అట్టిచో సహస్రలోచన శోభితుడగు ఇంద్రుడు హరిప్రసాద స్పృహుడగునే?"

అనుటయు సాత్రాజితి చిరునవ్వు నవ్వి, "అక్కా, ఇంక మాట్లాడకు, మా బావగారగు ఇంద్రునకు నేత్ర సహస్రము లభించిన దుఃస్థితిని నేనును వినియే యున్నాను. ఆ హాస్యోక్తి నటుండనీ. అవయవములు హీనాధికములగుటేమి లెస్స? నీ అసదాలాపమును మానుము. సరోజాక్షునితో సహస్రాక్షుడు పరాక్రమముతో పోరనీ. అప్పుడాతని బలము తెలియగలదు."

అని పలుకుటయు, తత్సంవాదమందు సత్యభామ వలన శచీదేవికైన వాక్పరాజయము .... )

చమత్కారభరితమైన ఈ తోడికోడండ్ర వాగ్యుద్ధమునకు మూలమే స్త్రీల పాటలలోనైన ఉన్నదేమో గాని, సంస్కృత హరివంశ, విష్ణు పురాణములలో నిట్టి సందర్భమే లేదు. కనుకనే తిమ్మన కావ్యమునను లేదు. తిమ్మన ఈ రుద్రభట్ట కల్పనను ఎరిగియే యున్నచో నిట్టి రసవత్తర సన్నివేశమును వదలి యుండెడివాడు కాడు. దీనికి మెరుగులు దిద్ది, ఒక సరస సంభాషణా సన్నివేశమును రూపొందించియే యుండెడివాడు. అతడేర్పరచుకొనిన కథా ప్రణాళికకు ఈ సన్నివేశము ఎంతమాత్రము బాధకము కాకపోగా, అతడు చిత్రించిన సత్యభామ పాత్రకు ఈ సన్నివేశము చక్కగ అమరియుండెడిది.

7) ఈ కథాభాగములో రుద్రభట్టు కావించిన కడపటి కల్పన సంగ్రామ భంగాన్వితుడైన ఇంద్రుని బిల్వోదకేశ్వరుడను శివుడు ఓదార్చి, కృష్ణుని అనుచిత కార్యమున కాతనిని మందలించి ఇరువురకును సంధి పొసంగించెననునది.

శివుడు కృష్ణుని మందలించి, షట్పురవాసులను రాక్షసులను సంహరించి దేవతా హితమును గావింపుమని కృష్ణున కాదేశమొసంగినాడు. హరివంశమున బిల్వోదకేశ్వరుని పేరున్నదిగాని ఆ సందర్భము వేరు. ముందు చూడగలము. విష్ణు పురాణములో బిల్వోదకపతి పేరే లేదు. కనుకనే ఈ రుద్రభట్ట కల్పన తిమ్మన కావ్యములోను లేదు.

రుద్రభట్టు గావించిన కథాంశ కల్పనలలో నొక్కదానినైన తిమ్మన స్వీకరింపలేదు. కనుక అతడు జగన్నాథ విజయము ననుసరింపలేదనియే నమ్మవలసి యున్నది.

హరి వంశము—పారిజాతాపహరణము

**కథాంశ సాదృశ్యములు :**

"రుద్రభట్టు స్వీయ కల్పనలను తిమ్మన స్వీకరింపనంత మాత్రమున ఆతడు జగన్నాథ విజయమునుగాక దానికి మూలములైన హరివంశ, విష్ణు పురాణములనే అనుసరించినాడని నిశ్చయాత్మకముగా చెప్పుటెట్లు సాధ్యము? నిజమునకు తిమ్మన రుద్రభట్ట కావ్యమునే మాతృకగా గొనియు, స్వీయాభిరుచి ననుసరించి బుద్ధిపూర్వకముగనే అందలి కొన్ని కథాంశములను, భావములను, పద బంధములను పరిత్యజించి యుండవచ్చును. కాకతాళీయముగ రుద్రభట్టు స్వీయ కల్పనలన్నియు అట్లు పరిత్యక్తములై పోయి యుండవచ్చును" అను ప్రశ్న ఉదయింపవచ్చును. నిజమే. తిమ్మన హరివంశ, విష్ణు పురాణముల ననుసరించినాడను నిశ్చయాత్మకమైన సాక్ష్యము లభింపనిచో, జగన్నాథ విజయానుకరణవాదము వలెనే హరివంశ, విష్ణు పురాణానుకరణ వాదము కూడ ఊహామాత్రమై ఔగాముల కాకరమగుననే కాని నిశ్చయాత్మకముగు సిద్ధాంతము కాజాలదు. కనుక 'ఈ రెండు సంస్కృత పురాణములందలి కథాంశములు, సన్నివేశములు, భావములు, పదబంధములు రుద్రభట్టు స్వీక

రింపనివానిని వేనినైన తిమ్మన స్వీకరించి యున్నాడా?' అని పరిశీలింపవలసి యున్నది. పరికింపగా అట్టి సాదృశ్యము లనేకము కనుపించుచున్నవి.

హరి వంశ, పారిజాతాపహరణములకు గల సాదృశ్యములను గుర్తించుటకు ముందు హరి వంశమును గురించి తెలిసికొనవలసిన విషయము కొంత కలదు.

హరివంశ మందలి 123 నుండి 140వ అధ్యాయము వరకు పారిజాతాపహరణ కథ చెప్పబడియున్నదని శ్రీ నాగపూడి కుప్పుస్వామయ్యగారు వ్రాసియున్నారు. 64 నుండి 7టి వరకు గల అధ్యాయములలో చెప్పబడి యున్నదని శ్రీ దూశి రామమూర్తి శాస్త్రిగారు వ్రాసియున్నారు. ఇట్లు వీరు అధ్యాయముల సంఖ్యను వేర్వేరుగా చెప్పుటకు గల కారణమును తెలిసికొనవలసి యున్నది.

హరివంశ గ్రంథమునందు మూడు భాగము లున్నవి. 1) హరివంశ పర్వము, 55 అధ్యాయములు గల భాగము. 2) విష్ణు పర్వము, 128 అధ్యాయములు గల భాగము. 3) భవిష్య పర్వము, 135 అధ్యాయములు గల భాగము. [1]

ఇదిగాక పూర్వ భాగము, ఉత్తర భాగము అని మరియొక విధముగ హరి వంశము నంతటిని రెండు భాగములుగ విభజించుట కలదు.[2] విష్ణు పర్వము నందలి 82వ అధ్యాయము నుండి ఉత్తర భాగముగా గుర్తింపబడినది. ఇట్లు భాగములను విభజంచుటలో భేదమున్నను పాఠములో మాత్రము భేదము లేక దేశమందన్ని ప్రాంతములందును దాదాపు ఒకేవిధముగ లభించుచున్నది. ఇట్లగుటచే తొలి పరిగణన ప్రకారపు విష్ణు పర్వము నందలి 64వ అధ్యాయము మలి పరిగణన ప్రకారము (64+55) 119వ అధ్యాయమగుచున్నది. ఇది ఇట్లుండగా మొదటి పరిగణన ననుసరించిన ప్రతులలో[3] గల

1. బొంబాయి, గోరఖ్‌పూర్‌లలో ముద్రింపబడిన ప్రతులలో ఈవిధమైన విభజన చేయబడినది.
2. పురాణం హయగ్రీవ శాస్త్రిగారి ముద్రణలో ఈవిధమైన విభజన చేయబడినది. 'డండం' ముద్రణకూడ ఇదే విభజన ననుసరించినది.
3. వీనిని పశ్చిమోత్తర ప్రతు లనవచ్చును.

నాలుగధ్యాయములు రెండవ పరిగణనపు ప్రతులలో[1] ఒక్కొక్కటి రెండేసి అధ్యాయములుగా విభజింపబడినవి.[2] ఇట్లు పైన తెలిపిన 119వ అధ్యాయము (119+4) 123వ అధ్యాయముగా లెక్క వేయబడినది. ఇట్లు అధ్యాయముల సంఖ్యలో భేదమున్నను పాఠములో భేదము లేకపోవుటచే శ్రీయుతులు నాగపూడి, దూశిగార్లు చూచిన పాఠములు భిన్నములై యుండునని శంకింపవలసిన పనిలేదు.

దీనికంటెను ముఖ్యమైన విషయము హరివంశమందు పారిజాతాపహరణ కథ రెండు విధములుగ చెప్పబడి యున్నది.[3] విష్ణు పర్వము 64వ అధ్యాయములో ఈ కథ సంగ్రహముగ చెప్పబడినది. మరల వెంటనే 65వ అధ్యాయము నుండి 76వ అధ్యాయము వరకు గల 13 అధ్యాయములలో విస్తరించి చెప్పబడినది. 76వ అధ్యాయమున సత్యభామ గావించిన పుణ్యక వ్రత వృత్తాంతము చెప్పబడినది. 77 నుండి 80 వరకు గల నాల్గధ్యాయములలో పుణ్యక వ్రతోత్పత్తి, మాహాత్మ్యములు, తదాచరణ విధానము విపులముగా చెప్పబడినవి. 81వ అధ్యాయములో రుక్మిణ్యాదులైన కృష్ణుని ఇతర పత్నులు పుణ్యక వ్రతము నాచరించుట చెప్పబడినది.[4]

1. వీనిని ప్రాగ్దక్షిణ ప్రతు లనవచ్చును.
2. విష్ణు పర్వమందలి 6వ అధ్యాయమైన 'శకట భంజన, పూతనా వధ' రెండధ్యాయిములుగను, 48వ అధ్యాయమైన 'జరాసంధ సునీధ సంభాషణము' అనునది 'రుక్మిణీ స్వయంవరోత్సవము, శిశుపాల వాక్య'మని రెండధ్యాయములుగను, 58వ అధ్యాయమగు 'ద్వారవతీ నగర నిర్మాణము అనునది అదే పేరుతో రెండధ్యాయములుగను, 63వ అధ్యాయమగు 'నరక వధ'యే 'ఇంద్రాగమనము', 'నరక వధ' గను విభజింపబడినవి.
3. నాగపూడివారుగాని, దూశివారుగాని ఇట్లు పారిజాతాపహరణ కథ రెండుసార్లు రెండు విధములుగా చెప్పబడినట్లు గుర్తించినట్లు లేదు.
4. ఈ విష్ణుపర్వపు 81వ అధ్యాయమే హయగ్రీవ శాస్త్రిగారి ప్రతిలో 140వ అధ్యాయ మగుచున్నది

ఉదాహరణ సౌకర్యమునకై మనము 64వ అధ్యాయమున చెప్పబడిన కథను తొలి కథ యనియు, 65 నుండి 81 వరకు గల అధ్యాయములలో చెప్పబడిన కథను మలికథ యనియు వ్యవహరింతము. ఈ రెండు కథలును అనేకాంశములలో పరస్పరము భేదించుచున్నవి. తిమ్మన ఈ ఉభయ కథలను కొంతకొంత అనుసరించినాడనుటకు బలముగా తిమ్మన కావ్యమునకును ఈ ఉభయ కథలకును సాదృశ్యములు అనేకము కనుపించుచున్నవి.

ముందుగా హరివంశ, పారిజాతాపహరణములకు గల కథాంశ సాదృశ్యములను గుర్తింతము.

1) నరకుని చెరలో గల పదునార వేలమంది కన్యలను శ్రీకృష్ణుడు 'నారదుని పన్నున' పరిణయ మయ్యెనని తిమ్మన తెలిపియున్నాడు.

" .... లలనామణులంబది యాఱువేవురం
బరిణయమయ్యె నారదుని పన్నున సౌఖ్య రసైక లోలుఁడై ". (I 37)

రుద్రభట్టీ పట్టున నారదుని పేరైన ఎత్తలేదు. అయిన తిమ్మనకు నారదు డెక్కడ దొరకినాడు? అని వెదుకగా హరి వంశములో దొరకు చున్నాడు. విష్ణువు నరకుని సంహరించి, తమ్ము పెండ్లి యాడునని నారదుడు తమ్మాశీర్వదించి యుండెనని ఆ సుర కన్యలు కృష్ణునితో ననుచున్నారు :

'తస్య చంద్రోపమం వక్త్రం నిరీక్ష్య ముదితేంద్రియాః
సంహృష్టాశ్చ మహాబాహు మిదం వచనమబ్రువన్
సత్యం యత్పురావాయు రిహాస్మాన్ వాక్యమబ్రవీత్
సర్వభూతమతిజ్ఞశ్చ దేవర్షిరపి నారదః
విష్ణుర్నారాయణో దేవః శంఖ చక్ర గదాసిభృత్
స భౌమం నరకం హత్వా భర్తా చ భవితాసి వః'.

— (హరి. ౬౪-32-38)

హరి వంశమును చూచియుండనిచో తిమ్మన నారదుని పేరెత్తి యుండడు గదా.

2) సత్యా మందిరమున నారదుడు భుజించినట్లు తిమ్మన చెప్పి యున్నాడు.

"అలరుఁ బోడులు వడ్డింప నచటఁ గలహ
భోజియును దాను బహు భక్ష్య భోజ్య లేహ్య
చోష్య పానీయముల మధుసూదనుండు
సారెఁగొనియాడుచును వేడ్క నారగించె'. (II 19)

రుద్రభట్టు నారదునకు కృష్ణునిచేత భోజనము పెట్టింపలేదు. అయిన ఈ విందు పూర్తిగా తిమ్మన స్వయముగా చేసిన వంటకము కాదు. హరివంశ మందే ఈ వంటకము సిద్ధపరుపబడి యున్నది.

"అథోపకల్పయామాస సుఖాసీనాయ కేశవః
పరమాన్నం స మునయే పరమాత్మా జగద్గురుః
తల్లోకకర్త్రా సత్కృత్య దత్తం మునిరుదారధీః
బుభుజే వదతాం శ్రేష్ఠః శ్రద్ధయా పరమా యుతః".

— హరి. ఉ౨-41, 42

మూలమందున్న పరమాన్నము మాత్రమే చాలదని తిమ్మన భక్ష్య భోజ్య, లేహ్య, చోష్య పానీయములను అదనముగా చేర్చినాడు. హరివంశ ము ను చూచియుండనిచో తిమ్మన కూడ రుద్రభట్టు వలెనే కలహభోజికి 'కబుర్ల'తోనే కడుపునింపి భోజనము పెట్టకుండనే సాగనంపి యుండెడివాడు.

3) సత్యా కృష్ణులు వైజయంతమున ఒక రాత్రి నిద్రించినట్లు తిమ్మన చెప్పినాడు (IV 48). రుద్రభట్టు సత్యాకృష్ణులచే రెండుసార్లు అమరావతీ యాత్ర చేయించినాడు; కాని ఒక్కరాత్రియైన అచ్చట నిద్ర చేయనీయలేదు. అయినచో తిమ్మన ఈ కల్పన నెట్లు చేయగలిగినాడనగా దీనికి కొంత ఆధా రము హరివంశ మందు కలదు. మరికొంత తిమ్మన కల్పన. దేవేంద్రుని అతిథిగా కృష్ణుడు వైజయంతమున ఒక రాత్రి నిద్రించినట్లు హరివంశము చెప్పుచున్నది. కృష్ణుని ఒంటరిగా నిద్రబుచ్చుటకు మనసొప్పక తిమ్మన సత్యను కూడ తోడుచేసినాడు.

ఆరాత్రి సత్యఁ గూడి ము
రారి ముదం బెసఁగ వైజయంతమున మనో
భూరాజ్యసౌఖ్య నిద్రా
పారీణతనుండుచోఁ బ్రభాతంబయ్యెన్". (పారి. IV 48)

4) సత్యా కృష్ణులు ఇంద్రుని అతిథులై యుండి నందన వన విహారము చేయుచు పారిజాతమును సమీపించి దానిని పెల్లగించినట్లు హరివంశ (తొలి కథ), విష్ణు పురాణములు రెండును చెప్పుచున్నవి. రుద్రభట్టు ప్రణాళిక ననుసరించి సత్యాకృష్ణులు ద్వారక నుండియే యుద్ధ సన్నద్ధులై తిన్నగా నందనవనమున కేగియున్నారు. తిమ్మన హరివంశ (తొలి కథ) విష్ణు పురాణ కథా ప్రణాళికనే అనుసరించి యున్నాడు. ఇది యాతనికి గల ఏతదుభయ పురాణ పరిచయమును—అథవా ఏదైన ఒక పురాణ పరిచయమునైన-నిరూపించుచున్నది.

5) నందనవన పాలకులు పారిజాతాపహరణ వృత్తాంతమును శచీదేవికి తెలుపగ ఆమె ఇంద్రుని కృష్ణునిపైకి యుద్ధమునకు ప్రోత్సహించినట్లు రుద్రభట్టు కల్పన. హరివంశ మందలి రెండు కథలును వన పాలకులు తిన్నగ దేవేంద్రునకే నివేదించినట్లు చెప్పుచున్నవి.

'శ్రుత్వా తం దేవరాజస్తు కర్మ కృష్ణస్య తత్తదా' (౭౪-70)
"తే తు నందనగోప్తారః పారిజాతో ద్రుమోత్తమః
హ్రియతీతి మహేంద్రాయ గత్వా నృప శశంసిరే" (౨౩-13)

తిమ్మనకూడ ఇట్లే తెలిపియున్నాడు.

అని పలికిన గర్వోక్తులు
విని వన పాలకులు చాల విస్మితులగుచున్
జనిచెప్పి రంతయును దా
రనిమిష పతికిం బులోమజా న్వితునకున్. (పారి. IV 59)

ఇది యాతని హరివంశ పరిచయమునే తెలుపుచున్నది.

6) పారిజాత సౌరభావేశము వలన ద్వారక యందలి వికలాంగులు, రోగులు స్వస్థ శరీరులైరని తిమ్మన తెలిపియున్నాడు (V. 45-48). రుద్రభట్టీ మాటను తెలుపలేదు. ఐన నిది తిమ్మన సొంత అల్లిక కాదు. హరివంశ మందున్న విషయమునే తిమ్మన విస్తరించినాడు (హరి. ౭౫-54-56).

7) పుణ్యక వ్రతాచరణము పారిజాతాపహరణమునకు పూర్వమే జరిగి నట్లు రుద్రభట్టు చెప్పియున్నాడు (XII-61). తిమ్మన పారిజాతాపహరణా నంతరమే పుణ్యక వ్రతాచరణను చెప్పినాడు (V. 55-100). ఇది హరి వంశము ననుసరించి చెప్పబడినది (హరి. ౭౬ అధ్యాయము).

8) పుణ్యక వ్రతమును రుక్మిణి యాచరించినట్లు రుద్రభట్టు తెలిపి యున్నాడు.

" .... కృష్ణని నాడుదు రుక్మిణీ మహా
దేవిగె పుణ్యకవ్రతద నోంపి ధరిత్రిగె రాగవప్పినం". (XII-61)

(ధరిత్రికెల్ల ఆనంద మగునట్లు కృష్ణుని వలన రుక్మిణీ మహాదేవికి పుణ్యక వ్రతపు నోము అయెను.)

తిమ్మనయో సత్యభామ పుణ్యక వ్రతము నాచరించినట్లు చెప్పినాడు. ఇందిరా ప్రతినిధియు, కృష్ణుని పట్టమహిషియు, పతివ్రతా శిరోమణియు, సాధు స్వభావయునైన రుక్మిణిచేత నాచరింపజేయక, తిమ్మన పుణ్యకమును సత్య చేతనేల ఆచరింపజేసెనను ప్రశ్న ఉదయింపక మానదు. తిమ్మన జగన్నాథ విజయము ననుసరించి యున్నచో అట్లే చెప్పియుండెడివాడు. కాని అతడనుస రించినది హరివంశమును. అందు ఒక అధ్యాయము నిండుగ (౭౬. అధ్యా) సత్యభామ యాచరించిన పుణ్యక వ్రతమే వర్ణింపబడినది. అటుపిమ్మట కృష్ణుని మిగిలిన పత్నులందరును పుణ్యక వ్రత మాచరించినట్లు కూడ హరి వంశము అతి సంగ్రహముగ (౮౧ అధ్యా.) చెప్పుచున్నది. తన సపత్ను లందరితోపాటు రుక్మిణి కూడ ఈ వ్రతము నాచరించినది. కాని ప్రాధాన్యము సత్యదే. కనుకనే ఇది తిమ్మన సత్యయెడ గల పక్షపాతముతో చేసిన మార్పు కాదు. రుద్రభట్టే రుక్మిణి యెడ పక్షపాతముతో కథాప్రణాళికను మార్చినాడు. తిమ్మన మూలమునే అనుసరించినాడు.

9) నారదుడు పుణ్యక వ్రతాచరణ విధానమును సత్యభామ కుపదేశించి నట్లు తిమ్మన చెప్పియున్నాడు (V 56-62). రుద్రభట్టీ ఊసెత్తుకొనలేదు. మరి తిమ్మన ఈ కల్పన ఎట్లు చేయగలిగినా డనగా మూలమగు హరి వంశ మున నాలుగు అధ్యాయములు (౭౭-౮౦) నిండుగ నారదుడు పుణ్యక వ్రతపు

టుత్పత్తిని, తదాచరణ విధానమును, తన్మహిమను విపులముగ నుపన్యసించి యున్నాడు. తిమ్మన ఈ అంశమును హరివంశము నుండియే గ్రహించినాడు. కాని హరి వంశమున నారదునకు ప్రధాన శ్రోత రుక్మిణి కాగా, తిమ్మను సత్యను శ్రోత గావించినాడు. పుణ్యక వ్రతాచరణము గావించిన కృష్ణ పత్ను లందరిలో ప్రాధాన్యము సత్యదేగాన ఆమెయే శ్రోత యగుట ఉచితమను తలంపుతో తిమ్మన ఈ మార్పు గావించినాడు.

10) ఉమా, శచీ, అరుంధతులు పుణ్యకము నాచరించియున్నట్లు నారదుడు తెలిపినట్లు తిమ్మన తెలిపినాడు (V. 55). రుద్రభట్టు కావ్యములో నీ ప్రసంగమే లేదుగదా. అయినచో నీపేర్లను తిమ్మన ఎట్లు కల్పింపగలిగినా డను ప్రశ్న ఉదయించును. ఈ పేర్లు హరివంశ మందున్నవే; నారదు డిట్లనుచున్నాడు :

'చచారోమా వ్రతం దేవీ పుణ్యకానాం శచివ్రతా'. (౭౭-11)

'అదిత్యా కశ్యపో దత్తః పుణ్యార్థం చ తథా మమ' (౬౭-67)

'ఇంద్రో దత్త స్తథేంద్రాణ్యా సౌభాగ్యార్థం తతో మమ'. (౬౩-68)

అరుంధతి పుణ్యక వ్రతము నాచరించినట్లు హరివంశము స్పష్టముగ చెప్పుట లేదు. కాని, పుణ్యకవ్రత విధానమును ఉమాదేవి అరుంధతి కుపదే శించినట్లు (౭౭-౮౦) అధ్యాయములు రచింపబడినవి. కనుక తరువాత అరుంధతి కూడ ఈ వ్రతము నాచరించియే యుండునని తిమ్మన ఊహించు టకు వీలయినది. హరి వంశమును చూచియుండనిచో తిమ్మన ఈ అరుంధ త్యాదుల పేర్లను చెప్పగలిగి యుండడు గదా.

11) రుద్రభట్టు పుణ్యక వ్రత విశేషముల నేమియు తెలుపలేదు. తిమ్మన ఈ వ్రతమునకు విశిష్టములైన అనేక విశేషములను తెలిపినాడు. వాని కన్నింటికిని హరివంశములో మూలము లున్నవి.

పూలమాలతో సత్యభామ కృష్ణుని పారిజాత వృక్షమునకు కట్టివేసినదని తిమ్మన చెప్పినాడు.

"మునిపతి యానతిం జకితముగ్ధ మృగీతరలాక్షి ప్రాణనా
థుని( గనకాంబరాంచలముతో( గుసుమాయుధ వాగురానిబం

ధనమును బోని క్రొవ్విరుల దండ దగుల్కొనఁ జుట్టి వేడ్కఁగ
ల్పనగముఁ గూడఁ గంకణ ఝుళం ఝుళమంజుల దోర్యుగంబునన్".

(V. 79)

హరివంశ మిట్లు చెప్పియున్నది :

పుష్పదామా వసజ్యాథ కంఠే కృష్ణస్య భామినీ
బబంధ కృష్ణం సుభగా పారిజాతే వనస్పతౌ. (౭౬-5)

12) సత్య కృష్ణుని నారదునకు దాన మొసంగినట్లు తిమ్మన తెలిపినాడు.

"కల్ప మహీజంబు సదక్షిణాకము నిజప్రాణేశుఁ గూడన్నుప
ర్వమునిశ్రేష్ఠున కిచ్చె దానముగ ధారాపూర్వ మవ్వేళఁ దు
భ్యమహం సంప్రదదే నమో నమ యటంచద్దేవి మోదంబునన్".

(V. 82)

హరివంశము నందిట్లున్నది :

'అద్భిర్దదౌ నారదాయ తతోఽనుజ్ఞాప్య కేశవమ్'. (౭౬-6)

13) నారదుడు కృష్ణుని నుండి పరిహాసార్థము సేవలు గొనెనని తిమ్మన చెప్పియున్నాడు.

"మాయభీప్సిత
కృత్యంబులు సలుపు మనుచుఁ గేళిపరుండై. (V 85)

'కపట నటనాపరుండైన కంసవైరిఁ
బరమముని నవ్వుటాలకుఁ బనులుగొనియె.' (V. 86)

హరివంశమం దిట్లున్నది. నారదు డిట్లనుచున్నాడు.
'సత్వం మామనుగచ్ఛస్వ కురు యద్యద్బ్రవీ మ్యహమ్'. (౭౬-9)

'పరిహాసం బహువిధం కృత్వా మునివరస్తదా'. (౭౬-11)

14) చివరకు సత్య తిరిగి నారదుని నుండి కృష్ణుని కొనినట్లు తిమ్మన చెప్పియున్నాడు.

"అపుడు విరించి సూనుఁడు జనార్దను నెయ్యపు వాలుఁగంటిఁ జూ
చి పడఁతి నీ మనోహరునిఁ జేకొను మిచ్చెద నంచుఁ బల్కుచో

నపరిమిత ప్రమోద భరితాననయై వెసనిచ్చె వేలుపుం
దపసికి నాత్మభూషణ వితానము లన్నియు నిష్క్రియంబుగన్".
(V. 88)

హరి వంశమున నారదు డిట్లనుచున్నాడు :

"కపిలాం గాం సవత్సాం భో నిష్క్రియార్థం ప్రయచ్ఛ మే
కృష్ణాజినం తిలైః పూర్ణం ప్రయచ్ఛ చసకాంచనమ్
ఏషోఽత్ర నిష్క్రియః కృష్ణ విహితో వృషకేతునా
తథేత్యుక్త్వా హృషీకేశః తథా చక్రే జనార్దనః". (౭౬. 12-14)

మూలమందున్న నిష్క్రియమును తిమ్మన మార్పు గావించినాడు. అది యాతని స్వీయాభిరుచి ననుసరించి చేయబడిన మార్పు. ఐనను దానమీయ బడిన కృష్ణుని తిరిగి నిష్క్రియ మొసంగికొనుట యను కథాంశము మాత్రము మూలమందలిదే.

తిమ్మన హరి వంశమును చూచియుండనిచో ఈ వివరముల నన్నిం టిని ఒసంగగలిగి యుండెడివాడు కాడు. అతడు జగన్నాథ విజయమునే అనుసరించినవాడైనచో ముఖ్యముగ పుణ్యక వ్రత సందర్భమున రుద్రభట్టు వలెనే కప్పగంతులు వేసి దాటుకొని పోవలసినవాడే.

ఉపర్యుదాహృత కథాంశ సాదృశ్యముల వలన తిమ్మన పారిజాతాప హరణమునకు జగన్నాథ విజయముగాక హరివంశమే మాతృకయని నిరూ పిత మగుచున్నది.

**విష్ణు పురాణము—పారిజాతాపహరణము**
**కథాంశ సాదృశ్యములు :**

హరివంశమునకు వలెనే విష్ణు పురాణమును కూడ తిమ్మన తన కావ్యమునకు మాతృకగా గొనెనని ఈ క్రింది కథాంశములు నిరూపించు చున్నవి.

1) జగన్నాథ విజయము ననుసరించి సత్యా కృష్ణులు ద్వారక నుండి తిన్నగా యుద్ధ సన్నద్ధులై నందనోద్యానమున కేగి పారిజాతోత్పాటనము గావించిరనియు, తిమ్మన ఆ కథాప్రణాళిక ననుసరింపక సత్యాకృష్ణులు

ఇంద్రుని అతిథులై యుండి నందనమును ప్రవేశించి పారిజాతోత్పాటనము గావించిరని చెప్పుచున్న హరివంశ (తొలి కథ) విష్ణు పురాణముల ననుస రించినాడనియు ఇదివరలో హరివంశ సాదృశ్యములను గుర్తించు సందర్భ మున చెప్పికొనుటయైనది (పుట. 52). ఇప్పుడు విష్ణు పురాణమందలి తత్కథాంశ సంబద్ధ పంక్తులను గుర్తింతము.

'తతో దదర్శ కృష్ణోపి సత్యభామా సహాయవాన్
దేవోద్యానాని హృద్యాని నందనాదీని సత్తమ. (30-30)

దదర్శ చ సుగంధాఢ్యం మంజరీ పుష్పధారిణం ....
పారిజాతం జగన్నాథః కేశవః కేశిసూదనః. (30-31-32)

'ఇత్యుక్త స్స ప్రహస్యైనాం పారిజాతం గరుత్మతి
ఆరోపయామాస హరిః' (30–38)

హరివంశపు తొలికథ కూడ ఈ విషయము ధాగాపిట్లే చెప్పుచున్నది. కనుక ఈయొక్క అంశమే తిమ్మనకు విష్ణు పురాణ పరిచయమున్నట్లు స్థాపింప లేదు. ఈ తరువాత ప్రదర్శింపబడుచున్న సాదృశ్యములు నిశ్చయాత్మక ముగా స్థాపింపబోవు సిద్ధాంతమున కిది పూర్వసిద్ధత మాత్రమే.

2) పారిజాతాపహరణము గావించుచున్న కృష్ణుని నందనవన పాల కులు బెదరించినట్లు తిమ్మన రెండు పద్యములు చెప్పినాడు.

తగునె యదు ప్రవీర యిటు ధౌర్త్యము నీవొనరించి యీ మరు
న్నగముహరించి వంచనఁ జనన్ దివిజాగ్రణి దీనినిచ్చె ద
క్కఁగ నిజకాంతకా కుసుమ కోమల యాజ్ఞ భయంబునొందుఁ దేఁ
టిగములు దీని చెంగట నటింపను నిందుల తావిఁ గ్రోలంగన్.
(IV 56.)

అట్టి సుర తరువు నెఱుఁగక
చుట్టపు మేలమునఁ గొంచు సురిఁగెడు మది నీ
కెట్టు జనియించె మరలం
బెట్టుము బలభేది విన్న మేలే నీకున్'. (IV. 57)

రుద్రభట్టీ బెదరింపులను తెలుపలేదు. విష్ణు పురాణమునందీ బెదరింపులు కలవు.

'భో శచీ దేవరాజస్య మహిషీ తత్పరిగ్రహమ్
పారిజాతం న గోవింద హర్తుమర్హసి పాదపమ్
ఉత్పన్నో దేవరాజాయ దత్త స్సోపి దదౌ పునః
మహిష్యై సుమహాభాగ దేవ్యై శచ్యై కుతూహలాత్

శచీ విభూషణార్థాయ దేవై రమృతమన్థనే
ఉత్పాదితోయం న క్షేమీ గృహీత్వైనం గమిష్యసి
దేవరాజో ముఖప్రేక్షీ యస్యాస్తస్యాః పరిగ్రహమ్
మౌఢ్యాత్ప్రార్థయసే క్షేమీ గృహీత్వైనం హి కో వ్రజేత్

అవశ్యమస్య దేవేంద్రో నిష్కృతిం కృష్ణ యాస్యతి
వజ్రోద్యతకరం శక్రమనుయాస్యన్తి చామరాః
తదలం సకలైర్దేవై ర్విగ్రహేణ తవాచ్యుత
విపాకకటు యత్కర్మ తన్న శంసన్తి పండితాః' (30-39-44)

తిమ్మన పై శ్లోకముల ననుసరించి యుండుట స్పష్టము.

3) అడ్డగించిన వన పాలకులను సత్యభామ ధర్షించినట్లు తిమ్మన తెలిపి యున్నాడు.

"వినుఁడు సురేశ్వర వన పాలకులు వార్ధిఁ
బుట్టిన యీ దివ్య భూరుహమున
కింద్రాణి యెవ్వతె యింద్రుండు నెవ్వఁడు
తోడి యిందిరను గౌస్తుభము నెవ్వఁ
డధిపుఁడై ధరియించె నతఁడె చేకొనుఁగాక
తెక తేరయిది యేమియొకరి సొమ్మె
యిదెనాడు విభునిచే నీవదాన్య నగంబు
నొడియించుకొని యేగుచున్న దానఁ

బలుకులేటికిఁ దా వీరపత్నియేని
మీ శచీదేవి తనదు ప్రాణేశుఁడైన

మఘవు నిటఁ బంపి సత్యభామా విధేయు
వలన మరలంగఁ గొనుటెపో వాసితనము'. (IV. 58)

వనపాలకుల బెదరింపులనే తెలుపని రుద్రభట్టు సత్యా ప్రతివచనము లను తెలుపు ప్రశ్నయే ఉదయింపదు. తిమ్మన పద్యమునకు మూలమైన విష్ణు పురాణ పంక్తు లిట్లున్నవి :

'ఇత్యుక్తే తైరువాచైతాన్ సత్యభామాతికోపినీ
కా శచీ పారిజాతస్య కో వా శక్ర స్సురాధిపః
సామాన్య స్సర్వలోకస్య యద్యేషోఽమృతమన్థనే
సముత్పన్న స్తరుః కస్మాదేకో గృహ్ణాతి వాసవః

యథా సురా యథైవేందుః యథా శ్రీ ర్వనరక్షిణః
సామాన్య స్సర్వలోకస్య పారిజాత స్తథా ద్రుమః
భర్తృబాహు మహాగర్వా ద్రుణద్ధేన మథో శచీ
తత్కథ్యతా మలం క్షాన్త్యా సత్యా హారయతి ద్రుమమ్.

కథ్యతాం చ ద్రుతం గత్వా పౌలోమ్యా వచనం మమ
సత్యభామా వదత్యేత దతిగర్వోద్ధతాక్షరమ్
యది త్వం దయితా భర్తు ర్యది వశ్యః పతి స్తవ
మద్భర్తు ర్హరతో వృక్షం తత్కారయ నివారణమ్".

(30-45-49)

తిమ్మన ఇచట విష్ణు పురాణ పంక్తులను తుచ తప్పక అనువదించినట్లు స్పష్టము.

4) యుద్ధము నందోడిన దేవేంద్రుడు శ్రీకృష్ణుని క్షమాపణ కోరినట్లు తిమ్మన తెలిపినాడు.

"సంక్రందనుఁడో ముకుంద మురఘస్మరయేన పరాధినంచుమే
ముందటవచ్చి సాగఁబడి మ్రొక్కిన .... " (V. 38)

రుద్రభట్టిట్లు క్షమాపణ చెప్పింపలేదు.

.... .... సంగ్రామభంగా
న్వితనాగిర్దింద్రదనం నోడుత్తె రణదౌఘపేంద్రం సకారుణ్యానాదం."
(XIII. 110)

(సంగ్రామ భంగాన్వితుడైన ఇంద్రుని గాంచి రణమందు ఉపేంద్రుడు సకారుణ్యు డయ్యెను.)

అని మాత్రమే రుద్రభట్టు తెలిపినాడు. ఇంతలో బిల్వోదకేశ్వరు డరుదెంచి "దేవతాహిత సాధకుడవు కావలసిన నీవు దేవతలతో పోరాడుట తగునా?" యని కృష్ణు నాక్షేపించి మధ్యస్థము చేసినాడు. దేవతలతో పోరాడిన నేరమునకు పరిహారముగనో యన్నట్లొక దేవహిత కార్యము నాచరింపుమని యాదేశించినాడు. దేవేంద్రునకు క్షమాపణ చెప్పుకొనవలసిన అవసరమే కలుగలేదు. ఇక హరివంశమునందో అదితి, కశ్యపుల మాధ్యస్థము వలన యుద్ధము మధ్యలోనే ముగిసినది. ఇంద్రుడు పరాజితుడే కాలేదు. కనుకనే అతడు కృష్ణుని క్షమాపణ కోరకపోగా, కృష్ణునిదే అపరాధమన్నట్లు నిష్ఠురముగా కూడ మాట్లాడినాడు.

'త్వం ప్రభు ర్లోకకృత్కృత్స్న రాజ్యేహం స్థాపిత_స్త్వయా
స్థాపయిత్వా కథం నామ పునర్మామవమన్యసే
భ్రాతృత్వ ముపగమ్యైవ జ్యేష్ఠత్వం చాప్యపోహ్య చ
కథం కమలపత్రాక్ష నిర్వాణం కర్తుమిచ్ఛసి". (౭౫. 28-29)

ఐన తిమ్మన ఇంద్రునిచే క్షమాపణ చెప్పించుట కాధారమేమి? తిమ్మన ఈ దీన వాక్యములను దేవేంద్రునిచే తానై పలికింపలేదు. విష్ణు పురాణమందే ఈ దీనాలాపము కలదు.

'దేవదేవ జగన్నాథ కృష్ణ విష్ణో మహాభుజ
శంఖ చక్రగదా పాణే క్షమస్వైతద్వ్యతిక్రమమ్.' (౩౧-8)

5) పరాజితుడైన దేవేంద్రునకు కృష్ణుడు పారిజాతమును తిరిగి ఈయజూపెనని తిమ్మన చెప్పియున్నాడు.

'.... .... .... కొమ్మనీ
సొమ్మని వజ్రమిచ్చి మధుసూదనుఁ డాతరువీఁ దలంచినన్ ....'
(V. 39)

రుద్రభట్టు కావ్యమున కృష్ణుడీ ఔదార్యమును ప్రదర్శింపలేదు. హరివంశమునను అట్టి ప్రసంగము లేదు. విష్ణు పురాణము మాత్రమిట్లు చెప్పుచున్నది :

'గృహీతోయం మయా శక్ర సత్యావచన కారణాత్
పారిజాత తరుశ్చాయం నీయతాముచితాస్పదమ్.' (౩౦-3)

అని కృష్ణుడు పలికినాడు. తిమ్మన దీనినే అనువదించినాడు.

6) పారిజాతము భూలోకమందు శ్రీకృష్ణావతార కాలావధి వరకును ఉండునని దేవేంద్రుడే సూచించినట్లు తిమ్మన తెలిపినాడు.

" .... శూర కులంబు నలంకరించు నీ
వమ్మహినుండు నంతకు ననన్య దురాపము పారిజాతభూ
జమ్మును నుండు .... " (V. 40)

రుద్రభట్టు కావ్యము నందలి దేవేంద్రుడు నోరు తెరువనైన లేదని పైన చెప్పబడి యున్నది. మాధ్యస్థము వహించిన బిల్వోదకేశ్వరుడైన ఈ విషయమై ఏమియు పలుకలేదు. మరల నెన్నటికైన పారిజాతము సురలోకమును చేరవలసి యుండునను విషయమునే అచటనున్న వారెవరును స్మరింపలేదు. హరివంశములో మాత్రము 'పుణ్యక వ్రతము ముగియగనే పారిజాతమును నందనవనమునకు చేర్చు'మని అదితి కృష్ణు నాదేశించినది. అతడును అంపుల కంగీకరించినాడు.

"ఉపేంద్ర ద్వారకాం గచ్ఛ పారిజాతం నయస్వ చ
వధ్వా సంప్రాపయస్వేశ పుణ్యకం హృదయే స్థితమ్.

పుణ్యకే సత్యయా ప్రాప్తే పునరేష త్వయా తరుః
నందనే పురుషశ్రేష్ఠ స్థాప్యః స్థానే యథోచితే
ఏవమస్త్వితి కృష్ణేన దేవమాతా యశస్వినీ
ప్రోక్తా .... .... ". (౭౫. 38-40)

ఇక తిమ్మన చేసిన పరిష్కారము అతడు స్వయముగా చేసినది కాదు. విష్ణు పురాణకారుడు చేసిన పరిష్కారమునకే తిమ్మన తన ఆమోద ముద్రను వైచినాడు. విష్ణు పురాణమందలి దేవేంద్రు డిట్లనుచున్నాడు :

'నీయతాం పారిజాతోయం కృష్ణ ద్వారవతీం పురీం
మర్త్యలోకే త్వయా త్యక్తే నాయం సంస్థాస్యతే భువి.'

ఉపర్యుదాహృత సదృశ కథాంశముల వలన తిమ్మన హరివంశముతో పాటు విష్ణు పురాణమును గూడ పారిజాతాపహరణ కావ్యమునకు మాతృకగా స్వీకరించినాడను విషయము నిరూపిత మగుచున్నది.

పారిజాతాపహరణ, హరివంశ, విష్ణు పురాణ, జగన్నాథ విజయములకు కథాంశములలో గల భేద సాదృశ్యములు ఇంతవరకు విపులముగ పరిశీలింప బడినవి. ఇప్పుడు వానిని క్రోడీకరించి ఒక పట్టిక రూపమున ఏర్పరచు కొందము.

## కథాంశములు - భేద సాదృశ్యములు

| క్రమ సంఖ్య | సదృశ గ్రంథములు | పారిజాతాపహరణము | హరి వంశము₁ (తొలి కథ) | విష్ణు పురాణము | హరి వంశము₂ (మలి కథ) | జగన్నాథ విజయము |
|---|---|---|---|---|---|---|
| | | పా | హ1 | వి | హ2 | జ |
| 1. | పా. | శ్రీకృష్ణుడు ప్రాగ్జ్యోతిషము నుండి ద్వారకకు వచ్చుట | లేదు (అమరావతికి) | లేదు (అమరావతికి) | — | లేదు (అమరావతికి) |
| 2. | పా. | కృష్ణుడు రుక్మిణితో జూదమాడుట | — | — | లేదు | లేదు |
| 3. | పా హ2 జ | ద్వారకకు నారదుని రాక; పారిజాత ప్రదానము | లేదు | లేదు | కలదు | కలదు |
| 4. | పా. | కృష్ణుడు సత్యను స్మరించుట | — | — | లేదు | లేదు |
| 5. | పా. | పారిజాతమును రుక్మిణి కిమ్మని నారదుని సైగ | — | — | లేదు | లేదు |

| | | పారిజాతాపహరణము | హరివంశము 1 | విష్ణు పురాణము | హరివంశము 2 | జ. విజయము |
|---|---|---|---|---|---|---|
| 6. | పా హ2 జ | కృష్ణుడు రుక్మిణికి పుష్పము నిచ్చుట | — | — | కలదు | కలదు |
| 7. | పా హ2 జ | నారదుడు సత్యను నిందించుట | — | — | కలదు | కలదు |
| 8. | పా | కృష్ణుడు సత్యా మందిరము నకు రథముపై వెడలుట | — | — | అస్పష్టము | కాదు (కాలి నడక) |
| 9. | పా హ2 జ | ప్రద్యుమ్నుని నారద సేవకై నియమించుట | — | — | కలదు | కలదు |
| 10. | పా హ2 జ | కృష్ణుడు సత్య చెలులకు సైగ చేయుట, సత్యకు విసరుట | — | — | కలదు | కలదు |
| 11. | పా | కృష్ణుడు సత్యకు నమస్కరించుట | — | — | లేదు | లేదు |
| 12. | పా | సత్యభామ కృష్ణుని తన్నుట | — | — | లేదు | లేదు |
| 13. | పా హ2 జ | సత్య ఏడ్చుట | — | — | కలదు | కలదు |

| | | పారిజాతాపహరణము | హరివంశము 1 | విష్ణు పురాణము | హరివంశము 2 | జ. విజయము |
|---|---|---|---|---|---|---|
| 14. | పా | సత్య చనిపోదునని బెదరించుట | — | — | లేదు | లేదు |
| 15. | పా హ2 జ | శ్రీకృష్ణుని వాగ్దానము సత్య శాంతించుట | — | — | కలదు | కలదు |
| 16. | పా హ2 | నారదుడు సత్య ఇంట భుజించుట | — | — | కలదు | లేదు |
| 17. | పా | కృష్ణుడు బంధువులకు అమరావతీ ప్రయాణ మును గూర్చి తెలుపుట | — | — | లేదు | అస్పష్టము |
| 18. | పా | కృష్ణుడు గరుడునకు యాత్రోద్దేశము తెలుపుట | — | — | లేదు | లేదు |
| 19. | పా హ1 వి జ | సత్యభామతో కలసి అమరావతీ యాత్ర | కలదు | కలదు | సత్య లేదు | కలదు |
| 20. | పా | దేవేంద్రుడు కృష్ణునకుఁ నమస్కరించుట | లేదు (కృష్ణుడే ఇంద్రునకు నమస్కరించును) | అస్పష్టము | — | అస్పష్టము |

| | | పారిజాతాపహరణము | హరివంశము 1 | విష్ణు పురాణము | హరివంశము 2 | జ. విజయము |
|---|---|---|---|---|---|---|
| 21. | పా హ 1 జ | కృష్ణుడు అదితికి కుండలము లిచ్చుట | లేదు (ఇంద్రున కిచ్చును) | కలదు | — | కలదు |
| 22. | పా వి. జ | అదితి కృష్ణుని స్తుతించుట | లేదు | కలదు | — | కలదు |
| 23. | పా | సత్యాకృష్ణులు అదితికి అతిథులుగా నుండుట | లేదు (ఇంద్రుని అతిథులే) | లేదు (ఇంద్రుని అతిథులే | — | లేదు (ఇంద్రుని అతిథులే) |
| 24. | పా | సత్యాకృష్ణులు వైజయంతమున ఒక రాత్రి నిద్రించుట | లేదు | లేదు | లేదు (కృష్ణుడొక్కడే) | లేదు |
| 25. | పా హ 1 వి | వనవిహారము చేయుచు పారిజాతము నపహరించుట | కలదు | కలదు | లేదు (యుద్ధ యాత్ర) | లేదు (యుద్ధ యాత్ర) |
| 26. | పా వి | వనపాలకులు కృష్ణుని బెదరించుట | లేదు | కలదు | లేదు | లేదు |

| | | పారిజాతాపహరణము | హరివంశము1 | విష్ణు పురాణము | హరివంశము2 | జ. విజయము |
|---|---|---|---|---|---|---|
| 27. | పా వి | సత్యభామ వనపాలకు లను ధర్షించుట | లేదు | కలదు | — | లేదు |
| 28. | పా హ1 హ2 | వనపాలకులు పారిజాత హరణ వృత్తాంతమును ఇంద్రునకు తెలుపుట | కలదు | లేదు (శచీదేవికి) | కలదు | లేదు (శచీదేవికి) |
| 29. | పా వి హ2 జ | ఇంద్ర, కృష్ణ యుద్ధము | లేదు | కలదు | కలదు | కలదు |
| 30. | పా వి జ | యుద్ధము ఒక్కదినమే | — | అవును | కాదు (రెండు దినములు) | అవును |
| 31. | పా వి జ | ఇంద్రునకు దిక్పాలురు తోడగుట | — | కలదు | అస్పష్టము | కలదు |
| 32. | పా వి జ | దిక్పాలుర ఓటమి | — | కలదు | — | కలదు |
| 33. | పా వి జ | ఇంద్రుడు వజ్రమును ప్రయోగించుట | — | కలదు | లేదు | కలదు |

| | | పారిజాతాపహరణము | హరివంశము 1 | విష్ణు పురాణము | హరివంశము 2 | జ. విజయము |
|---|---|---|---|---|---|---|
| 34. | పా వి జ | కృష్ణుడు వజ్రమును పట్టివేయుట | — | కలదు | లేదు | కలదు |
| 35. | పా | ఆగ్నేయాద్యస్త్రములు కృష్ణునిలో లీనమగుట | — | లేదు | లేదు | లేదు |
| 36. | పా వి | ఇంద్రుడు కృష్ణుని క్షమాపణ కోరుట | — | కలదు | లేదు | అస్పష్టము |
| 37. | పా వి | కృష్ణుడు పారిజాతమును తిరిగి ఈజూపుట | — | కలదు | లేదు | లేదు |
| 38. | పా వి | కృష్ణావతారావధి వరకు పారిజాతము ద్వారకలో నుండునని ఇంద్రుడనుట | — | కలదు | లేదు (ఒక్క సంవత్సరమే) | లేదు (అవధియే లేదు) |
| 39. | పా హ2 | పారిజాత మహిమ వలన వికలాంగులు స్వస్థ శరీరులగుట | లేదు | లేదు | కలదు | లేదు |

| | | పారిజాతాపహరణము | హరివంశము 1 | విష్ణు పురాణము | హరివంశము 2 | జ. విజయము |
|---|---|---|---|---|---|---|
| 40. | పా హ2 | నారదుడు పుణ్యకవ్రత విధానమును తెలుపుట | లేదు | లేదు | కలదు | లేదు |
| 41. | పా హ2 | గౌరీ శచీ అరుంధతులు పుణ్యకము నాచరించుట | లేదు | లేదు | కలదు | లేదు |
| 42. | పా హ2 | పారిపాతాపహరణము తర్వాతనే పుణ్యక వ్రతాచరణ | — | — | అవును | కాదు (పూర్వమే) |
| 43. | పా హ2 | సత్యభామ పుణ్యకము నాచరించుట | లేదు | లేదు | కలదు | లేదు (రుక్మిణి ఆచరించినది) |
| 44. | పా హ2 | కృష్ణుని పారిజాతమునకు కట్టివేయుట | — | — | కలదు | లేదు |
| 45. | పా హ2 | కృష్ణుని నారదునకు దానమొసంగుట | — | — | కలదు | లేదు |
| 46. | పా | ధర్మజాదులు నవ్వుట | — | — | లేదు | — |

| | | పారిజాతాపహరణము | హరివంశము$_1$ | విష్ణు పురాణము | హరివంశము$_2$ | జ. విజయము |
|---|---|---|---|---|---|---|
| 47. | పా హ$_2$ | నారదుడు కృష్ణునిచే సేవలు గొనుట | — | — | కలదు | లేదు |
| 48. | పా హ$_2$ | సత్య నారదుని నుండి కృష్ణుని కొనుట | — | — | కలదు | — |
| 49. | పా హ$_1$ వి హ$_2$ | అమరావతీ యాత్ర ఒక్కసారే | అవును | అవును | అవును | కాదు (రెండుసార్లు) |
| 50. | పా హ$_2$ జ | 16000 మంది కన్యల పెండ్లి పారిజాతాపహరణమునకు పూర్వమే | కాదు (తరువాత) | కాదు (తరువాత) | అవును | అవును |
| 51. | పా హ$_1$ | పెండ్లిలో నారదుని పాత్ర కలదు | కలదు | లేదు | అస్పష్టము | లేదు |
| 52. | హ$_1$ వి | అస్పష్టము | పెండ్లి ద్వారకలో | అవును | అస్పష్టము | కాదు (ప్రాగ్జ్యోతిషములో) |

| | | పారిజాతాపహరణము | హరివంశము 1 | విష్ణు పురాణము | హరివంశము 2 | జ. విజయము |
|---|---|---|---|---|---|---|
| 53. | హ$_1$ వి | లేదు | అదితి సత్యాకృష్ణులను దీవించుట | కలదు | — | లేదు |
| 54. | హ$_1$ వి | లేదు | పారిజాతము వలన పూర్వజన్మ స్మరణ | కలదు | లేదు | లేదు |
| 55. | హ$_1$ | లేదు | పారిజాతాపహరణము నకు ఇంద్రుని సమ్మతి | లేదు | లేదు | లేదు |
| 56. | వి జ | లేదు | లేదు | అదితి కృష్ణునకు నమస్కరించుట | — | కలదు |
| 57. | వి | లేదు | లేదు | శచీదేవి సత్యను అవమానించుట | లేదు | లేదు |
| 58. | వి జ | లేదు | లేదు | శచీదేవి యుద్ధమునకై ఇంద్రుని పురికొల్పుట | లేదు | కలదు |
| 59. | వి | లేదు | — | ఇంద్రుడు పారిపోవుట | లేదు | లేదు |
| 60. | వి | లేదు | — | సత్య ఇంద్రుని పరిహసించుట | లేదు | లేదు |

| | | పారిజాతాపహరణము | హరివంశము 1 | విష్ణు పురాణము | హరివంశము 2 | జ. విజయము |
|---|---|---|---|---|---|---|
| 61. | వి | లేదు | — | సత్య ఇంద్రునకు పారిజాతము చూపుట | లేదు | లేదు |
| 62. | హా2 జ | లేదు | — | — | రుక్మిణి ఉపవాస వ్రతము నాచరించుట | కలదు (పుణ్యకము) |
| 63. | హా2 జ | లేదు | — | — | సత్య నేలను కాలితో రాయుట మొ॥ చేష్టలు | కలదు |
| 64. | హా2 జ | లేదు | — | — | సత్య చేష్టలను కృష్ణుడు దూరము నుండి గమనించుట | కలదు |
| 65. | హా2 | లేదు | — | — | సత్య కృష్ణుని చూసి బాగు బాగు అనుట | లేదు |
| 66. | హా2 జ | లేదు | — | — | తపమునకై అనుజ్ఞ నిమ్మని సత్య కోరుట | కలదు |

| | | పారిజాతాపహరణము | హరివంశము1 | విష్ణు పురాణము | హరివంశము2 | జ. విజయము |
|---|---|---|---|---|---|---|
| 67. | హ2 జ | లేదు | — | — | శచీగారులు భర్తృ దానము నారదునకే ఇచ్చుట | — |
| 68. | హ2 జ | లేదు | | | కృష్ణుడు నారదుని రాయబార మంపుట | కలదు |
| 69. | హ2 | లేదు | — | — | పుణ్యక వ్రతాచరణమునకే పారిజాతమును కోరుట | లేదు |
| 70. | హ2 జ | — | — | — | ఇంద్రుడు పారిజాతము నీయడని నారదుడనుట | కలదు |
| 71. | హ_ జ | లేదు | — | — | శివుడు ఇంద్రుని పారిజాతమడిగి లేదనిపించుకొనుట | కలదు |
| 72. | హ2 | — | — | — | శివుడు మందారవన సృష్టి చేయుట | అస్పష్టము |

| | | పారిజాతాపహరణము | హరివంశము1 | విష్ణు పురాణము | హరివంశము2 | జ. విజయము |
|---|---|---|---|---|---|---|
| 73. | హ2 జ | — | — | — | స్వర్గములో మహేశ్వర పూజోత్సవము జరుగుట | కలదు |
| 74. | హ2 జ | — | — | — | ఇంద్రుడు తనకొసగిన నిమంత్రణ పుష్పమే ఇది యని నారదు డనుట | కలదు |
| 75. | హ2 జ | — | — | — | ఇంద్రుని గదతో మోదెదనని కృష్ణుడనుట | కలదు |
| 76. | హ2 | — | — | — | కృష్ణునితో యుద్ధము వలదని ఇంద్రునకు నారదుని బోధ | లేదు (నారదుడే యుద్ధమునకు పురికొల్పెను |
| 77. | హ2 | — | — | — | యుద్ధమొనరింపుమని బృహస్పతి సమ్మతి | లేదు (వలదనినాడు) |
| 78. | హ | లేదు | | | కృష్ణుడు మృగయా వ్యపదేశమున బయలుదేరుట | లేదు |

| | | పారిజాతాపహరణము | హరివంశము 1 | విష్ణు పురాణము | హరివంశము 2 | జ. విజయము |
|---|---|---|---|---|---|---|
| 79. | హ2 | లేదు | — | — | ప్రద్యుమ్న సాత్యకులను సాయము గొనిపోవుట | లేదు |
| 80. | హ2 | లేదు | — | లేదు | ప్రవరుడను బ్రాహ్మణ వీరుని వృత్తాంతము | లేదు |
| 81. | హ2 | లేదు | — | లేదు | జయంతుని యుద్ధము | లేదు |
| 82. | హ2 జ | లేదు | — | లేదు | ఐరావతము పారియాత్రముపై పడుట | కలదు |
| 83. | హ2 | లేదు | — | లేదు | గరుడుని భారమునకు పారియాత్రము క్రుంగుట | లేదు |
| 84. | హ2 | లేదు | — | లేదు | కృష్ణుడు దారుక సారథికమగు రథమును అమరావతికి తెప్పించుట | లేదు |
| 85. | హ2 | — | — | — | కృష్ణుడు పారియాత్రమునకు వరము లిచ్చుట | లేదు |

| | | పారిజాతాపహరణము | హరివంశము1 | విష్ణు పురాణము | హరివంశము2 | జ. విజయము |
|---|---|---|---|---|---|---|
| 86. | హ2 | లేదు | — | లేదు | ఇంద్రుని వజ్రపు వ్రేటులకు గరుడుడు ఈకలు రాల్చుట | లేదు |
| 87. | హ2 | లేదు | — | లేదు | శ్రీకృష్ణుడు మహేశ్వరుని పూజించుట | లేదు |
| 88. | హ2 జ | లేదు | — | లేదు | బిల్వోదకేశ్వరుడు ప్రత్యక్షమగుట | కలదు |
| 89. | హ2 | — | — | — | కృష్ణునకు పారిజాతము లభించునని బిల్వోదకేశ్వరుడు వరమిచ్చుట | లేదు |
| 90. | హ2 | లేదు | — | లేదు | అదితి కశ్యపుల మాధ్యస్థము | లేదు |
| 91. | హ2 జ | లేదు | — | — | షట్పురాసుర వధా ప్రసంగము | కలదు |

| | | పారిజాతాపహరణము | హరివంశము 1 | విష్ణు పురాణము | హరివంశము 2 | జ. విజయము |
|---|---|---|---|---|---|---|
| 92. | హ 2 | లేదు | — | లేదు | ఇంద్రుడు కృష్ణుని ఆక్షేపించుట | లేదు |
| 93. | హ 2 | లేదు | — | లేదు | శచీదేవి కృష్ణుని భార్యలకు సొమ్ములిచ్చుట | లేదు |
| 94. | హ 2 | లేదు | — | — | కృష్ణునికి మారుగా నారదునకు సత్య గోవు నిచ్చి కృష్ణుని కొనుట | — |
| 95. | హ 2 | లేదు | — | — | కృష్ణుని భార్యలందరును పుణ్యకము నాచరించుట | లేదు |
| 96. | హ 2 | లేదు | — | — | సంవత్సరాంతమున కృష్ణుడు పారిజాతమును తిరిగి ఇంద్రున కొసగుట | లేదు |
| 97. | హ 2 జ | లేదు | — | — | సత్య కన్నీటిని కృష్ణుడు వక్షమునకు రుద్దుకొనుట | కలదు |

| | | పారిజాతాపహరణము | హరివంశము 1 | విష్ణు పురాణము | హరివంశము 2 | జ. విజయము |
|---|---|---|---|---|---|---|
| 98. | ఐ | లేదు | — | — | లేదు | కృష్ణుడు నారదునకు సత్యకోప వృత్తాంతము చెప్పుట |
| 99. | ఐ | లేదు | — | లేదు | లేదు | శచీ సత్యా వాగ్వాదము శచీ పరాజయము |
| 100. | ఐ | లేదు | — | లేదు | లేదు | యుద్ధ మధ్యమున నారదు డింద్రుని ప్రోత్సహించుట |
| 101. | ఐ | లేదు | — | లేదు | లేదు | ఇంద్రుడు ఐరావతమును కృష్ణునిపై కుసిగొలుపుట |

సారాంశము :

'పారిపాతాపహరణ' మందలి కథ 51 అంశములుగ విభజింపబడినది. వానిలో 'జగన్నాథ విజయము'తో సాదృశ్యము గలవి 17 మాత్రమే. వీనిలో 8 హరివంశ మాతృకములు.[a] 7 విష్ణుపురాణ మాతృకములు.[b] 2 ఉభయ మాతృకములు.[c] మిగిలిన 34 కథాంశములలో 12 హరివంశ మాతృకములు,[d] 5 విష్ణుపురాణ మాతృకములు,[e] 2 ఉభయ మాతృకములు,[f] 15 కథాంశములు తిమ్మన సొంత కల్పనలు.[g]

జగన్నాథ విజయము నందలి పారిజాతాపహరణ కథ 47 అంశములుగ విభజింపబడినది. వానిలో హరివంశ మూలకములు 23,[h] విష్ణు పురాణ మూలకములు 10,[i] ఉభయ మూలకములు 4[j], రుద్రభట్టు సొంత కల్పనలు 10.[k] ఈ పదింటిలో ఒక్కదానినైన తిమ్మన అనుసరింపలేదు.

---

a – 3, 6, 7, 9, 10, 13, 15, 50

b – 21, 22, 30, 31, 32, 33, 34

c – 19, 29

d – 16, 28, 39, 40, 41, 42, 43, 44, 45, 47, 48, 51

e – 26, 27, 36, 37, 38

f – 25, 49

g – 1, 2, 4, 5, 8, 11, 12, 14, 17, 18, 20, 23, 24, 35, 46

h – 3, 6, 7, 9, 10, 13, 15, 25, 50, 62, 63, 64, 66, 68, 70, 71, 73, 74, 75, 82, 88, 91, 97

i – 21, 22, 28, 30, 31, 32, 33, 34, 56, 58

j – 5, 1, 19, 23, 29

k 5, 8, 42, 49, 52, 76, 77, 98, 99, 100, 101

| | పారిజాతాప హరణము | జగన్నాథ విజయము (పారిజాత కథ) |
|---|---|---|
| హరివంశ మూలక కథాంశములు | 20 | 23 |
| విష్ణుపురాణ ,, ,, | 12 | 10 |
| ఉభయ ,, ,, | 4 | 4 |
| స్వీయకల్పనా ,, | 15 | 10 |
| మొత్తము ,, | 51 | 47 |

ఉభయ కావ్య సామాన్య కథాంశములు :

| | |
|---|---|
| హరివంశమూలక కథాంశములు | – 8 |
| విష్ణుపురాణ ,, ,, | – 7 |
| ఉభయ ,, ,, | – 2 |
| | – 17 |

జగన్నాథ విజయము—పారిజాతాపహరణము

భావ సాదృశ్యములు :

శ్రీ బి. వెం. రావుగారు జగన్నాథ విజయము నుండి నాలుగు పద్యముల నుదాహరించి, వానితో భావసామ్యము గల పద్యములను తిమ్మన కావ్యము నుండి ఎత్తిచూపినారు.[1] తరువాత శ్రీయుతులు కె. సుబ్బరామప్ప,[2] నిడుదవోలు వేంకటరావు[3]గారలు కూడ అవే కన్నడ పద్యములను, దాదాపుగ అవే తెలుగు పద్యములతో పోల్చిచూపుచు శ్రీ బి. వెం. రావుగారి అభిప్రాయమునే పునరుద్ఘాటించినారు.

1. "పారిజాతాపహరణమునకు మూల గ్రంథము"–భారతి, 1952 డిసెంబరు
2. 'తెలుగు కన్నడ సాహిత్యాల సంబంధం'–భారతి, 1958 మే
3. 'ఆంధ్ర కర్ణాట సారస్వతములు పరస్పర ప్రభావము' 4పుట 127 (1961 సం॥)

ఇప్పుడు వరుసగా ఆ పద్యములను ఒక్కొకటిగా గైకొని వాని మధ్య గల సాదృశ్యమును, ఆ సాదృశ్యమునకు మూలమును గుర్తింతము.

1) శ్రీ బి. వెం. రావుగారుదాహరించిన మొదటి కన్నడ పద్యమిది :

"ఇదు కృతకాద్రి యప్పుదు, వనావళి యప్పుదు, పద్మషండ వ
ప్పుదు, తళిరుయ్యెలప్పుదు, లతాగృహవప్పుదు, రత్నదీపవ
ప్పుదు, మధుమాసవప్పుదు, నవోజ్జ్వల చంద్రికె యప్పు, దింతిదా
గద తెఱనిల్లిదొందు కుసుమం కుడుతిర్కు మభీష్ట సిద్ధియం."

(౧-౬8)

(ఇది కృతకాద్రి యగును; వనావళి యగును; పద్మషండవగును; తలి రుయ్యె లగును; లతా గృహమగును; రత్న దీపమగును; మధుమాస మగును; నవోజ్జ్వల చంద్రిక యగును. ఇట్టిది కానిది యను రీతి లేదు. ఈయొక్క కుసుమమే అభీష్టసిద్ధి నొసంగుచుండును.)

దీనికనువాదమని శ్రీ రావుగారు మూడు తెలుగు పద్యములను చూపినారు.1

'అలినీలాలక నీవు నీపతి రహస్యక్రీడ వర్తించు వే
ళ లతాంతాయుధ సంగరంబునకు నుత్సాహంబుఁ గల్పించు ను
జ్జ్వల దీపాంకురమై, రతిశ్రమ తనూసంజాత ఘారాళఘ
ర్మలవంబుల్ దొలఁగింపఁగా సురటియై రంజిల్లు నిచ్ఛాగతిన్'

(I. 60)

అడిగిన యంతలోన పరసాన్నములౕన్ సమకూర్చు నాకటన్
బడలికఁ జెందనీక యశభంబు లడంచు జగత్త్రియంబునన్

1. నిడుదవోలువారు కూడ ఇవే పద్యములను చూపినారు. శ్రీ సుబ్బరామప్ప గారు ఈ తెలుగు పద్యములను మాత్రమిచ్చి 'వీనికి సరియగు కన్నడ పద్యము' లున్నవని మాత్రమే తెలిపినారు. కన్నడ పద్యముల నుదాహరింపలేదు.

బడయఁగ రాని సర్వగుణ భవ్యము సుమ్మిది; దీనిఁ దాల్చి యి
ప్పడఁతులలోఁ గనుంగొను మపార మహా మహిమాను భావముల్.
(I. 61.)

నెలకొని వేసవిఁ జలువయుఁ
జలివేళల నుష్ణగుణము సముచితభంగిన్
గలిగించునీ లతాంతము
కొలఁదులు చెప్పంగ నిచ్చక్రొత్తలు సుమ్మీ." (I 62)

"ఇదుకృతకాద్రి" పద్యమునకును, 'అలినీలాలక' పద్యమునకును కొంత భావసామ్యము లేకపోలేదు. 'దీపమగును' అనునదే ఆ సమానాంశము. కాని ఈ 'దీపము' రుద్రభట్టు సొంతము కాదు.హరివంశకారుడు వెలిగించినదే

"ప్రదీపకర్మ రాత్రౌ చ కరోతి కమలేక్షణే". (ఉ.ఇ-27)

మూలము నందలి ఒక్క 'దీపము'చేత ఉద్దీపితుడై రుద్రభట్టు మరి ఏడు ఉద్దీపన విభావన పదార్థములను సృష్టించినాడు. రుద్రభట్టు సొంత సృష్టి యైన కృతకాద్రి మొదలగు నేడింటిలో ఒక్కదానినైన తిమ్మన స్పృశింపలేదు. మూలమందున్న దీపమును మాత్రమే గ్రహించినాడు. రుద్రభట్టు దానిని రత్న దీపముగా మార్చినాడు. తిమ్మన ఈ రత్నదీపము నైన ఉపయోగించుకొన లేదు. 'ఉజ్జ్వల దీపాంకురము'ను మాత్రమే వెలిగించుకొనినాడు. దానికితోడు 'సురటి' యను నొక వస్త్వంతరమును తాను స్వయముగా సృష్టించుకొని నాడు. వీని భోగ్యతకు ఉత్కృష్టత కలిగించుటకై 'రహస్య క్రీడ' అను శృంగార భావమును కల్పించినాడు. రుద్రభట్టు పద్యమును తిమ్మన చూచియే యున్నచో అందు సిద్ధాన్నము వలె సమకూర్చబడియున్న 'కృతకాద్రి' మొద లగు స్పృహణీయ పదార్థ సముదాయము నేల వదలిపెట్టి యుండును? ఒక్క దీపమునకే ఒక మధురమైన పద్యమును లిఖించిన తిమ్మన సువర్ణలేఖిని నుండి అమృత గుళికల వంటి మరి ఏడు పద్యములకు మనమెందులకు నోచికొని యుండము? 'అలినీలాలక' పద్యము హరివంశ శ్లోకార్థమునకు విపులీకరణమే గాని రుద్రభట్టు పద్యమునకు అనుసరణ కాదు.

'అడిగిన యంతలోన' 'నెలకొని వేసవి' అను పద్యములకు ఈపాటి భావసామ్యమైనను శోధకు లుదాహరించిన 'ఇదు కృతకాద్రి' పద్యమందేగాని,

రుద్రభట్టు రచించిన మరి యేపద్యమందుగాని లేదు. సరసాన్నముల నొసంగుట, ఆకటి బాధ కలుగనీయకుండుట, శీతోష్ణము లను సుఖావహముగ కూర్మిట అను నీ భావములు హరివంశ మందున్నవే.

"ప్రపత్యపి రసాన్ దేవి మనసా కాంక్షితాన్ పరాన్
శీతోష్ణే చేచ్ఛితే దేవి పుష్పమే తత్ప్రియచ్ఛతి. (౬౩-22)

బుభుక్షా వా పిపాసా వా గ్లానిరప్యథవా జరా
దేవవద్ధారయంత్యాస్తే స్వచ్ఛందేన భవిష్యతి." ( -29)

తిమ్మన పద్యములుపై శ్లోకములకు విపులీకరణములే.

2) శ్రీ బి. వెం. రావుగారుదాహరించిన రెండవ కన్నడ పద్యమిది. నారదకృత రుక్మిణీ ప్రశంసా, సత్యా నిందా ఘట్టమందలిది.

తడవేం పూణ్కొగె దివ్యం
బిడివెం రుక్మిణియొళల్లదేం హరి మరెదుం
గడ సత్యభామెగెరగం
ముడిగిక్కద నార్పరెత్తికొళ్ళిం సభెయొళ్. (౧౨-74)

(ప్రతిన చేయుటకు తడవేల? దివ్యమును* పట్టుకొందును. ఇంక హరి రుక్మిణివైపు తప్ప మరచియైనను సత్యభామవైపు మొగ్గడు. 'ముడిగ' పడవైచుచున్నాను. ఈ సభలో శక్తియున్న వారెత్తికొనుడు.)

దీని కనుసరణమని వారు తెలిపిన తిమ్మన పద్యమిది :

"కువలయ పత్ర నేత్ర నెఱిగొప్పున నీకుసుమంబు దాల్చుటన్

---

* 'తత్ర మానుష ప్రమాణా నిర్ణేయస్యాపి నిర్ణాయకం యత్త ద్దివ్య మితిలోక ప్రసిద్ధమ్'. **Quoted by Dr. P. V. Kane in history of Dharma Shastra III Vol. P. 3** 3. విష, కోశ, తప్తమాష, తండులాది దివ్య ప్రమాణములను యాజ్ఞవల్క్యాది స్మృతులు చెప్పుచున్నవి. దివ్య ప్రమాణమునకై 'సవాలు' చేయువాడు తన తలపై గల టోపీ లేక పాగను నేలపై పడవైచును. దీనికి 'ముడిగ' వేయుట అని పేరు. సవాలు నెదిరించువారు దానినెత్తికొనవలెను.

సవతులు వచ్చి నీచరణ సారస యుగ్మము నాశ్రయింపఁగా
ధవుఁడలేని కూర్మి జవదాఁటక నీ పలుకాదరింపఁగా
నవిరళ భోగభాగ్య మహిమాన్వితవై విహరింతు గావుతన్"

(I. 62)

ఈ రెండు పద్యములకును సాదృశ్యమేమియు లేదనుట స్పష్టము. కన్నడ పద్యములోని 'దివ్యమెత్తికొనుట', 'ముడిగ' విసరుట మొదలగు ఆవేశపు పలుకులు తెలుగులో లేవు. తెలుగులో గల 'సవతులు వచ్చి రుక్మిణి చరణముల నాశ్రయించుట' కన్నడ పద్యములో లేదు; 'భోగ భాగ్యముల' ప్రసక్తి కూడ లేదు. 'కృష్ణుడు రుక్మిణివైపునకే మొగ్గును" అను భావమున కును, "నీ భర్త నీయెడ కొరలేని ప్రేమ గలిగి జవదాటక నీ పలుకాద రించు"నను భావమునకు మాత్రము కొలదిగా భావసామ్యము గోచరించు చున్నది. దీనికి మూలము హరివంశ మందలి 'నారాయణ మనోహరా' (ఉ-అ-17), భర్తృవత్సలే' ( -20) అను పదములందును

"అద్యేష్టాం వాసుదేవస్య వేద్మి త్వాం భోజనందిని" ( -36)

"మందార కుసుమం దత్తం యత్తే మధువిఘాతినా" ( -38)

"అద్యాహమవగచ్ఛామి సర్వథా సర్వశోభనే
అత్మా ద్వితీయః కృష్ణస్య భోజ్యే త్వమితి భామిని" ( -42)

"త్రైలోక్యరత్నే సర్వస్వే మదదాద్యత్తవాచ్యుతః" ( -43)

అను నారద వాక్యములందును చూడవచ్చును. అట్లే "సవతులు రుక్మిణి చరముల నాశ్రయింతు" రను తెలుగు పద్యము నందలి భావమునకు ప్రేరకము కాగలిన భావము హరివంశ మందున్నది.

'సపత్న్యస్తే గుణోపేతే సర్వాః పర్యేశ్వరప్రియే
అవమానావసేకేన త్వయా సిక్తావ్య భామిని'. (ఉ-అ-37)

తెలుగు పద్యములో గల 'అవిరళ భోగభాగ్య'ములకు మూలము కూడ హరివంశమందే చూడగలము.

"ప్రకాశమద్య సౌభాగ్యం అనివార్యం యశశ్చ తే". (౬౫-38)
"సౌభాగ్యైకరథో జైత్రః తవ దేవ్యద్య నిసృతః' (౬౫-41)

ఇట్టు కన్నడ పద్యమందలి ముఖ్యమైన భావము తెలుగు పద్యములో లేకుండుట వలన, ఈ రెంటికిని గల అల్ప భావసామ్యమునకును, తెలుగు పద్యమునందు గల ఇతర భావములకును మూలము హరివంశ మందుండుట వలనను తిమ్మన అనుసరించినది సంస్కృత హరివంశమునే గాని కన్నడ జగన్నాథ విజయమును కాదని తెలుచున్నది.

3) శ్రీ బి. వెం. రావుగారుదాహరించిన మూడవ కన్నడ పద్యము కూడ నారదకృత రుక్మిణీ ప్రశంసా, సత్యానిందా ప్రసంగ మందలిదే.

"అబలెయరొళ్ ముయ్యాంపళ్
సొబగింగా సత్యభామె; బేడిం తనగా
సొబగీ యలరం ముడిదరె
సొబగేకచ్ఛత్రమాయ్తు భీష్మక సుతెయా." (జ. వి. ౧౨-71)

(అబలలలో సొబగు కొరకు సత్యభామ స్పర్థ వహించునది. ఇంక తనకా సొబగు వలదు; ఈ అలరును ముడుచుట వలన భీష్మక సుతయొక్క సొబగు ఏకచ్ఛత్రమైనది.)

"స్త్రీలందరిలో నేనే అత్యధిక సౌందర్యవంతురాలనని ఇదివరలో సత్యభామ అనగలిగియుండెనుగాని, ఇకముందు అమాట ననలేదు. ఎంచు కనగా ఈ పారిజాత పుష్పధారణము వలన రుక్మిణీ సౌందర్యము సర్వోత్తమ మైనది" అని పై పద్యపు భావము. దీనికనువాదమని శ్రీ రావుగారు తలచిన తెలుగు పద్యములివి :

'ఇన్ని దినంబులున్ సవతు లిందఱిలోనల సత్యభామకన్
సన్నలఁ ద్రిమ్మరున్ హరివశంవదుఁడై యన విందుఁ గాని యో
కన్నియ నీ యెడం గలుగు గారవమెయ్యెడఁ జూచికాన లే
కున్న నసర్ష్య దివ్యకుసుమోత్తమ మేరికిసైన నిచ్చెనే.' (పారి. I 65)

'చక్కని దాననంచు నెలజవ్వని నంచు జగంబులోనఁ బే
రెక్కిన దాననంచుఁ బతి యెంతయు నాకనురక్తుఁ డంచుఁదా

నిక్కుచు విఱ్ఱవీగుచు గణింపదు కాంతల సత్య; యింతకున్
స్రుక్కకయున్నె నీమహిమ సూచిన బోటులు విన్నవించినన్'.
(1 66)*

పై పద్యములలో మొదటిదైన 'ఇన్ని దినంబులున్'పద్యములో గల భావము కన్నడ పద్యములో ఛాయామాత్రముగనైన లేదు. దీనికి మూలము ఉపర్యుదాహృత 'అద్యేష్టాం .... ' ఇత్యాదిగా హరివంశ మందున్నది. (చూ. పుట. 84)

ఇక ఈ 'అబలెయరొళ్' పద్యమునకును 'చక్కనిదాన' అను పద్యమునకు కొంత భావసామ్యము లేకపోలేదు. సత్యభామ తాను జగదేక సౌందర్యవతినని భావించు ననునదే ఈ సామాన్యాంశ. కాని ఈ భావము సంస్కృత హరివంశ మందున్నదే.

"అద్య సాత్రాజితీ దేవీ జ్ఞాస్యతే వరవర్ణిని
సౌభాగ్యాద్యాం సదా వేత్తి యాత్మానం సుభగాసతీ" (౬౫-39)

ఈ సామాన్య భావాంశ పోగా మిగిలినదంతయు తెలుగు కన్నడ పద్యముల భావ విభిన్నతయే. కన్నడములోని సత్య స్పర్ధాళువు; తెలుగులో సత్య గర్విష్ఠి. కన్నడములో రుక్మిణీ సౌందర్య ప్రశంస చేయబడగా, తెలుగులో ఆమె మహిమా స్తుతి చేయబడినది. పారిజాత కుసుమధారణము వలన రుక్మిణీ సౌందర్యాభివృద్ధి యైనదని కన్నడ పద్యము; మహిమా ప్రకటనమైనదని తెలుగు పద్యము భావము. ఇక కన్నడమందలి 'ఏకచ్ఛత్ర' మను ముచ్చటయైన పదము ఏ అనువాదకుడును యథాతథముగ ప్రయోగింపకుంత విడుప లేనిది. తిమ్మన ఈ కన్నడ పద్యమును చూచియుండ ననుటకు అతడీ పదము నుపయోగించుకొనకుండుటే తార్కాణ కాగలదు.

---

* నిడుదవోలువారు కూడ 'తడవేం పూణ్కెగె' పద్యమునకు 'కువలయ పత్ర నేత్ర' పద్యము అనువాద మనినారు. 'అబలెయరొళ్' పద్యమునకు ఒక్క "ఇన్ని దినంబులున్" అను పద్యమును మాత్రమొసంగినారు. సుబ్బ రామప్పగారు "తడవేం పూణ్కెగె" "అబలెయరొళ్" రెండు పద్యముల భావము "ఇన్ని దినంబులున్", 'చక్కని దాననంచు' రెండు పద్యములలో చేరినదని ఉమ్మడిగా చెప్పినారు.

4) శ్రీ బి. వెం. రావుగారుదాహరించిన నాల్గవ కన్నడ పద్యము రుక్మిణి ఆధిక్యమును సపత్ను లంగీకరించిరని తెలుపుచున్నది.

"బగెవందీ సొబగీ మహాత్మెగుచితం ప్రద్యుమ్ననంతప్ప పె
ర్మగనం పెత్త మహత్త్వ దగ్రమహిషీ సంపత్తియం తాళ్ది దీ
కెగె లక్ష్మీవనితావతారగెనుతం మిక్కంగనా వృంద వీ
ర్ష్యెగళం మాణ్దిరె సత్యభామె తళెదళ్ సౌభాగ్యమాత్సర్యమం".
(౧౨-75)

(ప్రద్యుమ్ననివంటి పెద్ద కుమారుని కన్న మహత్త్వమును, అగ్ర మహిషీ సంపత్తిని పొందిన, లక్ష్మీవనితావతారమైన ఈ మహాత్మురాలికి ఈ సొబగు పరికింపగా ఉచితమే" అని మిగిలిన అంగనా బృందము ఈర్ష్య మానగా, సత్యభామ మాత్రము సౌభాగ్య మాత్సర్యము వహించెను.)

దీని కనువాదమని పరిశోధకులు భావించు తెలుగు పద్యమిది :

"అందఱలోనఁ బెద్ద మహిమాన్విత రుక్మిణిఁ గానఁ బూవు గో
విందుఁడు దానికిచ్చెఁ దగవే యని లక్షణయోర్చెః పై(చెఁగా
ళింది; శమించె భద్ర; యపులెమ్మని యూరడిలెన్ సుదంత; లోఁ
గుందుట మానె జాంతవతి; కోపమడంచెను మిత్రవిందయున్."
(౧. 69.)

సత్యభామ తప్ప మిగిలిన శ్రీకృష్ణ మహిషులు రుక్మిణియెడ మాత్స ర్యము వహింపలేదనియే పై రెండు పద్యముల తాత్పర్యము. కనుక ఈ రెండు పద్యములకును గల భావసామ్యము ప్రస్ఫుటమే. స్థూల దృష్టికి కన్నడ పద్యమునకు తెలుగు పద్యము అనువాదము గాకున్నను అనుసరణమైన యగు నని తోచుటయు సహజమే. కనుకనే "ఈ పద్యమొక్కటియే తిమ్మన రుద్ర భట్టు ననుసరించెనని రుజువు చేయగలదు" అని పరిశోధకులు దృఢముగా నమ్ముచున్నారు. కాని సంస్కృత హరివంశములో ఈ భావము చెప్పబడ కున్నచో మాత్రమే శోధకుల అభిప్రాయము ఆమోదయోగ్యము కాగలదు. ఇప్పుడీ క్రింది హరివంశ శ్లోకములను గమనింతము :

"అర్ఘేతి పుత్రమాతేతి జ్యేష్ఠేతి చ సమాగతాః
ప్రాయేణ ప్రవదంతిస్మ హృష్టా దామోదరస్త్రియః"
'మమృషే న సపత్నస్త్యు తత్సౌభాగ్య గుణోదయమ్.'
(ఉ. 48, 49)

తెలుగు, కన్నడముల పద్యములకు రెంటికిని పై శ్లోకములే మాతృక లనుట స్పష్టమే గదా. అంతేగాక సూక్ష్మముగా పరిశీలించినచో ఈ రెండు అనువాదములును నడచిన ధోరణి వలన రుద్రభట్టు ప్రభావము తిమ్మనపై ఏ మాత్రమును లేదనిగూడ తెలియగలము.

మూలమందలి శ్లోకముతో రుక్మిణికి 'అర్ఘా', 'పుత్ర మాత'; 'జ్యేష్ఠ' అను మూడు విశేషణములు వాడబడి యున్నవి. వీనిలో 'అర్ఘా' యనుటకు మారుగ రుద్రభట్టు 'మహాత్మె' అని వాడినాడు. తిమ్మన 'మహిమాన్విత' అనినాడు. తిమ్మన వాడిన పదము సంస్కృత మూలము ననుసరించినదో, కన్నడము ననుసరించినదో స్పష్టముగా చెప్ప వీలులేకున్నది. ఇక 'జ్యేష్ఠ'కు మారుగ రుద్రభట్టు 'అగ్ర మహిషి' అని ప్రయోగింపగా, తిమ్మన 'అందఱ లోనఁ బెద్ద' అని అనువదించినాడు. తిమ్మన చేసిన తెనిగింపు రుక్మిణీ వయోధిక్యమును సూచించునదిగనే యున్నదిగాని ఆమె అగ్ర మహిషత్వమును సూచించునదిగ లేదు. రుక్మిణి తన సపత్ను లందరలో వయోధికురాలై యుండుగాక. ఐనను ఆమె అగ్ర మహిషి కానిచో సపత్నులామె ఆధిక్యము నంగీకరించి యుండెడివారు కారు. లోకములో సపత్నులలో నొకతె అల్ప వయస్కురాలయ్యు అగ్ర మహిషి కావచ్చును; వయోధికురాలు అప్రధాన మహిషి కావచ్చును. ఇచ్చట రుక్మిణికి గల ప్రత్యేకత ఆమె అగ్ర మహిషీత్వము వలన వచ్చినదేగాని, వయోధికత వలన వచ్చినది కాదు. కనుక తిమ్మన చేసిన అనువాదముకంటె రుద్రభట్టు చేసిన అనువాదము హృద్యమనక తప్పదు. ఐనను తిమ్మన తనకంటె పూర్వుడైన రుద్రభట్టు చేసిన సరసానువాదమును గ్రహింపలేదు. కారణము అతడు దానిని చూచి యుండక పోవుటకంటె వేరేమి కాగలదు?

ఇక మూలమందు గల 'పుత్రమాత' అను విశేషణమును తిమ్మన అనువదింపక వదలిపెట్టినాడు. కారణము పుత్ర మాతృత్వము రుక్మిణికే విశిష్టమైన

ఘనత కాదు. తక్కిన మహిషు లందరకును సాంబాది నందనులప్పటికే కలిగి యున్నారు. కనుక సపత్నులు రుక్మిణిని పుత్రమాత యని గౌరవించుట అసంగతమని తిమ్మన తలచి యుండును. ఈ అసంగతత్వమును రుద్రభట్టు చక్కగా పరిష్కరించి "ప్రద్యుమ్నుని వంటి పెద్ద కుమారుని గన్న భాగ్యశాలిని" అని సరసముగా ననువదించినాడు. కృష్ణ పత్ను లందరలో రుక్మిణికి గల స్థానమెట్టిదో, కృష్ణ పుత్రులందరలో ప్రద్యుమ్ననకు గల స్థాన మట్టిది. అతడు శ్రీకృష్ణుని అగ్ర తనయుడు. ఒకనికి నూరుగురు కొడుకు లుండవచ్చును. కాని అగ్ర తనయునకు గల ప్రాధాన్యము తక్కినవారికి లభింపదుగదా. అందుచేను దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ కార్యములలో తన తండ్రికి దక్షిణ భుజమై నిలచినవాడు ప్రద్యుమ్నుడే. అట్టి ప్రద్యుమ్నుని కన్నతల్లికి సపత్నులలో ప్రత్యేక గౌరవము లభించుటలో నెట్టి అసంగతత్వమును లేదు. దశరథుని పత్నులలో రామ మాతగా కౌసల్యకు గల స్థానము సుమిత్రా కైకలకు లభించునది కాదుగదా. రుద్రభట్టు కావించిన ఈ సరస వ్యాఖ్యానము తిమ్మన కంటబడియున్నచో అతడు దానిని తన పద్యములో తప్పక ఇముడ్చుకొని యుండెడువాడు.

ఇంకను రుద్రభట్టు మూలములో లేని 'లక్ష్మీవనితావతార' అను విశేషణమును రుక్మిణికి అదనముగా చేర్చినాడు. ఇది చాల సార్థకమైన విశేషణము. నిజమునకు నాడుగాని, నేడుగాని రుక్మిణికి గల గౌరవమునకు కారణము ఆమె వయోధిక్యముకంటె, ఆమె అగ్రమహిషీత్వము కంటె, ఆమె ప్రద్యుమ్న మాతృత్వముకంటె ఆమె లక్ష్మ్యవతారమను నమ్మికయే.

"రాఘవత్వేఽభవత్సీతా రుక్మిణీ కృష్ణ జన్మని
నిత్యమన్యేషు జన్మేషు విష్ణోరేషా సహాయినీ."

అను వాక్యమిచట అనుసంధేయము. శ్రీకృష్ణుడు శ్రీమన్నారాయణుని యవతారమన్నట్లే రుక్మిణి లక్ష్మ్యవతారమని అనాడే జనులు తలచుచుండిరి. "ఈ రుక్మిణి లక్ష్మి" (పారి. I 51) అని నారదుడును, 'ఇందిరా ప్రతినిధి రుక్మిణీ రమణి' (V. 74) అని లోకులును నాడే తలచిరి. ఇట్లు సార్థకమై, ఔచితీ

శోభితమైన ఉదాత్త భావము తిమ్మన కంటబడి యున్నచో అతడు దానిని వదలిపెట్టి యుండెడివాడు కాదు.

ఇట్లు శ్రీ బి. వెం. రావుగారును తన్మతానుయాయులును ఉదాహరించిన పద్యములలో ఒక్కటియు తిమ్మన రుద్రభట్టు గ్రంథమును అనుసరించినట్లు నిరూపింపలేకపోగా, అతడా గ్రంథమును చూచియైన యుండడనియు, హరివంశమునే అనుసరించినాడనియు నిరూపింపజాలినవై యున్నవి.

ఇవియేగాక ఇట్టివే పోలిక పద్యములు ఇంకను 'లెక్కలేనన్ని' కలవని వీరనుచున్నారు. రుద్రభట్టు తిమ్మన లిరువురును ఒకే హరివంశ, విష్ణు పురాణముల ననుసరించిన వారగుటచే వారి కావ్యములలో అట్టి పోలక పద్యములుండుట అత్యంత సహజము. లేకుండుట అసహజము. కాని కొంచెము శ్రమించి వెదకినచో హరివంశ, విష్ణు పురాణములలో వీనికి మాతృకలైన శ్లోకములు లభించిన తీరును, మరికొంత ఓపికబట్టి పరిశీలించినచో వీరిరువురును మూలము ననువదించుటలో త్రొక్కిన స్వతంత్ర మార్గములు వేర్వేరగుట గోచరింపగలదు. ఇట్లు "పారిజాతాపహరణమున"కు "జగన్నాథ విజయము" మూలమను వాదము నిర్మూలము కాగలదు.

జగన్నాథ విజయము నందలి ద్వాదశాశ్వాసోత్తర భాగమునకును, పారిజాతాపహరణ ప్రథమాశ్వాసమునకును కథాంశములందేగాక భావములందును, పద బంధములందును కూడ అప్పచెల్లెండ్ర పోలికలు ఎన్నో కలవు. ఈ రెండును సమాన మాతృకము లగుటచే అట్టి పోలిక లుండుటలో వింత లేదు. అప్ప చెల్లెండ్రను తల్లి బిడ్డలనుకొనుట భ్రమజనిత ప్రమాదము. శ్రీయుతులు బి. వెం. రావు, సుబ్బరామప్ప, వేంకటరావులు ఉదాహరింపని మరికొన్ని సందర్భములను, వానికి మూలములైన మాతృకలను గుర్తింతము.

1) శ్రీకృష్ణుడు రుక్మిణీ మందిరమునుండి సత్యా మందిరమునకు వచ్చుటకు ముందు నారదుని సేవకై ప్రద్యుమ్నుని నియమికచినాడట.

"నారదన సమీపదొళ్ సంభాషణార్థం ప్రద్యుమ్ననం నిలిసి"

(జ. వి. XII 80 వ.)

తిమ్మన కూడ ఈమాటను చెప్పినాడు.

" .... ప్రద్యుమ్నుని మౌని దండనిది...." (పారి. [1] 103)

ఈ భావము రుద్రభట్టు తిమ్మన లిరువురును హరివంశము నుండి గ్రహించినదే.

"నారదస్యోపచారార్థం ప్రద్యుమ్నం వినియుజ్య సః" (హరి. ౬౬-5)

2) కోపాగారగతయైన సత్యను శ్రీకృష్ణుడు సమీపించు సందర్భమందలి రుద్రభట్ట పద్యము :

"బందు మృదుయానదిం దాం
బందుద నీదేవిగరుప బేడెందు సఖీ
వృందక్కె పేళ్ద సంజ్ఞెయి
నందు మనోరమెయ కోపగృహమం పొక్కం. (జ. వి. ౧౨-83)

(అప్పుడు శ్రీకృష్ణుడు మృదుయానముతో వచ్చి "నేను వచ్చుటను ఈ దేవికి తెలుపవలద"ని సఖీ బృందమునకు సంజ్ఞచే తెలిపి, ఆ మనోరమయొక్క కోప గృహమును ప్రవేశించెను.)

ఇదే భావము గల తిమ్మన పద్య భాగము :

'కొందఱు మంతనంబులను గొందఱు జంకెన వాడిచూపులన్
గొందఱు( జేతిసన్నల( దగుల్పడ(జేయుచు( జేర(బోయి.'
(పారి. ౧-108)

భావసామ్యము గల ఈ రెండు పద్యములకును మూలమిది :

"ప్రేష్యాజనం స సంజ్ఞాయ అనాఖ్యేయోస్మీతి సంజ్ఞయా
స శంకితప్రసారశ్చ వారితోఽన్వగమత్ సతాం".
(హరి. ౬౬-13)

3) పై సందర్భ మందలిదే రుద్రభట్టు వచన మొకటి :

"అంతు కోపగృహమం పొక్కు అల్లి మొల్లడివజ్జెయిం సొప్పుళాగదంతు నడెతందు తన్మనోహారియపింతె కుళిర్దు బిజ్జణిగెయం కళెదుకొండు పంకరుహనాభం కింకరభావది నొయ్యనె బీసుత్తిమిరె." (జ. వి. ౧౨-83)

(అట్లు కోప గృహమును ప్రవేశించి అచ్చట మెల్లని అడుగులతో చప్పుడు కాకుండ నడచి వచ్చి, తన్మనోహరి వెనుక కూర్చుండి, వీవన గైకొని పంకరుహనాభుడు కింకర భావమున ఒయ్యనొయ్యన వీచుచుండ') ....

ఇదే భావమును తిమ్మన కూడ చెప్పినాడు.

"ఈ లలితాంగి చందమొక యించుక చూచెదనంచు ధూర్తగో
పాలుఁడు తాళవృంతమొక భామిని సత్యపిఱుందనుండి మం
దాలసలీలమై విసర నాదటఁ గైకొని వీచె...." (పారి. ౧-109)

ఈ ఉభయమునకు మూలమైన శ్లోకమిది :

గ్రహాయ వ్యజనం చైవ స్థిత్వా స పరిపార్శ్వతః
శనైరివాసృజద్వాతం జహాస శనకైరివ" (హరి. ౬౬-14)

4) సత్యను అనునయించు కృష్ణునిచే రుద్రభట్టిట్లు పలికించినాడు.

సింధూరవసనమం కళె
దొండు సితాంబరమునుట్టు నిర్మళ నిర్మో
కం దళెద నాగకన్నికె
యందమనభినయిసి దందమేం లలితాంగీ. (జ. వి. ౧౨-89)

(సింధూర వసనమును వీడి, సితాంబరమును ధరించి నిర్మల నిర్మోకము ధరించిన నాగకన్యక అందము నభినయించు ఈ నీ తీరేమి ? లలితాంగీ!)

తిమ్మన కూడ కృష్ణునిచే ఇదే ప్రశ్న వేయించినాడు.

"ఇందునిభాస్య మైతొడవు లేల ధరింపవు? సన్నకావులీ
వెందును మానలేవు తెలుపేటికిఁ గట్టితి? .... " (పారి. ౧-115)

ఈ రెండు పద్యములును ఈక్రింది శ్లోకములకు అనువాదములే.

"కిమర్థం కౌంకుమం వాసో మహారాజతమేవ చ
నానుగృహ్ణాసి సుశ్రోణి శుక్లం వాసోనుగృహ్యతే
వాసస్యేతే తవాభీష్టే మహారాజత కౌంకుమే

దేవాభిగమనాదూర్ధ్వం శక్యం నేష్టం హి తే ప్రియే."
(హరి. ౬౬-29, 30)

ఇచ్చట శుక్లాంబరధారిణి యైన సత్యను కుబుసము వాల్చిన నాగకన్యకతో పోల్చి రుద్రభట్టు గావించిన హృద్యమైన ఉపమను తిమ్మన ఉపయోగించుకొనలేదు. కారణము ఆ ఉపమ మూలము లోనిదికాక రుద్రభట్టు స్వీయోపజ్ఞా కల్పితమగుటయు, తిమ్మన సంస్కృత మూలమును చూచినవాడే కాని, ఈ కన్నడ కావ్యమును చూచినవాడు కాకుండుటయును అని గుర్తింప వలెను.

5) అభిమానము దెబ్బతినిన సత్య కృష్ణునితో నిట్లనుచున్నది :

"మాననిధి యెందు మన్నిపె
నీనెన్నం మున్నమాదుదిందపమానం
మానినిగె మానభంగం
తానిదు మరణక్కె మధికమెంబుద నఱియా?" (జ. వి. ౧౭-97)

(నీవు నన్ను 'మాననిధి' అని మున్ను గౌరవించుచుంటివి. అట్టి నాకు నేడు అవమానమైనది. మానినికి మానభంగము మరణమున కంటె అధికమని ఎఱుగవా?"

తిమ్మన వ్రాసిన ఈ పద్యము దీనికి ప్రతిబింబమో అన్నట్లున్నది.

"మానంబె తొడవు సతులకు
మానమె ప్రాణాధికంబు మానమఖిలస
న్మానములకు మూలంబగు
మానరహితమైన బ్రతుకు మానినికేలా?" (పారి. ౧-129)

ఈ పద్యములు రెండును కందములై యుండుట, 'న'కార ప్రాస, 'మాన', 'మానిని' శబ్దముల సామ్యము వలన వీనిలో మొదటిదానికి రెండవది అనువాదమై యుండుననిపించుటలో వింత లేదు. కాని మాతృకను పరికించి నచో ఈ భ్రమ తొలగిపోగలదు.

"మానార్థం జీవ్యతే లోకే సద్భిరిత్యుక్తవానసి
తదేవం సతి నేచ్ఛామి జీవితుం మానవర్జితా." (హరి. ౬౭-15)

తెలుగు పద్యభావము కన్నడ పద్యభావమునకంటె సంస్కృత శ్లోక భావమునకే సన్నిహితముగా నున్నదనుట స్పష్టము.

6) పై సందర్భ మందలిదే మరియొక పద్యము

ప్రియె సత్యం సత్యభామాసతి సతియరొళ్ యచ్యుతంగెందు నిచ్చం
ప్రియదిందం నోడువర్మన్నిసి నడెసువరెమ్మత్తెవర్దేవకీదే
వియరిన్నాం నాడె కొండాడువుదు పరిజనం ఛాత్రికై గొళ్ళదింద
ప్రియె యాగిర్దెన్న నిన్నార్చగెదపరెనగిన్నేకె సంసారబంధం."
(జ. వి. ౧౭-106)

("ఈ అచ్యుతునికి సతులలో నెల్ల సత్యభామ ప్రియసతి, సత్యము గను నిత్యముగను" అని మా అత్తగారైన దేవకీదేవి నన్ను ప్రియముతో చూచుచుండును. పరిజనులును కొండాడుచుందురు. నేడు నీకు అప్రియురాల నైన నన్ను ఇంకెవరు సంభావింతురు? నాకింక ఈ సంసార బంధమేల?)

సరిగా ఇదే భావము గల పద్యమును తిమ్మన కూడ వ్రాసినాడు.

తనదు కోడండ్రలోనఁ బెద్దయుగ నన్ను
దేవకీదేవి మన్నించు నీవు నాకుఁ
జనవులిచ్చుటఁ జేసి యా సాధ్విసేవ
సేయఁబోవంగ నాకింక సిగ్గు గాదె." (పారి. ౧-130)

ఈక్రింది శ్లోకమే లేనిచో కన్నడ పద్యమునకు తెలుగు పద్యము అను వాదమే యనుటకెట్టి ఆక్షేపణయు లేదు.

"యదహ్రాక్షీద్విమాం శ్వశ్రూర్బహుమానేన నందినీ
అవజ్ఞాతాం త్వయా ద్రాక్షీత్ మానం దౌర్భాగ్యకర్శితాం."
(హరి. ౬౭-23)

ఉపర్యుదాహృత సాదృశ్యములకు మూలములను హరివంశములో గుర్తించియున్నాము. హరివంశేతరములైన మూలములు గల మరికొన్ని సాదృశ్యములను కూడ గుర్తింపగలము.

7) కృష్ణుడు సత్యను నాగకన్యకతో పోల్చినట్లు రుద్రభట్టు చెప్పిన పద్యమును చూచియున్నాము. అచ్చట తిమ్మన ఆ భావమును స్వీకరింపలేదని రెండుకూడ గుర్తించినాము. కాని సందర్భములలో తిమ్మన కూడ సత్యను నాగాంగనతో పోల్చియున్నాడు.

"అన విని ప్రేటువడ్డ యురగాంగనయుం బలె" (పారి. ౧-82)

.... కోపసదనంబునకుం
జనియెను లతాంగి హరిపం
దనకోటరమునకు నాగతరుణియు వోలెన్.' (పారి. ౧-96)

హరివంశములోగాని, విష్ణు పురాణములో గాని ఈ యుపమానము చెప్పబడలేదు. అంతమాత్రమున దీనిని తిమ్మన రుద్రభట్టు నుండియే సంగ్రహించినాడని తలంపనక్కరలేదు. ఈ యుపమానము రుద్రభట్టు సొంత కల్పన కాదు. కోపాగార ప్రవేశమున సత్యకు గురుత్వము వహించు కైకేయి కోపాగార ప్రవేశమును వర్ణించుచు ఆదికవి వాల్మీకి మహర్షియే తొలిసారిగా ఈ యుపమానమును ప్రయోగించి యున్నాడు.

"నాగకన్యేవ నిశ్వస్య దీర్ఘ ముష్ణం చ భామినీ."
(అయోధ్య. ౧౦-3)

భాస్కర రామాయణమున కూడ ఈ ఉపమానము స్వీకృతమైనది.

'నాగకన్యయుంబోలె నిట్టూర్పు నిగుడించుచు' (అయోధ్య. 67)

సత్య కోపాగార ప్రవేశ వర్ణనము చేయునపుడు తిమ్మనకు కైకేయీ కోపాగార ప్రవేశ సందర్భము గుర్తునకు వచ్చుట సహజమే కదా.

8. రుద్రభట్టు ఒక పద్యములో దిక్పాలకులను సవ్యక్రమములో దిక్కుల వరుసలో పేర్కొనినాడు :

'అనలన తేజదిం, యమన సాహసదిం, దనుపుత్ర నక్మ్రేయం,
వననిధినాథ సుద్ధతికెయిం, పపమానన శక్తియిం, కుబే
రన బలదిం, మహేశన మహత్వదినాగ్గమసాధ్యమెంబ బ

ల్పినాశగవైరి నిమ్మ వినయోక్తిగె తాం నగదేకె మాడ్పనో.'

(జ. వి. ౧౩-25)

(అనలుని తేజము వలనను, యముని సాహసము వలనను, దను పుత్రుని పరాక్రమము వలనను, వననిధినాధుని ఔద్ధత్యము వలనను, పవ మానుని శక్తివలనను, కుబేరుని బలము వలనను, మహేశ్వరుని మహత్వము వలనను తనను జయించుట ఎవరికైనను అసాధ్యమను గర్వముతో అగవైరి నీ వినయోక్తికి పవ్వకేల మానును? అని నారదుడు కృష్ణునితో నను చున్నాడు.)

తిమ్మన కూడ దిక్పాలుర నిట్లు సవ్య క్రమములో పలుమారులు పేర్కొని యున్నాడు.[1] ఐన ఈ విధానమును తిమ్మన కన్నడ కవియైన రుద్ర భట్టు నుండియే నేర్చుకొననక్కరలేదు. ఇది ఆంధ్ర కవులకు అదికవి నుండి అభ్యాసమైన అలవాటే. నన్నయ, ఎఱ్ఱన, శ్రీనాథుడు, నాచనసోముడు, నంది ఘంట కవులు, ఇంకెందరో తెలుగు కవులు ఇట్లు దిక్పాలురను సవ్య క్రమ ములో పేర్కొని యున్నారు.[2] తిమ్మనకీ తెలుగు కవులే మార్గదర్శకు లనుట న్యాయము.

9) యుద్ధ సన్నద్ధులై వచ్చిన దిక్పాలురను కృష్ణుడు సత్యభామకు చూపుచు వర్ణించినట్లు, ఒక్కొక్కరికొక్కటి చొప్పున ఎనిమిది మహా స్రగ్ధర లను రుద్రభట్టు రచించినాడు. (జ. వి. ౧౩-65-72). తిమ్మన కూడ దిక్పా లుర యుద్ధ సన్నాహములను వర్ణించుచు ఒక్కొక్కరికొక్కటి చొప్పున ఎని మిది వృత్తములను రచించి యున్నాడు. (౪. 79-85). దిక్పాలురను తల కొక పద్యముతో వర్ణించుట తెలుగు కవులకు క్రొత్త కాదు. ఇచట తిమ్మన ఆంధ్రకవి సంప్రదాయమునే అనుసరించినాడు.[3] ఇది ఇట్లుండ కృష్ణుడు తన ప్రియ పత్నికి దిక్పాలకులను చూపించి వర్ణించి చెప్పుట యనునది చాల సరసమైన కల్పన. రుద్రభట్ట కావ్యమును తిమ్మన చూచియే యున్నచో

1. పారి. 3-7; 41; ౪-46; 63; 67; ౫-22.
2. సభా. ౧-29; నృసింహ ౨-116-123; శృం. నై. ౪-9; ౮-103; భీమ ఖం॥ ౪-47; 107: ఉ. హరి. ౧-80; ౫-16; వరాహ. ౨-8
3. ఎఱ్ఱన—నృసింహ పురాణము. ౨-116-133.

తిమ్మన కూడ అట్లే రచించి యుండువాడు. యుద్ధ సందర్భముననో, అమరావతీ పుర ప్రవేశ సమయమున తమకు స్వాగతము చెప్పుటకై దిక్పాలురు వచ్చిన సందర్భముననో కృష్ణునిచే సత్యకు దిక్పాలకుల పరిచయమును తిమ్మన చేయించి యున్నచో రమ్యముగ నుండెడిది. తిమ్మన అట్లు చేయకుండుటచే అతడా కావ్యమును చూచియుండ డనియే తలపవలసి యున్నది.

ఇట్లు తిమ్మన రుద్రభట్టు ననుసరించెనని భ్రమింపజేయు సందర్భము లన్నియు నిజమునకు హరివంశమునకో, మరియొక గ్రంథమునకో అనుసరణము లగుటచే అతడు జగన్నాథ విజయమును చూచినట్లు నిశ్చయమైన సాక్ష్యము లేకున్నది.

**రుద్రభట్టు సొంత కల్పనలు :**

రుద్రభట్టు గొప్ప కవి, గొప్ప పండితుడు. అతడు హరివంశ, విష్ణు పురాణముల ననుసరించుచునే స్వతంత్రములైన అనేక రమ్య కల్పనలను కూడ చేసియున్నాడు. వానిని చదివి ఆనందించిన కవి ఆ తరువాత తాను రచించు కావ్యములో తెలిసియో, తెలియకయో అతని భావములను, పద బంధములను కొన్నింటినైన అనుకరింపక తప్పించుకొనలేడు. కనుకనే రుద్రభట్టు ప్రభావము అతని తరువాతి కన్నడ కవులపై విస్తారముగ కలదని కన్నడ సాహిత్యవేత్త లనుచున్నారు.* అట్టిచో సమానేతి వృత్తమును గైకొని కావ్య రచన గావించుచున్న తిమ్మన రుద్రభట్ట కావ్యమును చూచియే యున్నచో తప్పనిసరిగ అతని భావములను, పద బంధములను ఎన్నింటినో యథాతథముగ స్వీకరించుటయో, అనుకరించుటయో చేసియుండెడువాడు. కాని తిమ్మన కావ్యములో అట్టి రుద్రభట్టానువాదములు గాని, అనుకథనలు గాని మృగ్యములు. అనువాదములు, అనుకరణలు నని భ్రమ గొలుపు సందర్భము లన్నిటియందును ఉభయుల రచనలకు మూలములైన మాతృకలుండుటను గుర్తించి యున్నాము. ఇప్పుడు రుద్రభట్టు కావించిన కొన్ని రమ్యమైన స్వతంత్ర కల్పనలను పరిశీలింతము.

* విమర్శకాగ్రేసర డి. యల్. నరసింహాచార్— 'రుద్రభట్టు'—ప్రబుద్ధ కర్ణాటక Vol. 32-4 సంచిక.

1) తనకు నమస్కరించ కృష్ణుని వారించుచు అదితి ఇట్లనుచున్నది :

"నతనాగదిరెమగె, నీం జగద్గురు వత్తే". (౧౨-55)

(నీవు నాకు నమస్కరింపవలదు. నీవు జగద్గురువువు గదా.)

'అఱిపి నిజాదిమధ్యనిధనేతరవృత్తియ నోర్కె, మత్తదం
మఱెయిసి దేవకీతనయ నెందెనిసిర్దు వయోధికర్గె నీ
నెఱగి, సమానరెందు కెలరొళ్, సమవర్షజనెంబ భావమం
దెఱగిసి ధర్మజాద్యరనె మోహిపుదెమ్మనదేకె మోహిపై' (౧౨-56)

(ఒకప్పుడు నీ ఆదిమధ్యాంత రహితత్వమును గోచరింప జేయుదువు. అంతలోనే ఆ భావమును మరపింతువు. వయోధికులైనవారికి నమస్కరించి నీవు దేవకీ తనయుడవే అనెడి భావము వారికి కలిగింతువు. కొందరను సమానులని, సమ వయస్కులని భ్రమింపజేసి వారి మ్రొక్కులను గైకొందువు. ఇట్లు ధర్మజాదులను మోహింప జేయుచున్నావు. నన్ను గూడ నేల మోహములో ముంతువు?)

'పరమాణు సమం స్థూలం
పురాణనజరం సమీపగం దూరస్థం
నిరవయం సాకారం
హరి నీనె, పొగళ్వరళవె, నిన్న మహత్వం'. (౧౨-57)

(శ్రీహరీ, నీవు పరమాణు సముడవు, స్థూలుడవు; పురాణ పురుషుడవు, అజరుడవు; సమీపస్థుడవు, దూరస్థుడవు; నిరవయవుడవు, సాకారుడవు. నీ మహిమ పొగడ తరమా?)

ఈ సంగ్రహమైన భగవన్మహిమా మాయా వర్ణనము హృదయంగమము గదా.

2) ఈ నారద వర్ణన మెంతయైన హృద్యముగా నున్నది.

'పడినోడల్ హంసెగం బెళ్మగిళతిధవళం, హంసెగం బెళ్మగిళ్గం
మృదహాసం విశ్వలోకస్తుత మతిధవళం, హంసెగం బెళ్మగిళ్గం
మృదహాసక్కం సుధావారిధి యతిధవళం, హంసెగం బెళ్మగిళ్గం

మృడహాసక్కం సుధావారిధిగ మతిధవళం తానెనల్ యోగి బందం.'

(౧౨-63)

(పోల్చిచూడగా హంసకంటె శరన్మేఘమతి ధవళమైనది. హంస కంటెను, శరన్మేఘము కంటెను విశ్వలోక స్తుతమైన మృడహాసము అతి ధవళము. హంస కంటెను, శరన్మేఘము కంటెను, మృడహాసము కంటెను సుధావారిధి యతి ధవళము. హంసకంటెను, శరన్మేఘము (తెలిమబ్బు) కంటెను, మృడహాసము కంటెను, సుధావారిధి కంటెను తానే అతి ధవళమనునట్లుగా యోగి అరుదెంచెను.)

మాఘకవి నారదుని మనోజ్ఞముగా వర్ణించినాడు.

'రణద్భిరాఘట్టనయా నభస్వతః పృథగ్విభిన్న శ్రుతిమండలైః స్వరైః
స్ఫుటీభవద్గ్రామ విశేషమూర్ఛనా మవేక్షమాణం మహతీం ముహుర్ముహుః'

— ఇత్యాది. 'శిశుపాల వధము' ౧-10

తిమ్మన నారదుని స్వరూపమును మన మనోనయనము నెదుట సాక్షాత్కరింపజేసినాడు (పారి. I 44). కాని ఈ రుద్రభట్టు వర్ణనలోవలె నారదుని ధవళిమ నెవరును పరాకోటి కెత్తలేకపోయినారు. 'శారద నీరదేందు....' అను పద్యమున పోతనామాత్యుడు (?) భారతీ శౌక్లిమను నిరూపించుటకై శుక్ల వస్తు సముదాయమును పదునేడింటిని గుదిగ్రుచ్చినాడు. రుద్రభట్టు నాలుగే నాలుగు ఉపమానముల పునరుక్తి వలన సాధించిన ధవళిమ పదముల అభిధా శక్తికి మీరినది.

3) నారదకృత పారిజాత పుష్ప మహిమా ప్రశంసా సందర్భము నందలిది ఈ సరస శృంగార భావము :

"ఇదనె తలెదొడవు పూడియె
పదపద్మక్కెఱగిపళ్ శచీవధు వంతా
త్రిదశేంద్రనె నెనె, భువనదొ
ళిదదల్ సౌభాగ్యకారణం పెరతుంటే." (౧౨-67)

(ఈ పారిజాత పుష్పమును ధరించియే శచీదేవి దేవేంద్రునిచేత తన పాద పద్మములకు మ్రొక్కించుకొనినదనగా, ఇంక లోకములో దీనికంటె సౌభాగ్య కారణము మరేమున్నది?)

ప్రియుడు ప్రియురాలికి మ్రొక్కు సన్నివేశము సున్నితమైన శృంగారరసమునకు శిఖరాయమాణము. భర్తృవాల్లభ్యమే జీవిత ధ్యేయముగా గల శ్రీకృష్ణ పత్నుల కింతకంటె స్పృహణీయ ప్రయోజనము లేదు. తరువాతి ఘట్టములో కృష్ణుని చేత సత్యకు మ్రొక్కింపదలచుకొని యున్న తిమ్మనకు ఈ భావము విడువరాని పెన్నిధి. కంటబడి యున్నచో తిమ్మన ఈ నిక్షేపమును త్రోసిపుచ్చి యుండడు.

4) 'ఇదు కృతకాద్రి .... ' యను పద్యమును గూర్చి ఇదివరకే (పుట 81) ముచ్చటించుట యైనది. ఉద్దీపన విభావనా సామగ్రికి ఆ పద్యము నిజముగా నిక్షేపమే.

5) నారదకృత రుక్మిణీ ప్రశంసా, సత్యనిందా ఘట్టమునసే రుద్రభట్టు చేసిన నూత్న కల్పనలెన్నో యున్నవి.

'హెఱముట్టుదు సౌభాగ్యజయయశం రుక్మిణియా.' (౧౨-69)

(రుక్మిణీ సౌభాగ్య జయ యశస్సు ఎల్లెడల వ్యాపించుచున్నది.)

6) 'ఉలివుదు సౌభాగ్యడిండిమం రుక్మిణియా' (౧౨-70)

(రుక్మిణీ సౌభాగ్య డిండిమము మ్రోగుచున్నది.)

7) "బలిరిపు విన్నికెయ పద
తళ సంగద సుఖమనవళ ముఖసంగదొళం
తళెగుమె? రుక్మిణి యుంగుట
దొణళ్ళ సొబగుంటె సత్యభామెయ నొసలొళ్? (౧౨-22)

(ఈమె పదతల సంగతి వలన లభించు సుఖమును సత్యాముఖ సంగతి వలననైన కృష్ణుడు పొందగలడా? రుక్మిణి పాదాంగుష్ఠపు సొబగు సత్యభామ నొసటి యందైన కలదా?)

సత్యానింద ముదురు పాకములో నున్నను కల్పన గొప్పదే.

8) సత్యా కోపాగార నేపథ్యమును రుద్రభట్టిట్లు వర్ణించినాడు :

'ప్రీతియనీవ సిందురద వస్త్రమ నొల్లదదొందు వస్త్రమం

శ్వేతమ నుట్టఁగట్టిరె, తదంబరదిం బ్రియకోపచిహ్నాదిం
దాతరళాక్షిగాగళెనసుం నలవోఁడిదు దంతుట త్తె, బా
లాతపదిందమప్పు వలవబ్జినిగప్పుదె చంద్రకాంతియిం." (౧౨-77)

(సత్యభామ తన కిష్టమైన సిందూర వస్త్రమును వీడి యొక శ్వేత వస్త్రమును ధరించినది. ప్రణయకోప చిహ్నమైన ఆ శ్వేతాంబరము వలన ఆమె సంతోషము మరింత క్షీణించినది. అబ్జినికి బాలాతపము వలన కలుగు వికాసము చంద్రకాంతి వలన లభించునా?)

సత్య రక్తాంబకమును వీడి ధవళాంబరమును ధరించినదను నంత వరకు హరివంశమందలి భావమే. ఐన చివరి పాదము నందలి దృష్టాంతము రుద్రభట్టు ప్రతిభకు తార్కాణముగా నున్నది.

9) సత్యభామ తలకు 'వాసెనకట్టు' కట్టినదని హరివంశములో నున్నది. ఆ వాసెనకట్టును రుద్రభట్టిట్లు వర్ణించినాడు.

"తనగీర్ష్యెయిం శిరోవే
దన జనియిసె నిటలపట్టదొళ్ తిర్యక్చం
దన తిలకాయతమం మా
నిని రుచిరదుకూల పట్టమం నియమిసిదళ్". (౧౨-78)

(ఈర్ష్య వలన ఆమెకు శిరోవేదన జనింపగా, నుదుటికొక రుచిర దుకూలముతో కట్టు కట్టినది. ఆ కట్టు ఆమె ఫాలతలమున తిర్యక్చందన తిలక రేఖవలె నుండెను.)

10) ఈ వాసెనకట్టునే కృష్ణునిచే మరొక రీతిగ వర్ణింప జేసినాడు.

'హృదయద తాపది నుర్కువ
వదనద లావణ్యరసద నొరెయనె నొసలొ
ళ్లి దుకూలపట్టమం క
ట్టిదభిప్రాయమ నమోఘ మఱిపువు దబళే'. (౧౨-91)

(అబలా, హృదయము నందలి తాపము వలన పొంగిపారిన వదన లావణ్యపు నురుగో యన నొసట దుకూల పట్టమును ధరించిన కారణమును తెలుపవే.)

11) సత్యా శ్వేత వస్త్ర ధారణమును కృష్ణుడిట్లు వర్ణించుచున్నాడు :

"సింధూర వసనమం కళె
దొందు సితాంబరమనుట్టు నిర్మళ నిర్మో
కం దళెద నాగకన్నికె
యందమ నభినయిసిదందమేం లలితాంగి." (౧౨-89)

(లలితాంగీ, సిందూర వస్త్రమును వీడి సితాంబరమును ధరించి నిర్మల నిర్మోకము దాల్చిన నాగకన్యక అందము నభియించుచున్న యీ నీ తీరేమి?)

సత్యభామ కోపచిహ్నముగ ధరించిన శ్వేత వస్త్రము కూడ తిమ్మన చెప్పిన 'మాసిన చీర' కాదు. పాము కుబుసమువలె జిలుగైన నేతపని గలిగి పారదర్శకమైనది. ఈదుకూలము వలన ఆమె ఐశ్వర్యము, నాగరకత వెల్లడి కాగా, ఆమె దీర్ఘ కృశాంగము, తనైన్నగనిగ్యము, రోష స్వభావము ఆడు త్రాచుతోడి ఔపమ్యము వలన వ్యంజితము లైనవి.

12) కృష్ణుడింకను ఇట్లుత్ప్రేక్షించు చున్నాడు.

"తరుణి కళంకమనంతః
కరణదొ ళాంతమళవృత్తియం కూడబహిః
కరిపంతే మహారజనాం
బరమం కళెదేకె ధవళపటమం పొదెదొ." (౧౨-90)

(తరుణీ, కళంకమును అంతఃకరణములో నిడుకొని నిర్మల స్వభావ మును వెల్లడించుచున్నట్లు మహారజనాంబరమును వీడి ధవళ పటమును దాల్చితివేల?)

13) శిరోవేదన నివారణకై సత్య వేసికొనిన చందన గంధపు పట్టును పురోకమారు రుద్రభట్టు ఇట్లుత్ప్రేక్షించు చున్నాడు :

"కలుష కషాయేక్షణరుచి
లలాటపటదొళ్పొర్దు పుదిదత్తెనె కో
మలె తద్దుకూలపట్టద
కెలనెలదొ ళ్తోళెదళరుణ చందనరసమం." (౧౨-79)

(కలుష కషాయేక్షణరుచి లలాట పటమునందు వడియ గట్టబడి ప్రక్క లకు వ్యాపించెనో యన, ఆమె దుకూలపట్టమునకు ఇరువంకల రక్తచందనపు పట్టు వేసికొనెను.)

సత్య కనులు ఆకర్ణాంత దీర్ఘములు; వాని కొనలు రక్తచందనము కంటె ఎరుపెక్కినవి. రక్తచందన రుచి శ్వేతదుకూలములో వడియగట్టిన ఆమె అపాంగారుణ కాంతియో యన్నట్లుండెను.

14) ఈ "పట్టు"నే ఆ తరువాత కృష్ణు డిట్లుత్ప్రేక్షించినాడు.

"అలెవనిడు సుయ్యశిం ముఖ
నలిన రజస్సంకుళం తెరళ్దొర్చుళియిం
కెలసార్దం తిరలేకెగె
లలాటదొళ్ తొడెదె రక్తచందనరసమం". (౧౨-92)

(నిట్టూర్పుగాడ్పు వేగమునకు ముఖపద్మ మందలి పుప్పొడి తండములు ప్రక్కలకు వ్యాపించినట్లుగ ఇరుపార్శ్వములందు రక్తచందన రసమును ధరించితివేల ?

15) సత్యా కోప గృహమును గూర్చి హరివంశము "కోప గృహం వివిక్తం" (౬౫-52) అని మాత్రమే చెప్పినది. ఈ వివిక్త శబ్దమును రుద్ర భట్టు ఇట్లు విపులపరచినాడు.

"సారికెయ కీరదంచెయ
పారావత దించరంగళిల్లద కోపా
గారమ నావధు పొక్కళ్
తోరణమల్లాడె నిమిర్వ* సుయ్యెలరిందం." (౧౨-76)

(ఆ సత్యభామ శారికాకీర హంస పారావతాదుల మధుర ధ్వనులు లేని కోపాగారమును ప్రవేశించినది. అప్పుడామె నిట్టూర్పు గాడ్పుల వలన ద్వార తోరణ మల్లాడినది.)

---

* కన్నడములో వలవల గిలక గల అక్షరము సంయుక్తాక్షరము కాదు. తత్పూర్వాక్షరము గురువు కాదు.

16) ఇదే భావమును మరల కృష్ణుని నోట నిట్లు చెప్పించినాడు.

"పారావతవ్రులియద శుక
శారికెగళ్ మధురవిరుతి వీఱద కోపా
గారమనోర్మెయ పొక్కీ
కారణవేనెసగె తిళియె పేళిందుముఖీ." (౧౨-88)

(ఇందుముఖీ, పారావతము రొద చేయని, శుకశారికలు మధుర ధ్వనులు చేయని కోపాగారము నిట్లు హఠాత్తుగా ప్రవేశించుటకు కారణమేమి?)

17) కుపితయైన సత్యభామ తన చేతిలోని విలాస పద్మమును పత్రములు త్రెంపివేయుచు, కన్నీరు కార్చుచు, కాలి బొటనవ్రేలితో వేల మ్రాయుచు నిలువబడినదని హరివంశములో కలదు.

"విచూర్ణయామాస కుశేశయం సా
వినిశ్వస్య నిఃశ్వస్య నఖై ర్నతభ్రూః" (౬౫-54)
"కించిదాకులితాగ్రేణ చరణేన వసున్ధరాం (విలేఖయన్తీ) [౬౬-8]

ఈ భావముపైన రుద్రభట్టు చేసిన పెంపకము ఇట్లున్నది :

"పరమక్రోధాధిదేవార్చనమెనె పరిదొట్టుత్తె లీలాబ్జపత్రో
త్కరమం, చింతాలతావృద్ధియ నాడలిసలోరంతె నీర్వొయ్యెపాంగిం
సురివుత్తం, బాష్పధారాజలపరికరమం, స్నేహశాస్త్రక్కె టీకం
బరెవుత్తిర్పందదిందుంగుటదె బరెవుత్తం భూమియం భ్రామెయిర్దళ్.
[౧౨-81]

[పరమ క్రోధాధి దేవతార్చనము చేయుచున్నదో యన లీలాబ్జ పత్రములను త్రెంపివేయుచు, చింతాలతను వృద్ధి పొందించుటకో యన నిరంతరము కనులవెంట నీరు స్రవింపజేయుచు, ప్రణయ శాస్త్రమునకు టీక లిఖించుచున్నదో యన నేలపై కాలి బొటనవ్రేలితో వ్రాయుచు సత్యభామ నిలచి యుండెను.]

క్రోధాధి దేవతార్చనము కోపనయైన సత్యా స్వభావమునకు సంకేతకము; చింతాలతా దోహదము ఆమె తాత్కాలిక మనఃస్థితి సూచకము; స్నేహ

శాస్త్రమునకు టీకా విరచనము ఆమె శృంగార నాయికా శిరోమణిత్వ ద్యోతకము.

18] కృష్ణుడు సత్యను సమీపించునపుడు చూపిన కపట నటనలను రుద్రభట్టు ఇట్లు వర్ణించుచున్నాడు :

"ప్రియె మునిదీక్షిపుడుం భీ
తియి నాకెయ పింతె పొక్కడంగువ నిజచే
ష్టెయి నిమ్మడిసినంతా
ప్రియెయ మహాప్రణయకోపమం కమలాక్షం." [౧౨-85]

[సత్యభామ కోపముతో శ్రీకృష్ణుని గాంచినది. అతడు భీతునివలె ఆమె చాటున దాగికొనునట్లు నటించినాడు. దానితో అతడు ఆ ప్రియురాలి కోపమును ఇమ్మడి గావించెను.]

19] సత్య శ్రీకృష్ణునిట్లు దూరుచున్నది :

"పూతనెయం కొందా స్త్రీ
ఘాతుకవృత్తియ నదెమ్మొళం తోరిదపై
పూతనెయ తెరదె నినగా
నేతెరపొల్లమెయనరస బగెదం బగెయొళ్." [౧౨-96]

[స్వామీ, పూతనను చంపిన స్త్రీఘాతుక ప్రవృత్తినే నాయెడలను చూపుచున్నావు. కాని ఆ పూతనవలె నేను నీకేమి అపకారము తలచి యుంటిని?]

20) సత్యా కోపోపశమనానంతరము నారదుడామె మందిరమున కరుదెంచినాడు. అతని నామె భక్తితో పూజించినదని హరివంశకారుడును, తిమ్మనయు చెప్పియున్నారు. ఇచట నొక ప్రశ్న ఉదయించుచున్నది. కొలది క్షణముల క్రిందటనే ఈ నారదుడే సత్యను ఆమె సపత్ని యెదుట నిందించి యున్నాడు. రుద్రభట్టు ఈ నిందను మూలములోకంటె తీవ్రముగా చేయించినాడు.] అట్టివానిని ఆమె భక్తితో ఎట్లు పూజించినది. ఇంతలోనే ఆమె ఈ

విషయమును మరచిపోయినదా? రుద్రభట్టు ఈ ప్రశ్నకు చక్కని సమాధాన మొసంగి యున్నాడు.

'మునియిసువెం సపత్నియర నెందమరద్రుమదొందు పుష్పమం
మని హరిగిత్త, నంతదువె రుక్మిణిగాగిరె, మన్యుయుక్తె యా
దెనగె మురారి తత్కుజమనావగ మిత్తపెనెందు పూణ్దనం
తెనగె మనోరథం సమనిపల్లిగె నారదనత్తె కారణం.' (౧౨-4)

(సపత్నీ మాత్సర్య ప్రకోపమునకై నారదుడొక అమర ద్రుమ పుష్ప మును హరి కీయగా, అది రుక్మిణికి చెందగా, నేను కోపింపగా, మురారి నాకా కుజమునే తెచ్చి యిత్తునని ప్రతిన చేసినాడు. ఇట్లు నా మనోరథము నెర వేరుటకు నారదుడే గదా కారణము.)

అని సత్య ఆలోచించినదట. నారదుడు సత్యానింద గావించినను పర్యవసానమున పరోక్షముగ ఆమెకు మహోపకారము గావించిన వాడయి నాడు. అట్టివాని నామె ఏల పూజింపదు ?

21) సూర్యాస్తమయ, చంద్రోదయ, సూర్యోదయములను రుద్రభట్టు ముచ్చటగ మూడు పద్యములలో వర్ణించినాడు. ఈ వర్ణనలోని విశేషమేమ నగా 'తీర్థమునకు తీర్థము, ప్రసాదమునకు ప్రసాదము' అన్నట్లు కథ దారి కథది; వర్ణనల దారి వర్ణనలది కాక ఈ వర్ణనలో కథను అనుసంధానపరచి రుద్రభట్టు ఉత్తమ శిల్ప ప్రజ్ఞను ప్రదర్శించినాడు.

'నెగళ్దత్తిర్దుదనాకుళం మదనరాగం చక్రిగం సత్యభా
మెగమీవల్లభరిం విధూత్సవదొళత్యుత్సాహదిం కూడుగాం
పగలం తీర్చువె నెందతిత్వరితదిం పోపంతె మార్తాండన
స్తగిరీంద్రక్కెళెదం ముకుందవసన ద్యోతాహృతాత్మప్రభం'. (౧౩-34)

['సత్యా కృష్ణులకు మదనరాగ మతిశయించుచున్నది. ఆ ప్రేమికులు ఉత్సాహముతో చంద్రికోత్సవము నాచరింతురు గాక" అందుకై నేను త్వరగా పగటిని ముగింతును" అని తలంచువానివలె సూర్యుడు శ్రీకృష్ణుని వస్త్రముచే అపహృత ప్రభుడై అస్తగిరీంద్రముపై వ్రాలెను.]

22) "మృగమదలలామ దిందం
బగెగొళసుత్తిర్ప సత్యభామెయ వదనేం
దుగె దొరె యెంబిన ముదయిసి
మృగధరబింబం విరాజిసిత్తంబరదొళ్" [౧౩-35]

[మృగమద తిలకముచే శోభిల్లు సత్యభామ ముఖచంద్రునితో సరిపోలుచు మృగలాంఛనమును ధరించి చంద్రబింబము అంబరమున విరాజిల్లెను.]

23] 'సురగెణ్ హితార్థమెందసురరొళ్హరి కాదువుదల్తు విస్మయం
సురరొళె కాదు వందమిదు విస్మయమానిద నిందు నోళ్పెనెం
దిరదనురాగదిం దుదయిపంతు దయాద్రియ నొయ్యనేఱిదం
సరసిజ బంధువేఱె విజయాంగనె కృష్ణన బాహుపీఠమం.'
[౧౨-36]

[సురలకు హితము కొరకై హరి అసురులతో పోరుట విస్మయము కాదు. అతడు సురలతోనే పోరుట విస్మయము. ఈ వింత చూతును గాక." అని అనురాగముతో సరసిజబంధుడు ఉదయాద్రి నధిరోహించెను. విజయ లక్ష్మి శ్రీకృష్ణుని బాహు పీఠము నధిరోహించెను.]

24] శ్రీకృష్ణుడు గరుడుని ప్రతాపమును ప్రశంసింపగా అతడు వినయముతో నిట్లనును :

"దేవర సామర్థ్య దినె
న్నీ విక్రమమెసెవు దర్కతేజది నర్క
గ్రావద కాయ్పెసెపంతిరె
భావిపొడేనుంటె బేఱె విక్రమవెన్నొళ్ " [౧౩-41]

[సూర్యుని తేజము వలననే సూర్యకాంతము ప్రజ్వరిల్లునట్లు దేవరవారి సామర్థ్యము వలననే నా విక్రమము శోభిల్లుచున్నదిగాని నాకు వేఱుగా విక్రమ మెక్కడిది?]

గరుడుని ఈ వినయశీల మాతని పరాక్రమమునకు మెరుగుపెట్టుచున్నది. అనుత్సేకమే గదా విక్రమాలంకారము.[1]

1. 'అనుత్సేకః ఖలు విక్రమాలంకారః'—విక్రమోర్వశీయము I అంకము.

25) సత్యభామ గరుడు నధిరోహించిన అంద మెట్లున్నదనగా :

"ఈ దేవియ భూషణ ర
త్నోదితరుచి బళసె పంచరత్నప్రభనిం
వాదం గరుడనెసల్వ
ద్మోదరనొడనేఱి దేవి గరుడనొళెసెదళ్." (౧౩-45)

(సత్యభామాదేవి ధరించిన భూషణము లందలి రత్నముల కాంతి గరుడునిపై ప్రసరించుట వలన అతడు పంచరత్న ప్రభావిలసితుడయ్యెనో యనునట్లు సత్య శ్రీకృష్ణునితో గూడి గరుడుని పైనెక్కి శోభిల్లెను.)

మేరు రోహణ నగ నిభ విభా విలసితుడైన గరుడునకును అవనపు కాంతుల నొసంగగల సత్యభామాదేవి రత్నాభరణ కాంతులెట్టివో ?

26) శ్రీకృష్ణుని అమరావతీ యాత్రను రుద్రభట్టు రెండు పద్యములలో వర్ణించినాడు :

"ప్రభవిసిదుదు భానుగె చి
త్రభానుపెసరిగళెనిగి పీతాంబర కౌ
స్తుభ శంఖచక్రదేహ
ప్రభెగళ్తళ్పొయ్యె నభదొళెసెదం కృష్ణం." (౧౩-43)

(శ్రీకృష్ణుని పీతాంబరము, కౌస్తుభము, శంఖము, చక్రము, దేహము-వీని కాంతులు సోకియే సూర్యునకు చిత్రభాను వను పేరు కలిగినదో యనన శ్రీకృష్ణుడు ఆకసమున శోభిల్లెను.

27) "ఆనకవీచిరవం ధ్వజ
మీనం శేషాక్షతాంబుకణమొగెవ ధరాం
భోనిధియిం ఖగరాజం
మైనాకం నాకద త్తలొగెదంతొగెదం." (౧౩-44)

(శంఖారావమే తరంగ ఘోషగా, ధ్వజమే మీనముగా, శేషాక్షతలే జల కణములుగా భూమి యను సముద్రము నుండి గరుడుడను మైనాకుడు ఆకసము వంక కెగసెను.)

28) పారిజాతోత్పాటనానంతరము శ్రీకృష్ణుడు పాంచజన్యమును పూరించిన విధమెట్లున్న దనగా :

"నెరవం పేళరగేంద్ర నిన్నురగరం, దిక్పాలకశ్రేణి పీం
నెరవాగెం పడిమాతెలేరవి, ఎలే మాదేవెలేబొమ్మకే
న్దిరె నీముం నెరవాగిమా కులిశిగెంతుం గెల్వనేకాంగదిం
మురవిధ్వంసకనెందు సారువ హెలాత్తూ పాంచజన్యస్వనం."

(౧౩-48)

(ఓయి ఉరగేంద్రుడా, నీవు నీ ఉరగులతో కులిశికి సహాయుడవు కమ్ము. దిక్పాలకులారా, మీరును సాయము రండు. ఓయి రవీ, ఓయి మహాదేవుడా, ఓయి బొమ్మదేవరా, మీరును కూడ ఇంద్రునకు బాసటగా రండు. మురవిధ్వంసకుడు ఏకాంగవీరుడై గెల్వనున్నాడు." అని చాటుచున్నట్లు పాంచజన్యస్వనము విజృంభించెను.)

శ్రీకృష్ణుని ఈ యుద్ధాహ్వానము వీరరసభరితముగా నున్నది.

29) పారిజాతాపహరణ వార్తను నందనవన పాలకులు శచీదేవి కిట్లు నివేదించినారు.

'తనగేక్కగ్గద పారిజాత మహిజం పౌలోమిగాం వీరకా
మినియెం రూపినొళగ్గళం సొబగినిం మేలీకుజం యోగ్యవి
న్నెనగం బందరె సత్యభామె పతియం దైత్యారియం తందు, దే
వి, నిజోద్యానద పారిజాత తరువం కై కొండళుత్సాహదిం.'

(౧౩-49)

('నేనే వీరకామినిని. రూపమున కూడ నేనే అధికురాలను. కనుక శ్రేష్ఠమైన ఈ వృక్షరాజము నాకే చెందుట యోగ్యము. ఇది యా శచికేల ?' అనుదానివలె సత్యభామ తన భర్తయైన కృష్ణుని గొనివచ్చి నీ ఉద్యానవనపుంపతి పారిజాతమును ఉత్సాహముతో అపహరించినది.)

ఇతరుల నేరములను గోరంతలు కొండంతలుగా కల్పించి తమ యజమానుల యెదుట అతిశయోక్తులతో వర్ణించు నీచ పరిచారక స్వభావము ఈ వన పాలకుల ఉత్ప్రేక్షతో కూడిన కవిత్వపు టల్లికలో స్పష్టమగుచున్నది.

30) యుద్ధమునకై ఇంద్రుని ప్రేరేపించుట కాతనిని సమీపించు శచీదేవి వర్ణనమెట్లున్న దనగా :

"స్తనకంపత్రుట్యదేకావళీ, గతిజవనిర్ముక్తమంజీరవాందో
ళనధ్వస్తకర్ణోత్పల, మవిరళఘర్మాంబుధౌతాంగరాగం,
ఘనపోష్ణశ్వాసలోలక, మదృఢకచస్రస్తమాల్యం, జయ మా
శ్వినెగం పౌలోమి బందళ్ కులిశగపజయశ్రీయె బర్పెందదిందం."

(౧౩-50)

(స్తనకంపత్రుటితమైన ఏకావళితో, గమనవేగస్రస్తమైన మంజీరముతో, అందోళన భారము వలన ధ్వస్తమైన కర్ణోత్పలముతో, అవిరళఘర్మాంబుధౌతమైన అంగరాగముతో, తీవ్రోష్ణ శ్వాసపలన చెదరిన అలకలతో, శిథిల బంధమైన కచము నుండి జారిన మాల్యముతో పౌలోమి కులిశాయుధుని అపజయశ్రీ సమీపించినట్లు సమీపించినది.)

ముందు జరుగనున్న యుద్ధములో ఇంద్రునకు 'చచ్చినంత పని' కానున్నది. కనుకనే శచీదేవి యందు వైధవ్య స్ఫోరకములైన అశుభ లక్షణముల పోలికలు తమకు తామే కలిగినవి.

31) దేవేంద్రుడు సామాన్య వీరుడు కాడు. అతనిని గెలుచుట కృష్ణునకైనను ఏమంత సులభము కాదు. ఈ భావమును రుద్రభట్టు రెండు పద్యములలో చాల అందముగ చెప్పినాడు.

'నరనీవజ్రీయసూను నాదనదటెం బిల్లుబ్లెర్మెయిం లోకదొ
ళ్పిరియం తానెనె వజ్రిగావనొ సమం బిల్బుత్మెయిం దెంబినం
శరదిందం శరమం నివారిసి మహాస్త్రక్కెచ్చు దివ్యాస్త్రమం
హరిశౌర్యం హరితోళిదం హరియసామర్థ్యక్కె సామర్థ్యమం.'

(౧౩-94)

('లోకమందలి విలుకాండ్రలో అర్జునుడు పేరెన్నిక గన్నవాడు. ఆ అర్జునుడీ దేవేంద్రుని కుమారుడనగా నిక శరపాటవములో లోకమున కంతటికి ఇంద్రుడే అధికుడు. అతనికి సమాను లెవరు?' అను విధముగ శరముతో శరమును, అస్త్రమునంతకు మించిన దివ్యాస్త్రముతోను నివారించు హరి

(సింహ) శౌర్యుడైన హరి [ఇంద్రుడు], హరి [కృష్ణుని] సామర్థ్యమునకు ప్రతిసామర్థ్యమును చూపెను.]

దేవేంద్రుడు 'జగదేక ధన్వియైన అర్జునుని అబ్బ' అని ఆతని శౌర్యమును చమత్కారముగ నిరూపించిన రుద్రభట్టు నేర్పు ప్రశంసనీయము.

32] ఇదే సందర్భము నందలి మరియొక పద్యము.

"అరిదత్తందిన రావణప్రముఖ దైత్యాధీశరం గెల్దుదీ
సురచక్రేశన నాంతు గెల్వుదరిదెం దాగళ్జయప్రాప్తియొళ్
హరిగం సంశయబుద్ధి యాదుదెనె బేఱుత్ప్రేక్షిసల్బేకె, వి
స్తరిసల్బేఱభివర్ణిసల్వవణె బాహావిక్రమం శక్రనా." [౧౩-95]

['నాడు రావణ ప్రముఖులైన దైత్యాధీశులను గెల్చుట ఒక కష్టమని పింపలేదు. నేఁడీ సుర చక్రేశ్వరుని గెల్చుట కష్టతరమగుచున్నది" అని కృష్ణునకే తన జయమునందు సంశయ బుద్ధి కలిగినదనగా, శక్రుని బాహావిక్రమమును ఉత్ప్రేక్షింపనేల? విస్తరించి వర్ణింపనేల ?]

ప్రతినాయకుని పరాక్రమము నధికముగా వర్ణించి, ఆతని జయించుట చేత నాయకుని ఉత్కర్షను వెల్లడించుట యొక గొప్ప నేర్పు.[1]

33] దేవేంద్రుడు ప్రయోగించిన వజ్రమును కృష్ణుడెట్లు పట్టివేసెననగా :

"పొళెపిం సిడిల్దు కెండద
మళెయం కఱెవెసకదిందె బర్పుదనాగళ్
ఘుళిలనె పిడిదం మించుం
బుఱువరి పిడువంతె వజ్రమం దనుజహరం." [౧౩-106]

[పిడుగులు కురియుచు, అగ్ని కణములను వర్షించుచు భయంకరముగా వజ్రము రాగా, దానిని దనుజహరుడు మిణుగురు పురుగును పట్టినట్లు పట్టెను.]

1. "వంశవీర్యశ్రుతాదీని వర్ణయిత్వారిపోరపి
తజ్జయాన్నాయకోత్కర్ష వర్ణనం చ ధినోతినః".—కావ్యాదర్శము. 1 21

పిడుగులను, నిప్పులను కక్కుచున్న వజ్రము కృష్ణుని చేతిలో మిణు గురు పురుగై పోయినదట. కృష్ణుని శక్తి ఎట్టిదో.

రుద్రభట్టు కావ్యములో ఇట్టి సరసమైన కల్పనలెన్నో యున్నవి. వానిలో నొక్కటైనను తిమ్మన స్వీకరింపలేదు. కనుక అతడు రుద్రభట్టు కావ్యము ననుసరించిన మాట యటుంచి చూచియైన యుండునా యని సందేహ మగుచున్నది.

**హరివంశము—పారిజాతాపహరణము**
**రచనా సాదృశ్యములు :**

రెండు గ్రంథములకు మధ్యగల జనకజన్య సంబంధమును నిర్ణయించు టలో కథాంశములకంటె 'రచన' కెక్కువ ప్రాధాన్యము నీయవలసి యున్నది. 'రచన' అనగా భావములు, పదములు, పదబంధములును- కథాంశములను సాక్షాత్తుగా గ్రంథమును చదివియే తెలిసికొననక్కరలేదు; వినికిడి వలన తెలిసి కొనవచ్చును; మొదటి గ్రంథము ననుసరించిన మరియొక గ్రంథమును చదివి తెలిసికొనవచ్చును. కథాంశములకంటె భావములును, భావముల కంటె పద ములు, పద బంధములును కేవలము వినికిడి వలన మనస్సునందు స్థిరముగా హత్తుకొనుట కష్టము. ఒక గ్రంథము నుండి మరియొక గ్రంథములోనికివి ఎక్కవలెనన్న, ద్వితీయ గ్రంథకర్త ప్రథమ గ్రంథమును బహు వారములు అధ్యయనము చేసినవాడై యుండవలెను. లేదా తన గ్రంథ రచనా సమయ మున ఆ పూర్వ గ్రంథమును తన యెదుట తెరచి యుంచుకొని యుండవలెను. రెండు గ్రంథముల మధ్య ఇట్టి రచనా సాదృశ్య మధికముగా కానవచ్చినపుడు వానిమధ్య జనక జన్య సంబంధమున్నట్టు గుర్తింపగలము.

తిమ్మన తన పారిజాతాపహరణ కావ్యములో హరివంశ కథాంశములను అనుసరించినట్లు గుర్తించి యున్నాము. అతడు హరివంశ మందలి భావము లను, పద బంధములను కూడ స్వీకరించిన సందర్భములను ఇప్పుడు గుర్తింతము.

1] హరివంశ మందలి పారిజాతాపహరణపు మలికథ ప్రారంభములో జనమేజయుడు వైశంపాయనుని కృష్ణ కథలను సవిస్తరముగా చెప్పుమని కోరి నట్లు కలదు.

"ప్రాదుర్భావే మునిశ్రేష్ఠ మాధురే చరితం శుభం
శృణ్వన్నైవాధిగచ్ఛామి తృప్తిం కృష్ణస్య ధీమతః
ద్వారకాయాం నివసతః కృతదారస్య షద్గుణమ్
చరితం బ్రూహి కృష్ణస్య విదితం హి సకలం తవ."

[ఉ౩-1, 2]

తిమ్మన కావ్యమందలి కథాభాగము కూడ సరిగా నిట్లే జనమేజయుని ప్రశ్నతోనే ప్రారంభమగుచున్నది.

"హరివంశకథలెల్ల నానుపూర్విగ నిట్లు
వినికృతార్థుఁడనైతి మునివరేణ్య
యా దానవారాతి యమరులఁ బ్రోవంగఁ
బూని యా యదువంశమున జనించి
యతఁడు గ్రమ్మఱ వారికాధారమగు పారి
జాతంబు పుడమికేరీతిఁ దెచ్చె
ననుమతినిచ్చిరో యావేల్పు లొండేని
బలిమిఁ జేకొనియెనో పాడి దొఱఁగి
తెలియ నానతి యిమ్ము సందియము తీఱ
వినఁగ వేడుక యయ్యె సవిస్తరముగ." (I 36)

మూలము నందలి జనమేజయుని ప్రశ్నలో పారిజాతమును గురించిన ప్రస్తావన లేదు. 'కృష్ణుని చరిత్రము'ను చెప్పుమని మాత్రమే కలదు. తిమ్మన 'పారిజాతాపహరణము'ను ప్రత్యేకించి పలికించినాడు. 64వ అధ్యాయమున జనమేజయుడు పారిజాతహరణ వృత్తాంతమును సంగ్రహముగ వినియే యున్నాడు. కనుకనే తిమ్మన జనమేజయునిచే 'సవిస్తరముగ' చెప్పుమని పలికించినాడు. అంతేగాక సంగ్రహ కథలో ఇంద్రుడు పారిజాతాపహరణము నంగీకరించి మిన్నకుండెనను కథాంశమును చూచియుండినవాడు కనుకనే 'అనుమతి నిచ్చిరో యా వేల్పులు' అను ప్రశ్నను వేయించినాడు. తిమ్మన హరివంశము నందలి 64వ అధ్యాయమును చూచియుండనిచో ఈ ప్రశ్నను

గాని 'సవిస్తరముగ' అను పదమును గాని జనమేజయునిచే వలికించి యుండెడివాడు కాడు.

2) నారదుడు పారిజాత పుష్ప మహిమను రుక్మిణికి తెలుపు సందర్భ మున దానిని ధరింపగల దేవకామినుల పేర్లను చెప్పినాడు :

ఉమా దేవవరస్యేష్టా హిమాలయసుతా సతీ
ధారయంతీశ్వరీ నిత్యం పుష్పాణ్యేతాని సుప్రభే
అదితిశ్చ సపౌలోమీ మహేంద్ర సురతారణీ
సావిత్రీ దేవమాతా చ శ్రీశ్చ సర్వగుణోచితా. (ఉ౫-33, 34)

తిమ్మన కూడ ఇవే పేర్లను చెప్పి యున్నాడు :

పౌలోమి పార్వతి పద్మ పద్మజు రాణి
యును శిరంబునఁ దాల్తు రనుదినంబు (I. 58.)

వృద్ధురాలని కాబోలు తిమ్మన అదితి పేరును మాత్రము వదలినాడు. త్రిమూర్తుల యొక్కయు, దేవేంద్రుని యొక్కయు ఇల్లాండ్ర పేర్లు చెప్పి యున్నాడు. శచీదేవికి 'పౌలోమి' యను పేరును తిమ్మన ప్రయోగించుట హరివంశ మాతృకా ప్రభావము వలననే.

3) ఇదే సందర్భమున పారిజాత పుష్పమును దేవకాంతలు మాత్రమే ధరింపగలరని నారదు డనినాడు :

దేవపత్న్యస్తథైవాన్యా దేవ్యశ్చ వసుదేవతాః. (ఉ౫-35)

తిమ్మన ఇదే భావమును కొద్దిగా మార్చి ఇది మానవులకు అలభ్యము అని తెలిపినాడు.

జలజాక్షి యిది పారిజాత ప్రసూనంబు
నరులకు ధరియింప నరిది చూవె. (I. 58.)

4) అదే సందర్భమున రుక్మిణి కృష్ణున కత్యంత ప్రియురాలనుటకు పారిజాత ప్రదానమే తార్కాణయని నారదు డనుచున్నాడు.

"అద్యేష్టాం వాసుదేవస్య వేద్మి త్వాం భోజనందిని ....
.... .... .... ....
మందారకుసుమం దత్తం యత్తే మధువిఘాతినా
అద్యాహమవగచ్ఛామి సర్వదా సర్వశోభనే
ఆత్మా ద్వితీయః కృష్ణస్య భోజ్యే త్వామితి భామిని
త్రైలోక్యరత్న సర్వస్వం అదదాద్యత్తవాచ్యుతః
జీవితాతిశయస్తేన త్వయా ప్రాప్తో హరిప్రియే. (ఉ౫-37-43)

తిమ్మన కూడ ఇదే తార్కాణను ఇట్లే చూపినాడు.

"హరి బహిఃప్రాణంబవగుట నేఁడెఱుగంగ
వచ్చె నీకిపుడిది యిచ్చెఁ గాన". (I. 58)

'ఆత్మా వ్వితీయః' అనునదే 'బహిఃప్రాణ' మైనది. 'ఇపుడు' తెలియవచ్చె ననుటకు మూలమున ఒకటికి రెండుమార్లు నొక్కి చెప్పబడిన 'అద్య'యే కారణము.

5) అదే సందర్భమున పదునారువేల సపత్నులలో రుక్మిణి ఆధిక్యము నిట్లు ప్రశంసించుచున్నాడు.

"షోడశస్త్రీ సహస్రాణాం మధ్యే ఖల్వద్య వర్తసే
— — — — —
ప్రకాశమద్య సౌభాగ్యం అనివార్యం యశశ్చ తే."
(ఉ౫. 36, 38)

తిమ్మన కూడ ఇదే భావమును చెప్పించినాడు.

"వెలఁదులు పదియాఱు వేవురలోనెన్న
సరిలేరు సౌభాగ్య గరిమ నీకు (I. 58)

మూలము నందలి 'సౌభాగ్య' పదమును తిమ్మన స్వీకరించినాడు.

6) రుక్మిణి ధరించుటచే పారిజాతము ధన్యమైనదనుచున్నాడు :

అలంకృతం పుష్పమేతత్సంసర్గాత్తవ సర్వథా. (ఉ౫-19)

తిమ్మన కూడ ఇదే భావమును పలికించినాడు.

నీవు తాల్చిన కతన నీపూవు నేఁడు
భాగ్యము వహించె నుచితోప యోగ్యవృత్తి. (I. 58)

7) ఇదే సందర్భమున పారిజాతము కోరిన సువాసనల నొసంగ గల దని చెప్పుచున్నాడు :

"ఈప్సితానపి గంధాంశ్చ దదాతి వదతాం వరే
స్రవత్యపి తథా గంధాన్ ఈప్సితాన్ ప్రీతివర్ధనాన్."
(ఉ.ప. 21, 23)

తిమ్మన నారదునిచే ఇట్లు పలికించినాడు :

'ఈప్సితార్థంబు నొడఁ గూర్చునిది లతాంగి'. (I. 58)

తిమ్మన 'గంధము'లను గూర్చి చెప్పింపలేదు. కాని తిమ్మన ప్రయోగించిన 'ఈప్సిత' శబ్దము మూలమున రెండుమార్లున్నదే.

8) ఇదే సందర్భమున పారిజాతము ఎన్నటికిని వాడదనుచున్నాడు.

'అమ్లానమేతత్సతతం పుష్పం భవతి మానిని.' (ఉ.ప-20)

తిమ్మన కూడ ఇదే భావము చెప్పినాడు.

పరిమళము సెడదు వాడదు
పరువము దప్పదు పరాగభరభరితంబై
నిరతము జగదేక మనో
హరమగునీ కుసుమరాజమంబుజవదనా. (I. 59)

9) ఇదే సందర్భమున పారిజాతము సరసాన్నముల నొసగు ననుచున్నాడు.

స్రవత్యతిరసాన్ దేవి మనసా కాంక్షితాన్ వరాన్
బుభుక్షా వా పిపాసా వా గ్లానిర్వ్యాప్యథవా జరా
దేవవద్ధారయంత్యాస్తే స్వచ్ఛందేన భవిష్యతి. (ఉ.ప. 22-29)

తిమ్మన నారదునిచే ఇట్లనిపించినాడు.

అడిగిన యంతలోన సరసాన్నములన్ సమకూర్చునాఁ కటన్
బడలిక చెందనీక — — (I. 61)

తిమ్మన జరాగ్లానులను చెప్పలేదు. కాని "బుభుక్ష"ను "ఆకలి" యని అనువదించినాడు. తిమ్మన "సరసాన్నములు" మూలము లోని "అతిరస" ములే.

10) ఇదే సందర్భమున పారిజాతము శీతోష్ణ సమస్థితి ని చ్చు న ను చున్నాడు.

"శీతోష్ణే చేచ్ఛితే దేవి పుష్పమేతత్ప్రియాస్యతి." (౬౫-22)

తిమ్మనకూడ ఇదే భావమును విపులీకరించి చెప్పించినాడు.

నెలకొని వేసవిఁ జలువయుఁ
జలివేళల నుష్ణగుణము సముచితభంగిన్
గలిగించు నీలతాంతము .... (I. 63)

11) సంవత్సరము తరువాత పారిజాత పుష్పము తిరిగి చెట్టునకే చేరునట.

పూర్ణే సంవత్సరే దేవి పుష్పమేతత్తవాంతికాత్
నిర్వృత్త్స్యతే తరువరం సమయేన ప్రయాస్యతి
— — — —
సంవత్సరపరఃకాలః సర్వేషాం నతు సంశయః (౬౫. 31, 35)

ఈ మాటనే తిమ్మనకూడ చెప్పించినాడు.

ధరియించిన మొదలొక వ
త్సర మాత్రము తావకీన ధమ్మిల్లములో
నిరవుకొని మగుడ నివ్విరి
తరుణీ యల పారిజాత తరువున కరుగున్. (I. 67.)

12) నారదుని మాటలను కృష్ణుని ఇతర పత్నుల చెలికత్తెలు స్వయముగనే విని పోయి తమ తమ యజమానురాండ్రకు చెప్పిరట.

"తచ్చ శ్రుత్వా సునిఖిలం ప్రేష్యాభిః స్త్రీస్వభావతః
ప్రకాశీకృతమేవాసీత్ విష్ణోరంతఃపురే తదా." (౬౫-46)

తిమ్మన కూడ ఇట్లే చెప్పి యున్నాడు.

"అనుచు నారదుఁ డాడిన యట్టి పలుకు
లచటి వృత్తాంత మంతయు నరసిపోయి
వేఱువేఱన సఖులు దేవేరులకును
విన్నవించిన — — " (I. 68)

13) 'హరివంశ కారుడు' సత్యభామ నిట్లు వర్ణించుచున్నాడు :

"సత్యభామా ప్రియా నిత్యం విష్ణోరతుల తేజసః
రూపయౌవన సంపన్నా స్వసౌభాగ్యేన గర్వితా
అభిమానవతీ దేవీ — — " (౬౫. 49, 50)

తిమ్మన వర్ణన ఇట్లున్నది :

"వారిలోపల సౌందర్యవతియు మాన
వతియు మహనీయ సౌభాగ్యవతియు నైన
సత్య — — — " (I. 70)

మూలము నందలి 'రూపము' అనువాదములో 'సౌందర్య' మైనది. 'మానవతి', 'సౌభాగ్య' పదములు మూలము నుండి యథాతథముగ గ్రహింప బడినవి.

14) సత్యా మందిరమున ప్రవేశించుచు కృష్ణుడు సేవకుని వాకిటి యొద్దనే నిలిపివాడట.

"సేవకం ద్వారదేశే తు తిష్ఠేత్యుక్త్వా" (౬౬-5).

తిమ్మన కూడ సరిగా ఇదే మాట చెప్పినాడు.

— తద్ద్వారసీమ
దారుకుని నుండ నియమించి " (I. 105)

మూలములోని అనామక సేవకుడు కృష్ణుని సారథియైన దారుకుడేనని తిమ్మన చెప్పినాడు. 'ద్వార' యను పదము గమనింపదగి యున్నది.

15) సత్య నోదార్చుచు కృష్ణుడు త్రికరణశుద్ధిగా ఆమెనే ప్రేమించుచుంటి ననుచున్నాడు.

"మనసా కర్మణా వాచా న త్వామతిచరామ్యహమ్" (౬౬-41)

తెలుగులో కూడ 'త్రికరణముల' ప్రసంగమున్నది.

"మనమున మాటలం గ్రియలమన్ననలీ నొకనాఁడు నెట్టికా
మినులకు" — — (I. 118)

16) కృష్ణుడు ఇతర పత్నులను ప్రేమింపడట.

"బహుమానోప్యపమాన్యాసు స్త్రీషు సర్వాసు శోభనే
స్నేహశ్చ బహుమానశ్చ త్వామృతేఽన్యాసు నాస్తి మే."
(౬౬-42).

దీనికి తిమ్మన యనువాదమిది :

" — గౌరవంబు మెఱమెచ్చులకై పచరింతుఁగాని పా
యని యనురక్తి నీయెడన యగ్గలమై కనుపట్టు నాకు" (I. 118)

17) తాను కావించిన అపరాధమేమని అడుగుచున్నాడు :

"కిమకార్షమహం దేవి విప్రియం తవ భామిని" (౬౬-40)

తిమ్మన కూడ ఇదే ప్రశ్న వేయించినాడు.

"నాయెడ నిక్కము తప్పు గల్గెనో." (I. 116)

18) 'నాతో నేల మాట్లాడవు?' అని ప్రశ్నించుచున్నాడు.

"పూర్ణచంద్ర సపత్నేన స్మేరేణ బహుభాషిణా
కిమునా భాషసే మాద్య ముఖేనోత్పల గంధినా." (౬౬-36)

తిమ్మన కూడ ఇదే ప్రశ్న వేయించినాడు :

'పలుకులఁ దేనెలుట్టిపడఁ బల్కవు నేఁడిది యేల?' (I. 117)

19) "నన్ను అరకంటనైన చూడవేమి?" అని వాపోవుచున్నాడు.

"అర్ధాక్ష్ణాపి హి తావన్మాం కిమర్థం న నిరీక్షసే." (ఉఉ-37)

ఇదే ప్రశ్న తెలుగులో కూడ నున్నది.

" .... వాలుగ, న్నుల నునుసిగ్గు లూల్కొనఁ గనుంగొనవేల?"
(I. 117)

అరకన్నులు విలాసముగా వాలుకనులైనవి.

20) కృష్ణుని నమ్మినందులకు తనకు తగిన శిక్షయే లభించినదని సత్య పలుకుచున్నది.

' ... దృష్టః స్నేహఫలోదయః' (ఉఉ-52)

ఇదే వ్యంగ్యము తెలుగులో కూడ కనుపించుచున్నది.

'నిను నమ్మియుండిన ఫలంబిది తోడనె కల్గె నాకు.' (I. 125)

'ఫల'మను పదము ఉభయ సామాన్యమగుట గుర్తింపదగి యున్నది.

21) 'తన పేరెత్తనేల' అని రోషముతో ననుచున్నది.

"దుర్భగోయం జనస్తత్ర కిమర్థమనుశబ్దితః' [ఉఽ-11]

తెలుగులోను ఇదే ప్రశ్న కలదు.

'ఆమతకరి వేలుపుందపసి మమ్ముఁ దలంపఁగ నేల నచ్చటన్.'
[I. 84]

తెలుగులో సమయ సందర్భములు కొద్దిగా మారినవి. మూలములో కృష్ణుని ఎదుట పలికిన మాటలు అనువాదములో చెలికత్తె ఎదుట పలికింపబడినవి.

22) సత్యా కోపము సుపశమింపజేసిన పిదప కృష్ణుడు స్నానము గావించెను.

"తతః స్నాతో జగన్నాథః సర్వేశః సర్వభావనః" [ఉఽ-38]

తిమ్మన ఈ స్నాన భోగమును 9 పద్యములలో విస్తరించినాడు.

"తలిరాకుఁబోఁడి యొక్కతె ...
... నీరాజనముల్." [II 5-13]

23] నారదుడు సత్యా మందిరమున కరుదెంచుటకు ముందు సముద్రములో స్నానము చేసి వచ్చెనట.

'అభ్యాజగామ స స్నాత్వా మునిశ్రేష్ఠో మహోదధౌ.' [౬౭-38]

తిమ్మన కూడ నారదుని స్నానమును చెప్పినాడు.

"చనుదెంచెగ లహభోజన
ముని రుక్మిణి వీడుకొల్ప మున్నీటిజలం
బున మజ్జనాది మాధ్యం
దినకృత్యము లాచరించి" ... [II. 16]

ఇచట నారదుని స్నానము 'సముద్రము' నందని చెప్పుటను కూడ తిమ్మన మరువలేదు.

24) నారదుడు తనకు మ్రొక్కిన సత్యను దీవించుచు 'నా తపసు వలన నీవు సౌభాగ్యవతివై యుండు' మనుచున్నాడు.

"స విశేషం చ సుభగా భవ మత్తపసో బలాత్.' (౬౭-45.)

తిమ్మనగారి నారదు డిట్లనుచున్నాడు :

" .... నీకు మగడు గోరిన కోర్కుల్
ఘటియించుగాక తానెం
తటి కార్యంబైన డించి నా దీవనలన్." (II. 2)

దీవెనలకు బలము నిచ్చునది తపస్సే గదా.

25) అమరావతి కేగుదారిలో సత్యాకృష్ణులు మేరుగిరిని చూచిరట.

"స మేరుగిరిమాసాద్య దేవగంధర్వ సేవితమ్." (౬౮-48)

తిమ్మన మేరు పర్వత వర్ణనను నాలుగు పద్యములలోను, ఒక దీర్ఘ వచనములోను విస్తరించి రచించినాడు. (II. 85-89)

26) అనేక దేవతా మందిరములను కూడ చూచిరట.

'దేవసద్మాని సర్వాణి దదర్శ మధుసూదనః' (౬౮-48)

తిమ్మన ఈ నాకలోక వర్ణనను 6 పద్యములలో (II. 95-100) చేసి యున్నాడు.

27) పారిజాతముతో ద్వారక కరుదెంచిన పిమ్మట కృష్ణుడు దేవకీ వసుదేవులకు, బలరామునకు, ఇతర వృద్ధులకు నమస్కరించినాడట.

"వసుదేవం మహాత్మానం దదృశే దేవకీం తథా
కుకురాధిపతిం చైవ బలం భ్రాతరమేవచ
వృద్ధాంశ్చ యాదవానాం యే మానార్హా నమరోపమాన్."
(౪౫. 60-61)

తిమ్మన కూడ కృష్ణునిచే వీరందరకు పేరుపేరున మ్రొక్కించినాడు.

వరభక్తి దేవకీ వసుదేవులకు మ్రొక్కి
బలభద్రునకు నట్ల ప్రణతి సేసి
గురు పురోహిత బంధుకోటికి వినయంబు
గావించి మిత్రులఁ గౌగిలించి.' .... (V. 49)

28) పారిజాత లాభమునకు సత్య సంతోషించినదట.

'సా దేవీ పూజయామాస ప్రహృష్టా వాసవానుజం' (౭౫-64)

తిమ్మనగారి సత్యకూడ సంతోషించినది.

.... అద్దేవి హర్షమంది' (V. 49)

'ప్రాణవిభుఁ బెక్కుమాఱులు ప్రస్తుతించి' [V. 50]

సత్య సంతోషించినదనుటలో విశేష మేమియు లేదు. కాని మూలమందలి 'ప్రహృష్టా' అన్న పదమే అనువాద మందలి 'హర్ష'మునకు మాతృక యనుట విశేషము. సత్య కృష్ణుని పూజించుటయో, ప్రస్తుతించుట కూడ విశేషమే.

29) పారిజాత తరువొకప్పుడు ద్వారక నంతటిని కప్పి నీడ నొసగెడిదట.

'కదాచిద్ద్వారకాం సర్వాం ప్రచ్ఛాదయతి భారత.' [౭౫-66]

దీనికి చక్కని అనువాదమది.

'విరివిగా నొకవేళఁ బెరిగి వీటికినెల్ల
నిజశీతలచ్ఛాయ నిగుడఁజేయు." [V. 52]

30] అట్లే ఒకప్పుడు అంగుష్ఠమాత్రమయ్యెడిదట.

'కదాచిద్ధ_స్తధార్యస్తు భవత్యంగుష్ఠ సన్నిభః' [౭౨-66]

దీనికిది ముచ్చటయిన అనువాదము.

'పిన్నగా నొకవేళఁ బెనుబ్రేలియంతమై
చూడ్కులకెంతయు వేడ్క సేయు.' [V. 52]

31] పారిజాతమున సర్వ పుష్ప జాతులును ప్రభవించునట.

'సర్వపుష్పాణి దృశ్య_న్తే తస్మిన్నేవ మహాద్రుమే.' [౬౭-63]

ఇది పారిజాతాపహరణమునకు ముందు నారదుడు సత్యా మందిరమున గావించిన వర్ణన. దీనిపై తిమ్మన అల్లిన అల్లికలు.

'వినుమింతుల్ దిలకంబుఁ జంపకముఁ గ్రోవిన్సిందువారంబుఁ బ్రేం
కనమున్మామిడి గోఁగుఁ బొన్నఁ బొగడం గంకేళి నూహించి క
న్గొన మోమె_త్తఁగఁ గౌఁగిలించికొన నూర్కొఁ బాడఁ జేనంటఁ బ
ల్కనగం గల్గుమియంగఁ దన్న ననుచుం గల్పాగ మాయావిరుల్'
[IV. 9]

'కనఁ దిలకంబుఁ, గేసరముఁ గల్గుమియ, న్నహిఁ బాడఁ బ్రేంకనం
బు, నిమురఁ మావి, నవ్వ సురపొన్న, ముఖాంబుజ మె_త్తఁ జంపకం
బు, నెఱగవుంగిలం గొరవి, నూర్కొన వావిలి, దన్న వంజుళం
బు, నుడువ గోఁగునై తరుణి పూచు సురద్రుమమన్ని పువ్వులన్.'
[IV. 10]

"వింతగా నొకవేళ వివిధ భూరుహ పుష్ప
సురభి గంధంబుల సోడుముట్టు." [V 52]

పై 'వినుమింతుల్ — ' పద్యములో ఆయా పుష్పములను 'ఊహించుట' చెప్పబడినది. అనగా పారిజాతము కోరిన పుష్పముల నొసంగు ననుట.

ఈ భావము కూడ అమూలకము కాదు. రుక్మిణికి పారిజాత మహిమను వర్ణించు సందర్భమున నారదు డిట్లని యున్నాడు :

"యాని యాని చ పుష్పాణి త్వం దేవ్యభిలషిష్యసి
కుసుమం దేవరాజస్య తాని తాని ప్రదాస్యతి.' [ఉ.ఇ-24]

ఒకచోట పుష్పమునకు చెప్పబడిన మహిమయే మరొకచోట వృక్షమునకు చెప్పబడినది.

32) పారిజాతము కోరిన రూపము దాల్చునని తిమ్మన చెప్పినాడు.

'అభిలషించిన రూపంబు నభినయించు.' [V. 52]

దీనికి మూలము పరంపరిత సంబంధము గలిగి యున్నది. పారిజాత పుష్ప మహిమను రుక్మిణికి నారదు డిట్లు చెప్పియున్నాడు :

'యద్యదిచ్ఛసి వర్ణం చ తత్సర్వం ధారయిష్యతి.' [ఉ.ఇ-26]

33] పారిజాతమును దర్శించినంత మాత్రమున ద్వారకావాసులందరకును మహైశ్వర్యములు లభించినవట.

'తం దివ్యకుసుమం వృక్షం దృష్ట్వా నర్త వివాసినః
రాజన్నతత్ర్పపుర్హృష్టాః పశ్యమానా మహోదయమ్.' (ఉ.ఇ-54)

ఆ మహోదయమును తిమ్మన విపులముగా నిట్లు వర్ణించినాడు :

'ఆ మహిజాతముం గనిన యంతటిలో ధనధాన్యరాశితో
సామజ ఘోటికామహిత శాలలతో మణిసౌధ పంక్తితో
గోమహిషీ శతాంగ భటకోటులతో మణిభూషణాలితోఁ
జామర తంపరై తనరెఁ దత్పురిఁ గింపచ గేహవాటికల్.'

(V. 45)

34) వృద్ధులు మరల యువకులైరట.

'వృక్షోత్తమం పశ్యతాం వై వృద్ధానామగమజ్జరా.' (ఉ.ఇ-55)

తిమ్మన కూడ ఈమాట చెప్పినాడు.

" — — వృద్ధాలికిం.

మరలం బ్రాయము వచ్చెఁ దత్తరుచల న్మందానిలా సంగతిన్"
(V. 46)

35) పారిజాతపు వాసన సోకిన వికలాంగులు, రోగులు స్వస్థులైరట.

"యేత్వన్ధచక్షుష స్సర్వే తేఽభవన్ దివ్యచక్షుషః
విరోగా రోగిణశ్చాసన్ ఘ్రాత్వా గంధం వనస్పతేః." (౭౨-56)

తిమ్మన కూడ ఈ విషయమును తెలిపినాడు.

"విననేర్చిరి బధిరులు గనుఁ
గొననేర్చిరి యంధకులు లఘుత్వము మీఱన్
జననేర్చిరి వికలాంగకు
లనిమిషతరు కుసుమ సౌరభావేశమునన్." (V. 47)

36) నారదుడు రుక్మిణికి పుణ్యక వ్రత విధానము నుపదేశించుచు ఇట్లనుచున్నాడు :

"స్నాత్వా స్త్రీ ప్రాతరుత్థాయ పతిం విజ్ఞాపయేత్సతీ
ఉపవాసార్థ మథవా వ్రతకార్థం పతివ్రతే.
శ్వశురాభ్యాం చ చరణౌ సతతం సత్తమస్య చ
గ్రహాయ" — — [౭౮. 18-19]

తిమ్మన నారదునిచే సత్యకు ఇదేవిధముగ చెప్పించినాడు.

"తెలతెలవాఱ మౌననియతిన్నదికిం జని తీర్థమాడి
— — —
— — అత్తమా
మలకును నాత్మభర్తకు నమస్కృతి సేసి తదీయ సమ్మతిన్."
[V. 56]

37) సత్యా పుణ్యక వ్రతమునకు చేయబడిన సంభారసేకరణ హరివంశములో ఇట్లు చెప్పబడినది :

"యాని ద్రవ్యాణి కౌరవ్య జంబూద్వీపే తు కానిచిత్
యోగ్యాని తాని కృష్ణేన సంభృతాని మహాత్మనా. [౭౨-68]

దీనికి అనువాద మిట్లున్నది.

"నగముల నదులఁ బయోధుల
దిగంతములఁ గాననముల దీవుల మఱియుం
దగునెడలఁ బుణ్యక వ్రత
జగదుత్సవమునకు వచ్చె సంభారంబుల్" [V. 65]

"ద్వీప" 'దీవి' శబ్దముల, 'సంభృత' 'సంభార' శబ్దముల జనకజన్య సంబంధము గుర్తింపదగి యున్నది.

38] ప్రధానదాన ప్రతిగ్రహీతగ నొక బ్రాహ్మణోత్తముని నియమింప వలె ననుట.

"తతో ద్విజం శుచిం దాంతం జ్ఞాన విజ్ఞానకోవిదం." [౭౯-21]

దీనికి తెలుఁగు

"పరమాచారధురీణు నధ్యయన సంపన్నున్ —
— భూసురవరుం బ్రార్థించి — " [V. 59]

39] దాన ప్రతిగ్రహార్థము నారదుడు ప్రార్థింపబడుట.

"ఆజగామ మునిశ్రేష్ఠో నారదో వదతాం వరః
సంపూజయిత్వా విధివద్వాసుదేవో విశాంపతే
ప్రతిగ్రహార్థం విధివత్ శ్రీమాన్ భక్త్యా న్యమంత్రయత్.
[౮౦-1, 2]

తిమ్మన కూడ ఇదేమాట చెప్పియున్నాడు.

"వ్రత కల్పోచిత దాన
ప్రతిగ్రహార్థముగ నిఖిల పరిషదనుజ్ఞన్
గృతనిశ్చయుఁడై సవినయ
నతితో సమ్మతిలఁజేసె నారద మౌనిన్" [V. 69]

"ప్రతిగ్రహార్థం" అను పదబంధము యథాతథముగ స్వీకృతమైనది. రెండుచోట్లను నారదుని కోరినవాడు కృష్ణుడే.

40] సత్య కృష్ణుని పారిజాతమునకు పూలదండతో కట్టివేయుట.

"పుష్పదామావసజ్యాథ కంఠే కృష్ణస్య భామినీ
బబంధ కృష్ణం సుభగా పారిజాతే వనస్పతౌ" [౭౬-5]

తెలుగులో కూడ పూలదండతోనే కట్టివేసినది.

" — క్రొవ్విరుల దండఁ దగుల్కొనఁ జుట్టె వేడ్కఁగ
ల్పనగముఁ గూడ — " [V. 79]

41] దానముగా నీయబడుటకు కృష్ణుని అనుమతిని సత్య గై కొనినదట

"తతోనుజ్ఞాప్య కేశవం" — [౭౬-6]

తెలుగులో కూడ నీ అనుమతి గై కొనుట కలదు.

'వికచాబ్జనేత్ర — ధారవోయు మనినన్.' [V. 82]

42) సత్య కృష్ణుని ధారా పూర్వకముగ దానము చేసినదట.

"అద్భిర్దదౌ నారదాయ — " (౭౬-6)

తెలుగులో కూడ ధారా పూర్వకముగ నిచ్చుట కలదు.

" — నిజప్రాణేశుఁగూడ న్నుప
ర్వముని శ్రేష్ఠునకిచ్చె దానముగ ధారా పూర్వమువ్వేళ" (V. 82)

43) గోదాన, హిరణ్య దానాదులు కూడ చేయబడినవట.

"దేవీ ధేను సహస్రం చ కాంచనస్య తు పర్వతం
హిరణ్యరూప్య మిశ్రం చ మణిరత్న ప్రభస్య చ
తిలమిశ్రస్య తథా ధాన్యైరన్యై ర్యుతస్యచ' (౭౬-6, 7)

దీనికి తెలుగిట్లున్నది :

"ధారవోసి యపుడు తద్వ్రతాంగంబుంగా
దానమిచ్చెనపుడు తలిరుఁ బోడి
మణిసువర్ణ ధాన్యమయ పర్వతంబులు
గోసహస్ర వాజి కుంజరములు." (V. 83)

"సహస్ర" "పర్వత" "ధావ్య" శబ్దములు ఉభయ సామాన్యములుగా నున్నవి.

44) నారదుడు కృష్ణునితో నిట్లనుచున్నాడు.

'భోః కేశవ మదీయస్త్వం అద్భిర్దత్తోసి సత్యయా.' (౭౬-9)

తెలుగు నారదుడు కూడ ఇదేమాట ననుచున్నాడు.

'సత్యముగ నిన్ను నిప్పుడు
సత్యాసతి మాకు నిచ్చె' (V. 85)

45) నేను చెప్పిన పనులెల్ల చేయుమని ఆజ్ఞాపించుచున్నాడు.

"త్ర త్వం మామనుగచ్ఛస్వ కురు యద్యద్బ్రవీమ్యహమ్" (౭౬-9)

తెలుగులో కూడ ఇదే మాట.

"ఇక మాయ భీప్సిత
కృత్యంబులు సలుపుమనుచుఁ గేళిపరుండై." (V. 85)

46) నారదుడు కృష్ణునిచేత వినోదార్థము సేవలు గొనినాడట.

'వ్రజన్త మనువవ్రాజ నారదం చ జనార్దనః
పరిహాసం బహువిధం కృత్వా మునివరస్తథా' [౭౬-10]

ఈ పరిహాసములను వివరముగా తిమ్మన తెలిపినాడు.

'మేళవించినవి సుమ్మా దీనిమెట్లని
మాంస లాంసంబున మహతిఁ జేర్చి

— — — — —
— — — — —
— — — — —

పొమ్ము పొమ్మని యొకకొంత పోవఁ బోవ
రమ్ము రమ్మని మరలఁ జేరంగఁ బిలిచి
కపట నటనా పరుండైన కంసవైరిఁ
బరమముని నవ్వులాటకుఁ బనులు గొనియె" (V. 86)

'పొమ్మ' 'రమ్మ' అనునది 'వ్రజంతమనువ్రాజ' అనుటకు భావాను సరణ. తక్కిన పద్యమంతయు "పరిహాసం బహువిధం" అనుటకు విపులీకరణ.

పైన చెప్పబడిన భావములు, పద బంధములలో నొక్కటియైనను జగ న్నాథ విజయము నందు లేవు. తిమ్మన హరివంశమునే అనుసరించి యుండనిచో ఇన్ని సమానాంశములు పొందుపడి యుండుట అసంభవము. ఇట్లు తిమ్మన సంస్కృత హరివంశ మూలమునే అనుసరించినాడని నిరూపిత మగుచున్నది.

విష్ణు పురాణము—పారిజాతాపహరణము
రచనా సాదృశ్యములు :

హరివంశమును వలెనే విష్ణు పురాణమును కూడ తిమ్మన పారిజాతాప హరణ రచనలో అనుసరించి యున్నాడని ఊహించియున్నాము. విష్ణు పురాణ పారిజాతాపహరణములకు గల కథాంశ సాదృశ్యములను కూడ గమనించి యున్నాము. హరివంశ, పారిజాతాపహరణములకు వలెనే, ఈ రెండు గ్రంథ ములకును గల రచనా సాదృశ్యములను ఇప్పుడు గుర్తింతము.

1] పారిజాత వృక్షమును చూడగనే సత్య కృష్ణునితో పలికిన మాట లుగా విష్ణు పురాణములో ఇట్లు కలదు.

యది చేత్త్వద్వచః సత్యం త్వమత్యర్థం ప్రియేతి మే
మద్గేహనిష్కుటార్థాయ తదయం నీయతాం తరుః [30-34]

తిమ్మన రచనలో ఈ భావమే ఇట్లున్నది.

" .... నీ పలుకుఁ బంతము సెల్ల మదీయగేహకే
ళీ వనవాటి వేడుక దలిర్పఁగ నిల్పుము జీవితేశ్వరా." [IV. 11]

కథా ప్రణాళికలో గల భేదము వలన తిమ్మన "పంతము"ను అదన ముగా చెప్పించినాడు. పారిజాతమును చూడగనే సత్య దానిని పెకలించుమని కృష్ణుని తొందర పెట్టుటయు, "మద్గేహ నిష్కుట" "మదీయగేహకేళీవనవాటి" పద బంధముల పోలికయు గమనింపదగి యున్నది.

17)

2] నందన వన పాలకులు కృష్ణుని పారిజాతాపహరణమును నిరోధించుచు ఇట్లనుచున్నారు :

'ఉత్పన్నో దేవరాజాయ దత్తస్సోపి దదౌ పునః
మహిష్యై సుమహాభాగ దేవ్యై శచ్యై కుతూహలాత్." [30-40]

ఈ విషయమునే తిమ్మన కూడ ఇట్లు చెప్పించినాడు :

"....దివిజాగ్రణి దీని నిచ్చె దక్కుగ నిజకాంతకు" [IV. 56]

3] అదే సందర్భమున ఇంకను ఇట్లు బెదరించుచున్నారు.

[ .... న క్షేమీ గృహీత్వైనం గమిష్యసి." [30-41]

తిమ్మన కూడ దాదాపు ఇదే భావము నిట్లు పలికించినాడు.

" .... బలభేదివిన్న మేలే నీకున్." [IV. 57]

4] వన పాలకులను ధర్షించుచు సత్య ఇట్లనుచున్నది :

'కా శచీ పారిజాతస్య కో వా శక్రస్సురాధిపః
సామాన్యస్సర్వలోకస్య యద్యేషోమృతమన్థనే
సముత్పన్నః తరుః కస్మాదేకో గృహ్ణాతి వాసవః
యథా సుధా యథై వేందుః యథా శ్రీర్వనరక్షిణః
సామాన్యస్సర్వలోకస్య పారిజాత స్తథా ద్రుమః. [30-45-47]

పైదానికి అనువాదప్రాయమైన మాటలనే తిమ్మన సత్య చే పలికించినాడు :

వినుఁడు సురేశ్వరవనపాలకులు వార్ధిఁ
బొడమిన యీ దివ్య భూరుహమున
కింద్రాణి యెవ్వతె? యింద్రుండు నెవ్వఁడు?
తోడి యిందిరను కౌస్తుభము నెవ్వఁ
డధిపుఁడై ధరియించె నతఁడే చేకొనుఁగాక
తెకతేర యిది యేమి యొకరి సొమ్మె?" (IV. 59)

"కా శచీ పారిజాతస్య కో వా శక్రః" అనుటకు సరియగు అనువాదము 'ఈ దివ్య భూరుహమున కింద్రాణి యెవ్వతె, యింద్రుండు నెవ్వఁడు?' పారి

జాతము సముద్ర జన్యమైనదను భావము కూడ ఉభయ సామాన్యము. 'ఇది సర్వలోక సామాన్య' మను మూలమందలి భావమునకు ప్రతిధ్వనియే "ఇది యేమి యొకరి సొమ్మె?" అను మాట.

5) ఇంకను సత్యభామ శచీదేవి నుద్దేశించి ఇట్లు 'సవాలు' చేయు చున్నది.

"యది త్వం దయితా భర్తుః యది వశ్యః పతిస్తవ
మర్త్య ర్త్యుర్హరతో వృక్షం తత్కారయ నివారణమ్." (30-50)

దీని అనువాద మిట్లున్నది :

'పలుకు లేటికిఁ దా వీరపత్నియేని
మా శచీదేవి తనదు ప్రాణేశుఁడైన
మఘవునిటఁ బంపి సత్యభామా విధేయు
వలన మరలంగఁ గొనుటె పో వాసితనము.' (IV. 59)

'దయితా భర్తుః' అను మాటవలన స్ఫూర్తి పొందినదే 'వీరపత్ని' అను పదము. "యది వశ్యః పతిస్తవ" అను దానివలన స్ఫూర్తి పొందినదే 'సత్య భామా విధేయుడు' అను పదము. ఉభయుల భర్తల పరాక్రమమును గురించిన ప్రసంగము ఉభయగ్రంథ సామాన్యము.

5) పారిజాతాపహరణ కారణమును కృష్ణు డింద్రున కిట్లు చెప్పు చున్నాడు.

"గృహీతోఽయం మయా శక్ర సత్యావచన కారణాత్". (౩౧-3)

తెలుగులో కూడ ఇదే కారణము చెప్పబడినది.

" .... ... నీ మఱందలి
కొమ్మవదాన్య భూరుహముఁ గోరినఁ దెచ్చితి..." (V. 39)

7) వజ్రమును తిరిగి ఇంద్రుని కిచ్చుచు కృష్ణు డిట్లనుచున్నాడు :

"వజ్రం చేదం గృహాణ త్వం యదత్ర ప్రహితం త్వయా
తవైతత్తు ప్రహరణం ... " (౩౧-4)

దీనికి తెలుగు :

" — 'కొమ్మ నీ సొ'మ్మని వజ్ర మిచ్చి — (V. 39)

'తవైతత్తు' అనుదాని అనువాదమే 'నీ సొమ్ము' అనునది.

8) పారిజాతమును కృష్ణుని కిచ్చివేయుచు ఇంద్రు డిట్లనుచున్నాడు :

"మర్త్యలోకే త్వయా త్యక్తే నాయం సంస్థాస్యతే భువి." (౩౦-7)

దీనికి తెలుగు :

" — నీ, వమ్మహినుండు నంతకు ననన్య దురాపము పారిజాత భూజమ్మును నుండు — ". (V. 40)

'శ్రీకృష్ణావతార కాలము' అను భావమునకు 'నీవు భూలోకమున నుండు నంతకాలము' అని భూలోకమును పేర్కొనుట ఉభయగ్రంథ సామాన్యము.

ఈ పై భావములలో, పద బంధములలో ఒక్కటికూడ జగన్నాథ విజయములో లేదు. కనుక తిమ్మన విష్ణు పురాణము ననుసరించినాడనుట నిర్వివాదము.

ప్రక్షేప విచారము :

"పారిజాతాపహరణ" కావ్యము కథాంశములలోను, భావములలోను, పద బంధములలోను 'జగన్నాథ విజయము'న కంటె హరివంశ, విష్ణు పురాణములనే ఎక్కువగా పోలియున్నదనియు, జగన్నాథ విజయమునకంటె పలు తావులందు భిన్నముగా నున్నదనియు, ఆ భిన్నములగు సందర్భములలో చాలవరకు హరివంశ, విష్ణు పురాణములతో సంవదించు చున్నదనియు, కనుక తిమ్మన జగన్నాథ విజయమును గాక దానికి మాతృకలగు హరివంశ, విష్ణు పురాణములనే అనుసరించి యుండుననియు ఇంతవరకు నిరూపింపబడినది (పుటలు. 47-129). ఐనను ఈ నిరూపణము నంతటిని పూర్వ పక్షము చేయగల వాద మొకటున్నది. హరివంశ, పారిజాతాపహరణములకు కనుపించు ఈ సాదృశ్యములకు కారణము తిమ్మన హరివంశము ననుసరించుటకాక, హరివంశమే తిమ్మన కావ్యము ననుసరించుట యని వాదించువారు లేకపోలేదు. జగన్నాథ విజయము ననుసరించుచును, స్వీయాభిరుచి ననుస

రించి అటనట కొన్ని మార్పులు చేయుచును తిమ్మన పారిజాతాపహరణమును రచింపగా, దాని నాధారముగ గొని ఎవరో పండితుడు మరికొన్ని చేర్పులు మార్పులు చేయుచు, సంస్కృతీకరించి హరివంశములో ప్రక్షేపము గావించి యుండునని ఈ వాదపు సారాంశము.

హరివంశమును ఎఱ్ఱాప్రెగడయు, నాచన సోముడును తెనిగించి యున్నారు. వీరిరువురి గ్రంథములలో పారిజాతాపహరణ కథ లేదని శ్రీ నిడుదవోలు వేంకటరావు గారనుచున్నారు.* ఎఱ్ఱన, సోమనల నాటికి పారిజాతాపహరణ కథయే పుట్టియుండ లేదనియు, పారిజాతాపహరణ వృత్తాంతమంతయు ప్రక్షిప్తమే యనియు శ్రీ వేంకటరావుగారి అభిప్రాయమైనట్లు తోచుచున్నది. నిజమునకు సోముడు పారిజాతాపహరణ కథను ప్రత్యేకముగ చెప్పలేదు. కాని అతడు మూడుచోట్ల పారిజాతాపహరణ కథను సూచించియున్నాడు.

"పారిజాతంబుఁ దెచ్చుచో బ్రతికిపోయె
నిర్జరాధీశుఁ డొక్కఁడు నిన్నుఁ దాకి."
— ఉత్తర హరివంశము (V. 293)

'ధట్టించి పారిజాతముఁ దెచ్చె' (II. 64)

'పారిజాత గోవర్ధనోత్పాటన' (II. 73)

ఇక ఎఱ్ఱన గ్రంథములో పారిజాతాపహరణ కథ కొంత విపులముగనే యున్నది. (ఎఱ్ఱన హరి. IV. 190–273). కాని అది తిమ్మన చెప్పిన కథకు అనేకాంశములలో భిన్నముగ నున్నది. ముఖ్యముగ ద్వారకకు నారదా

"కృష్ణావతార విశేషములను పూర్తిగ నెఱింగించు హరివంశమున నీ పారిజాతాపహరణ వృత్తాంతము లేదు. హరివంశమును సంపూర్ణముగ తెనుగు చేసిన ఎఱ్ఱన గ్రంథమున నీ పారిజాతాపహరణ వృత్తాంతము లేదు. నాచన సోముని హరివంశమున లేదు. క్రీ. శ. 13వ శతాబ్ది నాటి హరివంశ ప్రతులలో నీకథ లేనట్లు ఎఱ్ఱన అనువాదమే సాక్ష్యమిచ్చుచున్నది. — ఆంధ్ర కర్ణాట సాహిత్యములు-పరస్పర ప్రభావము. పుట. 125.

గమనము, పారిజాత పుష్ప ప్రదానము, సత్యా మానము మున్నగు రసవత్కథాంశములను ఎఱ్ఱన చెప్పలేదు. సత్యాకృష్ణులు నరక వధానంతరము ప్రాగ్జ్యోతిషము నుండియే అమరావతి కేగి, అదితికి కుండలములు సమర్పించి, మరలి ద్వారకకు వచ్చు మార్గములో కనుపించిన పారిజాత వృక్షము నపహరించుకొని వచ్చినట్లు చెప్పినాడు. శ్రీ చాగంటి శేషయ్యగారు ఎఱ్ఱన గ్రంథమునందలి ఈ పారిజాతాపహరణ కథను గుర్తించి యున్నారు. ఎఱ్ఱన, తిమ్మనల్లు చెప్పిన కథలలోని భేదముల వలన హరివంశమునందలి పారిజాతాపహరణ కథాభాగములో కొంత ప్రక్షిప్తము కూడ చేరియుండునని ఊహ చేసినారు. ఆ ప్రక్షిప్త భాగ రచనకు తిమ్మన కావ్యమే మాతృక యని కూడ ఊహించినారు. "నాచన సోముడు శృంగార రసాభిలాషి. శృంగార రసాత్మకమైన ఇట్టి కథనాంధ్రీకరింపక ఈతడేల వదలివేసెనో తెలియకున్నది. మూలానుసారముగా అనువాదమును సాగించిన ఎఱ్ఱాప్రెగ్గడ అతిరసవంతమై పాఠకుల హృదయాకర్షణము నొనర్చు నీకథను మూలానుసారముగ నేల యాంధ్రీకరింపలేదో తెలియకున్నది." అని వారి సందేశము.

తిమ్మన కావ్యమునకు రుద్రభట్ట కావ్యము మాతృక యని శ్రీ బి. వెం. రావు, శ్రీ సుబ్బరామప్పగార్ల భావము. హరివంశ భాగమునకు తిమ్మన కావ్యము మాతృక యని చాగంటివారి ఊహ. ("ఈ సందర్భములన్నిటిని బరికించి చూడగా నెఱ్ఱాప్రగ్గడ యాంధ్రీకరించిన స్వల్ప భాగమే మొట్టమొదట సంస్కృత హరివంశమున నుండెననియు, దానిని గైకొని తిమ్మనార్యుడు తన స్వకపోల కల్పనలతో నీ యుత్తమ కావ్యమును హరివంశ శేషముగా రచించెననియు, తరువాత నెవరో పండితావతంసుడీ కథయందు పాత్రోచితములు కావనియో, అసమంజసములనియో తనకు దోచిన భాగములను మార్చి శ్లోక రూపముగా రచించెననియు, నది క్రమముగా సంస్కృత హరివంశమున జేరి యుండుననియు దోచుచున్నది."— ఆంధ్రకవి తరంగిణి–7వ సంపుటము–పుటలు 236-237.

ఈ రెండు ఊహలును చేరి నిడుదవోలు వారి సిద్ధాంతముగా రూపొందినది. హరివంశ భాగమునకు తిమ్మన కృతియు, దానికి రుద్రభట్టు కృతియు మాతృకలని వారి నిర్ణయము.

| బి. వెం. రావు, సుబ్బరామప్ప గార్ల వాదము | + | చాగంటి వారి ఊహ | = | నిడుదవోలువారి సిద్ధాంతము |
|---|---|---|---|---|
| జగన్నాథ విజయము | | .... | | జగన్నాథ విజయము |
| ↓ | | | | ↓ |
| పారిజాతాపహరణము | | పారిజాతాపహరణము | | పారిజాతాపహరణము |
| | | ↓ | | ↓ |
| .... | | హరివంశ భాగము | | హరివంశ భాగము |

ఇక శ్రీ వేంకటరావుగారు ఆ ప్రక్షిప్తకారుని పేరు నేమాని భైరవావధాని అని చెప్పుచున్నారు.[1] భైరవావధాని సంస్కృత హరివంశ మందలి ప్రక్షిప్త భాగ రచయిత యని నిడుదవోలు వారి అభిప్రాయమైనట్లే కనుపించు చున్నది. కాని భైరవావధాని రచించినది సంస్కృతము కాదు; తెలుగు కావ్యమే. అతని నాటికే సంస్కృత హరివంశములో నీ 'ప్రక్షిప్త భాగము' ఉన్నట్లు ఆ కావ్యావతారికలో గల కృతిపతి యగు కోటగిరి శ్రీనివాస భూపతి ప్రశ్న వలన విదిత మగుచున్నది.[2]

వరగుణశాలి కోటగిరి వంశభవుండగు శ్రీనివాసభూ
వరుఁ డతిభక్తితోడ హరివంశ కథాశ్రవణైక చిత్తుఁడై
యరయుచుఁ బారిజాత హరణాది కథావళి లేకయున్నచో
సురుచిర దృష్టి చేత ననుఁ జూచి దయామతితోడ నిట్లనున్.

ఎఱ్ఱనార్యుండు తెనిగింపఁడేల నొక్కొ ?
తెలుఁగు చేసిన పిదపన దొలఁగెనొక్కొ ?
ఈకథల నీవు తెనిగింపు మింపు మీఱఁ
బ్రకటనేమాని భైరవ సుకవి చంద్ర.

1. "18వ శతాబ్దిని నేమాని భైరవావధాని యను కవి ఈ భాగము గల కథలను రచించి హరివంశమున జేర్చియున్నాడు."—ఆంధ్ర-కర్ణాట సారస్వతములు-పరస్పర ప్రభావము. పుట 125.
2. నేమాని భైరవావధాని రచిత "ఆంధ్ర హరివంశము-ఉత్తర భాగము" వ్రాత ప్రతి కాకినాడ, ఆంధ్ర సాహిత్య పరిషద్గ్రంథాలయములో నున్నది.

తిమ్మన కావ్యమునకు మాతృక ఏదను ప్రశ్నకు సమాధానము సంతృప్తి కరముగ నొసంగుటకు ముందీ ప్రక్షేప సమస్యను పరిష్కరింపవలసియున్నది. అనగా ప్రక్షిప్త మనబడు నీ భాగము నిజముగా ప్రక్షిప్తమేనా? ఐనచో తద్రచన ఎప్పుడు జరిగినది? ఎవరిచే జరిగినది? అను ప్రశ్నలకు సమాధానములు కనుగొనవలసి యున్నది. సంస్కృత హరివంశమును సవిమర్శముగా పరిశీలించినచో ఈ ప్రశ్నలకు సమాధానములు లభింపగలవు.

సంస్కృత హరివంశములో పారిజాతాపహరణ కథ రెండు విధములుగ చెప్పబడి యున్నదని ఇంతకుముందే తెలిసికొని యున్నాము (పుట. 49). తొలికథ కంటె మలికథలో అనేకములగు నూతనాంశము లుండుట అటుం డగా, అనేక కథాంశములో నీ రెండును పరస్పర విరుద్ధములుగ నున్నవి. నూతన కల్పనలలో సత్యా మానము, నారదుని రాయబారము,అదితి కశ్యపుల మాధ్యస్థము, పుణ్యక వ్రత వృత్తాంతము మున్నగునవి కలవు. వీనికంటె ముఖ్యమైనవి గనుక పరస్పర విరుద్ధాంశములను మరల కొంచెము వివరముగ గుర్తింతము.

1) నరకాసుర సంహారానంతరము శ్రీకృష్ణుడు ప్రాగ్జ్యోతిషము నుండియే అమరావతి కేగినట్లు తొలికథ చెప్పుచుండగా, ద్వారక నుండి యేగినట్లు మలి కథ చెప్పుచున్నది.

2) 16,000 మంది కన్యల పెండ్లికి పూర్వమే పారిజాతాపహరణము జరిగినట్లు తొలికథలో నుండగా, పెండ్లికి తరువాతనే ఈ వృత్తాంతము నడచి నట్లు మలికథలో నున్నది.

3) తొలికథలోని స్నేహ యాత్ర మలికథలో యుద్ధయాత్ర యైనది.

4) తొలి కథ ననుసరించి పారిజాతహరణ సమయమున సత్యభామ శ్రీకృష్ణుని పార్శ్వమందే యుండగా, మలికథ ననుసరించి ఆమె యపుడు ద్వారకలోనే యున్నది.

5) తొలి కథలో లేని ప్రద్యుమ్న సాత్యకులు మలికథలో కృష్ణునకు పారిజాతాపహరణములో సహాయకులై యున్నారు.

6) కృతజ్ఞతా గుణబద్ధుడైన దేవేంద్రుడు కృష్ణుని పారిజాతాపహరణ మున కంగీకరించి మిన్నకున్నట్లు తొలికథ చెప్పుచుండగా, ఎదిరించి యుద్ధ మొనరించినట్లు మలికథ చెప్పుచున్నది.

ఇంకను స్వల్పములగు భేదములు చాల కలవు. ఒకే సంఘటనను గురించి ఒకే కవి ఒకదాని వెనుక నొకటిగా ఇట్టు పరస్పర విరుద్ధమైన రెండు కథలు చెప్పి యుండుట అసంభవము. కనుక ఈ రెండు కథలలో నేదో యొకటి మాత్రమే మూలగ్రంథకారుని రచన యనియు, రెండవది ప్రక్షిప్త మనియు చెప్పక తప్పదు. ఐనచో నీరెండు కథలలోనేది మూల గ్రంథకారుని రచనయో గుర్తించుటకు ప్రయత్నింతము.

శ్రీకృష్ణావతార చరిత్ర నభివర్ణించు గ్రంథములలో ప్రధానమైనవి మూడు : 1) హరివంశము, 2) విష్ణు పురాణము, 3) భాగవతము. వీనిలో హరివంశ మత్యంత ప్రాచీనమైనదనియు, అందలి విష్ణుపర్వపు కథ ప్రధానా ధారముగ విష్ణు పురాణము నందలి కృష్ణ చరిత్ర రచితమైన దనియు, దాని ననుసరించి భాగవతము రచింపబడినదనియు సంస్కృత వాఙ్మయ చరిత్రకారులు నమ్ముచున్నారు. విష్ణు పురాణ, భాగవతము లందలి కథ చాలవరకు హరి వంశపు తొలి కథతోనే సంవదించు చున్నవి. ఈ రెండు గ్రంథములును కృష్ణుడు ప్రాగ్జ్యోతిషము నుండియే అమరావతి కేగినట్లును, అదితికి కుండల ములు సమర్పించి సత్యాసహితుడై నందనవన విహారము గావించుచు పారి జాతమును గాంచి పెకలించినట్లే చెప్పుచున్నవి. సత్య తనకు పారిజాతము కావలెనని కోరినందుననే కృష్ణుడు పారిజాతోన్మూలనము గావించినట్లు పై రెండు గ్రంథములును స్పష్టముగ చెప్పుచున్నవి. హరివంశపు తొలికథలో ఈమాట లేదు. కాని ఆ సమయమున సత్య కృష్ణుని పార్శ్వమందే కలదు గాన ఇందులో పెద్ద వైరుధ్యము లేదని సరిపెట్టుకొనవచ్చును. సత్య ఇట్టి కోరిక కోరుటకు కారణము అంతకుముందు శచీదేవి సత్యకు పారిజాత పుష్పము నొసంగక అవమానించుటే యని విష్ణు పురాణము చెప్పుచున్నది. ఇది హరి వంశ కథకు విరుద్ధము కానిదైనను నిశ్చయముగ నూతన కల్పనయే. ఇక దేవేంద్రుడు కృష్ణునితో యుద్ధము చేసి ఓడిపోయినట్లు విష్ణు పురాణ, భాగ

వతములలో చెప్పబడిన విషయము హరివంశపు తొలి కథకు కేవల విరుద్ధ మైనదే.

పై విషయములను బట్టి చూడగా హరివంశమందు మొదట 'తొలి కథ' మాత్రమే యుండెననియు, కృష్ణుని పర ద్రవ్యాపహరణ చర్యను సమర్థించుటకై శచీకృతావమాన కథను, అతని సర్వాతిశాయి పరాక్రమమును ప్రకటించుటకై యుద్ధ కథను, ఇంద్రుని పరాజయ కథను విష్ణు పురాణము కల్పించి యుండుననియు నమ్మవలసి వచ్చుచున్నది. ఈ కథచే స్ఫూర్తి పొందిన మరియొక కవి తోడికోడండ్ర కంటె సపతుల మధ్య మాత్సర్యము మరింతగ శోభిల్లగలదను ఊహతో రుక్మిణీ సత్యభామల మధ్య రవరవలు పుట్టుటకు పారిజాతము కారణమైనట్లును, దానికి కలహాశనుడని పౌరాణిక వాఙ్మయమున ప్రసిద్ధుడైన నారదుడు సూత్రధారుడైనట్లును ఒక నాటకమును రచించి యుండును. అదే హరివంశ మందలి మలికథగ రూపొంది యుండును. అనగా "మలికథ"యే ప్రక్షిప్తమని తేలుచున్నది.

"తొలి కథ"యే ప్రక్షిప్తమనుకొందమన్నచో మరియొక చిక్కుగూడ కలదు. నరకు డపహరించిన కుండలములను అదితికి మరల శ్రీకృష్ణుడు చేర్పవలసి యున్నాడు. ఈ సమర్పణము "తొలి కథ" లోనే చెప్పబడినది. మలి కథలో ఈ కథాంశ ముండుటకే అవకాశము లేదు.

"మలి కథ"యే ప్రక్షిప్త మనుటకు మరియొక ప్రబలమైన సాక్ష్యాధారము కలదు. క్షేమేంద్రుడను ప్రసిద్ధ సంస్కృత కవి "భారత మంజరి" యను గ్రంథమును రచించి వ్యాస దాసుడను ప్రసిద్ధి నందియున్నాడు. భారత ఖిల గ్రంథమైన హరివంశముతో సహా భారత కథయంతయు ఈ గ్రంథమున చెప్పబడినది. భారత మందలి ప్రక్షిప్త భాగములను గుర్తించుటకు భారత మంజరి యొక ప్రబల ప్రమాణముగ గుర్తింపబడు చున్నది. భారత మంజరిలో తొలికథయే కలదు. మలి కథ పొలకువయైన లేదు.*

* పూనా భండార్కర్ సంస్థ వారుకూడ ఈ "మలి కథ" ప్రక్షిప్త మనియే నిర్ణయించినారు. చూ. పి. యల్. వైద్య—'హరివంశ' Vol. I పీఠిక. పుట. 42.

తం దృష్ట్వానయనానంద బాంధవం మాధవస్స్వయమ్
సముత్పాట్య జహాదాబ తచ్చామన్యత వృత్రహా (భారత మంజరి)

పారిజాతాపహరణపు అత్యంత ప్రాచీన ప్రసంగము మహాభారతము లోనే లభించుచున్నది. దానిలోకూడ హరివంశపు తొలికథయే కలదు. మలి కథ పొలకువ యైన లేదు.

"వైనతేయం సమారుహ్య త్రాసయిత్వా మరావతీమ్
మహేంద్ర భవనాద్వీరః పారిజాతముపానయత్
తచ్చ మర్షితవాన్ శక్రో జానంస్తస్య పరాక్రమమ్."
(మహాభారతం. 7-10-22, 23)

ఇట్లు ప్రక్షిప్త భాగమును గుర్తించిన పిదప దాని రచనా కాలమును గుర్తింతము. దీనినిగూర్చి మూడు ప్రాయోవాదము లుండుట కవకాశమున్నది. 1) రుద్రభట్టునకంటె పూర్వము 2) రుద్రభట్టు, తిమ్మనలకు మధ్య కాలము 3) తిమ్మనకు తరువాత. వీనిలో మొదటి ప్రాయోవాదమే సత్యమైనచో రుద్ర భట్ట కావ్యమునకు ఈ 'ప్రక్షిప్త కథ' మాతృక యగును. రెండవ వాదమే సత్యమని తేలినచో రుద్రభట్ట కావ్యమే ఈ ప్రక్షిప్త కథకు మూలమగును. ఈ రెండిటిలో ఏ వాదము నెగ్గినను "ప్రక్షిప్త కథ"కు తిమ్మన కృతి మాతృక కాజాలదు. తిమ్మన కృతికే ఈ ప్రక్షిప్త కథ మాతృక కాగలదు; లేక రుద్ర భట్ట కావ్యమైనను కావచ్చును. మూడవ ప్రాయోవాదమే సత్యమని నిరూపణ యైననే 'ప్రక్షిప్త కథ'కు రుద్రభట్టు, తిమ్మనల కావ్యములలో నేదోయొకటి మాతృక యగుటయు, తిమ్మన కావ్యమునకు రుద్రభట్ట కావ్యమే మాతృక యగుటయు సిద్ధాంతము కాగలదు.

శ్రీయుతులు చాగంటి, నిడుదవోలు వారలు మూడవ ప్రాయోవాదమునే సమర్థించుచున్నారు. కనుక దానికి గల సాధక బాధకములను విచారింతము.

ఎఱ్ఱన, సోమనలీ కథను చెప్పలేదు గనుక వారి కాలమునకు అనగా 14వ శతాబ్ది వరకు ఈ ప్రక్షిప్త కథ పుట్టియుండలేదని వారి వాదపు సారాంశము. సోముడు హరివంశ కథల నన్నిటిని రచింపలేదు. లేదా అతని గ్రంథమంతయు నేడు మనకు లభించుట లేదు. ఏమైనను అవతారికోప సంహా

రములు లేని సోముని గ్రంథము దాని అసంపూర్ణ స్థితినే వెల్లడించుచున్నది. కనుక సోముడీ కథను రచింపలేదనునది ఒక అక్షేపణ కాజాలదు. ఈ అక్షేపణ నంగీకరించినచో మొత్తము పారిజాతాపహరణ కథయే ప్రక్షిప్త మన వలసి వచ్చును. అట్లయినచో ఎఱ్ఱన చెప్పిన కథ కూడ ప్రక్షిప్తమే యనవలసి యుండును. అదియుగాక సోముడు పారిజాతము కారణముగ ఇంద్రునకును కృష్ణునకును యుద్ధము జరిగినట్లు చెప్పియుండుటచే అతనికీ "మలి కథ" పరిచితమే యని చెప్ప వీలగుచున్నది.[1]

ఎఱ్ఱన చెప్పిన కథ దాదాపుగ తొలికథ తోనే సంవదించుచున్నది. రమ్యమైన సత్యామాన కథను అతడు చెప్పక విడచుటచే అ కథాభాగము ఆయన కంట పడలేదనియే నమ్మవలసి వచ్చుచున్నది. లేక 'ధీరవిచారుడగు' ఎఱ్ఱన ఆ భాగపు ప్రక్షిప్తతను గుర్తించి పరిత్యజించెనో? ఏమైనను కథ ముగింపులో 'తొలి కథ'కు విరుద్ధముగ ఇంద్రోపేంద్రుల యుద్ధమును చెప్పి యున్నాడు. హరివంశపు తొలికథకును, విష్ణు పురాణమునకును ముగింపులో గల వైరుధ్యమును సమన్వయపరచుటకు ఎఱ్ఱన ప్రయత్నించినాడు. కనుకనే కృష్ణుడు గావించిన పారిజాతాపహరణమునకు "మదిలో నొడంబడియు" "మనసు పట్టలేక" పోరాడి ఓడినట్లు చెప్పినాడు.[2]

ఇక "తదీయ నివృత్తి పర్యంతము దివ్య మహీరుహంబు మహీతల స్పర్శిగా నొడంబరచి" (IV.223) అను ఎఱ్ఱన వాక్యమునకు మూలము విష్ణు పురాణమే యనుట స్పష్టమే. "పారిజాతంబు నవతారితంబు సేయ బ్రద్యుమ్ను

1. పారిజాతంబు దెచ్చుచో బ్రతికిపోయె
నిర్జరాధీపుడొక్కడు నిన్ను దాకి. (ఉ. హ. V. 293)

2. (దేవేంద్రుడు) "తత్కృతంబు తగనొడ బడియున్"
(హ. వం. ఉ. భా. IV. 221)

"మనసు పట్టలేక యనిమిషకోటితో
నరిగి యతని దాకి యని యొనర్చి
వజ్రమతనిమీద వైచి తద్వేగసం
స్తంభనమున మదము దక్కి గ్రుక్కి" ( ,, 222)

వాజ్ఞాపింప నతండయ్యుత్తమ తరువు నంతఃపురంబునకుఁ గొనిపోయె" (IV. 231) నని ఎఱ్ఱన చెప్పియుండుటచే అతడు హరివంశ ప్రక్షిప్త భాగమును కూడ చూచియే యుండెనని ఊహింపవలసి యున్నది. ఈ సందర్భమున 'తొలి కథ'లో ప్రద్యుమ్నుని పేరైన లేదు. 'మలి కథ' లోనే ప్రద్యుమ్నుడు ప్రధాన పాత్ర వహించుటేగాక పారిజాతమును ద్వారకలో ప్రవేశపెట్టినవాడుగ చెప్పబడి యున్నాడు.[1] కనుక ఎఱ్ఱన నాటికి 'ప్రక్షిప్త' భాగపు రచన జరిగి యుండలేదని నిశ్చయముగ చెప్పుటకు అవకాశము లేకున్నది. తిక్కన కూడ పారిజాతాపహరణ కథ నొకచోట స్మరించి యున్నాడు.[2]

క్రీ. శ. 1300 ప్రాంతముననే హరివంశపు మలికథ ప్రచారము నంది యుండుననుటకు ఒక సాక్ష్యము కలదు. ఉమాపతి ఉపాధ్యాయ యను కవి మైథిలీ సంస్కృత మిశ్రమ భాషలో 'పారిజాతాపహరణ' మను నొక ఏకాంకిక నాటికను రచించియున్నాడు.[3] నారదుడు కృష్ణునికి పారిజాతము నొసగుట మొదలు పుణ్యక వ్రత సమాప్తి వరకు గల కథను ఇతడీ నాటికలో కూర్చి నాడు. కృష్ణునితోబాటు అమరావతీ దండయాత్రలో అర్జునుడు కూడ పాల్గొను టయు, పుణ్యక వ్రతమును సత్యభామతో బాటు సుభద్ర కూడ నాచరించు టయు ఇందలి విశేషములు. మిగత కథ యంతయు హరివంశపు మలికథయే. తిమ్మన, రుద్రభట్టుల కావ్యములతో కొంతకు కొంత సమానముగ నున్న పారిజాతాపహరణ వృత్తాంతము మాట యెట్లున్నను, పుణ్యకవ్రత వృత్తాంతము (రుద్రభట్టు చెప్పనిది) తిమ్మన సొంత కల్పన మాత్రము కాదనుటకీ ఉమాపతి

1. తతోऽగ్రతః పారిజాతం ఆరోప్య గరుడే తదా
ప్రద్యుమ్నో ద్వారకాం రమ్యాం వివేశ రథినాం వరః
శైబ్యాదిహయయుక్తేన రథేనానుయయౌ హరిః.
(75 అధ్యా. 50, 51 శ్లో.)

2. 'సత్యభామకుఁ బారిజాతంబుపై గల
కోర్కి తీర్చిన రసికుండితండె'. (ఉద్యోగ. III. 175)

3. ఇతడు మిథిలా హిందూరాజు హరసింహుని మంత్రి, 1324 సం॥కు ముందరివాడు. చూ. Dr. Sukumar Sen—History of Bengali Literature. P. 24).

రచిత నాటిక తిరుగులేని సాక్ష్యమై యున్నది.* అందుచే నీ "ప్రక్షిప్త" భాగము తిమ్మన రచనకు సంస్కృతీకరణము గాక తిమ్మన రచనయే దానికి ఆంధ్రీకరణమని నిరూపణ యగుచున్నది.

ప్రక్షిప్త భాగమునకు తిమ్మన రచనయే మూలమను వారు మరియొక విధముగ నిట్లు వాదింపవచ్చును. "రుద్రభట్టు కావ్య మాధారముగ కొన్ని స్వీయ కల్పనలతో ఉమాపతి తన నాటికను రచింపగ, ఈ రెంటిని ఆధారముగ గొని మరికొన్ని స్వకపోల కల్పితములగు చేర్పులు మార్పులతో తిమ్మన తన కావ్యమును రచింపగా, ప్రక్షిప్తకారుడును అట్లే తిమ్మన రచనను తన అభిరుచి ననుసరించి 'సంస్కరించి' సంస్కృతీకరించి యుండవచ్చును" అని. కాని ఈ వాదమునకు చాల చిక్కులు కలవు.

బీహారు ప్రాంతీయుడును, మైథిలీ మాతృభాషగా గలవాడును నగు ఉమాపతి ఉపాధ్యాయుడు కన్నడ మందున్న రుద్రభట్ట కావ్యము నెట్లనుసరింపగల డనునది మొదటి ఆక్షేపణ. మాట వరుసకు ఈ ఆక్షేపణకెట్లో సమాధానము చెప్పికొందము. ఉమాపతి ఎట్లో కష్టపడి కన్నడమును రుద్రభట్ట కావ్యము కొరకేయైన నేర్చుకొనినాడనుకొందము. లేదా ఈనాడు మనకు లభ్యము గాకున్నను రుద్రభట్ట కావ్యమున కేదైన సంస్కృతీకరణ మేర్పడి యుండవచ్చును. ఉమాపతి దాని ననుసరించి యుండవచ్చును. ఇప్పుడు మరియొక ఆక్షేపణ. ఉమాపతి నాటకము కేవల సంస్కృతము కాదు. సంస్కృతము కంటె మైథిలియే అందు అధికముగా కలదు. తిమ్మనకు కన్నడ భాషాజ్ఞానముతోబాటుగ మైథిలీ భాషాజ్ఞానము కూడ ఉండినగాని, అతడీ కావ్యద్వయమును అనుసరించి యుండలేడు. మాట వరుసకే మరల ఈ ఆక్షేపణను కూడ ఎట్లో సరిపెట్టుకొందము. తిమ్మన కూడ ఉమాపతి నాటకము కొరకే కష్టపడి ఎట్లో మైథిలి నేర్చుకొని యుండవచ్చును. లేదా నేడు మనకలభ్యమైనను ఉమాపతి నాటికకు కేవల సంస్కృత అనువాద మొకటి ఏర్పడి యుండవచ్చును. తిమ్మన దాని ననుసరించి యుండవచ్చును.

---

* Sir George Grierson K. C. I. E. గారిచే Journal of the Bihar and Orissa Research Society, మార్చి 1917 సంచికలో ఆంగ్లానువాద సహితముగ ప్రకటింపబడినది.

ఇన్నివిధముల సరిపుచ్చుకొనినను ప్రక్షిప్త భాగమునకు తిమ్మన రచనయే మాతృక యనుటకు మరియొక పెద్ద ఆక్షేపణ అడ్డు వచ్చుచున్నది. ఈ ప్రక్షిప్త భాగమునందలి కొన్ని కథాంశములు రుద్రభట్ట కావ్యముతో మాత్రమే సంవదించుచున్నది. మరికొన్ని కథాంశములు ఉమాపతి నాటికతో మాత్రమే సంవదించుచున్నవి. మరికొన్ని కథాంశములు తిమ్మన కావ్యముతో మాత్రమే సంవదించుచున్నవి. కొన్ని ముఖ్యాంశములను మాత్రము గుర్తింతము.

స్వర్గమున మహేశ్వర పూజోత్సవ ప్రసంగము, శివుడు ఇంద్రుని పారిజాత మిమ్మని అడిగి లేదనిపించుకొనుట, ఐరావతమును గరుడుడు పారియాత్రముపై పడునట్లు విసరివేయుట, బిల్వాదకేశ్వరుని ప్రసంగము, షట్పురాసురులను వధించుమని బిల్వోదకేశ్వరుడు కృష్ణుని ఆదేశించుట అను కథాంశములు రుద్రభట్ట కావ్యమందు మాత్రమే కలవు. గౌరీ శచీదేవులు భర్తృదానమును నారదునికే యొసంగుట, సత్యభామ కృష్ణునికి సరియగు వెలగ ఒక గోవు నొసంగుట అను కథాంశములు ఉమాపతి నాటిక యందు మాత్రమే కలవు. నారదుడు సత్య ఇంట భుజించుట, కృష్ణుడు వైజయంతమున ఒక రాత్రి నిద్రించుట, కృష్ణుని పారిజాతహరణ వృత్తాంతమును నందనవనపాలురు ఇంద్రునకే తెలుపుట, పారిజాత పుష్పము యొక్కయు, వృక్షము యొక్కయు విస్తృతమగు మహిమల వర్ణన, పుణ్యకవ్రత విధాన వివరణ— ఇవి తిమ్మన కావ్యమునందు మాత్రమే కలవు. ఆయా అంశములలో, ఆయా కావ్యములతో సంప్రదించుచున్న ఈ ప్రక్షిప్త భాగ రచయిత ఎవరోగాని ఒక కన్నడ కావ్యమును, ఒక తెలుగు కావ్యమును, ఒక మైథిలీ నాటికను ముందుంచుకొని సంస్కృతములో తాను రచన సాగించినాడనవలెను. ఇట్టి అభూతమగు ఊహను చేయుటకంటె ఈ కన్నడ, మైథిలీ, తెలుగు కవులు ముగ్వురును ఒకే సంస్కృత పురాణము నాధారముగ గొన్ని తమతమ అభిరుచుల కనుగుణముగ చేర్పులు మార్పులు చేయుచు గ్రంథములు రచించిరనుకొనుట స్వభావసిద్ధము గదా.

అసహజము




సహజము

సంస్కృత పురాణము




మరొకసారికూడ మాటవరుసకే పై అసహజమైన ఊహనే అంగీకరింతము. చతుర్భాషావేత్తయైన యొక పండితుడు కన్నడ, మైథిలీ, తెలుగు గ్రంథముల నాధారముగ సంస్కృత గ్రంథమును రచించినాడనియే అనుకొందమన్నను తిమ్మన కంటెను, ఉమాపతి కంటెను పూర్వమే ఈ పారిజాతాపహరణ, పుణ్యక వ్రత కథలు దేశమున బహుళ వ్యాప్తిని హొందియున్నట్లు ఇతర ప్రమాణముల వలన రూఢియగుచున్నది.

దేవతల సొత్తగు పారిజాతమును సత్యభామ అపహరించుటయు, కృష్ణుని నారదునకు దానమొసంగుటయు నను కథాంశములు జైమిని భారతములో స్మరింపబడి యున్నవి. పారిజాతము నపహరించిన భర్తను దానమొసంగిన సత్యయొక్క అకార్యమును, తనకు లభించిన కృష్ణుని తిరిగి అమ్మివేసిన

నారదుని అవివేకమును ద్రౌపది ఇట్లు పరిహసించుచున్నది.[1] మరియొకసారి అనుసాల్వుడు కూడ సత్యభామ కృష్ణుని నారదునకు దానమొసగిన వృత్తాంతమును స్మరించినాడు.[2] జైమిని భారత రచన ఎప్పుడు జరిగినదో స్పష్టముగ చెప్పుటకు సాధ్యము గాకున్నను అది క్రీ. శ. 1300 కంటె చాల పూర్వమే రచింపబడి యుండునని నమ్మవలసి యున్నది. జైమిని భారతమును లక్ష్మీశుడను మహాకవి 1345–47 ప్రాంతమున కన్నడములోనికి అనువదించి యున్నాడు. అప్పటికే అది కొంత ప్రాచీనమై యున్నగాని దానికి పౌరాణిక ప్రతిపత్తి లభించుటయు, లక్ష్మీశుని వంటి మహాకవి దానిని అనువదించుటకు పూనుకొనుటయు జరిగియుండదు. కనుకనే ఉమాపతి కూడ ఈ పుణ్యక వ్రత వృత్తాంతమును హరివంశము నుండియే గ్రహించియుండునుగాని స్వయముగ కల్పించి యుండడని చెప్పగలుగుచున్నాము.

ఇంకను సవిమర్శముగా పరీక్షించినచో రుద్రభట్టు కాలమునకే ఈ ప్రక్షిప్త భాగము హరివంశములో చేరియున్నట్లు ఆతని కావ్యము వలననే తెలిసికొనగలము.

1) హరివంశములో అతి సంగ్రహముగ చెప్పబడిన అనేకాంశములు రుద్రభట్టు కావ్యములో అతి విపులముగ చెప్పబడి యున్నవి. ఒక ఉదాహరణ:

---

1. నారదాయ త్వయా దత్తో మాధవః పతిరాత్మనః
పారిజాతస్తు దేవానాం మండనం యత్పురాహృతమ్
దేవద్విజగురూణాం హి విత్తం నైవాత్ర పండితాః
ప్రతిగృహ్ణన్తి సుభగే త్వం గృహీత్వా న లజ్జసే
నారదం చైవ గర్హామి ప్రతిగృహ్య జనార్దనమ్
ప్రదత్తవాన్ కథం మన్దః తవ హస్తే జగత్పతిమ్
కృష్ణాదప్యధికం త్వత్తః కిరి లబ్ధం తేన ధీమతా
బ్రాహ్మణానాం మతిర్యస్మాత్ పశ్చాదుత్పద్యతేఽనఘే.
(XII. 66-69)

2. గ్రహీతారం నారదం తు వదన్త్యన్యే మృషావచః
సత్యభామార్పితం కృష్ణం పరిజానే కరాగతమ్
సంధర్తుమసమర్థోసౌ నారదో దత్తవాన్ యతః. (XI'. 99-100)

హరివంశమున నారదకృత సత్యానింద ఒకే ఒక శ్లోకములో చేయబడినది.[1] జగన్నాథ విజయములో ఈ సత్యానింద ఐదు పద్యము లాక్రమించినది.[2] దీనిని ఒక విధముగ రుద్రభట్ట రచనకు హరివంశపు సంగ్రహీకరణ అని చెప్ప వచ్చును. లేదా హరివంశమునకు రుద్రభట్టు విస్తరణ యనియైన చెప్ప వచ్చును. కాని అనుకర్త ఎల్లప్పుడును మూలమున కంటె సుందర రచనయే చేయుటకు ప్రయత్నించు ననియు, మూలము నందున్న రమ్యములగు భావములను అనువదింపకుండ వదలడనియు గుర్తించినచో ఈ భాగములను రుద్రభట్ట రచనకు హరివంశపు సంగ్రహీకరణ యనుటకంటె, హరివంశ మందలి అరకొర శ్లోకములకు రుద్రభట్టు గావించిన విపులీకరణ యనియే చెప్పవలసి యుండును.

2) హరివంశమున గల కొన్ని సుదీర్ఘ ప్రసంగములకు రుద్రభట్టు రచనలో సంగ్రహ వాక్యములు గల సందర్భములును గలవు. ఉదాహరణకు పారిజాతము నిమ్మను తన కోరికను ఇంద్రుడు తిరస్కరించిన పిదప శివుడు తన ఇల్లాలిని ఎట్లు సంతృప్తి పరచెనో హరివంశమున అతి విపులముగ 11 శ్లోకములలో చెప్పబడినది. ఇందులో సందర్భశుద్ధి లేని అధిక ప్రసంగము కూడ చాలగలదు. ఈ సందర్భమును రుద్రభట్టు "ఎంతానుం సంతైసి" (ఏదోవిధముగా సంతృప్తిపరచి) అని ఒక్కముక్కతో తేల్చివేసినాడు. ఇట్టి సందర్భములను ఒకవిధముగ రుద్రభట్ట సంగ్రహ ప్రసంగములకు హరి వంశపు విపులీకరణమనియైన చెప్పవచ్చును. లేదా హరివంశపు విస్తృత ప్రసంగములకు రుద్రభట్టు సంక్షిప్తీకరణమనియైన చెప్పవచ్చును. కాని సందర్భశుద్ధి లేని హరివంశపు విస్తృత ప్రసంగములకంటె రుద్రభట్టు గావిం చిన ఔచిత్యవంతములైన సంగ్రహ వాక్యములే రమ్యములుగ నుండుటచే రుద్రభట్టుదే ఉత్తర కాలిక రచన యని నిర్ణయింపగలము.

1. అద్య సాత్రాజితీ దేవీ జ్ఞాస్యతే వరవర్ణినీ
సౌభాగ్యాద్యం సదావేత్తి యాత్మానం సుభగా సతీ.
(65 అధ్యా. 39 శ్లో.)

2. జ. వి. XII. 70-74.

3) కథాంశములు భిన్నముగ నున్న తావులలో కూడ హరివంశ కథాంశములకంటె రుద్రభట్టు కథాంశములే రమ్యములుగ నున్నవి. ఒక్క ఉదాహరణ చాలును. శ్రీకృష్ణుడు ఏకాంగవీరుడై పోరి దేవేంద్రుని జయించినట్లు రుద్రభట్ట కృతి చెప్పుచున్నది. కృష్ణుని మహిమను ప్రస్తుతించుటకే రచింపబడిన హరివంశము నందలి ఈ కథాభాగమో- సాత్యకి, ప్రద్యుమ్నుల సహాయముండి కూడ కృష్ణుడు దేవేంద్రుని జయింపలేకపోయినాడని తెలుపుచున్నది. ఈ రెండు కథా భాగములలో దేనికేది మెరుగు పెట్టినట్లున్నదో, అనగా ఏది పూర్వకాలిక రచనయో, ఏది ఉత్తరకాలిక రచనయో వివరింపవలసిన పని లేదు.

4) రుద్రభట్టు పారిజాత కథా ప్రారంభమున రుక్మిణి పుణ్యక వ్రతము నాచరించినదని తెలిపియున్నాడు (XII. 61, 62). ఆ వ్రతాచరణ విధానమును గూర్చి రుద్రభట్టు ఏమియు తెలుపలేదు. ఈ వ్రతాచరణ విధానము అతి విపులముగ హరివంశములో నున్నది. పురాణ మగుటచే వ్రతకల్ప సుదీర్ఘ వర్ణనలను హరివంశము చేసియుండగా, కావ్యదృష్టితో రుద్రభట్టు వానిని సంహరించినాడని చెప్పుట యుక్తియుక్తము. రుద్రభట్టు కల్పించిన "అపురూపపు" వ్రతపు పేరునకు అటుపిమ్మట హరివంశము వ్రత కల్పమును రచించిన దనుట యుక్తిసహము కాదు. మొదటికి రుద్రభట్టు "పుణ్యకము" అను పేరును కల్పింపవలసిన అవసరమే లేదు. 'రుక్మిణి ఒక వ్రతము నాచరించు చుండె'నని హరివంశములో ఈ సందర్భమున చెప్పినట్లు* సాధారణముగ చెప్పియుండుటయే సహజమగు మార్గము. వివరములతో పనిలేకుండ నిర్నిమిత్తముగ ఒక 'అపురూపపు' పేరును సృష్టించుట అసహజము. రుద్రభట్టు ఇట్లు 'పుణ్యక' వ్రతపు వివరముల జోలికి పోకున్నను, పుణ్యకమను పేరును స్మరించుటయే ఆతని రచన హరివంశ భాగపు రచనకు తర్వాతిదని నిరూపించుచున్నది.

5) ఇట్లే యుద్ధావసానమున బిల్వోదకేశ్వరుడను శివుడు కృష్ణు నెదుట సాక్షాత్కరించినట్లు రుద్రభట్టు తెలిపినాడు (XIII. 1). శివునకు బిల్వోద

* "ఉపవాసావసానం హి రుక్మిణ్యాః ప్రతిపూజయన్".
హరి. 65 అధ్యా. 5॰ శ్లో.

కేశ్వరుడను పేరు ఎట్లేర్పడినదో అతడు తెలుపలేదు. ఆ వివరము హరివంశ ములో నున్నది. "తొలినాటి యుద్ధానంతరము రాత్రివేళ శ్రీకృష్ణుడు పారి యాత్రముపై విడిసియుండి మహేశ్వరుని పూజింపగోరెను. పూజకు ముందుగ స్నానమాచరించుటకై అతడు గంగను స్మరించెను. అంతట అచట గంగ ప్రాదుర్భవించెను. శ్రీకృష్ణుడు ఆ గంగలో స్నానము గావించి గంగోదకము లపై బిల్వ పత్రములుంచి వానిపైకి ఈశ్వరుని ఆవాహన చేసెను. ఈశ్వరుడు కృష్ణునకు ప్రత్యక్షమై "నీవు నన్ను బిల్వోదకములపైకి ఆవాహన గావించితివి గనుక నేనిచటనే "బిల్వోదకేశ్వరు"డను పేర నెలకొని యుందును. ఈ గంగ కూడ ఇచట అవింధ్య యను పేర ప్రవహించుచుండ గలదు. ఈ క్షేత్రమున మూడు రాత్రులుండి నన్ను సేవించినవారు పుణ్య లోకములు పొందుదురు" అని పలికెను. పిదప శ్రీకృష్ణుడు కూడ పారియాత్ర పర్వతమున కిట్లు వర మొసంగెను. 'ఓ పర్వతరాజమా, నేనును ఇచ్చటనే నీపైన సన్నిధి చేసి యుం దును. నీ శిఖరమున నెలకొని యున్న నన్ను దర్శించినవారికి గోసహస్ర దాన పుణ్యము లభింపగలదు. నీరాతితో నా విగ్రహములు కావించి పూజించువారు నా లోకమును పొందగలరు". ఇది సంగ్రహముగా హరివంశము నందు గల బిల్వోదకేశ్వర వృత్తాంతము.[1]

ఈ కథాభాగమంతయు నొక స్థల పురాణమువలె నున్నది. ఈ స్థల పురాణమును రచించిన వ్యక్తి పారియాత్ర ప్రాంతీయుడై యుండును. వింధ్య పర్వత పంక్తుల పశ్చిమోత్తర భాగమునకే పారియాత్రమని పేరు.[2] కనుక ఈ ప్రక్షిప్త భాగపు రచయిత మహారాష్ట్ర, గుజరాత్, రాజస్థాన్ ప్రాంతములకు చెందినవాడై యుండును.[3] మైసూరు నందలి ద్వార సముద్ర ప్రాంతీయుడైన

1. హరివంశము—74వ అధ్యాయము. 10-54 (45 శ్లోకములు)

2. **Nandalal Day—Geographical Dictionary of Ancient and Medieval India. Page : 68.**

3. కతియవాడు (గుజరాతు) లోని మహాత్మగాంధి జన్మస్థానమైన పోర్ బందరుకు సమీపమున నొక "బిల్లేశ్వరము" కలదు. అచటి శివలింగ మును శ్రీకృష్ణుడే ప్రతిష్ఠించినట్లు స్థల పురాణము చెప్పుచున్నది. ఈ 'బిల్లేశ్వరుడే' 'బిల్వోదకేశ్వరుడై' యుండవచ్చును. చూ. **Archaelogical Survey of India 1937 — Page 40.**

రుద్రభట్టునకు ఈ పారియాత్ర విషయమై ఆసక్తి యుండకపోవుట సహజము. కనుకనే అతడీ భాగము నంతటిని అనువదింపక విస్మరించినాడు. బిల్వోద కేశ్వరుడను పేరును మాత్రము గ్రహించినాడు. మాతృకయైన గ్రంథములో నీ పేరుండుటచేతనే అతడు దానిని స్వీకరించి యుండునుగాని నిర్నిమిత్తముగ అతడీ 'అపురూపపు' పేరును సృష్టించి యుండడు. అతడు కావించిన అపురూపపు నామసృష్టికి ఆకాశ పంచాంగము వంటి క్షేత్ర మాహాత్మ్యమును మరొకరు కల్పించి యుండరు. ఇదిగాక ఈ సందర్భమున రుద్రభట్టు చేసిన పద ప్రయోగమును బట్టి ఈపేరు రుద్రభట్టు కల్పించినది కాదని స్పష్టమగుచున్నది.

శ్రీదసఖం పురరిపు బి
ల్వోదకపతి నామ నల్లి సన్నిదనాగి... (జ. వి. XIV. 1)

(బిల్వోదకపతి యను పేరుగల శ్రీదసఖుడైన పురరిపుడు అచ్చట సాక్షాత్కరించి....)

శివుని పేర్కొనుటకు శ్రీదసఖుడు, పురరిపుడు అనినట్లుగనే "బిల్వోదకపతి" యని ఉపచార నిర్విశేషముగ పేర్కొనక 'బిల్వోదక పతియను పేరుగల' అని పేర్కొనుటలోనే ఆ పేరిట ప్రసిద్ధుడైన ఒక ప్రత్యేక శివుడు గలడనియు, ఆ పేరు వెనుకనేదో కొంత చరిత్ర కలదనియు, ఆ చరిత్ర నంతటిని చెప్పుటకు ఇష్టము లేక, బొత్తుగా పేరునుగూడ వదలిపెట్టుటకును ఇష్టము లేక, రుద్రభట్టు ఇట్లు చెప్పినాడని స్పష్టమగుచున్నది, అనగా రుద్రభట్టు హరివంశము ననుసరించినాడేగాని, అతని కావ్యము ననుసరించి ప్రక్షిప్త భాగ రచన జరిగియుండలేదని నిరూపణ యగుచున్నది.

ఇట్లు ఈ 'ప్రక్షిప్త భాగము' బిల్వోదక క్షేత్ర ప్రాంతీయునిచే భారత మంజరీ రచనా కాలమగు 1048కి తరువాతను,* జగన్నాథ విజయ రచనా కాలమగు 1215కు పూర్వమును రచింపబడినట్లు నిర్ధారణ యగుచున్నది.

---

* చూ. P. L. Vaidya — Introduction to Hari Vamsa Chitical Edition, Vol. I, Page XXXIII.

పారిజాతాపహరణమునకు శ్రీకృష్ణుని పురికొల్పినది ఆతని కాంతానునయత్వమే యను విషయమును తొట్టతొలిసారిగా కల్పించినది మూడవ శతాబ్దమునకు చెందిన సర్వసేనుడను రాజకవి రచితమైన హరివిజయమను ప్రాకృత కావ్యమని తెలియుచున్నది. హరివిజయము నేడు అనుపలభ్యము. కాని 10వ శతాబ్దివాడైన ఆనందవర్ధనునకును, 11వ శతాబ్ది వాడైన అభినవగుప్తునకును ఈ కావ్యము పరిచితమే. ప్రసిద్ధేతి వృత్తములలో కవి స్వకపోల కల్పనలను ప్రవేశపెట్టుటను సమర్థించుచు ఆనందవర్ధను డిట్లనుచున్నాడు. 'ఇతివృత్తవశాయాతాం కథం చిద్రసాననుగుణాం స్థితిం త్యక్త్వా పునరుత్ప్రేక్ష్య అభీష్టరసోచిత కథోన్నేయో విధేయః, యథా కాలిదాస ప్రబంధేషు, యథా చ సర్వసేనేన విరచితే హరివిజయే' (ధ్వన్యాలోక. II ). దీనిపై అభినవ గుప్తుని వివరణ "హరివిజయే కాంతానునయాంగత్వేన పారిజాతహరణం నిరూపితం, ఇతిహాసేష్వదృష్టమపే" (లోచన).

ఇట్లు తిమ్మన కావ్యము సంస్కృతీకరింపబడి హరివంశములోనికెక్కినదను వాదము నిరాధారమని తేలినది. ఇట్టీ వాదము పరాస్తమగుటతో తిమ్మన హరివంశము ననుసరించినాడనుటకు గల ఆక్షేపణ తొలగిపోయినది. ఇక విష్ణు పురాణములోని పారిజాత కథ ప్రక్షిప్తమను మాటయే లేదు గనుక దానిని తిమ్మన అనుసరించినా డనునది నిరాక్షేపణీయమే యైనది.

ప్రణయ కుపితయైన సత్య ననునయించుటకే శ్రీకృష్ణుడు పారిజాతము నపహరించినాడను కథ తిమ్మన కల్పన కాదు; రుద్రభట్టు కల్పన కాదు. వీరియువురికంటె వేయి సంవత్సరములకు పూర్వమే ఈ కథ ప్రచారములో నున్నదని తేలుటతోను, తిమ్మన అనుసరించినవి హరివంశ, విష్ణు పురాణములే యని నిరూపణ యగుటతోను అతడు జగన్నాథ విజయము ననుకరించినాడను వాదము నిర్మూలమైనది.

సారాంశము :

రుద్రభట్టు రచించిన జగన్నాథ విజయములో శ్రీకృష్ణుని జన్మ మొదలు సాల్వ వధ వరకు గల ఏకోత్తర శత కృత్యములు కీర్తింపబడినవి. తన కావ్యమునకు విష్ణు పురాణము మాతృక యని రుద్రభట్టు అవతారికలో తెలిపి

యున్నాడు. ఐనను పారిజాతాపహరణ కథా సందర్భమున అతడు హరి వంశము ననుసరించి యున్నాడు.

తిమ్మన తన పారిజాతాపహరణ కావ్యమునకు హరివంశము మాతృక యని సూచించి యున్నాడు. ఐనను అతడు విష్ణు పురాణమును కూడ కొంత వరకు అనుసరించి యున్నాడు.

తిమ్మన కావ్యమునకు హరికథాసారము, జగన్నాథ విజయము అను కన్నడ గ్రంథములు మూలములని ఇటీవల కొందరు పండితులు చెప్పుచు వచ్చినారు. కన్నడములో "హరి కథాసార" మను పేరు గల గ్రంథమే లేదు. ఇక జగన్నాథ విజయమందలి పారిజాతహరణ కథా భాగమునకును, తిమ్మన పారిజాతాపహరణ కావ్యమునకును ఎన్నో పోలికలు కనుపించుచున్నవి. కనుక ముందు పుట్టిన జగన్నాథ విజయమును వెనుక పుట్టిన పారిజాతాపహరణ మనుకరించినదని ఆ పండితులు భ్రమించిరి. కాని ఈ సాదృశ్యములకు కారణము తిమ్మన రుద్రభట్టు కావ్యము ననుకరించుట కాదు. ఈ ఇరువురును హరి వంశ, విష్ణు పురాణముల ననుసరించినవారు కనుక సమాన మాతృకములగు వారి కావ్య ద్వయము మధ్య అప్పచెల్లెండ్ర పోలికల వంటి పోలిక లుండుట సహజము.

జగన్నాథ విజయమునకును, పారిజాతాపహరణమునకును కథాంశము లందు గాని, రచనా విశేషములందు గాని సాదృశ్యములు కనుపించు సందర్భములందెల్ల వానికి హరివంశమందో, విష్ణు పురాణమందో, మరియొక ప్రాచీన కావ్యమందో మాతృకలు కనుపించుచున్నవి. రుద్రభట్టు సొంత కల్పనలలో ఒక్కదానినైనను తిమ్మన స్వీకరింపలేదు. పైగ హరివంశ, విష్ణు పురాణము లందలి కథాంశములను, భావములను, పద బంధములను ఎన్నింటినో రుద్రభట్టు స్వీకరింపక పరిహరించిన వానిని తిమ్మన స్వీకరించి యున్నాడు. కనుక తిమ్మన అనుసరించినది హరివంశ, విష్ణు పురాణములనే గాని జగన్నాథ విజయమును కాదని నిరూపణ యగుచున్నది.

ఇది ఇట్లుండ తిమ్మన హరివంశము ననుసరింపలేదనియు, తిమ్మన కావ్యమే సంస్కృతీకరింపబడి హరి వంశమున ప్రక్షిప్తము గావింపబడిన

డనియు కొందరు పండితులు చెప్పిరి. కాని తిమ్మన కంటెను, రుద్రభట్టు కంటెను కూడ పూర్వమే ఈ పారిజాత కథాభాగము హరివంశములో చేరి యున్నట్లు సాక్ష్యము లభించుచున్నది. 1100 సంవత్సర ప్రాంతమున బిల్వోదక క్షేత్ర ప్రాంతీయు డెవ్వరో ఈ భాగమును రచించినట్లూహించుటకు తగిన ఆధారములు హరివంశమందే లభించు చున్నవి. కనుక రుద్రభట్టు, తిమ్మన లిరువురును హరివంశము ననుసరించి యుండుటలో అసంభావ్యమేమి యును లేదు. ఇక విష్ణు పురాణమందలి పారిజాత కథ ప్రక్షిప్తమను ప్రశ్నయే లేదు. కనుక అదికూడ ఉభయుల కావ్యములకు మాతృక యగుట సుసంభావ్యమే.

ఇట్లు తిమ్మన రుద్రభట్ట కావ్యము ననుసరించినాడను వాదము నిర్మూలమైనది.



# పారిజాతాపహరణము

## జగన్నాథ విజయముతో తులనాత్మ కానుశీలనము

### తృతీయ ప్రకరణము

### అనువాద విధానము :

ఒక మహాకవి ఒక గ్రంథము ననువదించు నప్పుడు గ్రంథమంతటిని 'తు', 'చ' తప్పని 'మక్షికీ మక్షి' అనువాదము చేయడు. వేదతుల్యమైన భారతము ననువదించిన నన్నయాదులు కూడ మూలమునకు కేవలము బానిసలు కాలేదు. మహాప్రౌఢ కావ్యమైన నైషధీయముననువదించునప్పుడు కూడ శ్రీనాథుడు తన స్వాతంత్ర్యమును కోల్పోవలేదు. అట్టిచో ఛాందస పురాణ కథలను రసవత్కావ్య రూపమున సంతరించునపుడు మహాకవులు తమ ప్రతిభను అనేక విధముల ప్రదర్శింపకుండ నుండలేరు.

ప్రసన్నకథాకలితార్థయుక్తి పురాణ ధోరణియు, అక్షరరమ్యత కావ్య ధోరణియు ననవచ్చును. పురాణములు నానాసూక్తి నిధులు, కావ్యములు నానా రుచిరార్థ నిధులు. శివేతరక్షతియు, ఉపదేశకతయు పురాణముల ప్రధాన లక్ష్యములు; కాగా సద్యః పరనిర్వృతియు, కాంతాసమ్మితత్వమును కావ్యముల ప్రధాన లక్ష్యములు.

కవులు పవిత్ర గంగాతోయములను గూడ వడియగట్టి, తేర్చి, ఆ పైన కలకండ, ఏలకులు, కుంకుమ పువ్వు ఇత్యాదులు చేర్చి కమ్మని పానకముగా చేసికొని త్రాగుట కభిలషింతురు. ఈ పానకమువందలి ముఖ్య పదార్థము గంగా జలమే. ఐనను దానికి వారు గావించు సంస్కార విశేషము వలన దానికి పావనత్వమునకు తోడు మధురిమయు సౌరభము కూడ చేరి గంగామతల్లి యెడ పవిత్ర భావన లేని వారికి గూడ స్పృహణీయమగుచున్నది. పురాణ కథలకు కావ్య కవులు చేయు సంస్కారమట్టిది.

ఈ సంస్కారము పలు విధములుగ నుండును.

1. మూలము నందు సంగ్రహముగ నున్న వర్ణనాదులను విపుల పరచుట.
2. విస్తృతములైన నీరస ప్రసంగములను మట్టసముగా సంక్షిప్త పరచుట.
3. విరసములని తోచిన భాగములను పూర్తిగ పరిహరించుట.
4. దేశకాలానుగుణములగు అభిరుచుల కనుగుణముగ మార్చుట.

5. పరసములైన నూతన స్వతంత్ర కల్పనలను చేయుట.

6. పై సంస్కారములకు తోడు బింబప్రతిబింబ తుల్యములైన యథామాతృకానువాదములు కూడ కొన్ని పట్టులలో వారు చేయుదురు.

వీనినే మనము సంగ్రహముగ 1. విపులీకరణ, 2. సంగ్రహీకరణ, 3. పరిహరణ, 4. పరివర్తన, 5. నూత్నకల్పన, 6. యథాతథానువాదము అని చెప్పవచ్చును. హరివంశ విష్ణు పురాణములను ముడి దినుసులతో కావ్యములను కజ్జాయములను సిద్ధపరచుటలో తిమ్మన రుద్రభట్టులు గావించిన సంస్కార విశేషముల నారయుదము.

## తిమ్మన అనువాదము :

ముందుగా తిమ్మన గావించిన అనువాదపు తీరులను పరిశీలింతము.

### 1. విపులీకరణ :

1. హరివంశమందలి 'ప్రాప్తదారః' (౬౫-4) అను నాలుగక్షరముల పదము తిమ్మన చేతిలో నాలుగుపాదముల పద్యమైనది.

'మఱియు రుక్మిణి సత్య జాంబవతిమిత్ర
వింద భద్ర సుదంత కాళింది లక్ష
ణ యనఁగా నున్న కలరబ్జనాభునకును
మహిషులెనమండ్రు సమతాభిమానవతులు.' (I. 38)

2. 'నారదోభ్యాయయౌ మునిః' (హరి. ౬౫-12) అని పాడిమాటలు గల ఒక అనుష్టుప్ పాదములో చెప్పబడిన నారదాగమనము తెలుగులో అనేకాలంకార భూషిత నారద స్వరూప సాక్షాత్కార సమర్థమైన నిండు సీస పద్యము నాక్రమించినది.

'సరిగమపదనిస. . . . . . . దైత్యారికడకు.' (I. 44)

3. 'పారిజాతతరోః పుష్పం దదౌ కృష్ణస్య భారత' (హరి౬౫-14) అని నిరుపచారముగ చెప్పబడిన పారిజాత పుష్పము ఉత్ప్రేక్షాగర్భితములు, వృత్త్యనుప్రాస శోభితములునైన మూడు దీర్ఘ సమాసములచే గౌరవింపబడినది.

'............ నిజవాసనా బిరుద గాథాకథన వంది బృందాయ మానేందిందిరంబును, నుచితోపయోగ జనితానంద బాష్ప సందోహాశంకావహ మకరంద

బిందుతుందిలంబును, నిఖిల మనోరథ ప్రదాన కీర్తి శంకాకర విశద ప్రభా నిచుళితంబునగు పారిజాతంపు క్రొన్నన. . .' (I 52)

ఇక 'దదౌ' అను రెండక్షరముల కనువాదమిది :

'. . . . అమందానందంబు డెందంబునంగ్రందుకొన. . . మిన్నేటి పసిండి నెత్తమ్మి చిగురుటాకునం బొదివి యిచ్చిన.' (I 52)

దివ్య కుసుమమును నారదుడెంతటి శ్రద్ధా భక్తి సౌకుమార్యములతో లలిత నాగరకముగా తెచ్చియిచ్చినాడో, తిమ్మన ఒక్కొక్క సరస భావ సుమమును అంతటి శ్రద్ధాభక్తి సౌకుమార్యములతో లలిత పద బంధ కిసలయపుటమున పొదివి ఇచ్చును. తిమ్మనార్యుని భావ సౌకుమార్య, పదలాలిత్య, బంధకోమలత్వ, శయ్యామార్దవ, ఔపచారిక నాగరకతలకీ చిన్ని వచన మొక మచ్చుతునక.

4. 'తద్వృక్షరాజ కుసుమం రుక్మిణ్యాః ప్రదదౌ హరిః' (హరి. ౬౫-15)

నారదు డొసగిన పుష్పమును వెంటనే ఎట్టి ఆలోచనము లేకుండగనే కృష్ణుడు రుక్మిణి కొసగినాడని సంస్కృతపురాణోక్తి. తెలుగుకావ్యమున సత్యభామా విధేయుడైన కృష్ణుడంత త్వరగ పుష్పమును రుక్మిణికీయలేదు.

'వినయంబు విస్మయంబును. . . . నిలువన్' (I 53)

'ఇది భోజాత్మజకు. . . . కాంతకున్' (I 54)

'కనుఁగవఁ జిన్న నవ్వు. . . . ఇచ్చినన్' (I 55) అని యెంతయో తడవు మూడు పద్యములలో తర్క వితర్కములు గావించుకొని, చివరకు నారదుని కనుసన్నవలన ప్రోత్సహితుడైగాని కృష్ణుడు పుష్పమును రుక్మిణి కొసంగలేదు. అతనికి సత్య యెడగల భయభక్తులీ పట్టున చక్కగ వ్యక్తమైనవి. నారదుని కనుగవయందు తొలికిన పిన్న నవ్వు వెనుక నుండి కృష్ణుని దక్షిణ నాయకత్వపు 'సౌఖ్యము' నెడల సానుభూతితో గూడిన పరిహాసము, దాని వెనుక నారదుని కలహ ప్రియత్వము, పారిజాత కథా నాటక సూత్రధారిత్వమును తొంగి చూచు చున్నవి. ఇట్టి సూక్ష్మ మనస్తత్వ చిత్రణము వలననే తిమ్మనార్యుని పాత్రలు సజీవములై పాఠకుని హృదయము నాకట్టు కొనగలుగుచున్నవి.

5. 'త్రైలోక్య రూప సర్వస్వం నారాయణ మనోహరా

శుశుభే దేవపుష్పేణ ద్విగుణం భైష్మకీ తదా' (హరి. ౬౫-17)

పారిజాతపుష్ప ధారణము వలన ఇమ్మడియైన రుక్మిణీ సౌందర్యమును ప్రశంసించుటకు 'వ్యాసుడు' ఒక చిన్న శ్లోకము చాలుననుకొనినాడు. తిమ్మనకు రెండున్నర పద్యములు - అందులో నొకటి సీసము - చెప్పినగాని తృప్తి కలుగలేదు.

'. . . . తగ భోజనందనయు . . . . కాంతి సంపదన్' (I 55)

'మగమీల నగఁజాలు. . . . సతికి (I 56)

'కలకంఠకంఠి. . . . పొలుపొందంగా (I 57)

పారిజాతమునకు లేతనెల తోడను, రుక్మిణికి పులుగడిగిన ముత్తియము తోడను చెప్పబడిన ఔపమ్యము నందలి సౌందర్యము ఎంతయు హృదయంగమముగా నున్నది. రుక్మిణి పుష్పమును ధరించుటకు ముందు నారదునకు మ్రొక్కినదని చెప్పుట వలన ఆమె వినయ భావమును, కృతజ్ఞతా బుద్ధిని, సంప్రదాయౌచిత్య జ్ఞానమును, సాధుసౌశీల్యమును తిమ్మన అతి నిపుణముగా సూచించిన వాడైనాడు.

6. 'అమ్లాన మేతత్సతతం పుష్పం భవతి కామిని' (హరి. ౬౫-20) అను శ్లోకార్థము ఒక నిండు పద్యమైనది.

'పరిమళము సెడదు వాడదు
పరువము దప్పదు పరాగభర భరితంబై
నిరతము జగదేకమనో
హరమగు నీ కుసుమరాజమంబుజవదనా! (I 59)

'అమ్లానం' అనుటకు 'వాడదు' అనుట సరిపోగా మిగిలిన దంతయు తిమ్మన పెంపకమే.

7. అట్లే 'శీతోష్ణం చేచ్ఛితే దేవి పుష్పమేతత్ప్రయచ్ఛతి (౬౫-22) అను శ్లోకార్థము కూడ వ్యాఖ్యా ప్రాయమైన నిండు పద్యమై వెలసినది.

'వెలకొని వేసవిఁ జలువయుఁ
జలివేళల నుష్ణ గుణము సముచిత భంగిన్

గలిగించు వీలతాంతము

కొలదులు చెప్పంగ నిచ్చ క్రొత్తలు సుమ్మీ' (I 63)

8. 'ప్రదీపకర్మ రాత్రౌచకరోతి కమలేక్షణే' (ఉ.౫-27) అను అనుష్టుభర్ధము ఒక మత్తేభముగా విస్తరిల్లినది.

'అలినీలాలక నీవు నీపతి రహస్యక్రీడ వర్తించు వే

ళ లతాంతాయుధ సంగరంబునకు నుత్సాహంబు గల్పించు ను

జ్జ్వల దీపాంకురమై, రతిశ్రమ తనూ సంజాత ధారాళఘ

ర్మలవంబుల్ దొలఁగింపఁగా సురటియై రంజిల్లు నిచ్ఛాగతిన్' (I 60)

తెలుగులో పారిజాతము మంద ప్రకాశము నొసంగు దీపాంకురమే గాని సంస్కృతములో వలె ఉజ్వల ప్రకాశము నోసంగు ప్రదీపము కాదు. కారణము అది రహస్య క్రీడా సమయోప యోగి గనుక. పారిజాతము సురటియై రంజిల్లునను అదనపు భావము పాఠకగ్రాహకునకు తిమ్మన బేహారి యొసగిన కొసరు.

9. 'అద్య సాత్రాజితీ దేవీ జ్ఞాస్యతే వరవర్ణినీ

సౌభాగ్యాద్యాం సదా వేత్తి యాత్మానం సుభగా సతీ' (పారిఉ.౫-39)

అని మూలములో నారదుడు రుక్మిణీ సమక్షమున సత్య పేరును ఒక్కసారి మాత్రమే స్మరించినాడు. అందలి ఎత్తి పొడుపు కూడ అంతగాటుగా లేదు. సత్యకు తీవ్ర కోపము తెప్పించుటకిది చాలదని తిమ్మన నారదునిచే రెండు పెద్ద పద్యములలో కొంచెము గాటుగా సత్యానింద చేయించినాడు.

'ఇన్ని దినంబులున్ . . . . ఇచ్చెనే.' (I 65)

'చక్కని దానవంచు . . . . విన్న వించినన్.' (I 66)

10. 'ప్రాయేణ ప్రవదంతిస్మ హృష్టా దామోదరస్త్రియః

మమ్పృషే వ సపత్న్యస్తు . . . . ' (హరి ఉ.౫-69)

అమటకు విపులీకరణ :

'. . . . . . . . తగవేయని లక్షణ యోర్చె, సైఁచెఁ గాళింది,

శమించె భద్ర, యవులెమ్మని యూరడిలెన్ సుదంత, లోఁ

గుందుట మానె జాంబవతి, కోపమడంచెను మిత్రవిందయున్'(I 79)

11. సత్య భామ పారిజాత వృత్తాంతమును తన చెలికత్తె వలన వినుటను హరివంశము 'శ్రుత్వా' (౬౫-50) అని ఒక్కమాటతో తేల్చివేసినది. అనువాదమో ఎనిమిది పద్యములుగా పెరిగినది.

'అని సత్యభామ. . . . . . . వారిజనేత్రా' (I 74-81)

యజమానురాంద్ర ఇచ్చకములకై సపత్నుల నేరములను 'ఉన్నవి లేనివి' పుట్టించి, గోరంతలు కొండంతలుగా పెంచి వారి మధ్య మాత్సర్యాగ్నిని ప్రజ్వరిల్ల జేయుటే జీవికగా గల నీచదాసీ జన స్వభావమిందతిసహజముగా ప్రకటమగు చున్నది.

12. సత్యకు కలిగిన ఈసును 'ఈర్ష్యా వశంగతా' (౬౫-50) అని హరివంశము ఒక్కముక్కతో తేల్చి చేసినది. తిమ్మన స్త్రీ స్వభావమునకు దర్పణము లనదగిన 15 పద్యములను, ఆడునోటికి మాత్రమే అలవడగల నుడికారపు పలుకు బడిగలవానిని, అత్యంత రసవంతమైన వానిని, సత్యచే పలికించినాడు. ఇందలి ఒక్కొక్క పద్యము ఒక్కొక్క అనర్ఘరత్నము.

'ఏమేమీ. . . . చెలియా.' (ఐ. 83 - 97)

13. 'సంపస్ఫృత్య సంపస్ఫృత్య శిరః సరోషం

ప్రకంపమానా కోపోవవిష్టా.' (౬౫-54)

అను అర్ధ శ్లోకము నందలి సత్య తపన ఒక హృద్యమైన ఉపమను సంతరించుకొని ఒకచంపకమాల నిండుగ విస్తరిల్లినది.

'వెడవెడఁ గన్నుమూయు. . . . పెంపఅన్ (I 101)

14. 'జగామ త్వరితశ్చైవ సత్యభామా గృహం మహత్' (హరి.౬౬54)

ఆ 'త్వర' ఎట్టిదో ఒక చంపకమాల విస్తృతిలో మూడు ఉపమలతో తెలివిడి చేయబడినది.

'అరదమువెక్కి........ వీధికిన్' (I 104)

15. 'ప్రేష్యా జనం స సంజ్ఞాయ అనాఖ్యేయోస్మీతి సంజ్ఞసన్' (౬౬ -13)

కపటనటనాపటువైన కృష్ణుని పన్నుల వివరములు తెలుగులో చూడదగియున్నవి.

కొందఱ మంతనంబులను ..... చేరఁబోయి' (I 108)

16. 'అన్వగమత్ సతాం.' (౬౬ -13)

ఈ ఆరు అక్షరములు ఒక స్మరణాలంకారమును సంతరించుకొని అర్థోత్పలమైనది.

'మధ్యందిన భాను మండల.... విస్మితాత్ముఁడై.' (I 108)

17. 'గ్రహాయ వ్యజనం చైవ స్థిత్వా స పరిపార్శ్వతః

శనైరివాసృజద్వాతం జహాస శనకైరివ.' (హరి. ౬౬ -14)

ఈ భావమిట్లు విస్తరింపబడినది.

'ఈ లలితాంగి చందము .... కైవడిన్' (I 109).

అనువాదమున క్రొత్తగ చేరిన ఉత్ప్రేక్ష అక్షర లక్షలు చేయునది.

18. 'కిమకార్ష మహం దేవి విప్రియం తవ భామిని.' (౬౬ -40)

ఈ భావమిట్లు చిలవలు పలవలు వేసినది.

'మనమఱయం దలంచి.... నేర్తువే.' (I 110)

19. 'నాహం త్వాం కితవం ధూర్తమజ్ఞాసిష మరిందమ' (౬౭ -25)

మూలము నందలి 'కితవ' 'ధూర్త' శబ్దములు మాత్రమైన చాలవని తెలుగు సత్య కృష్ణుని మాయలను ఒక వృత్తములో గట్టిగ తిట్టినది.

'గట్టిన చేతలుం....... ఏమి చేయుదున్.' (I 127)

20. 'తతః స్నాతో జగన్నాథః సర్వేశః సర్వభావనః' (౬౭ -13)

మూలములో ఇట్లు మాట మాత్రముతో ముగిసిన శ్రీకృష్ణ దేవుని స్నానభోగము తెలుగులో 13 పద్యములాక్రమించినది.

'సరసాలాపములన్. . . . . . నీరాజనముల్. (I 3-15)

ఈ భోగము శ్రీకృష్ణునదైనను కాకున్నను శ్రీకృష్ణ దేవరాయలదగుట మాత్రము నిశ్చయము.

21. 'అభ్యాజగామ స స్నాత్వా ముని శ్రేష్ఠో మహోదధౌ.' (౬౭ -38)ఔ

సంస్కృత నారదుడు స్నాన మాత్రమాచరింపగా తెలుగు నారదుడు మాధ్యాహ్నిక సంధ్యా వందనాదులు గూడ కావించినాడు.

'చనుదెంచె. . . . .. నిష్ఠాపరుఁడై.' (II -16 - 16)

22. 'అథోపకల్పయామాస సుఖాసీనాయ కేశవః

పరమాన్నం స మునయే పరమాత్మా జగద్గురుః

తల్లోకర్త్రా సత్కృత్య దత్తం మునిరుదారధీః

బుభుజే వదతాం శ్రేష్ఠః శ్రద్ధయా పరయా యుతః (౬౭ -41,42)

రెండు శ్లోకములలో లఘువుగా ముగిసిన నారద భోజనము 5 పద్యములుగా బరువైనది.

'అతనికి సత్యభామ . . . . పతియున్.' ( II -17-21)

తెలుగువారి మర్యాదననుసరించి గృహమేధి కూడ సపుత్ర బాంధవుడై అతిథితో సహపంక్తిన భుజించుట, భోజనాంతరము జాలవల్లికలో తాంబూలము లిప్పించుట విశేషము. తెలుగువారికి పరమాన్నమనగా క్షీరాన్నమనియే అర్థము. అది యొక్కటి చాలదని తిమ్మన నారదునకు భక్ష్య భోజ్య లేహ్య చోష్య పానీయములను వడ్డింప జేసినాడు. ఆ వడ్డించువారు అలరుబోడులగుటచే వారి కంకణముల గలగలలు, కింకిణుల చిణిచిణులు, మట్టియల గులుగులులు, దువ్వలువల ఫెళఫెళలు ఆ విందునకు అదనపు భోగ్యత నొసగినవి.

23. 'యథైదానీం తథైవ త్వం భవ దేవి పతివ్రతా

సవిశేషం సుభగా భవ మత్తపసో బలాత్' (హరి. (౬౭ -45)

అని సంస్కృత నారదుడు సత్యను ఒకే ఒక శ్లోకముతో ఆశీర్వదింపగా తెలుగు నారదుడు ముచ్చటగా మూడు పద్యములలో దీవించినాడు.

'పతి నీవై విహరింపఁగా. . . . దీవనలన్.' (II- 24-26)

మాటలో మాటగా పారిజాతానయనమునకై శ్రీకృష్ణుని వెంట నీవు కూడ అమరావతికేగుమను సూచనను చల్లగా జార్చినాడు. ఇది నీళ్ళలో నిప్పు పుట్టింపగల నారదుని వదతాం వరత్వమున కొక మచ్చు.

24. 'స పక్ష బలవిక్షేపైః హిమాద్రి శిఖరోపమః

దిక్షు సర్వాసు సంహ్రాదం జనయామాస పక్షిరాట్

ఆరుజన్ పర్వతాగ్రాణి పాదపాంశ్చ సముత్క్షిపన్

సంజహార మహాభ్రాణి విజహార చ కానిచిత్

విషయం సమతిక్రమ్య దేవయోశ్చంద్ర సూర్యయోః

యయౌ వాతజవో పక్షీ జనార్దన వశే స్థితః (హరి(౬౪45-47) అని హరివంశములో 3 శ్లోకములలోను

'గరుడో వారుణం ఛత్రం తథైవమణి పర్వతమ్

సభార్యంచ హృషీకేశం లీలయైవ వహన్ యయౌ (విష్ణు. 30-1)

అని విష్ణు పురాణములో ఒక శ్లోకములోను చెప్పబడిన పక్షిరాట్టు. ఆకాశయానము అనువాదములో 7 పద్యములుగా సాగినది.

'ఆ విహగా వతంసము. . . . . హరియున్,' (II 77-83)

25. 'స మేరుగిరి మాసాద్య దేవగంధర్వసేవితమ్' (హరి. (౬౪ 48)

అని అర్ధ శ్లోకములో చెప్పబడిన మేరుపర్వతము తెలుగున 3 పద్యములు, 36 పంక్తుల దీర్ఘ గద్యములో వర్ణింపబడినది, బంగరు కొండకు ఆ ఆ మాత్రము గౌరవము చూపనక్కర లేదా మరి?

'కువలయ పద్మనేత్రి . . . . . . మెఱయునిది. . ' (II 85-88)

26. 'దేవసద్మాని సర్వాణి దదర్శ మధుసూదనః

విశ్వేషాం మరుతాం చైవ సాధ్యానాం చ జనాధిప

భ్రాజమానా నతిక్రామన్ విశ్విహోశ్చ పరంతప

ప్రాప్య పుణ్యతమాన్ లోకాన్ దేవలోక మరిందమ

శక్రసద్మ సమాసాద్య ప్రవివేశ జనార్దనః' (హరి.(౬౪ 48-50)

నాకలోక వర్ణనమైన ఈ రెండున్నర శ్లోకములు 12 పద్యములైనవి.

' కిన్నరకంఠి. . . . . . ద్వీపమున్.' (II-89-100)

27. 'అవతీర్య స తార్క్ష్యాత్తు' (హరి. (౬౪ 51)

అనునొక్క పాదము మూడు పద్యములకు మూలమైనది.

'అవి నాకపుర. . . . . . .రహిన్' (II 101 -103)

28. ప్రీతశ్చైవాభ్యనద్దత్తం దేవరాజ శ్శతక్రతుః

అర్చితో దేవరాజేన రత్నైశ్చ ప్రతిపూజితః (హరి. (౬౪ 53)

అని హరివంశములో ఒక్క శ్లోకములోను

'ఉపతస్థుః తదా దేవా! పార్శ్వహస్తా జనార్దనమ్

స దేవైరర్చితో కృష్ణః . . . . . ' (విష్ణు. 30 - 2,3)

అని విష్ణు పురాణములో ముక్కాలు శ్లోకములోను ముగిసిన దేవతా స్వాగతము తెలుగులో కృష్ణునకు 8 పద్యములలో లభించినది.

'అంతకుమున్న . . . . . . . . .కీర్తనీయుఁడై.' (II 3 -10)

29. 'తత్రాదితి ముపాప్యస్త్రీం అప్సరాభి స్సమన్వతః

దదృశాతే మహాభాగౌ మహాభాగాం తపోన్వితామ్.' (హరి. (౬౪ 55)

ఈ అదితి సందర్శనము విష్ణు పురాణములో 'దదృశే దితిమ్' (30-3) అనుటతో ముగిసినది. దీని అనువాదమొక సీస పద్యము.

'తొడలపై . . . . . . . . అదితిఁగనియె' (III 24)

డా. చిలుకూరి నారాయణరావుగారి మాటలలో 'ముదుసలి తొక్కు అదితి ఎంత ముద్దుగా నున్నది.[1]

30. 'స తాం ప్రణమ్య శక్రేణ సహ తే కుండలోత్తమే, దదౌ' (విష్ణు. 30-3) దీనికి తెలుగు.

'కని సత్యారమణీ. . . . . మొసంగ.' (III 25)

కృష్ణునకు పూర్వ జన్మపు తల్లి యెడగల భక్తి శ్రద్ధలు ఆమె కుండలములను ఎంత భద్రముగా తెచ్చి సమర్పించినాడనుట బట్టి తెలియు చున్నది.

31. 'తతోదదర్శ కృష్ణోపి సత్యభామా సహాయవాన్

దేవోద్యానాని హృద్యాని నందనాదీని సత్తమ.' (విష్ణు 30-30) మాటల పిసినారితనములో హరివంశము విష్ణు పురాణమును మించినది. సత్యా కృష్ణుల నందనవన విహారమును ఒక్క శ్లోకపాదములో తేల్చివేసినది.

'దేవాక్రీడం పరిక్రామన్' (హరి. (౬౪ 65)

ఈ వన విహారమును తిమ్మన కవీంద్రుడు 57 పద్యములలో (III 42-58 IV 2-41) అతి మనోహరముగా వర్ణించిన విధమాతని వర్ణనా ప్రతిభకు సాక్షి. వనవిహారము, పుష్పాపచయము, జలక్రీడ అను వర్ణనలను ఈ సందర్భమున తిమ్మన కల్పించినాడు.

32. సర్వార్థప్రదమైన పారిజాతమును వర్ణించుటకు హరివంశ విష్ణు పురాణములు రెండు రెండున్నర శ్లోకముల కంటే వెచ్చింప లేకపోయినవి. (హరి. ౬౪ 65,67విష్ణు. 31,32) తిమ్మన 8 పెద్ద పద్యములు వ్రాసినాడు.

'అమరారాతి విఘాతి. . . . . . . అన్ని పువ్వులన్ ( IV- 3-10)

33. ప్రధాన విషయము పారిజాతాపహరణముగదా.

'ఉత్పాట్యారోపయామాస విష్ణు స్తం గరుడోపరి.' (హరి(౬౪68)

'. . . . . . . . . . . . . . .పారిజాతం మహాబలః

ఉత్పాట్యారోపయామాస పారిజాతం సతాంగతిః

గరుడం పక్షిరాజానమయత్నే నైవ భారత.' (హరి. 23, 9,10) అవి అర కొర

శ్లోకములతో రెండుసార్లు హరివంశము

'. . . . . . . పారిజాతంగరుత్మతి

ఆరోపయామాస హరిః. . . . ' (విష్ణు. 30-38) అని విష్ణు పురాణమును అయినవదనిపించినవి. తిమ్మన 5 పెద్ద పద్యములు వ్రాసినాడు.

'సకల సురైక వంద్యుఁడగు. . . . . . అందఱున్ (IV-51-55)

34. ఇంద్రుని యుద్ధ ప్రయత్నములను హరివంశము ఒక్క శ్లోకముతోను, విష్ణు పురాణమురెండు శ్లోకములతోను చెప్పినది.

తిమ్మన యుద్ధ ప్రయత్నములు - తిమ్మనవికావు. దేవేంద్రునివే, కానిచో కృష్ణరాయలవి - 28 పద్యముల వరకు సాగినవి.

'కోణ పరంపరాహతుల........నిండెనొక్కటన్.' (౬౭ -V-3)

35. 'గరుత్మానపి తుండేన పక్షాభ్యాం చ నఖాంకురైః

భక్ష యంస్తాడయన్ దేహాన్ దారయంశ్చ చచార వై.' (విష్ణు. 30-64) ఖగరాజ చక్రవర్తి వీరవిహారమును తిమ్మన ఒకసీస పద్యములో అత్యంత భీషణ రమణీయముగ చిత్రించినాడు.

'హరిబాణలూనంబు. . . . . . చక్రవర్తి,' (V-8)

36. యుద్ధమును విష్ణు పురాణము13 శ్లోకములలో వర్ణించినది.

'తతో నిరీక్ష్య. . . . . . సుదర్శనమ్.' (విష్ణు. 30-55-67) తిమ్మన దానిని 34 పద్య (గద్య)ములుగా విస్తరించినాడు.

'ఆ కమలాయతాక్షి. . . . . . చేపట్టుటయును'. (V- 4-37)

37. 'ఛిన్నేష్వశేష బాణేషు శస్త్రేష్వ స్త్రేషుచ, (విష్ణు. 30-67)

యుద్ధ ఘట్ట మందలిదే యైన పై అర్ధ శ్లోకము తిమ్మన చేతిలో ఒక సీసముగా పెంపుగాంచినది.

'కినిసి బిడౌజుఁడు. . . . .అగునె.' (V30)

38. జగ్రాహ వాసవో వజ్రమ్' (విష్ణు. 30 -67)

దీనికి తెలుగొక పూర్తి వృత్తము.

'కులవసుధా ధరావళికిఁ గుంటి తవంబొదవించెనెద్దియా

బలితపుఁ గైదువుం గొని సుపర్వకులాగ్రణి వేయుఁ గన్నులం

దలకొని కౌస్తుభస్తబకితంబగు శౌరి యురంబు సూచిన

న్జలజదళోదరోదకము చాడ్పున నల్లలలాడె లోకముల్.' (V33)

39. 'క్షిప్తం వజ్రం మహేంద్రేణ' (వి. 30 - 69)

దీని యనువాదము రెండు వృత్తములు. వానిలో నొకటి మహాస్రగ్ధర.

'వీరుఁడవాదు. . . . . .పూచినైచినన్.' (V34)

'శతధారా. . . . . యేగు దేరన్' (V35)

40. 'జగ్రాహ భగవాన్ హరిః' (విష్ణు. 30-69)

దీనికిని తెనిగింపు ఒక వృత్తమైనది.

'కని వెమ్మోమునఁ చిన్న నవ్వు దొలఁకం గంపారి విశ్శంకఁ దా

ర్ప్యుని నడ్డంబుగ ద్రిప్పి వేగ రవితేజో దుష్ప్రహస్ఫూర్తి మైఁ

దమదాయన్నతకోటిఁ గేలి శతపత్రక్రీడఁ బట్టెం గటా

క్షనిరీక్షాగతి వందకత్సరు కిణాంకంబైన హస్తంబునన్.' (V-36)

41. 'ససాత్యకిః సపుత్రశ్చ ప్రాప్తో రైవతకం గిరిమ్' (హరి. (౭౫-45)

'. . . . . . . . . . . . ఆజగామ భువం హరిః

ప్రసక్తైః సిద్ధ గంధర్వైః స్తూయమానః సురర్షిభిః' (విష్ణు (౩౦ 9) అరకొర శ్లోకములలో చెప్పబడిన కృష్ణుని తిరుగుప్రయాణము తిమ్మన రచనలో రెండు పెద్ద పద్యములైనది.

'గంధర్వోరగ.. . . . . . . ఉప్పొంగఁగన్' (V 41)

'వాసవుతోడి. . . . . .చయ్యనన్' (V 42)

42. 'తం దివ్యకుసుమం వృక్షం దృష్ట్వా నర్తనివాసినః
రాజన్న తత్పుపుర్వృష్టాః పశ్యమానా మహోదయమ్.' (హరి.)

ఆ మహోదయపు వివరములు తెలుగులోనే కలవు.

'ఆ మహి జాతముం గనిన యంతటిలో ధనధాన్య రాశితో
సామజ ఘోటికా మహిత శాలలతో మణిసౌధ పంక్తితో
గోమహిషీశతాంగ భటకోటులతో మణిభూషణాళితోఁ
దామర తంపరై తనరెఁ దత్పురిఁ గింపచ గేహ వాటికల్.' (V 45)

43. 'వృక్షోత్తమం పశ్యతాం వై వృద్ధానా మగమజ్జరా.' (హరి)

వృద్ధులకు పునర్యౌవనము వచ్చిన విధమెట్టిదనిన.

'బెరసెన్నైన విగిడ్చినట్లు వళులుబ్బెన్దుర్బలాంగంబు లం
కురముల్మాసెరదంబు లంఘ్రుల వడంకు ల్దీతె వాలారులై
కరజంబు ల్చిగిరించెఁ గేశవితతుల్గప్పారె వృద్ధా లికిన్
మరలం బ్రాయము వచ్చెఁ దత్తరు చలన్మందానిలా సంగతిన్'(V 46)

44. 'తతో ద్విజం శుచిం దాంతం జ్ఞాన విజ్ఞాన కోవిదమ్
భోజయేచ్చ యథా శక్త్యా సహాభర్త్రా సుమధ్యమే.' (హరి. 20-21)

పుణ్యకవ్రత దానగ్రహీత మూలమందు మూడు విశేషణములు గలవాడు అనువాదమున ఎనిమిది విశేషణములు గలవాడైనాడు.

'పరమాచార ధురీణు, నధ్యయన సంపన్ను, న్శుభాచారు, శా
స్త్రరహస్యజ్ఞు, విశిష్ట వంశజుఁ, బ్రశాంత స్వాంతు, సద్యద్దయా
పరతంత్రున్, విదితాత్ము, భూసురవరుం బ్రార్థించి యాచార్యుఁగాఁ
దరళాక్షీ నియమింపఁగా దగు వ్రతో ద్యాప క్రియా వేళకున్,' (V 59)

45. 'నిమంత్రితా గణాస్సర్వే కేశవేన మహాత్మనా' (హరి. 21-22)

పుణ్యకవ్రత దర్శనార్హులై యరుదెంచిన 'సర్వే' ఒక సీస పద్యములో వివరింపబడినారు.

'యదువృష్ణి . . . . .అభ్యుదయమునకు. (V 64)

46. 'పుష్ప దామావసజ్యాథ కంఠే కృష్ణస్య భామినీ

బబంధ కృష్ణం సుభగా పారిజాతే వనస్పతౌ.' (హరి. (౭౬5)౫

పొడిపొడి నుడులతో కూడిన ఈ శ్లోకము లలిత కోమల శృంగార భక్తి భావ భరితమై, సుశ్రావ్య వర్ణ విన్యాసముతో అలంకృతి చమత్కృతి భరితములైన రెండు పద్యములుగా రూపుగొన్నది.

'మునిపతి యానతిం జకిత ముగ్ధమృగీతరలాక్షి ప్రాణనా

థునిఁ గనకాంబరాంచలముతోఁ గుసుమాయుధ వాగురా నిబం

ధనమును బోని క్రొవ్విరులదండఁ దగుల్కొన జుట్టె వేడ్కఁ గ

ల్పవగముఁ గూడఁ గంకణ ఝుళంఝుళ మంజుల దోర్యుగంబునన్ (V 79)

'పరమముని మానసాలాన బంధనమునఁ

గట్టువడకుండు యాదవ కుంజరంబు

వికచ రాజీవనేత్రచే వేల్పు మ్రానఁ

గమ్మ పూవుల దండ చేఁ గట్టువడియె.' (V 80)

మొదటి పద్యమున సత్య భామ కంకణముల ఝుళంఝుళలు వీనుల విందు చేయుచున్నవి. రెండవ పద్యమున సత్యామహిమ వెల్లడియైనది. శ్రీకృష్ణుని కట్టి వేయగల శక్తి యశోదకే లభించినది. మరల సత్యకే లభించినది. యశోద కృష్ణుని కట్టి వేయుట కెంతయో కష్టపడవలసి వచ్చెను. సత్య అతనిని అవలీలగ కట్టివేయగలిగినది.

47. 'అద్భిర్దదౌ నారదాయ తతో నుజ్ఞాప్య కేశవమ్.' (హరి. ౭౬ 6)

అర్ధశ్లోకములో చెప్పబడిన ఈ భర్తృదాన ఘట్టమును తిమ్మన నాటకీయముగ పెంపొందించి నాలుగు పద్యముల సరస సంభాషణలు కూర్చినాడు.

'వికచాబ్జనేత్ర. . . . . . . . . . . . యాదవాన్వయ తిలకున్.' (V 76)

'అనవుడు సత్యభామ. . . . . . . చిఱునవ్విఁగుర్పఁగన్.' (V 77)

'నవచంద్రాలిక. . . . . . . . ఏపారఁగన్.' (V 78)

'సమయజ్ఞుండయి. . . . . . . . . మోదంబునన్. (V 82)

48. 'పరిహాసాన్ బహువిధాన్ కృత్వా మునివరస్తథా.' (హరి. ౭౫-11)

తిమ్మన ఈ పరిహాసములను ఒక సీసము నిండ నింపినాడు.

'మేళవించినవి. . . . . . . . పనులు గొనియె,' (V 86)

'ఇది భక్తుడు భగవంతునితో ఆడుకొనుట. ఇట్టి పద్యము ఇతర దేశములలో, ఇతర సారస్వతములలో నుండదు. భారత దేశముననే, ఈ సారస్వతములోననే యుండవలెను. శతవిధాలమరియొక కవివ్రాసి యుండదు. తెలుగులో కూడ ఒక్క ముక్కుతిమ్మన్నయే వ్రాసెను[2]

49. 'సాన్తఃపురో మహాతేజాః పరమర్ద్యా వసన్నృప.'

రేమే. . . . . . . . . ' (హరి. (౭౬ 25)

కృష్ణుని అంతఃపురర్ధిని తిమ్మన పుష్కలమైన ఉద్దీపనాలంబనాత్మక విభావ సామగ్రితో నాలుగు పద్యములుగ పెంపుగావించినాడు.

'ఆరమణీలలామల. . . . . . . . వసించుచున్. (I 39)

'తలిరులతుద. . . . . . . . . . . . తోఁటల లోనన్. (V102)

'దరదళదంబుజ. . . . . . . .స్థలులన్.' (V103)

'మరకత గోమేదక. . . . . . కందరలన్,' (V104)

50. 'రేమే' యను రెండక్షరములకు తాత్పర్యము రెండు పద్యములు. ఒకటి వృత్తము, మరొకటి సీసము, ఒకటి గ్రంథాది యందు; మరొకటి గ్రంథాంతమున.

'ఏయే వేళల వే సరోజముఖి. .. .. .. . . . . .చాతురిన్.' (I 40)

'భోజకన్యా.. . . . . . . . . . . .వర్తిష్ణుఁడగుచు' (V101)

అనగా గ్రంథమంతట శ్రీకృష్ణుని రమించుటయే శ్రీకృష్ణ రతియే వ్యాప్తమై యున్నదన్నమాట.

తిమ్మకవీంద్రుడు గావించిన ఈ రసవంతములగు విపులీకరణల వలన కావ్యమునకు గాత్ర వృద్ధితోబాటు సత్త్వ వృద్ధియునైనదనుటకు సహృదయులే ప్రమాణము.

## సంగ్రహీకరణ :

పురాణములు మహా సముద్రముల వంటివి. అవి నిజముగా రత్నాకరములే. ఐనను సముద్ర గర్భమునందంతట రత్నములే దొరుకవు. అంత కంటే పనికి మాలిన గవ్వలు. రాళ్ళు హెచ్చుగ నుండును. రత్నములు మాత్రము సేకరించి, వానికవసరమగు శాణోల్లేఖన సంస్కారమాచరించి, పొందికగా అమర్చి ప్రదర్శించు విపణులు కావ్య ప్రబంధములు. కనుక పౌరాణిక కథలను ప్రబంధ కావ్యములుగ మలచుటలో కవులు పరిహరింపవలసిన 'రద్దు' అధికముగనే యుండును. ఈ పరిహరణ ద్వివిధము. 1. నీరసములైన అప్రస్తుతములైన విస్తృత భాగములకు సరసమైన సంగ్రహీకరణ. 2. విరసములగు అంశముల సంపూర్ణ పరిహరణ.

హరివంశ విష్ణు పురాణములను ఖనుల నుండి పారిజాతాపహరణేతి వృత్తమను ఖనిజమును త్రవ్వివెత్తిన తిమ్మన ఖనకుడు కావ్యరత్న పాంచాలికను సృష్టించుటలో శాణోల్లేఖన మాచరించిన-సంగ్రహించిన - పట్టులను ముందుగా పరిశీలింతము.

1. నరకాసుర విజయము హరివంశ మందలి 62, 63 అధ్యాయములలో చెప్పబడినది. 64వ అధ్యాయములో 23 శ్లోకముల వరకు కృష్ణుడు నరకుని ధనాగారమందలి అమూల్య వస్తు సంపదను స్వాయత్తము గావించుకొనుట తెలుపబడినది. విష్ణు పురాణములో కూడ ఈ విషయము ఒక అధ్యాయము (29) నిండుగ వివరింపబడినది. తిమ్మన ప్రధాన కథకు సంబంధము లేని ఈ కథా భాగము నంతటిని 'హరి నరకాసురుం గెలిచి' అని అతి సంగ్రహముగా చెప్పినాడు.

2. నరకుని చెరలోనున్న 16100 మంది గంధర్వ కన్యలను హరివంశము 7 శ్లోకములలో వర్ణించినది. ప్రధాన కథ వారికి సంబంధించినది కాదు గనుక

తిమ్మన 'అచ్చరల కొలంబు వారి వెల జవ్వనముం బొలివోని వారి,.... లలనా మణులన్ (I 37) అని మాత్రము సంగ్రహముగా చెప్పినాడు.

3. ఆ కన్యలు కృష్ణుని పతిగ వరించుట 5 శ్లోకములలో (౯౪ 35) చెప్పబడి యుండగ తిమ్మన దానినంతటిని 'తన్వరునిగ గోరు వారి' అని ఒక్క ముక్కలో తేల్చివేసినాడు.

4. నారదుడు రుక్మిణీ మందిరములో పలికిన పలుకులను పరిచారికలు తమ తమ యజమానురాండ్రకు తెలుపుట 4 శ్లోకములలో (౬౪44-47) చెప్పబడియున్నది. కథానాయికయైన సత్యకు ఆమె చెలికత్తె చేయబోవు 'పితూరీ'ని ఎట్లును విస్తారముగ చెప్పవలసియే యున్నది గనుక తిమ్మన ఈ విషయమును ఒక్క తేటగీతిలో (I 68) కుదించినాడు.

5. పారిజాతోత్పాటనము గావించిన కృష్ణుని వందన వనపాలకులు తర్జించుటను విష్ణు పురాణము 7 శ్లోకములలో (30-38-44) చెప్పినది. ఈ క్షుద్ర పాత్రల మాటల కంత ప్రాధాన్యమేలనని కాబోలు తిమ్మన వానిని 2 పద్యములలో (IV 56,57) సంక్షేపించినాడు.

6. పరాజితుడైన దేవేంద్రుడు కృష్ణుని స్తుతించుట విష్ణు పురాణములో 3 శ్లోకములలో చెప్పబడినది. (30-78-80) దానికి తిమ్మన 'ఓ ముకుంద, మురఘస్మర యేనపరాధిని' అని పారభూతమైన సంగ్రహానువాదము గావించినాడు. అప్పుడున్న దీనదశలో ఇంద్రుడు అంతకంటె ఎక్కువ ప్రసంగించి యుండలేడు.

7. పారిజాతాపహరణమునకు దేవేంద్రుని అంగీకారము 4 శ్లోకములో (విష్ణు (3౦5-8) చెప్పబడియుండగా పై సందర్భమందు వలెనే తిమ్మన దానిని ఒక్క పద్యములో (V 40) 'ముక్తసరి'గ చెప్పించినాడు.

8. పుణ్యక వ్రతాచారణ విధానము హరివంశములో 4 నిండు అధ్యాయముల (౭౨ ౪౦) నాక్రమించినది. అందలి వివరములు చాల వరకు పునరుక్తులుగను, నీరసములుగను, ఛాందసములుగను, అసంగత ములుగను, హాస్యాస్పదముగను నున్నవి. నీరసములైన వివరములకొక ఉదాహరణ :

'అంజనం రోచనం చాపి గంధాన్సుమనసస్తథా

వ్రతకే చోపవాసే చ నిత్యమేవ విసర్జయేత్.

దన్తకాష్టం శిరోస్నానం ఉద్వర్తన మథాపివా

వివర్జితం మృదా సర్వం శౌచార్థం తు విధీయతే.

ప్రక్షాలనం వై శిరసః సదా మృణ్మిశ్రితైర్జలైః

పాదుకార్థం తృణైః కార్యం సర్వదా వ్రతకే సతి.' (హరి. (౭౮ 28-30)

ఈ మొదలుగాగల వివరములు వ్రతకల్ప గ్రంథములలో తప్పక ఉండవలసినవే కాని కావ్యములలో వానికి తావు లేదు.

ఛాందసములైన వివరములకొక యుదాహరణ

'క్షురకర్మ తతో భర్తురాత్మనశ్చైవ కారయేత్.' (౭౬ 6)

ఇదే నియమమైనచో ఏ సుందరియు పుణ్యక వ్రతము పేరైనను తలపెట్టదు. కనుకనే వ్యాఖ్యాతయగు నీలకంఠుడీ సందర్భమున నిట్లు సమర్థించు కొనవలసి వచ్చినది.

'సర్వాన్ కేశాన్ సముద్ధృత్య ఛేదయేదంగుల ద్వయమ్

ఏవమేవహి నారీణాం సర్వథా వపనం స్మృతమ్ - ఇతి స్మృతిః అథవా కేశవర్జితం నఖ మాత్ర నికృంతనం వా.'

హాస్యాస్పదములగు వివరములు కొన్ని

'. . . . . . . . . . . . .తతో దద్యాద్ద్విజాతయే. . . .

గోవాల రజ్జు సుకృతం చామరం చ ధ్వజం తథా

ఊర్మిమంతః స్వరాలాగ్రాః శ్రోణి దేశ విలంబినః

తస్యా భవన్తి కేశాస్తు. . . . . . . .

ఇచ్ఛే దోష్ఠౌ చారురూపే విద్రుమం దాతుమర్హతి . . . .

స్తనౌ విచ్ఛతి యా నారీ తృణరాజ ఫలోపమౌ

. . . . . . . ద్వే బిల్వే కాంచనే శుభే

సదక్షిణే బ్రాహ్మణాయ ప్రయచ్ఛతి ధృతాత్మనే. (హరి. అధ్యా)

చక్కని ముక్కు, చక్కిలాల వంటి చెవులు 'వగైరా' కావలసిన వారికి కూడ ఇటువంటివే 'చిటకా'లు కలవు. ఈ 'చిటకా'లలో కొంత ఔపమ్య చమత్కృతి లేకపోలేదు. కాని ఇట్టి ప్రసంగములు ఆధునికులకు హాస్యాస్పదములనుట మాత్రము సత్యము. కనుకనే తిమ్మన కవీంద్రుడు కావ్యౌచితిని పాటించి ఈ వివరముల నన్నింటిని 'వ్యాసునికే'[3] వదలిపెట్టి ఆధునికాభిరుచుల కనుగుణములైన వివరములతో 8 పద్యములలో (V 55-62) సరసముగా సంగ్రహించివాడు.

## పరిహారణ

ఇప్పుడు తిమ్మన అనువదింపక పరిహరించిన భాగములను గుర్తింతము.

1. కథ ప్రారంభమున నారదాగమన దినమున రుక్మిణి ఏదో ఉపవాస వ్రతము నాచరించుచున్న వివరణ హరివంశమున గలదు. (౬౭-3 -11) తిమ్మన ఆ ఉపవాసవ్రత ప్రసంగమే ఎత్త లేదు.

2. సత్యభామకు కావి చీరెలే ఇష్టము. కోపము వచ్చినపుడే ఆమె తెల్లని చీరెను కట్టును. దేవతా దర్శనమునకేగునపుడు ఆమె తెల్లని చీరెనే కట్టునని హరివంశ కృష్ణుడనుచున్నాడు.

'దేవాభిగమనాదూర్ధ్వం శుక్లం నేష్టం హి తే ప్రియే.' (౬౬ 30) అనగా దేవతా దర్శనార్థ మేగునప్పటి సత్య ముస్తాబు కోపాగారపు ముస్తాబునే పోలియుం డునన్నమాట. ఇది యంత సరసముగ లేదు. కనుక తిమ్మన కృష్ణునిచే ఈ మాట ననిపించలేదు. 'సన్న కావులీవెందును మానలేవు, తెలుపేటికిఁ గట్టితి?' వని మాత్రమే ప్రశ్నింప జేసినాడు. (I 115) తిమ్మనగారి సత్య కోపము రానిచో తెలుపెన్నడును కట్టదు.

3. సత్యననుయించు కృష్ణుని వాక్యములొకటి రెండిట్లున్నవి.

'నైవ త్వాం మదనో జహ్యాత్ మృతేపి మయి మామకః' (౬౬ 43)

శాపితాపి మమ ప్రాణైః ఆచక్ష్వ సత్యయోయది.' (౭౬ 3) ధీరోదాత్త నాయకుడైన కృష్ణుడిట్టి 'చావుకబుర్లు' చెప్పడు. కనుక తిమ్మన ఈ మాటలను

పరిహరించినాడు.

4. కృష్ణునితో సత్య ఇట్లు పలికినదట :

'మమాభవద్యతో రక్షా భయమద్య తతో మమ

సర్గతో రక్షతే యో మాం స మాం వాద్యాభిరక్షతి.

హా గతిం కాం గమిష్యామి త్యక్తా దేవ త్వయా ప్రభో

కుముద్వతీ గతాం నూనం గతిం యాస్యామ్యసంగతా

కిమకార్ష మహం మోహాదీశ్వరాణాం ప్రియాప్రియం

ప్రియా భూత్వాప్రియా భూతా యద్యహం తవ మానద' (౭౬ 16-18)

ఈ దీన వాక్యములు అభిమానవతియగు సత్య నోట వెలువడ వలసినవి. కావు; అందునను కృష్ణుని యెదుట. కనుక తిమ్మన వీనిని సత్య చే పలికింపలేదు.

5. పారిజాతకుసుమమును రుక్మిణి కొసంగవలసి వచ్చిన పరిస్థితిని గూర్చి కృష్ణుడు సత్యకిట్లు నివేదించుకొనినాడట :

'తత్పారిజాత కుసుమం తస్యా దేవి మమాగ్రతః

నారదో మత్ప్రియం కుర్వన్ మునిరక్లిష్ట కర్మకృత్

దాక్షిణ్యాదనురోధాచ్చ దత్త వాన్నాత్ర సంశయః

ప్రసీదకాపరాధం మే మర్షయస్వ శుచిస్మితే.' (హరి. ౬౭ 29-30)

కృష్ణుడీ పంజాయిషీ నిచ్చు కొనవలసిన పనిలేదు. ఆ సంగతి సత్యకే తెలియును. 'ఆ సరసీరుహాక్షి నిలయంబునఁ బంకజనాభుఁ డుండుటం జేసి యొసంగెఁ బో తగవు సేకొని యొక్క లతాంతము' (I 92) అని ఆమెయే చెప్పుకొనినది. కనుకనే తిమ్మన కృష్ణునిచే ఈ మాటలనిపింపలేదు.

6. కృష్ణుడు పారిజాతమును వాగ్దానము చేయగనే సత్య ఇట్లనినదట

'యద్యేవం తద్ద్రుమః శక్యః త్వియానయితు మచ్యుత

మన్యురేష ప్రమృష్టో హి భవేద్బహుగుణం మమ.

పీమన్తినీనాం సర్వాసాం అధికా స్యామధోక్షజ (హరి౬33,34)

విష్ణు పురాణములో కూడ నిట్లే సత్య 'పారిజాతపుష్పాలంకృతనై సపత్నులలో అధికురాలనయ్యెద'నని (30-37) పలుకును. ఈ మాటలు గంభీర స్వభావురాలగు సత్య మనస్సులో నుండవలసినవేగాని, పైకి రాదగినవి కావు. కనుకనే తిమ్మన వీనినమవదింపలేదు.

7. నారదుడు సత్యా కృష్ణులయొద్ద సెలవు గైకొనుచు దేవేంద్రుడు మహేశ్వర పూజ కావింపనున్నాడనియు, తావా ఉదయు మొనగిన పారిజాత పుష్పము మహేంద్రుడొసగిన నిమంత్రణ పుష్పమేయనియు తెలిపినాడు. (హరి. (౭౬51-54) ఇంత వరకు నారదుని ప్రసంగము కొంత సందర్భశుద్ధిని కలిగియున్న దనవచ్చును. కాని పారిజాతపు ప్రసంగము వచ్చినదిగదా అని అదే పనిగ పారిజాతోత్పత్తి మాహాత్మ్యములను గూర్చియు, దానితో బాదరాయణ సంబంధము కల్పించుకొని పుణ్యక వ్రతమును గూర్చియు 18 శ్లోకములలో (౭౬55-72) సుదీర్ఘ ప్రసంగము కావించుట కేవలము అసందర్భముగ నున్నది. తిమ్మన మహేశ్వర పూజోత్సవ ప్రసంగమే ఎత్తు కొనలేదు.

8. హరివంశమందలి ౬౬ వ అధ్యాయమంతయు స్వర్గమందలి మహేశ్వర పూజోత్సవ వర్ణనకే సరిపోయినది. ప్రధాన కథకు అనవసరమైన ఈ ఉత్సవపు ఊసే తిమ్మన ఎత్తలేదు.

9. యుద్ధమున పరాజితుడైన దేవేంద్రుని సత్య పరిహసించినట్లు విష్ణు పురాణము చెప్పుచున్నది. (3౦ 71-76). ఎంతటి గర్వపరురాలైనను ఉత్తమ కుల ప్రసూతయైన ఇల్లాలు, ఓడినను గౌరవనీయుడగు పరపురుషుని - అందునను బావగారిని - అట్లు 'బరితెగించి' పరిహసించుట భావ్యము కాదు. కనుకనే సత్యా సౌశీల్యమునకు భంగకారులైన ఈ వాక్యములను తిమ్మన తెనిగింపలేదు.

10. ఇంద్రునకు సత్య పారిజాతమును తిరిగి ఈయజూపినట్లు గల విష్ణు పురాణ వాక్యమును (30-73-76) తిమ్మన తెనిగింపలేదు. శచీదేవితోడి పంతము గొన్న విష్ణు పురాణ సత్య వలె రుక్మిణితో పంతముగొన్న తిమ్మనగారి సత్య పారిజాతమును తిరిగి ఈయజాలదు.

11. సత్యా పరిహాస వాక్యములు పరిహృతములైనందున వానికి

సమాధానముగ ఇంద్రుడు పలికిన పలుకులను (30-77-80) అనువదింప వలసిన అవసరము కూడ లేకపోయినది.

12. యుద్ధ విరమణానంతరము కృష్ణుడొక రాత్రి త్రివిష్టపమున గడిపినట్లు హరివంశము చెప్పుచున్నది. (౭౬ 36-37) సత్యాకృష్ణులదివరకే ఒక రాత్రి వైజయంతమున గడపినట్లు తిమ్మన చెప్పియుండుటచే అతడు వారిచే నచట మరియొక నిద్ర చేయింపలేదు.

13. సత్యభామ కొరకై శచీదేవి అనేకాభరణములను కృష్ణున కొసంగినట్లును (౭౬ 41-44) పుణ్యక వ్రతావసానమున సత్య వానిని నవత్నులం దరకును పంచిపెట్టినట్లును (౭౬-20) గల హరివంశ కథాభాగమును తిమ్మన అనువదింపలేదు. సర్వాభీష్ట ప్రదమైన పారిజాతమే సత్యకు లభించిన పిమ్మట శచీదేవి యొసంగగల ఆభరణములతో సత్యకేమి అక్కర?

## అన్యథా కల్పన

'అన్యథా వా ప్రకల్పయేత్' అని దృశ్యకావ్యకర్తలకు లాక్షణికులొసంగిన స్వాతంత్ర్యమునే కాలక్రమమున శ్రవ్య కావ్యకర్తలు కూడ వాడుకొనసాగినారు. ఇతి వృత్తమునకుగాని, నాయకునికిగాని, రసమునకుగాని, విరుద్ధమైన విషయములను, పరిహరించుటకు, లేక పరివర్తింప జేయుటకు లాక్షణికు లొసంగిన ఈ స్వాతంత్ర్యమును నుపయోగించుకొని తిమ్మన గావించిన అన్యథా ప్రకల్పన వలన అతడు సాధింపగలిగిన ఇతివృత్త నాయక రసాభ్యుదయములు ఇప్పుడు పరిశీలింతము.

1. నరక సంహారానంతరము సత్యా కృష్ణులు ప్రాగ్జ్యోతిషము నుండియే అమరావతి కేగినట్లు హరివంశ విష్ణు పురాణములు రెండును చెప్పుచుండగా ద్వారకకే తిరిగి వచ్చినట్లు తిమ్మన కల్పించినాడు. ఈ మార్పు వలన అదితికి కుండలముల నొసంగుట కొకసారి, సత్యామాన శాంత్యనంతరము పారిజాతాపహరణమున కొకసారి రెండుసార్లు అమరావతీయాత్ర చెప్పవలసిన పని తప్పిపోయి, ఒక్క యాత్రతో రెండు పనులును సాధ్యమైనవి.

2. శ్రీ కృష్ణుడు దేవేంద్రునకు నమస్కరించినట్లు హరివంశము (తొలికథ) లోనుండగ, దేవేంద్రుడే కృష్ణునికి నమస్కరించినట్లు తిమ్మన మార్పు గావించెను. విష్ణు పురాణము ఈ విషయమై ఏమియు తెలుపలేదు. వైష్ణవాగ్రేసరుడైన

రాయల కొలువులోనున్న తిమ్మన విష్ణు పారమ్య బుద్ధితో చేసిన ఈ మార్పు నిజమున కంత సరసము కాదేమో.

3. కృష్ణుడు తనకు పారిజాతము నొసంగుమని దేవేంద్రునకు నారదుని ద్వారా సందేశము పంపినట్లును, ఆతడట్లొసంగనిచో ఆతనిని గదతో మోదెదనని తెలిపినట్లును, నారదుని రాయబారమును ఇంద్రుడు తిరస్కరించుటచే కృష్ణుడు అమరావతి పైకి యుద్ధయాత్ర సాగించినట్లును హరివంశము తెలుపుచుండగా, పారిజాతపు పేరైన ఎత్తకుండ, అదితి దేవికి కుండలములను సమర్పించుటకై తాను అమరావతి కరుదెంచుచున్నట్లు నారదుని ద్వారా కృష్ణుడు సందేశమంపినట్లు తిమ్మన మార్పుగావించెను. దీనివలన యుద్ధయాత్ర స్నేహయాత్రయైనది. కృష్ణుని సందేశమాతని మాయావిత్వమునకు అనుగుణముగ నున్నది. ఇది తిమ్మన గావించిన అన్యథా కల్పనలలోని కెల్ల ప్రధానమైనది.

4. హరివంశ కృష్ణుడు తన అమరావతీ యాత్రను గురించి బంధుమిత్రుల కెవరికిని తెలుపక మృగయావ్యపదేశమున రైవతకాద్రికి బయలుదేరి అచ్చట నుండి అమరావతికి వెడలినాడు. ఉగ్రసేన వసుదేవాది వృద్ధులు తన యుద్ధయాత్ర కడ్డు చెప్పెదరని హరివంశ కృష్ణుడు భయపడి నట్లున్నాడు. తిమ్మన దానిని స్నేహయాత్రగ మార్చి యుండుటచే దానిని రహస్యముగ నుంచవలసిన అవసరము తప్పిపోయినది. తిమ్మనగారి కృష్ణుడు తగిన వారిని సుహృజ్జన బంధు కోటిని రాబనిచి, నిజప్రయాణమును పట్టణ రక్షయు తెలిపి, వారిచే అనుమతి గాంచియే విహగాధిపు నధిరోహించినాడు.

5. హరివంశ కృష్ణుడు సాత్యకి ప్రద్యుమ్న సహితుడును, సత్యా విరహితుడునునై అమరావతికి బయలుదేరగ, తిమ్మన సత్యాద్వితీయునిగ కృష్ణుని బయలు దేరదీసినాడు. దేవతా కోటితో ఏకాంగవీరుడై పోరుటకు బయలు దేరిన తెలుగు కృష్ణుడు సంస్కృత కృష్ణుని కంటె సాహసికుడనుట స్పష్టము. తిమ్మన కావించిన ఈ మార్పు వలన శౌరి శౌర్యము ఉజ్జ్వలమైనది. సాత్యకి ప్రద్యుమ్నుల సాయము లేనిచో హరివంశ కృష్ణుడు పారిజాత రక్షణ చేసికొనలేక పోయెడివాడే. తెలుగు నందలి కృష్ణుని పరాక్రమము ముందు మూలము నందలి కృష్ణుని పరాక్రమము దివిటీ ముందరి దీపమైనది. సత్య పార్శ్వస్థయై యుండుట వలన యుద్ధమధ్యమున కృష్ణుడామెతో సవిలాసముగ ప్రసంగించుటకును, తిమ్మన

వీర రసములో శృంగారమును 'మిళాయించుట' కును వీలైనది. ఇట్టీ మార్పు పాత్ర పోషణకును, రసపుష్టికిని కూడ దోహదకారియైనది.

6. నందన వనపాలకులు పారిజాతాపహరణ వార్తను శచీదేవికి తెలుపగ ఆమె ఇంద్రుని కృష్ణునిపైకి యుద్ధమునకు పురికొల్పినట్లు విష్ణు పురాణము చెప్పుచున్నది. వనపాలకులు తిన్నగ ఇంద్రునకే నివేదించినట్లు తిమ్మన మార్పుగావించెను. శచీదేవి పెదవి కదపనైన లేదు దీని వలన శచీగర్వ భంగమనదగిన విష్ణు పురాణకథ సత్యా విజయ మాత్రముగ రూపొందినది. శచీదేవి గౌరవము కాపాడబడినది.

7. కృష్ణుడు వజ్రాయుధమును నిర్వీర్యము గావించినంతనే దేవేంద్రుడు పలాయితుడైనాడని విష్ణు పురాణకథ. తిమ్మనగారి తీరుపులో దేవేంద్రుడు పారుబోతుకాడు. అతడు ధీరుడు. కనుకనే ప్రత్యర్థి ఆధిక్యము నిరూపిత మైనంతనే ఆతనికి మ్రొక్కి ఎదుట నిలువ బడినాడు.

8. హరివంశమున కృష్ణ పత్నులందరును పుణ్యక వ్రతము నాచరించినట్లు కలదు. తిమ్మన ఒక్క సత్యచేతనే ఆచరింపజేసినాడు. సపత్నులందరును వ్రతము నాచరించినచో పారిజాతమును సత్య వారికేల ఇచ్చును? అల్లరి తనదియు అనుభవము అందరిదియు అగుటకామె ఎట్లు సమ్మతింప గలదు?

9. తిమ్మన కావించిన ఒక మార్పు మాత్రము అంతగ ఔచితీవంతముగ లేదు. తనకు దానముగ లభించిన కృష్ణుని తిరిగి అమ్మ జూపుచు హరివంశ నారదుడిట్లనినాడు :

'కపిలాం గాం సవత్సాం భో విప్రాయార్థం ప్రయచ్ఛ మే

కృష్ణాజినం తిలైః పూర్ణం ప్రయచ్ఛ చ సకాంచనమ్

ఏషోఽత్ర విప్రాయః కృష్ణ విహితో వృషకేతునా (౭౬12,13)

'పారిజాతాపహరణపు' నారదుడు 'ద్విజు(దేయర్థంబులన్ వేడినన్ జేతః ప్రీతిగ నిచ్చి క్రమ్మఱ( బతిం జేకొంట యుక్తంబు' అని సత్యకు వ్రతవిధి నుపదేశించినాడు.(V-61). ఆమెయు 'వేలుపుం దపసికినాత్మ భూషణ వితానము లన్నియు విప్రాయంబుగ నొసగినది. (V88) సవత్సయైన కపిల, తిలకాంచన

సమన్వితమగు కృష్ణాజినమునను నివి నిశ్చయముగ సాంకేతికములు, పవిత్రములును, విక్రేతకును, విక్రీతునకును గౌరవ మహత్త్వములను చేకూర్చగలవి. క్షుద్రములైన సువర్ణ భూషణము లెన్నియైన శ్రీకృష్ణునకు వెలగట్ట గలవు? అవధూత యైన నారదునకీ స్వర్ణాభరణములతో పనియేమి? ఇచట ప్రధానమైనవి భక్తి శ్రద్ధలుగాని వెండి బంగారములు కాదు. ఈ సందర్భమున లోకమున వ్యాప్తి యందుండిన 'శ్రీకృష్ణ తులాభారొ' కథ స్మరింపదగియున్నది. రుక్మిణి కృష్ణుని ఒక్క తులసి దళముతో సరితూచినది. తిమ్మన కృష్ణుని విలువను లాఘవ పరిచినాడనియే చెప్పవలెను. నిశ్చయముగా ఈ మార్పు అనుచితమైనదే. ఐనను ఈ అనౌచిత్యము మూలముతో అనువాదమును పోల్చిచూచినప్పుడే వెల్లడి యగు చున్నది గాని తిమ్మన కావ్యమును మాత్రమే పరిశీలించినపుడు అనౌచిత్యముగా భాసించుట లేదు. కనుక ఈ కథాంశమును అనౌచిత్యముగా లెక్కింపనక్కరలేదు.

## నూతన కల్పనలు :

తిమ్మనకావించిన నూతన కల్పనలాతని ప్రతిభకు ద్యోతకములైనవి. క్రమప్రాప్తముగ వానిని పరిశీలింతము.

కథాంశములు :

1. నారదుడు వచ్చుసరికి రుక్మిణీ కృష్ణులు జూదమాడు చుండిరనుట తిమ్మన కల్పనయే. కృష్ణ దేవరాయడు అంతఃపురకాంతలతో చదరంగమాడుచు కాలక్షేపముగా వినోదించెడి వాడని ప్రసిద్ధి. రాయడు కృష్ణుడు కాగా చదరంగమే జూదమైనది. జూదమానాటి నాగరక వినోదక్రీడలలో స్త్రీ పురుష సామాన్యమైన వానిలో నొక ముఖ్యమైనది.

2. రుక్మిణి కనుసన్నతో పరిచారికలు నారదునకు రత్న సింహాసనమిడిరట. అట్లే సత్య కనుసన్నలో ఊడిగంపు పద్మముఖులు కృష్ణుని జలక మాడించిరట. నోటి మాటలతోగాక కనుసన్నలతోనే పరిచారికల కాజ్ఞల నొసంగు ప్రభుత్వ దర్ప గాంభీర్యవతులనుగా కృష్ణుని రాణులను తిమ్మన తీర్చినాడు.

3. పారిజాతము రుక్మిణి కొసంగుమని నారదుడు కృష్ణునకు సైగ చేసినాడట. వనపాలకులతో నేమేని వచింపబోవు కృష్ణుని సత్య కరసంజ్ఞతో అదల్చినదట.

కథాంశములుగా అల్పము లేయయ్యు తిమ్మనగావించిన ఈ కల్పనలు నాటకీయముగ మిగుల విలువగలవి. పాత్రల ప్రత్యక్ష సాక్షాత్కారమునకు ఉపస్కారకములైనవి.

4. రుక్మిణి పారిజాత పుష్పమును ధరించుటకు ముందుగా నారదునకు నమస్కరించినదని తిమ్మన చేసిన కల్పన ఆమె వినయశీలమును సూచించునదిగానున్నది. అట్లే సత్యా పుణ్యక వ్రతమునకై ఆమె తన సవతులు పదారువేల మందిని వెంటనిడుకొని వచ్చినదని తిమ్మన చేసిన కల్పన వలన కృష్ణుని పట్టపు దేవేరిగా ఆమెకు గల ప్రభుత్వమేర్పడుచున్నది. ఇట్టి చిన్న చిన్న కల్పనల వలన తిమ్మన పాత్రల శీల స్వభావములను నిపుణముగ చిత్రించును. ఇది మహా కవి ప్రతిభ.

5. సత్య శ్రీకృష్ణుని 'చే నిరిఁదమ్మి వ్రేయుటకునై యుంకించి జంకించుట' ఒక సరసమైన కల్పన. సత్య కృష్ణుని యెడ ప్రదర్శింపగల గర్వముతో గూడిన దురుసుతనము, దానికి కారణమైన అతడామె కొసగిన చనవు, దానికి మూలమైన అతనికామె యెడగల వలను మాలిన మోహము, దానికి హేతునైన ఆమె చందములు, నాగరకత, రసికత ఇట్లెన్నియైన సుకుమార భావములకు స్ఫోరకమైనదీ చిన్న కల్పన, మహాకవి వాక్కు మహా ధానుష్కుని చేతి బాణము వంటిది. దాని వ్యాపారము దీర్ఘ దీర్ఘ తరమనుట ఇందులకే.

6. తిమ్మన చేసిన కల్పనలలోని కెల్ల మకుటాయమైనది. కృష్ణుడు కోపాగార గతయైన సత్యకు మ్రొక్కుటయు, ఆమె యాతని శిరమును వామపాదముతో తొలగించుటయు, దానికాతని శరీరము గగుర్పొడుచుటయు, పిదప నతడామెను మరింత వినయముగ నమనయించుటయు నను సన్నివేశము. ఇచట గల నాలుగు పద్యములును (I120-123) నాలుగు రస గుళికలు. 'తత్ర పద్య చతుష్టయమ్' అని చెప్పదగినవి. ఈ కల్పనయందలి స్వారస్యమును గ్రహింపగల రసికతయే చాల మందిలో లోపించుచున్నదనగా, అట్టి కల్పన గావించినవాడెంతటి ఖాణమైన రసికుడో ఊహాకందుటలేదు.

7. పుణ్యక వ్రత విశేషములలో అధిక భాగము అమూలకములే. విశ్వకర్మ మండప నిర్మాణము, గర్గుని పౌరోహిత్యము, ధౌమ్యాదుల ఋత్విజత్వము, సత్య చెలుల పరిహాసము, ధర్మజాదుల హాసము - అన్నియు తిమ్మన కల్పనలే. ఈ కల్పనల వలన కలిగిన వాస్తవికతానుభూతి సహృదయైకవేద్యము.

8. సపత్నీ మాత్సర్యమును విడువుమని నారదుడు సత్యకుపదేశించుటయు

(V67) తదనుగుణముగనే ఆమె రుక్మిణ్యాదులనందరను వినయముతో ఆమతించి కల్పవగప్రసూనముల వాయనము లొసగుటయు (V-90) తిమ్మన కల్పనలే. కథా ప్రారంభమున ఈర్ష్యామాత్సర్యగ్రస్తురాలైన సత్య కథాంతమువేళకు వినయపరురాలుగను, స్నేహశీలిగను పరిణమించినది, పారిజాతలాభము వలన కలిగిన 'అంచిత సంపదలందు తాల్మి'ని ప్రదర్శించిన సత్య ఉత్తమ కాంతాత్వమిట్లు ప్రకటితమైనది. సత్యాశీలమునిట్లు ప్రత్యగ్రసుందర మొనర్చుటయే పుణ్యకవ్రత ప్రయోజనమనిపించుచున్నది.

**భావములు :**

1. శ్రీకృష్ణుని నారదుడు స్తుతించుట (I49-51; V 92-101) అంతయు తిమ్మన సొంత కవిత్వమే.
2. కృష్ణుని ఆగమనమునకై నిరీక్షించు సత్యా సతి విరహోత్సుకతా వర్ణన తిమ్మన స్వీయ కల్పనయే.
3. క్రోధావిష్టురాలైన సత్య పొందిన సాత్త్వికవికారముల వర్ణన (I100) మానసిక చిత్రణలో తిమ్మనకు గల నైపుణికి మచ్చుతునక.
4. సత్యామందిరమునందలి సీరసవాతావరణమును గాంచిన కృష్ణుని స్వగతము (I 105, 106) అమూలకము.
5. సంభృత తాలవృంతుడైన కృష్ణుని గాంచిన సత్యా ప్రవర్తన (I 112, 113) అమూలకము.
6. శ్రీకృష్ణవైనతేయుల సంభాషణ (II 74-76)కు మూలము లేదు.
7. అదితి కృష్ణ స్తుతి యందలి దశావతార, శ్రీకృష్ణ లీలా ప్రశంసా భాగము తిమ్మన స్వీయశేషముషీ విలాసమే.

**వర్ణనలు : అలంకారములు :**

'పారిజాతాపహరణ' కావ్యము సగము వరకు నిండియున్న వర్ణనలు, ప్రాయశః ప్రతి పద్యమునమగల అలంకారములు అన్నియును తిమ్మన సొంతములే, వానిని గూర్చి విపులమగు పరిశీలన ప్రత్యేక ప్రకరణములుగ చేయుదము.

## యథాతథానువాదము :

యథాతథానువాదమనగా మూలమునకు ఒక 'తు' గాని 'చ'గాని హెచ్చు తగ్గులులేకుండ అక్షరమునకక్షరముగ చేయబడిన అనువాదమనియే అర్థమైనచో ప్రాయశః అటువంటి అనువాదములు ఏ కావ్యమునకైనను ఏ భాషలో నైనను జరిగియుండవని చెప్పవచ్చును. 'ప్రాధాన్యేన వ్యపదేశా భవన్తి' యను న్యాయము చొప్పున ఒకటి రెండు పదములు ఎక్కువగగాని, తక్కువగగాని యున్నను, ఒకటి రెండు భావములలో అల్పములగు మార్పులున్నను అట్టి భేదములను లెక్కలోనికి తీసికొనక మొత్తము మీద వ్యక్తమగు పద, భావ సామ్యమును మాత్రము లెక్కలోనికి తీసికొనవలసియున్నది. ఈ దృష్టితో చూచినచో హరివంశ విష్ణు పురాణ శ్లోకములకు శ్లోకభాగములకు కొన్నింటికి తిమ్మన కావించిన యథాతథాను వాదములను గుర్తింపగలము. ఈ రెండు పురాణములకును పారిజాతాపహరణమునకును గల రచనా సాదృశ్యములను గుర్తించు సందర్భమున ఈయబడిన ఉదాహరణలే (పుటలు 112 - 130) దీనికిని ఉదాహరణలు కాగలవు. ప్రత్యేకించి హరివంశ సాదృశ్యములలో 2, 4, 5, 6, 11, 13, 16, 19, 20, 21, 27, 28, 29, 30, 32, 36, 39, 43, 44, 45, విష్ణు పురాణ సాదృశ్యములలో 2, 3, 4, 5, 6, 8 చూడదగినవి.

## రుద్రభట్టు అనువాదము - విపులీకరణ :

1. హరివంశమందు ఒక్క అనుష్టుప్ పాదములో 'వారదోభ్యా యయౌ ముని' (౬౫12) అని చెప్పబడిన వారదాగమనమును తిమ్మన వలె రుద్రభట్టు కూడ ఒక పెద్ద పద్యముగా విపులీకరించినాడు.

'పడివోడల్ హంపెగం బెళ్ముగిలతి ధవళం, హంపెగం బెళ్ముగిళ్గం,
మృడహాసం విశ్వలోకస్తుతమతిధవళం, హంపెగం భెళ్ముగిళ్గం
మృడహాసక్కం సుధావారిధి యతిధవళం, హంపెగం బెళ్ముగిళ్గం
మృడహాసక్కం సుధావారిధిగమతిధవళం తావెవల్ యోగి బందం.' (౧౨63)

(పరికింపగా హంస కంటె వెలిమొగిలు అతిధవళము. హంసకంటెను, వెలిమొగిలుకంటెను విశ్వలోకస్తుతమైన మృడహాసమతిధవళము. హంసకంటెను,

వెలిమొగిలుకంటెను, మృదహాసముకంటెను సుధావారిధియతి ధవళము. హంసకంటెను, వెలిమొగిలుకంటెను, మృదహాసముకంటెను, సుధావారిధికంటెను తావే అతి ధవళమన్నట్లు యోగివచ్చెను.)

2. కృష్ణుడు రుక్మిణికి పారిజాత పుష్పము నొసంగుటను హరివంశము అర్ధశ్లోకములో చెప్పినది.

'తద్వృక్షరాజకుసుమం రుక్మిణ్యాః ప్రదదౌ హరిః'(౭౬15)

తిమ్మనవలె రుద్రభట్టు కూడ దీనిని విస్తరించి ఒక పద్యము చెప్పినాడు.

'బనదొళగుళ్ళ పూగళ వొలల్ల మిదచ్చరి బేటదొందు కం

పిన కణి, బేటదొందు మకరందదగుందలె, బేటదొందుచె

ల్విననిధి యెందుకృష్ణను నమానుష పుష్పమనొల్దు నోడి త

న్ని నియళెనిప్ప రుక్మిణియ వక్త్రముమం దయెయిందనోడిదం.(౭౬65)

వ.అంతు నోడి నిజాగ్రమహిషిగా పారిజాతద పుష్పమం దయగెయ్యే.'

('వనములలోనున్న పూలవంటిదికాదు. ఇది ఆశ్చర్యము. ఇది వేరొక (కంపు) సువాసన గని. వేరొక మకరందాతిశయము. వేరొక చెలువునకు నిధి' అని కృష్ణుడు అమానుష పుష్పమును మెచ్చి చూచి, తన ప్రియురాలైన రుక్మిణి వక్త్రమును దయతో చూచెను. అట్లు చూచి నిజాగ్రమహిషికా పారిజాత పుష్పమును దయసేయగా)

3. పారిజాతపుష్ప ధారణము వలన అతిశయించిన రుక్మిణీ సౌందర్యమును హరివంశము ఒక చిన్న శ్లోకములో వర్ణింపగా (చూ.పుట.156) తిమ్మనవలె రుద్రభట్టు కూడ విస్తరించి ఒక పెద్ద పద్యము వ్రాసినాడు.

'అలవడె పారిజాత దలరం ముడియొళ్ తళెదిర్ద నల్లళా

గళిన నిళాస మాగళిన నిభ్రమ మాగళి నంగ భావనా

గళిన నిడంబ వాగళిన దేసి మురారిగనంగ రాగమం

బళెయిసె పెండిరొళ్ బళెయిసెత్తెనసుం ప్రణయ ప్రకోపమం.' (౧౨66)

(పారిజాతపుటలరు ముడిలో వలవడగా ధరించియున్న ఆ ప్రియురాలి

అప్పటి విలాసము, అప్పటి విభ్రమము, అప్పటి యనంగ భావము, అప్పటి విడంబము, అప్పటి సొగసు మురారికనంగ రాగమును పెంపొందింపగా, ఇతర కాంతలకు ప్రణయప్రకోపమును మిక్కిలి పెంపొందించెను)

4. పారిజాత పుష్ప మహిమను వర్ణించుచు నారదుడు హరివంశ మందు చెప్పిన ఒక అర్ధ శ్లోకమును రుద్రభట్టు ఒక పద్యముగా విస్తరించినాడు. మూలమునందలి ఒక్క విభావనా వస్తువునకు తోడు మరి ఏడు వస్తువులను సృష్టించినాడు. (చూ. పుట81).

5. శ్రీకృష్ణుడు తాను సత్యకు పారిజాతమును వాగ్దానము చేసిన విషయమును నారదునకు తెలుపుట హరివంశమందొక్క శ్లోకములో నున్నది.

'మయా మునే ప్రతిజ్ఞాతం పుణ్యార్థం సత్యభామయా

స్వర్గాదిహా నయిష్యామి పారిజాతమితిప్రభో.' (౭౬-35)

దీనికి రుద్రభట్టు పెంపకము.

(పీతాంబరధరుడు,'వినుమోమునీంద్రా, మీరు నేడు మాకు తెచ్చియొసంగిన ఆ నిమంత్రణ పారిజాత కుసుమమును రుక్మిణీ దేవికీయగా, ఆ దేవి తత్కుసుమమును శిరశ్శేఖరము గావించుకొనిన సమయమందు మీరేమేమి పలికిరో, ఆ మాటలకు లోనై తత్ప్రపంచమును విజపఖి చెప్పుట వలన విని ఈ సత్యభామ నికామప్రణయ కుపితయ్యైయుండుట వెఱిగి వచ్చి ఆ దేవిని శాంతింపజేసిన వృత్తాంతమును చెప్పగోరెద'నని-

ప్రియురాలు మచ్చరించుటయు,ఆసతి కోపగృహమునకు వచ్చి సింధుర వస్త్రమును విడచి పాండుర వస్త్రమును ధరించుటయు, మరియు నా అంబురుహ దళాయతేక్షణ దుకూలపు పట్టమును ఆత్మ ఫాలమునందు ధరియించి రక్తచందనము నిరుకెలంకుల ధరించియున్న చేతయు, చెలులు ప్రీతితో నుడివినను మౌనముతో నుండుటయు, అనంగతాపముతో మలయజపంకమును హృదయమునందు రాచుకొనుచుండగా నోవధికమ్మైనదని చందనపు శుక్తికను నేలపై 'ధప్పు)మని యుప్పళించుటయు, వినోదపు కరాబ్జమును త్రెంపివేయుచుండుటయు[7] నేనపరాధినైయుండి ఎట్లీ ప్రియురాలి సమీపమునకు పోగలనని నానావిధపుటుద్వేగముతో తాను ఎంతయైన బెదరి దూరము నుండి వీక్షించుటయు[8] యువతి

దుకూలపుటంచలమును మొగమున కప్పి పాన్పునందు పవళించిన యందమును, తానది వీక్షించి వద్ద కేగుటకు ఇదియవసరమని మెల్లన చిన్నగా నడచి వచ్చి 'అస్మదాగమనమీమెకు విన్నవింపకు'డని సఖీజనమునకు సైగ చేయుటయు[9] తరువాత మెత్తని యడుగులతో చప్పుడుగాకుండునట్లు ఒయ్యనొయ్యననేగుదెంచి ఆ కోమలి నిజకోప మందిరముజొచ్చి ఆ ప్రియురాలి వెనుక తానున్న స్థితియును[10] ముదముతో నొకవీవనను ప్రియురాలికి ఒయ్యనతానే వీచుచుండుటయు, అమరద్రుమ ప్రసవ సంగము వలన వాసితమైన తన హస్తపు నవగంధము కలతపరుపగా మానిని నిద్ర నుండి లేచి, ఏదో గాఢమైన అపూర్వ గంధమనుచు, తరళీకృత నేత్ర యగుటయు[11], ప్రియురాలు కోపముతో వీక్షించి తనను గనుటయు, భయము మిగులగా తానా ఘనకుచ వెనుక నడంగిన వినోదముతో తత్పతికి కోపమును పెంచుటయు[12] కోపముతో ఉన్మీలిత లోచనయై చూచుటయు, ఆమె చూపు అపాంగముల వెంటసాగి తనకు అగ్గలమైన రాగము వలన మనము నందలి అంజికపోయి నుడివిన చతురోక్తులను[13] 'నేను ప్రియురాలితో ఇట్లిట్లంటిని. ఈ దేవి ఇట్లిట్లనినది.' అని ఇసుమంతయు విడువక శౌరి సంతసముతో మునికి చెప్పి మరియు నిట్లనెను. 'మాధవా, అపూర్వమైన ఉత్తమ పుష్పమును సవతి కొసంగి నన్నేల వట్టి మాటలతో సంతోషపెట్ట జూచెదవు? ఈయరాని వస్తువు మాటయటుండనీ. ఇపుడు నాకు తపస్సునకు అనుజ్ఞయైన ఇమ్ము', అను ప్రియురాలికి అప్పుడు నేను పారిజాతమునే తెచ్చియొసంగెదనని ప్రతిజ్ఞ గావించితిని," అనగా. . . . )

కథా కల్పన మాటయటుండనిచ్చి, భావకల్పనా చమత్కృతి కూడ ఏ మాత్రములేని పునరుక్తిప్రాయమైన ఈ అతిదీర్ఘనివేదన వలన రుద్రభట్టు సాధించిన రసాలంకార చారుత్వమేదియుకానరాదు. ఇట్టి రచన గ్రంథ స్థౌల్యమునకేగాని గౌరవమునకు ఉపయోగింపదు.

6. కృష్ణుడు నారదుని ఇంద్రునియొద్దకు దూతగానంపు సందర్భమున హరివంశములో కృష్ణుని ప్రసంగములు రెండును, వాని మధ్యనారదుని ప్రసంగమొకటి మాత్రముండగా, రుద్రభట్టు కృష్ణుని ప్రసంగములను నాల్గింటిని, వాని మధ్య నారదుని ప్రసంగములను మూడింటిని రచించినాడు. ఇట్లీ సన్నివేశము మూలమున కంటె ఎక్కుడు నాటకీయముగ మలుపబడినదనుట నిజమేయైనను మూలమునందలి కథాగమన వేగము కుంటుపడినదని చెప్పక తప్పదు. హరివంశమున ఈ భాగము 40 శ్లోకములను (౬౭అధ్యా.) ఆక్రమింపగా రుద్రభట్టు భాగమున చిన్నవి పెద్దవి చేరి 41 గద్య,పద్యములను (౦౩-5-32) రచించినాడు.[1] ఇందలి చాల పద్యములు, గద్యలు అనుష్టుప్పుకంటె

పెద్దవియగుటచే మొత్తము మీద పరిమాణము కూడ పెద్దదేయైనది. తదనుగుణముగ రససాంద్రత తగ్గినది. నాటకీయత వలన కలిగిన మేలుకంటె, రసము పలుచబడి, రసానుభూతి మందగించుట వలన కలిగిన నష్టమెక్కువయైనది.

7. పారిజాతము నున్మూలించిన కృష్ణుని చర్యను నందన వనపాలకులు దేవేంద్రునకు నివేదించుట హరివంశమునందు ఒక్క శ్లోకములో చెప్పబడినది.

'తే తు నందన గోప్తారః పారిజాతో ద్రుమోత్తమః

హ్రియతీతి మహేంద్రాయ గత్వా నృప శశంసిరే.' (౭౩ -13)

విష్ణు పురాణములో వనపాలకులీ వృత్తాంతమును శచీదేవికి విన్నవించుట కూడా అర్ధశ్లోకములోనే ముగిసినది.

'ఇత్యుక్తా రక్షిణో గత్వాశచ్యాః ప్రోచుర్యథోదితమ్'. (30-52)

రుద్రభట్టు ఇచట విష్ణు పురాణము ననుసరించుచు వనపాలకుల మాటలను సొంత కల్పనలతో పెంచి ఒక పెద్ద పద్యము రచించినాడు.

(అనిమిష వనపాలకులు పౌలోమి సమీపమునకు వచ్చి, "దేవీ, 'పౌలోమికీ శ్రేష్ఠమైన పారిజాత మహిజమేల? నేను వీరకామినిని. రూపము నందును అధికురాలను. పాలగునందీ కుజము మేలైనది. నాకే యోగ్యమైనది.' అనునట్లు సత్యభామ తన పతియైన దైత్యారిని తీసికొనివచ్చి, నిజోద్యాన పారిజాత తరువును ఉత్సాహముతో గైకొనినది." అని విన్నవింపగా. . . . )

8. శచీదేవి దేవేంద్రుని కృష్ణునిపై యుద్ధమునకు ప్రేరేపించుటను విష్ణు పురాణము అర్ధశ్లోకములో చెప్పినది.

'శ్రుత్వా చోత్సాహయామాస శచీ శక్రం సురాధిపమ్,' (30-52)

రుద్రభట్టు దీనిని చాల విపులపరచినాడు. శచీదేవి ఇంద్రుని సమీపించుట నొక పద్యములోను, అతనిని పురికొల్పుటను రెండు పద్యములలోను చెప్పినాడు.

(స్తన కంపత్రుట్య దేకావళియు, గతిజవ నిర్ముక్త మంజీరవాందోళన భారధ్వస్త కర్ణోత్పలమును, అవిరళ ఘర్మాంబు ధౌతాంగరాగమును, ఘనపోష్ణ శ్వాసలోలాలకమును, అదృఢకచప్రస్తమాల్యమును భయము గొలుపుచుండగా, కులిశికి అపజయ శ్రీయే వచ్చిన

అందముతో పౌలోమి వచ్చెను. (50) అట్లు వచ్చి సభాంతరాళమందున్న నిజకాంతుని యంతికముంజేరి. 'నాకతి ఖేదమగునట్లు నేడు నందనము పదార్థ విహీనమైనది. అమరౌఘము వలన నిక ఫలవాంఛితముకాదు. ఓయి సుధాశనపతీ, మురవైరి వలన పారిజాతా పహరణమైన కారణము వలన నేడు అనిమిషలోకపు నిజకీర్తి మలీమసమైనది. (51) అనిమిషానోకహము పోవుట నరసియు ఇంకను నిలింపేభ పూర్వాసన మందు కాలూనక, ఇంకను నిజకులిశ మహాస్త్రమునకు చేయి వేయక, ఇంకను కోపముతో పైకెత్తిపోక, ఇంకను దనుజరిపునితో పోరక ఉంటివేమి? సంక్రందనా, పౌలోమినైన నా అధిపుడవనిపించుకొని బన్నమున కెదురొడ్డి నిలువుము.) (59).

9. కృష్ణుని ధనుష్టంకారమును అర్ధశ్లోకములో హరివంశము వర్ణించినది. రుద్రభట్టు ఒక మహాస్రగ్ధరను రచించినాడు.

'శార్ఙ్గస్య చ నినాదేన ముముహుః స్వర్గవాసినః' (హరి ౭౩-22)

'పవినిర్ఘోషోపమానం, ప్రళయ ఘనఘటా గర్జనాభం,మహాభై

రవదుర్వారాట్ట హాస ప్రతినిధి, యమ బాహాపరిస్ఫాలన ప్ర

ఖ్యవెనల్, ధూతాహిలోకం, భ్రమదవనితళం, ప్రోచ్ఛల ద్వార్ధినిర్భి

న్న విరించాండం, పాదళ్లత్త సురరిపు ధనుర్దండ చండప్రణాదం. (౧౩-74)

(పవినిర్ఘోషోపమానమును, ప్రళయ ఘనఘటా గర్జనాభమును, మహా భైరవ దుర్వారాట్ట హాసప్రతినిధియును, యమబాహా పరిస్ఫాలన ప్రఖ్యమును అనువట్లు, అసురరిపు ధమర్దండ చండ ప్రణాదము ధూతాహిలోకమును, భ్రమదవనితలమును, ప్రోచ్ఛలద్వార్ధి నిర్భిన్నవిరించాండమునునై వ్యాపించెను.)

10. 'క్షిప్తం వజ్రమథేంద్రేణ' (30-69) అని విష్ణు పురాణము ఒక అనుష్టుప్ పాదములో చెప్పిన ఇంద్ర కృత వజ్రప్రయోగమును తిమ్మన రెండు పెద్ద పద్యములలో విస్తరింపగా, రుద్రభట్టు ఒక చిన్న కందపద్యముగా పెంచినాడు.

'హరనేత్ర వహ్నియుం పం

హరణాగ్నియు మిదళ కాయ్చువాళ్ దొరెయక్కుం

దొరెయల్తు గర్జనాడం

బరదొళిదర్కొనిప వజ్రదిం వృషనిట్టం' (౧౩-105)

('హరనేత్ర వహ్నియు, సంహరణాగ్నియు దీని వేడిమికి సరిపోలును. గర్జనాడంబరమున సరిరావు.' అనదగిన వజ్రముతో వృషుడు వేసెను.)

11. అట్లే 'జగ్రాహ భగవాన్ హరిః' )30-69) అని విష్ణు పురాణము ఒక పావుశ్లోకములో చెప్పిన కృష్ణుని వజ్రపు పట్టివేతను తిమ్మన ఒక మత్తేభ వృత్తముగా విస్తరిల్లజేయగా రుద్రభట్టు ఒక కందముగా విపులీకరించినాడు.

'పొళెపిం పిడిల్దు కెండద

మళెయం కఱెవెసకదిందె బర్పుదవాగళ్

ఘళిలనె పిడిదం మించం

బుఱువం పిడివంతె వజ్రమం దనుజహరం.' (౧౩-106)

('మెరపులు మెరయించుచు నిప్పుల వర్షము గురియునట్లు భయంకరముగా రాగా, ఆ వజ్రమును దనుజహరుడు 'చట్టున' మిణుగు పురువుమ పట్టినట్లు పట్టివేసెను.)

ఇట్లు రుద్రభట్టు చేసిన విపులీకరణలు కొన్ని పట్టులందు గొప్ప భావకల్పనలకు తావలమై రసవంతములుగనున్నవి. కొన్ని పట్టులందు నీ రసములుగ మన్నవి. కొన్ని పట్టులందు చేయవలసినంతగ విపులీకరణ చేయ బడలేదు. అనగా మొత్తము మీద ఈ విపులీకరణ క్రమబద్ధము కాదన్నమాట. అనగా రుద్రభట్టులో సమ్యగ్దృష్టి కొరవడినదని యర్థము.

## సంగ్రహీకరణ :

రసపోషణకొరకును, భావకల్పన కొరకును రుద్రభట్టు కొన్నియెడల మూలమునకంటె పెంచి వ్రాసినను మొత్తము మీద గ్రంథమును సంక్షిప్త పరచి వాడనియే చెప్పవలెను. హరివంశమందు 18 అధ్యాయములుగ 1032 శ్లోకము లుగనున్న కథా భాగమును, విష్ణు పురాణములో మూడధ్యాముల మీద 105 శ్లోకములుగ నున్న కథా భాగమును కలిపి సుమారు 270 గద్య పద్యములలో ఇమిడ్చియుండుటచే రుద్రభట్టు

సంగ్రహించిన భాగములు, పూర్తిగ పరిహరించిన భాగములు చాల ఎక్కువగనే యున్నవి. ఇపుడాతడు గావించిన సంగ్రహీ కరణలను పరిశీలింతము.

1. నరకవధానంతరము వాని సంపదలను కృష్ణుడు ద్వారకకు చేర్పించుట హరివంశమందు 18 శ్లోకములలో (౬౪-1-18) చెప్పబడియున్నది. రుద్రభట్టు దానిని ఒక్కపద్యములో సంగ్రహించినాడు.

'వ, 'అన్నెగం భౌమాన్వయాగత ప్రధాన పురుషం బందు. . .

చ. బళివిధ్వంసిగె కొట్ట నాహవ రసప్రస్యందన స్యందనం
గళ వంగచ్ఛవిసత్త్వరూప విజచేష్టా వాహ వాహంగళం
జళదశ్యామ సదానగండ రద నిర్భిన్నాగ నాగంగళం
విళసద్రత్నగణ ప్రభాపరికర వ్యాకోశ కోశంగళం. (౧౨-52)

వ, ఆమనోహర పదార్థసార్థంగళం ద్వారావతిగె కళిపి. . . '

(అంతలో భౌమాన్వయాగత ప్రధాన పురుషుడు వచ్చి బలివిధ్వంసికి ఆహవరస ప్రస్యందన స్యందనములను, అంగచ్ఛవిసత్త్వరూప విజచేష్టావాహ వాహములను,. జలదశ్యామ సదానగండ రద నిర్భిన్నాగ నాగములను, విలసద్రత్న గణప్రభా పరికరవ్యాకోశ కోశములను ఒసంగెను. ఆ మనోహర పదార్థ సార్థములను ద్వారావతికి పంపి. . . )

2. నరకుని చెరలోనున్న పదునారు వేలమంది గంధర్వ కన్యలను కృష్ణుడు దర్శించుటను హరివంశము 7 శ్లోకములలో (౬౪-24-30) చెప్పినది. వానిని రుద్రభట్టు ఒక్క కందపద్యములో సంగ్రహించినాడు.

'షోడశ సహస్ర శశిగళ్
మూడిదనభమెనె గుహాగ్ర గతముఖ తతియిం
కూడి మణిశైల మెసెదిరె
నోడిదరచ్యుతన నఖిల సురకన్యకెయర్' (౧౩-53)

(షోడశ సహస్రశశులుదయించిన నభమోయన, గుహాగ్రగత

ముఖతతితోగూడి మణిశైలము ప్రకాశింపగా, అఖిలసురకన్యకలు అచ్యుతునిగాంచిరి.)

3. రుక్మిణీకృత వ్రతవర్ణన హరివంశములో 7 శ్లోకములు (౬౫-5-11) అక్రమింపగా రుద్రభట్టు దానిని రెండు పద్యములలో ఇమిడ్చినాడు.

ఉ. 'ఆవృతమాగె తూర్యరవదిం సభసట్టు వుపాయనక్కెది
గ్దేవతె మేరెయాగె, కుడువశ్వగజాళి పదార్థవర్ధి సా
ర్థావధియాగె, విశ్వవిభు కృష్ణని నాదుదు రుక్మిణీ మహా
దేవిగె పుణ్యకవ్రతద నోంపి ధరిత్రిగె రాగవప్పినం. (౧౨-61)
వ. ఆ మహోత్సవదొళ్

మ. కెదఱిర్దుత్తమ పుష్పమొక్క ఘుసృణం చెల్లిర్ద కస్తూరి సూ
సిద పోతాత్రియ కర్పురం, నెగెవ ధూపోద్దామధూమం, వధూ
వదనాంభోరుహ గంధమం, కెదడు వుద్యచ్చామరౌఘానిలం
ముదమం మాడె సరోజనాభ సభె చెల్వాగిర్దు దొడ్డోలగం.' (-62)

(తూర్యరవముతో సభమావృతము కాగా, అంపించెడు ఉపాయనములకు దిగ్దేవతయే మేరకాగా, ఒసంగెడు అశ్వగజాళి పదార్థము అర్థిసార్థావధికాగా, ధరిత్రికి రాగమగునట్లు విశ్వవిభుడైన కృష్ణుని వలన రుక్మిణీ మహాదేవికి పుణ్యకవ్రతపు నోము నడచెను. ఆ మహోత్సవమందు. చెదరిన ఉత్తమ పుష్పములు, పూసిన ఘుసృణము, చల్లిన కస్తూరి, వెదజల్లిన 'పోతాత్రియ' కర్పూరము, ఎగయుచున్న ధూపోద్దామ ధూమము, వధూ వదనాంభోరుహ గంధమును కలంచు ఉద్యచ్చామరౌఘానిలము ముదము గలిగింపగా సరోజనాభుడు ఒడ్డోలగమున చెలువారియుండగా. . . )

4. నారదకృత రుక్మిణీ ప్రశంస హరివంశములో 8 శ్లోకములు (౬౫-36-43) ఉండగా రుద్రభట్టు రెండు కందపద్యములలో సంగ్రహించినాడు.

'పుట్టె విలాసం ముడిగళ
నట్టుత్తి కుసుమ మీకెయొళ్ సవతియరొళ్
పట్టాంతరవెనలిం పాఱ

పరిహరించియున్నాడు. ఇపుడాయంశముల నన్నిటిని వరుసగా క్రోడీకరింతము.

1. పదునారు వేలగంధర్వ కన్యలకు శ్రీకృష్ణుడు భర్తయగునని వాయుదేవుడు, నారదుడు వరమొసగినట్లు హరివంశము చెప్పుచున్న వృత్తాంతమును రుద్రభట్టు చెప్పలేదు. అట్లు చెప్పకుండుటకు కారణమేమియు లేదు.

2. అదితి సత్యాకృష్ణులను దీవించినట్లు హరివంశ, విష్ణు పురాణములు రెండును చెప్పుచున్నవి. రుద్రభట్టు ఈ మాటను చెప్పలేదు. శ్రీకృష్ణుని పరమేశ్వరత్వమునకు అదితి నుండి దీవెనలు గైకొనుట భంజకమగునని రుద్రభట్టు భయపడినట్లున్నాడు. కాని ఈ భయమునకు మూలములేదు. దేవకీ వసుదేవులకు నమస్కరించి వారి యాశీస్సులను గొనుటెట్టిదో, కృష్ణునకు అదితి యాశీస్సులను గొనుటయునట్టిదే.

3. శచీదేవి తన కతిథియైన సత్యనవమానించినట్లు చెప్పుచున్న విష్ణు పురాణ కథను రుద్రభట్టు పరిహరించినాడు. హరివంశ కథననుసరించి సత్యాసపత్నీ మాత్సర్య వృత్తాంతమును చెప్పబూనియున్న రుద్రభట్టునకు ఈ శచీకృతావమాన కథను పరిహరించుట అవసరమేయగుచున్నది. తిమ్మన కూడ ఈ కథాంశమును పరిహరించినాడు.

4. సత్యవోదార్చువేళ కృష్ణుడు తన ప్రాణముపై ఒట్లుపెట్టుకొనినట్లు హరివంశము చెప్పుచున్నది. తిమ్మనవలెనె రుద్రభట్టు కూడ ఈ శపథములను పరిహరించి కృష్ణ పాత్రకుదాత్తతను పెంపొందించినాడు.

5. సత్యభామ దేవాయతనమునకేగు నపుడు తెల్లనిచీరను కట్టునని హరివంశము తెలుపుచున్నది. హరివంశములోవలెనే జగన్నాథ విజయమునందు కూడ సత్య తపస్సున కేగుటకై కృష్ణుని అనుమతిని కోరుచున్నది. అట్టి స్థితిలో ఆమె తెల్లని చీరె కట్టుటయే ఉచితము. తిమ్మన తపోభ్యనుజ్ఞాయాచనను చెప్పలేదు గనుక ఆమె దేవపూజా నైపథ్యప్రసంగమును మానవలసి వచ్చినది. రుద్రభట్టున కట్టి అక్కర లేదు సరిగదా ఆ విషయమును తెలుపుటయే సరసముగనుండెడిది. కాని అతడేలనో ఆ మాటను చెప్పినవాడుకాడు.

6. హరివంశ సత్యపలికిన దీన వాక్యములను తిమ్మన వలెనే రుద్రభట్టు

కూడ పరిహరించి ఆమె పాత్రచిత్రణకు మెరుగెక్కించినాడు.

7. హరివంశ కృష్ణుడు తాను రుక్మిణికి పుష్పము నీయవలసి వచ్చిన పరిస్థితులను గూర్చి సత్యకిచ్చుకొనిన 'సంజాయిషీ'ని తిమ్మన వలెనె రుద్రభట్టు కూడ పరిహరించుట సందర్భానుగుణముగ నున్నది.

8. కృషుడు పారిజాతమును వాగ్దానము గావింపగనే 'అట్లైనచో నా కోపము పోయినది.' అని సత్యభామ పలికినదను హరివంశోక్తిని తిమ్మనవలెనె రుద్రభట్టు కూడ పరిహరించుట ఉచితముగానున్నది.

9. సత్యామందిరమున నారదుడు కృష్ణునకు పారిజాతోత్పత్తి మాహాత్మ్యమును గూర్చి విపులముగ నుపన్యసించిట్లుగల హరివంశ ప్రసంగమును తిమ్మనవలె రుద్రభట్టు కూడ పరిహరించుట సముచితముగానున్నది.

10. తిమ్మన వలెనె రుద్రభట్టు కూడ ఇంద్రలోకమందలి మహేశ్వర పూజోత్సవ వర్ణనను చేయక విడచినాడు. తిమ్మన కథా ప్రణాళికలో దానికి స్థానమే లేదు. రుద్రభట్టు ప్రణాళికలో దానికి స్థానము లేకపోలేదు. ఐనను దానిని విడచినందున ప్రధానకథకెట్టి భంగమును కలుగలేదు.

11. పారిజాత పుష్ప మాహాత్మ్యములో అనేక విశేషములను రుద్రభట్టు చెప్పక విడచినాడు. పారిజాతము సంవత్సరము వరకు వాడకుండుట, సంవత్స రాంతమున తిరిగి పారిజాతవృక్షమున కరుగుట, సరసాన్న పానీయములను సర్వ సుగంధముల నొసగుట, సమశీతోష్ణ స్థితిని కల్పించుట మొదలగు విశేషములను రుద్రభట్టు విస్మరించుటకు కారణము లేదు. పారిజాత మహిమను రుద్రభట్టు సంకుచిత పరచినాడని చెప్పవలెను.

12. సత్యామందిరమున నారదునకు కృష్ణుడాతిథ్యము నొసగిన హరివంశ కథాంశమును రుద్రభట్టు విస్మరించినాడు. ఐనను కథకు దానివలన నెట్టి నష్టమును కలుగలేదు. తిమ్మన ఈ విషయము తెలిపినాడు.

13. హరివంశమున నారదుడు ప్రసంగవశమున చెప్పిన అంధకాసుర సంహార వృత్తాంతమును రుద్రభట్టు పరిహరించినాడు. నిజమునకీ వృత్తాంతము నచట చెప్పవలసిన అవసరమేలేదు. కనుక రుద్రభట్టు ఈ అంశమును చెప్పక విడచుటయే ఉచితముగ నున్నది. తిమ్మనకీ వృత్తాంతమును చెప్పవలసిన అవసరము బొత్తిగలేదు. కనుక అతడు కూడ ఈ వృత్తాంతమును పరిహరించినాడు.

14. నారదుడు కృష్ణుని సందేశమును ఇంద్రునకు తెలిపిన వృత్తాంతమును రుద్రభట్టు తెలుపలేదు. దృశ్యకావ్యము నందైనచో ఇతివృత్తము నందలి సన్నివేశములనన్నిటిని ప్రదర్శించుట కష్టమేయగును. కాని శ్రవ్య కావ్యమును రచించుచున్న రుద్రభట్టు ఈ విషయమును చెప్పక విడచుటకు కారణము లేదు. పారిజాతాపహరణ వృత్తాంతమును శచీదేవి వలన ఇంద్రుడు వినిన పిమ్మట తనలో తాను 'నారదుని మాటలు నిజమైనవి? అని తలచినట్లు సంగ్రహముగనైన నారద దౌత్యమును ఉచిత స్థానమున వర్ణించినచో సముచితముగ నుండెడిది. తిమ్మన కథాప్రణాళికలో దీనికి స్థానమే లేదు.

15. ఇంద్రునకు కృష్ణునివలన కలుగనున్న ప్రమాదమును గూర్చి బృహస్పతి కశ్యపునితో సమాలోచించుటయు, కశ్యపుడు శివుని స్తుతించుటయు, శివుడు కశ్యపునకు కర్తవ్యమునుపదేశించుట మొదలగు హరివంశ (౭౨-అధ్యా) కథాంశములను రుద్రభట్టు చెప్పలేదు. ఐనను ఇతివృత్తమునకెట్టి క్షతియును కలుగలేదు.

16. కృష్ణుడు అమరావతికేగుటకై మృగయావ్యపదేశమున రైవతకాద్రికేగి అట నుండి అమరావతికేగినట్లు హరివంశము తెలుపుచున్నది. (౭౩-1) దీనివలన కృష్ణునకు తాను చేయనున్నది అకార్యమనియు, గురుబంధు జనులకు ముందుగ నీ సంగతి తెలిపినచో ఆక్షేపింతురనియు భయము కలిగినట్లర్థమగుచున్నది. కృష్ణపాత్ర ధీరోదాత్తతకిది కొంతవరకు భంజకమే. కనుక రుద్రభట్టు ఈ మాటచెప్పలేదు. ఇది ఉచితముగనేయున్నది. తిమ్మన ప్రణాళికలో కృష్ణుని అమరావతీ యాత్ర యుద్ధయాత్రకాక స్నేహయాత్రయే కనుక దానిని మరుగుపరుపవలసిన అవసరమే లేకపోయినది.

17. విష్ణు పురాణమున గల సత్యాప్రగల్భోక్తులను తిమ్మన చక్కగ అనువదించియున్నాడు. రుద్రభట్టేలనో వానిని పరిహరించినాడు. దీనివలన రుద్రభట్టు సాధించినదేమియులేదు. కాని సత్యాపాత్ర చిత్రణమును సమగ్రము గావించునొక చక్కని అవకాశమును చేతులార జార బుచ్చుకొనినవాడైనాడు.

18. ఇంద్రోపేంద్రుల యుద్ధములో ఇంద్రునకు బాసటయై నిలచిన ప్రవరజయంతుల పేర్లను తిమ్మనవలె రుద్రభట్టు కూడ చెప్పలేదు. చెప్పనందున కలిగిన నష్టమేమియు లేదు.

19. కృష్ణుడు యుద్ధ మధ్యమున బిల్వోదకేశ్వరు నారాధించుట, గరుడుని భారమునకు పారియాత్రము క్రుంగుట, కృష్ణుడు దారుక సారథికమగు రథమును ద్వారకనుండి తెప్పించుకొనుట, పారియాత్రమునకు వరములొసగుట్మ మున్నగు హరివంశస్థములగు అవాంతర కథలను తిమ్మనవలెనే రుద్రభట్టు కూడ పరిహరించినాడు. దీని వలన కథాగమన వేగము హెచ్చుటయను మేలు కూరినది. యుద్ధఘట్టమున తిమ్మన రుద్రభట్టులిరువురును హరివంశమును గాక విష్ణు పురాణము ననుసరించిన వారగుటచే ఇరువురచే పరిహృతములైన అంశముల మధ్య సామ్యముగా గోచరించుచున్నది. ఈ కారణము వలననే ఈ ఇరువురును అదితి కశ్యపులు ఇంద్రోపేంద్రులకు సంధిసాసగించిన అంశమును కూడ పరిహరింపవలసిన వారైనారు.

20. కృష్ణుడు ఇంద్రునిపై చక్రమును ప్రయోగింపబూనియు విరమించినట్లు విష్ణు పురాణము చెప్పుచున్నది. చివరకెట్లును ప్రయోగింపలేదు గనుక తిమ్మన రుద్రభట్టు లిరువురును ఆ ప్రసంగమునే చేయరైరి.

21. ప్రణష్టవజ్రుడైన ఇంద్రుడు పలాయితుడగుటయు, సత్య ఆతనిని పరిహసించుటయు, ఇంద్రుడామెకు సమాధానమొసంగుటయు నను విష్ణు పురాణ కథాంశములను తిమ్మన వలెనే రుద్రభట్టు కూడ పరిహరించి ఇంద్ర పాత్రకును, సత్యాపాత్రకును కూడ మేలుచేసినాడు.

22. యుద్ధ విరమణానంతరము కృష్ణుడు త్రివిష్టపమునవొక రాత్రి విడియుట, శచీదేవి సత్యభామ కొరకై ఆభరణాధికములనిచ్చుట అను అంశములను తిమ్మన వలెనె రుద్రభట్టు కూడ చెప్పలేదు. ఈ పట్టున ఇరువురును హరివంశమునుగాక విష్ణు పురాణముననుసరించుటే ఇందులకు కారణము.

23. కృష్ణుడు పారిజాతమును తిరిగి ఇంద్రునకీజూపిన విష్ణు పురాణ కథాంశమును తిమ్మన అనువదించినాడు. కాని రుద్రభట్టు అనువదింపక విడచినాడు. కాని దీని వలన కథకులోటు కలుగలేదు.

24. హరివంశ విష్ణు పురాణములు రెండును చెరియొక విధముగనైన పారిజాతమును తిరిగి నందనవనమునకు చేర్చుటకొక గడువును చెప్పినవి. రుద్రభట్టీ విషయమును చెప్పుటను నిజముగానే మరచినాడు. ఇది కేవలము అసావధానతా జనిత ప్రమాదమనుటకెట్టి సంశయమును లేదు. సాధారణ దృష్టికి ఇదియొక లోపముకాదు.

కాని విమర్శాత్మక దృష్టికిది యొక్క గొప్ప లోపమే.

25. చివరకు సత్యభామయు, ఆమె సపత్నులును పుణ్యక వ్రతమాచరించిన విషయమును రుద్రభట్టు చెప్పక విడచినాడు. నిజమునకు సత్యా గృహోద్యానములో పారిజాతమును నాటుటతో 'పారిజాతాపహరణ' కథ ముగిసినది. కనుక తిమ్మన దీనిని చెప్పకున్నను దోషములేదు. చెప్పుటయే దోషమన్నవారును ఉన్నారు. కాని శ్రీకృష్ణుని జీవిత చరిత్రనంతటిని జగన్నాథ విజయముగా రచించుచున్న రుద్రభట్టు ఈ కథను విస్మరించియుండరాదు. పుణ్యకవ్రత సందర్భమున జగన్నాథుని విజయమేమియు లేదని రుద్రభట్టు భావించియుండును. కాని ఈ వ్రతము శ్రీ కృష్ణుని రసికతకొక విజయమనుట అతిశయోక్తికాదు. శ్రీకృష్ణుని కేవల యుద్ధవీరునిగ మాత్రమేగాక శృంగార నాయకునిగ కూడ చిత్రించియున్న రుద్రభట్టు పుణ్యకవ్రతకథను కూడ చెప్పియున్నచో మరింతరమ్యముగ నుండెడిది.

హరివంశ విష్ణు పురాణములందలి కథాంశములలో కొన్నింటిని రుద్రభట్టు తన కథా ప్రణాళికనుబట్టి పరిహరించుట అవసరమైనది. కొన్నింటిని పరిహరింపవలసిన అవసరము లేకున్నను అట్లు పరిహరించినందున ఇతివృత్తమునకుగాని, రసమునకుగాని, ఔచితికిగాని, పాత్రచిత్రణకుగాని ఎట్టి లోటును కలుగలేదు. కాని మరికొన్నింటి విస్మరణ వలన కావ్యసౌందర్యమునకు కొంత కొరత ఏర్పడినదని చెప్పక తప్పదు.

## <u>రుద్రభట్టు నూతన కల్పనలు :</u>

తిమ్మన వలెనే రుద్రభట్టు అనేక నూతన కథాంశములను కల్పన చేసినాడు. మార్పు చేయక అనుసరించిన కథాంశములో అనేకములైన నూతన భావములను కల్పించినాడు. వర్ణనాత్మకములు, అలంకారికములు, వివరణాత్మ కములునైన ఈ నూతన భావనలు రుద్రభట్టు ప్రతిభా సంపదకు తార్కాణలై యున్నవి. రుద్రభట్టు గావించిన అట్టి కల్పనలను ఇది వరకే మనము మాతృకా నిర్ణయ సందర్భముగా 'కథాంశములు' (పుటలు 39-47), 'రచనావిశేషములు (పుటలు 97-112) అను విభాగములలో గుర్తించియున్నాము.

రుద్రభట్టు చేసిన కల్పనలు తిమ్మన కల్పనల కంటె సంఖ్యలో తక్కువైనవి; నిడివిలోను తక్కువైనవే. కాని ఉన్నంతలో చాలవరకు రమణీయార్థ ప్రతి పాదకములనుట కెట్టి ఆక్షేపణమునుండజాలదు. ముఖ్యముగా శచీ సత్యావాగ్వాద కల్పన మిక్కిలి

రమణీయముగనున్నది. కాని నారదుడు సత్యానింద గావించు సందర్భమున ఆవేశమెత్తిన వానివలె దివ్యప్రమాణము చేయుదునని 'సవాలు' చేయుట, శచీదేవికి రోషమును పెంచుటకై ఆమెతో పుల్లవిరుపు మాటలనుట, యుద్ధరంగమున ఇంద్రుని పోరునకై పురికొల్పుట, కృష్ణుడు తనకు సత్యకును నడచిన ప్రణయ కలహపు వివరములు నారదునకు వివరముగ తెలుపుట, బిల్వోదకేశ్వరుడు కృష్ణుని చర్యను ఆక్షేపించుటయను కల్పనలు ఆయా పాత్రల ఉదాత్తతకు భంగకారులగుటచే అరమణీయములనక తప్పదు.

## రుద్రభట్టు :
## అన్యథాకల్పనలు :

1. నరకుని చెరలోనున్న పదునారు వేల గంధర్వకన్యలను కృష్ణుడు ప్రాగ్జోతిష నగరముననే పెండ్లియాడినట్లు చెప్పుట రుద్రభట్టు ఈ కథా భాగములో గావించిన తొట్ట తొలిమార్పు.

2. అదితి తనకు నమస్కరించు కృష్ణుని 'నీవు పరమేశ్వరుడవు. కనుక నాకు నమస్కరింపరాదనుటయు, తానాతనిని దీవింపకుండుటయు ఈ కథాభాగమున రుద్రభట్టు చేసిన మార్పు.

3. పారిజాతమును కోరుటకు పుణ్యకవ్రతపు సాకు చెప్పక కృష్ణుడు ఉన్న నిజమనే చెప్పుట. రుద్రభట్టు చేసిన మరియొక ముఖ్యమగు మార్పు.

4. తన రాయబారపు ఫలితమును తిరిగి వచ్చి చెప్పనక్కర లేదనియు, రేపటి ఉదయమే, దండెత్తి వచ్చుచున్నాననియు కృష్ణుడు నారదునకు తెలుపుట కూడ రుద్రభట్టు కల్పనయే. హరివంశమునందు నారదుడు ఒకటికి రెండు పర్యాయములు ఇంద్రోపేంద్రుల మధ్య తిరుగవలసిన వాడైనాడు. రుద్రభట్టు నారదునకు శ్రమ తగ్గించినాడు. దానితోపాటు కథావేగమును పెంచినాడు.

5. కృష్ణునకు పారిజాతమును సమర్పింపుమని నారదుడు ఇంద్రునకు హితోపదేశము గావించినట్లు హరివంశము చెప్పుచుండగా, అతడే ఇంద్రుని యుద్ధమునకు పురికొల్పినట్లు రుద్రభట్టు కల్పన, నారదుని కలహప్రియునిగ స్పష్టముగ నిరూపించుటకై రుద్రభట్టీ అన్యథా కల్పనను చేసినాడు. కాని ఇదియంత రమణీయమైన కల్పన కాదు. దీని వలన నారద పాత్ర చాల నీచముగ రూపొందినది. కృష్ణునితో పోరువలదని బృహస్పతి ఇంద్రునకు హితవు చెప్పినట్లు చేసిన మార్పు పాత్రోచితముగ నున్నది.

6. కృష్ణుడు అమరావతికి సాత్యకిప్రద్యుమ్న సహితుడై యేగినట్లు హరివంశము తెలుపుచుండగా, సత్యాద్వితీయుడై యేగినట్లు రుద్రభట్టు మార్పు గావించినాడు. ఇది చాల రమ్యమైన మార్పు. దీని వలన శ్రీకృష్ణుని పరాక్రమ మధికముగా ప్రకటితమగుటే కాక కావ్యమున వీర రసముతోబాటు మరికొంత శృంగారరసమును కూడ పోషించుటకవకాశము లభించినది. అంతేగాక సత్యాశచీ వాగ్వాదమును కల్పించుటకు కూడ అవకాశము లభించినది.

7. హరివంశమున రెండు దినములు జరిగినట్లున్న యుద్ధమును రుద్రభట్టు ఒకే దినము జరిగినట్లు చెప్పుటయు మార్పేయగును. ఐనను ఇచట నాతడు విష్ణు పురాణము ననుసరించి వాడనిదైన చెప్పవచ్చును.

8. ఇంద్రుని వజ్రప్రయోగమునకు ముందే గరుడుడు ఐరావతమును పారియాత్రముపై పడవేసినట్లు హరివంశము చెప్పుచుండగా వజ్రము కృష్ణుని చేతిలో నిర్వీర్యమైన పిమ్మట ఈ విషయమును రుద్రభట్టు చెప్పినాడు. ఇదియొక సందర్భ పరివర్తన. ఈ మార్పు వలన రుద్రభట్టు సాధించిన ప్రయోజనమేమియు లేదు.

9. అట్లే యుద్ధ మధ్యమున బిల్వోదకేశ్వరుడు కృష్ణునకు ప్రత్యక్షమైనట్లు హరివంశము చెప్పుచుండగా యుద్ధాంతమున నతడు సాక్షాత్కరించినట్లు రుద్రభట్టు ప్రకరణమును మార్పుచేసినాడు. ఈ అన్యథా కల్పనల వలన కూడ రుద్రభట్టు సాధించిన గొప్ప ప్రయోజనమేమియు లేదు. సాక్షాత్తుగ శివుడే వచ్చి జోక్యము చేసికొని నివారింపవలసి వచ్చిన జగత్సంక్షోభకారిగా ఇంద్రోపేంద్ర యుద్ధమును నిరూపింపవలసి ఈ మార్పును రుద్రభట్టు చేసియుండును. కాని అప్పటికే కృష్ణుడు ('సకారుణ్యానాదం' (౧౩-110) సకారుణ్యుడయ్యెనని రుద్రభట్టు చెప్పియున్నాడు. ఆ తరువాత శివుడరుదెంచి కృష్ణుని మందలింప వలసిన అవసరము లేదు.

ఇట్లు కథావిధానము నందు రుద్రభట్టు గావించిన మార్పులలో ఒకటి రెండు రమ్యమైన వున్నను, కొన్ని మార్పులు ప్రయోజనరహితమైనది, కాగా మరికొన్ని మార్పులు రసపాత్రౌచిత్యములకు భంగకారులుగ కూడ పరిణమించినవి.

రుద్రభట్టు :

యథాతథానువాదము:

తిమ్మన వలెనె రుద్రభట్టు కూడ మూలమును 'తు' 'చ' తప్పక అనువదించిన

పద్యములు తక్కువ, ఛందోనిర్బంధముల వలననైననేమి, రుచిభేదము వలన నైననేమి కొలదిపాటి భావచ్ఛాయా భేదమైన లేక శ్లోకములను పద్యములుగా మార్చిన ఉదాహరణములు లభించుట కష్టము. ఐనను కొంత కుడి ఎడమగా సమాన భావములు గల ఈ శ్లోకములు అనువాదములు గమనింపదగియున్నవి.

1. 'ప్రేష్యా జనం ససంజ్ఞాయ అవాఖ్యేయోస్మి సంజ్ఞయా
సశంకిత ప్రసారశ్చ వారితో వ్యగమత్ సతాం' (హరి. ౬౬-13)
'బందుమృదుయాన దిందాం
బందుదనీ దేవిగఱుప బేడెందు సఖీ
వృందక్కె పేళ్దు సంజ్ఞెయి
నందు మనోరమెయ కోపగృహమం పొక్కం' (౧౩-83)

(మృదుయానముతో వచ్చి నేను వచ్చుటనీ దేవికి తెలుపవలదని సఖీబృందమునకు సంజ్ఞతో చెప్పి అప్పుడా మనోరమదైన కోపగృహమును ప్రవేశించెను.)

2. 'మానార్థం జీవ్యతేలోకే సద్భిరిత్యుక్త వానసి
తదేవం పతివేచ్ఛామి జీవితుంమాన వర్జితా.' (హరి. ౬౭-15)
'మానవిధి యెందుమన్నిపె
నీనెన్నం మున్నమాదుదిం దపమానం
మానినిగె మానభంగం
తానిదు మరణక్కెమధికవెంబుద నఱియా?' (౧౩౹-97)

(నీవు నన్నిదివరలో మానవిధియని మన్నించుచుంటివి. అందుచేత మానినికి మానభంగము మరణమునకంటె అధికమనుటెరుగవో?)

3. 'సపారిజాతం యదిన ప్రదాస్యతి
ప్రయాచ్యమానో భవతామరేశ్వరః
తతః శచీవ్యామృదితానులేపనే

గదాం విమోక్ష్యామి పురందరోరసి.' (హరి. ౬౮-40)

'కుడదండు పారిజాతమ

నెడెగుడ దివ్నాశచీకుచక్రీడెగె తా

నెడెగొళ్దం కామోదకి

బిడౌజనతి విపులమెనిప వక్షఃస్థళమం' (౧౩-29)

# పారిజాతాపహరణము

## జగన్నాథ విజయముతో తులనాత్మకానుశీలనము

## చతుర్థ ప్రకరణము

### కథాంశ సమన్వయాదికము

**కథాంశ సమన్వయము :**

పారిజాతాపహరణ కథ విష్ణుపురాణములో ఒక విధముగను హరి వంశములో రెండు విధములుగను - అనగా మొత్తము మూడు విధములుగ చెప్పబడి యున్నదని గుర్తించియున్నాము. అనేకాంశములలో ఈమూడు కథలును పరస్పర భిన్నములుగ నుండుటనుగూడ గమనించియున్నాము. ఈ విభిన్న కథలలో దేనినెంతవరకనుసరింపవలెనను సమస్య పారిజాతా పహరణ కథను రచించు నపుడు రుద్రభట్టు తిమ్మనల నిద్దరను ఎదు ర్కొనినది. భిన్న కథాంశములకు వీరిరువురును సమన్వయము సాధించిన మార్గములందలి తారతమ్యము నిపుడు పరిశీలింతము.

1) పారిజాతాపహరణమునకు కారణమేమి? అనునది ఈ కథను చెప్పు నాతడు సమాధానమీయవలసిన ప్రధానప్రశ్న. హరివంశపు తొలికథ (64వ అధ్యా.) ప్రత్యేకమగు కారణమును దేనిని చెప్పుటలేదు. శ్రీకృష్ణు డాసురతరువును చూడగనే ముచ్చటపడి పెకలించి గరుడుని మూపుపై నుంచినట్లు మాత్రమే చెప్పుచున్నది. సత్యభామచేత చోదితుడై కృష్ణుడు పారిజాతోత్పాటనము గావించినట్లు భాగవతము చెప్పుచున్నది. కాని సత్య శ్రీకృష్ణుని ప్రచోదించుటకు ప్రత్యేకముగ కారణమేమియు తెలుపబడ లేదు. ఆమె కేవలము ముచ్చటపడి కోరినదనియు, కృష్ణుడు తనముద్దుల పెండ్లపు ముచ్చట తీర్చినాడనియు మాత్రమే తలపవలసియున్నది. పరద్రవ్యాపహారము న్యాయమా? అను శంకను కృష్ణుడు పెట్టుకొనలేదు.

ఈకథలోనున్న గొప్ప లోపమిది. 'శ్రేష్ఠుడైనవ్యక్తి దేనినాచరించునో, ఇతరులుగూడ దానినే ఆచరింతురు.' యద్యదాచరతిశ్రేష్ఠః తత్తదేవే తరోజనః —(భగవద్గీత III 21.) అని ఎఱిగి యుండియు అవతార మూర్తి యగు కృష్ణుడు లోకమునకు ఉత్తమాదర్శమును స్థాపింపవలసి నదిపోయి పరసత్త్వాపహారమునకు పాల్పడవచ్చునా? దీనికి కృష్ణభక్తు లేవో డొంకతిరుగుడు సమాధానములుచెప్పి కృష్ణుని చర్యను సమర్థింప చూతురు. కాని సాధారణపాఠకులు మాత్రము కృష్ణునకు పరద్రవ్యాప హరణము వెన్నతోనేర్చిన విద్యయనియు, వయస్సుతోబాటుగ ఆతని దొంగ తనములుకూడ పెద్దవగుచు వచ్చినవనియే భావింతురు. నిష్పక్షపాత దృష్టితో విమర్శించువారికి శ్రీకృష్ణుడు Might is Right అను ధర్మ మును మాత్రమే స్థాపించెనని గోచరింపకమానదు.

ఈ లోపమును విష్ణుపురాణ మొకరీతిగ సరిదిద్దినది. నరకుడు అపహరించిన కుండలములను ఆమెకు తిరిగి సమర్పించుటకై సత్యా కృష్ణులు అమరావతి కేగియుండిరి. సత్యభామ శచీదేవితో 'ఇష్టాగోష్ఠి' యందున్న సమయమున శచీదేవి పరిచారికలు గంపలతో పారిజాత పుష్పములనుతెచ్చి ఆమెముందుంచిరి. శచీదేవి వాని నన్నింటిని తలలోను మెడలోను తానే ధరించినదిగాని, ఎదుటనున్న సత్యకు ఒక్క పుష్పమైన ఇచ్చినదికాదు. పైగ మానవకాంతలు దివ్యకుసుమధారణ యోగ్యలు కారనికూడ పలికినది. ఇది సత్యకు అవమానకారణమైనది. అభిమానవతి యగు సత్యకు తన మానుషీత్వపు మహత్తును ప్రదర్శించి శచీదేవియొక్క దేవత్వపు బండారమును బయటబెట్టవలెనను పట్టుదలకల్గినది. ఆపట్టుదల తోనే పారిజాతము నపహరించినది. ఈ విధముగ ఈకథకు 'శచీగర్వభంగ' మని పేరుపెట్టదగియున్నది. ఈకథ ననుసరించి కృష్ణుడు గావించిన పారిజాతాపహరణము కేవలము దూష్యమైన చర్యకాదు. కొంతవరకు సమర్థనీయముకూడ.

కాని రుద్రభట్ట తిమ్మనలిరువురును ఈ విష్ణుపురాణకథను అనుస రింపలేదు. వారిరువురును హరివంశమునందలి మలికథనే అనుసరించి నారు. ఈ కథననుసరించి సత్యభామ కోరికకు కారణము ఆమెకు రుక్మిణి యెడగల సపత్నీమాత్సర్యము, ఆమాత్సర్యమును ప్రకోపింపజేసినవాడు

నారదుడు. అది రుక్మిణికి పారిజాతపుష్పమును కృష్ణునిచే ఇప్పించుట, సత్యను తూలనాడుట అను వానివలననైనది. ఈ కథవలన సపత్నులలో సత్య ఆధిక్యము నిరూపితమైనది. ఈ కథకు సత్యావిజయమను పేరు తగియున్నది. హరివంశపు మలికథ తొలికథ యందలి అన్యాయమును సరిదిద్దుటలేదు. రుక్మిణీ సత్యలమధ్య పొడమిన రతరవలవలన ఆకీచులాటతో ఎట్టిసంబంధమును లేని శచీదేవి సొత్తును శ్రీకృష్ణుడు అపహరించినాడు.

శచీదేవికి సంబంధించిరింతవరకు తిమ్మన హరివంశ కథనే అనుసరించినాడు. అనగా తిమ్మనకథ ననుసరించి శచీదేవి పూర్తిగ నిరపరాధిని. తిమ్మనకావ్యము మొత్తముమీద శచీదేవి నోరుతెరచి ఒక్కమాటనైన పలుకలేదు. ఆమె బొత్తుగా నోరులేనిదానివలె నున్నది. నందనవన పాలకులు పారిజాతాపహరణ వృత్తాంతమును నివేదించి నపుడుకూడ ఆమె కేవలము విన్నబాటునుపొంది యూరకున్నదేగాని ఒక్క పలుకునైన పలుకలేదు. రుద్రభట్టు మాత్రము శచీదేవిని ఎంతోకొంత అపరాధిని చేయదలచినాడు. అందుచే ఆమె శ్రీకృష్ణునిపైకి యుద్ధమునకు దేవేంద్రుని పురికొల్పినదని విష్ణుపురాణ కథ ననుసరించినాడు. ఈ కల్పన ననుసరించియైనను శచీదేవియందు దోషము కన్పింపదు. తన సొత్తును ఎవరో అపహరించుకొని పోవుచుండగా దానిని కాపాడికొనుట దోషముకాదు. ఐనను భగవంతుడైన శ్రీకృష్ణుని లీలలన్నింటికి ఆనందముతో తలయొగ్గుటయే ధర్మమనియు, ఆయన లీలలకు విరుద్ధప్రయత్నము చేయుటే శచీదేవి దోషమనియు, అందుచే ఆమె శిక్షార్హురాలే యనియు శ్రీకృష్ణ భక్తులు వాదింపవచ్చును. నిష్పక్షపాత దృష్టిగలవారు మాత్రము కృష్ణుని చర్యను ఖండింపకమానరు.

ఇట్లు ఉపదేశాత్మక దృష్టితో చూచినపుడు ఈకథ లోపభూయిష్ఠ మనక తప్పదు. ఐనను ఈ కథయందుగల శృంగార రసపోషణావకాశ లోభముచే మన కవులిరువురును ఈకథనే స్వీకరించినారు. అనగా ఇరువురును ధర్మదృష్టికంటె రసపుష్టినే అభిమానించినారని పిండితార్థము.

2) పారిజాతాపహరణమునకై శ్రీకృష్ణుడు అమరావతికి ఎచ్చుట

నుండి బయలుదేరినాడనునది రెండవప్రశ్న. ఇది మిక్కిలి చిక్కయిన ప్రశ్న. హరివంశమునందలి మలికథ మాత్రము కృష్ణుడు ద్వారకనుండి బయలుదేరినాడని తెలుపుచున్నది. తక్కిన కథలన్నియు నరక వధానంతరము ప్రాగ్జ్యోతిషమునుండియే కృష్ణుడు అమరావతికేగి పారిజాతమును హరించినట్లు చెప్పుచున్నవి. ఐనను వానిలో సత్యామాన ప్రసంగము లేదుకనుక ఆ కథాప్రణాళికకది అనుగుణముగనే యున్నది. కాని సత్యామానకథను స్వీకరించిన రుద్రభట్టు తిమ్మన లిరువురును కృష్ణుని ద్వారకనుండియే బయలుదేరదీయక తప్పనిసరియైనది. కాని ఇచట మరియొక చిక్కు ఎదురైనది. నరకుని సంహరించిన కృష్ణుడు నరకాపహృతములైన అదితి కుండలముల నామెకు చేర్పవలసియున్నాడు. అందులకై అతడు అమరావతి కేగవలసియున్నాడు. ఈరెండు అమరావతీ యాత్రలకు సమన్వయమును సాధింపలేక రుద్రభట్టు కృష్ణునిచే రెండు సార్లు అమరావతీయాత్ర చేయించినాడు. నరక వధానంతరము ప్రాగ్జ్యోతిషమునుండి యొకసారి; సత్యాప్రణయకోపశాంత్యనంతరము ద్వారకనుండి మరియొకసారి మొదటిసారి యాత్రలో కృష్ణుడు అమరేంద్రునకు అతిథిగానుండి అదితికి కుండలములను సమర్పించి ద్వారకకు వచ్చినాడు. ఇది విష్ణుపురాణానుసారి కథ. రెండవసారి తిన్నగా నందనవనమునకేగి పారిజాతమును పెకలించినాడు. ఇది హరివంశపు మలికథ ననుసరించి నది. ఇట్లీ రెండుకథలును తీర్థమునకు తీర్థము, ప్రసాదమునకు ప్రసాదమునైనవి. శ్రీకృష్ణునకు రెండుసార్లు యాతాయాత శ్రమ కల్గినది.

ఈపట్టున తిమ్మన తన నేర్పునుచూపి ఈరెండు కథలకు చక్కని సమన్వయమును సాధించినాడు. నరకవధానంతరము కృష్ణుడు వెంటనే అమరావతి కేగలేదు. ప్రాగ్జ్యోతిషమునుండి తిన్నగా ద్వారకకే వచ్చినాడు. అదితికుండలములను తనవద్దనే ఉంచుకొనినాడు. వానిని తిరిగి అదితికి సమర్పించు ఉద్దేశమైన అతనికుండెనో లేదో తెలియదు. ఆ కుండలములపై కృష్ణుని ప్రియురాండ్రలో ఎవరికిని మక్కువ కలుగకపోవుట అదితి అదృష్టము. ఇంతలో నారదాగమనము, సత్య అలుక మున్నగు చరిత్ర నడచినది. అపుడు పారిజాతాపహరణమునకై ప్రతినపూనిన కృష్ణుడు ఆమాట వెల్లడికానీయక అదితికి కుండలములు సమర్పించు నెపమున

అమరావతికేగి, అమరేంద్రుని అతిథియై వైజయంతమున విడిసి, చుట్టపు మరియాదతో నందనవనమును ప్రవేశించి పారిజాతాపహరణము గావించి నాడు. తిమ్మన ప్రణాళికలో ఇట్లు రెండు విధములైన కథలకును చక్కని సమన్వయము సాధింపబడినది. కృష్ణునకు రెండుసార్లు అమరావతీ యాత్రచేయవలసిన శ్రమ తప్పినది. కృష్ణుని పథకము ఆతని జిత్తులమారి తనమునకు అనుగుణముగ నున్నది.

పారిజాతాపహరణ కథను రచించిన కొందరు ఇతర కవులు ఈ సమస్యనెట్లు పరిష్కరించిరోకూడ ఈ సందర్భమున పరిశీలింతము.

హరివంశ చంపూకారుడైన వేంకటరాయసూరికూడ కృష్ణునిచే రెండు సార్లు అమరావతీయాత్ర చేయించినాడు. అంతేగాక పారిజాతాపహరణ మునుగూడ రెండుసార్లు చేయించినాడు. హరివంశపు తొలి, మలి కథలను దేనికి దానిని ఒకదానివెంట నొకటి మూలములోనున్నట్లే చెప్పినాడు. రెండు కథలకు మధ్య 'తతః పునరపి పురందర ప్రార్థనయా స్వస్తరు స్స్వస్థానముపగతోభూత్' అని ఒక అమూలకమైన అతుకు నతికినాడు. ఇది చాల అసంబద్ధముగ నున్నది. దీనికంటె రుద్రభట్టు చెప్పినతీరే మేలుగానున్నది.

కృష్ణాధ్వరి రచించిన నైషధ పారిజాతీయ ద్వ్యర్థికావ్యము నందును నారాయణతీర్థ విరచిత పారిజాతాపహరణ యక్షగానమునందును, తరిగొండ వేంగమాంబరచించిన విష్ణుపారిజాతమునందును ఈరెండు ప్రయాణము లకు మరొకవిధముగ సమన్వయము సాధింపబడనది. శ్రీకృష్ణుడు నరకుని పైకి దాడి వెడలవలయునను ప్రయత్నముననున్న సమయముననే నారదా గమన, సత్యాప్రణయకోపాది సంఘటనలు నడచినవి. అంతట కృష్ణుడు సత్యా సహితుడై నరకునిపైకి దాడివెడలి, వానిని వధించి ప్రాగ్జోతిషము నుండియే అమరావతికేగి, అదితికి కుండలము లొసంగి ద్వారకకు తిరుగు ప్రయాణములో పారిజాతము నపహరించినాడు. కుమార తాతాచార్యుడు తన పారిజాతాపహరణ నాటకములో గూడ దాదాపు ఇట్టి మార్గమునే అనుసరించినాడు. ఐన సత్యాప్రణయకోపోప శాంత్యనంతరమే ఇంద్రా దులువచ్చి నరక సంహారార్థము కృష్ణుని ప్రార్థించినట్లు చిరుమార్పు

గావించినాడు. ఈ సమన్వయము తిమ్మన గావించిన దానికంటె మెరుగుగా నున్నది. నరక వధార్థము ప్రాగ్జోతిషమునకేగు కృష్ణుని సత్యభామ ఏల అనుసరించినదను ప్రశ్నకు ఈ సమన్వయము చక్కని సమాధాన మొసగుచున్నది. నరకుడు భూదేవి కుమారుడగుటచే వానివధకై భూదేవ్యవతారమైన సత్య అంగీకారము పొందవలసియుండెనను సమాధానము కావ్యదృష్టిలో అప్రకృతము.

3) పారిజాతాపహరణ సమయమున సత్యభామ కృష్ణుని పార్శ్వమునగలదా ? యనునది మూడవప్రశ్న. హరివంశపు మలికథ ప్రకారము కృష్ణుడు సత్యను తనవెంట అమరావతికి తీసికొనిపోలేదు సరికదా ప్రద్యుమ్న సాత్యకి సహితుడై వెడలినాడు కాని తక్కిన కథలన్నియు కృష్ణుడు సత్యాద్వితీయుడై యుండియే పారిజాతహరణము గావించినట్లు ఏకవాక్యములైయున్నవి. ప్రద్యుమ్న సాత్యకి సహాయుడై యుద్ధమున పాల్గొనిన కృష్ణునకంటె కళత్రసహితుడై ఏకాంగవీరుడై పోరిన కృష్ణుడు సమధిక బలపరాక్రమ సాహస సంపన్నుడనుట స్పష్టమేగదా. అదియు గాక యుద్ధసమయమున సత్యభామ కృష్ణునకు సన్నిహితురాలైయున్నచో వీరరసములో శృంగారమును మిళితము గావింపవచ్చును. శ్రీకృష్ణుని సర్వశక్తిమత్వ ప్రతిపాదకులగుటచేతను శృంగార రసాభిమానులగుట చేతను రుద్రభట్టుతిమ్మన లిరువురును విష్ణుపురాణాదులనే అనుసరించినారు.

4) పారిజాతము నపహరించుకొనిపోవు కృష్ణుని ఇంద్రుడు ఎదిరించినాడా ? లేదా ? అనునది నాల్గవప్రశ్న. హరివంశపు తొలికథమాత్రము ఇంద్రుడు కృష్ణునియెడ కృతజ్ఞతా గుణబద్ధుడై ఆతని నెదిరింపక పారిజాతాపహరణము నామోదించినట్లు తెలుపుచున్నది. తక్కినకథలన్నియు అతడు కృష్ణుని ఎదిరించి పోరాడినట్లే తెలుపుచున్నవి. పోరుపొసగకున్నచో వీరరసపోషణ కవకాశములేదుగదా. కనుకనే ఇద్దరును యుద్ధకథనే స్వీకరించినారు.

5) యుద్ధమెట్లు ముగిసినది ? అనునది మరియొక ముఖ్యప్రశ్న. ఇంద్రుని సంపూర్ణ పరాజయముతో యుద్ధము ముగిసినదని విష్ణుపురాణ భాగవతములు చెప్పుచున్నవి. అదితి కశ్యపుల మాధ్యస్థమువలన మధ్య

లోనే పోరు విరమింపబడినదని హరివంశపు మలికథ చెప్పుచున్నది. శ్రీకృష్ణ పారమ్యబుద్ధి గలవారగుటచే రుద్రభట్ట తిమ్మన లిరువురును శ్రీకృష్ణుని సర్వాతిశాయి పరాక్రమమును నిరూపించుటకై విష్ణుపురాణోక్త కథనే స్వీకరించి ఇంద్రుని సంపూర్ణ పరాజయమునే చెప్పినారు.

శ్రీకృష్ణునితో అభిన్నుడుగా వర్ణింపబడిన, జయశీలుడైన శ్రీకృష్ణ దేవరాయల విజయమును ధ్వనింపజేయుటకు కూడ కృష్ణుని సంపూర్ణ విజయమునే నిబంధించుట తిమ్మనకు అవసరమైనది. పరాజయానంత రము ఇంద్రుడు కృష్ణుని క్షమాపణకోరినట్లు తిమ్మన చెప్పగా, బిల్వోద కేశ్వరుడను శివుడు దిగివచ్చి ఇంద్రోపేంద్రులకు మైత్రిని పొసగించినట్లు రుద్రభట్టు కల్పించినాడు. ఈ శివుడు ఇంద్రుని వెనుకవైచుకొనివచ్చి, "దేవతాహిత సాధకుడవు కావలసిన నీవు దేవతలతో పోరాడుటేమి ఉచి తము?" అని కృష్ణుని మందలించినాడు. ఇది విష్ణు (కృష్ణ) పారమ్య బుద్ధికి విరుద్ధముగనున్నది. శివుని 'వత్తాసు'లభించుటవలన ఇంద్రునకు క్షమాపణ వేడుకొనవలసిన అవసరముకూడ తప్పినది, 'శివుడే దిగివచ్చి శాంతి సంధానము గావింపవలసినంత జగద్భయంకరమైనది ఈ ఇంద్రో పేంద్రయుద్ధము' అని ధ్వనింపజేయుటకేమో తరిగొండ వేంగమాంబకూడ తన విష్ణుపారిజాతములో ఈశ్వరుని మాధ్యస్థమును నిబంధించినది. పరాజితులై శరణాగతులైన పగవారిని కాపాడిన కృష్ణరాయల కరుణామతిని (పారి. I 21) ధ్వనింపజేయుటకు కూడ తిమ్మన ఇంద్రుని శరణాగతి కథనే స్వీకరించినాడు.

6) కృష్ణుడు పారిజాతమును తిరిగి నందనవనమున కెపుడుచేర్చె ననునది చిట్టచివరి ముఖ్యమైనప్రశ్న హరివంశపు తొలికథలో ఈప్రసం గమునకు అవకాశమేలేదు. శ్రీకృష్ణుడు తన జీవితకాలములో దానిని తిరిగి అప్పగింపనేలేదు. మలికథలో మాధ్యస్థముగావించిన అదితి "ఒక ఏడాది పాటు పారిజాతమును ద్వారకలో నుంచుకొని, నీ భార్యలచేత పుణ్యక వ్రతములు ఆచరింపజేసి, ఏడాది ముగియగనే తిరిగి నందనవనమునకు చేర్చు' మని కృష్ణుని ఆదేశించినది. తల్లిమాటను త్రోసిపుచ్చలేక కృష్ణుడు అందుల కంగీకరించినాడు. పాపము ఇంతగా అల్లరిపెట్టిన, అల్లరిపడిన

సత్యభామకు పారిజాతభోగము ఒక్క యేడాదిమాత్రమేయైనది. అదియు తక్కిన సపత్నులందరితో సమముగనే ఆమెకును లభించినదిగాని ఆమెకు ప్రత్యేకత యేమియులేకుండ పోయినది. ఇందులకామె అంగీకరించి యుండుట అసంభవము. విష్ణుపురాణము కృష్ణావతార పరిసమాప్తి పర్యంతము పారిజాతము ద్వారకలో నుండుటకు ఇంద్రు డంగీకరించినట్లు చెప్పుచున్నది. సత్యభామకు ఇదియే అంగీకారయోగ్యమైనది. కనుకనే తిమ్మన విష్ణుపురాణము చెప్పిన గడువునే స్వీకరించినాడు. ఇక రుద్రభట్టు మరలనెన్నటికైన పారిజాతము అమరావతికి చేరవలసియున్నదను ప్రసంగమే తేలేదు. అతడును బిల్వేదకేశ్వరుడునుకూడ ఆవిషయమునే మరచి పోయినారు.

మరికొన్ని అప్రధానాంశములలోకూడ హరివంశ విష్ణుపురాణములు ఏకీభవింపకున్నవి.

7) 16000 మంది కన్యలను కృష్ణుడెప్పుడు వివాహమయ్యెనునది ప్రధానకథకు అంతగా సంబంధింపని ఒక చిన్నప్రశ్న. పారిజాతాపహరణానంతరమే ఈ పెండ్లి జరిగినట్లు హరివంశపు తొలికథయు విష్ణుపురాణమును చెప్పుచుండగా వివాహానంతరమే పారిజాతాపహరణమని హరివంశపు మలికథ చెప్పుచున్నది. నరకవధయైన వెంటనేగాక కొంతకాలము గడచిన పిమ్మటనే పారిజాతాపహరణము జరిగినట్లు చెప్పిన వారగుటచే రుద్రభట్టు తిమ్మన లిరువురును ఈమధ్యకాలములో ఆపెండ్లి జరిగినట్లుగ చెప్పియున్నారు.

8) అదితి కుండలములను కృష్ణుడు ఇంద్రునిచేతి కీయగా, అతడు వానిని అదితికి సమర్పించినట్లు హరివంశపు తొలికథ చెప్పగా, కృష్ణుడే స్వయముగ సమర్పించినట్లు విష్ణుపురాణము చెప్పుచున్నది. మధ్యలో ఇంద్రుని పేరంటమేల యనికాబోలు రుద్రభట్టు తిమ్మన లిరువురును విష్ణుపురాణక్రమమునే అనుసరించినారు.

9) యుద్ధ మెన్నిదినములు నడచినది ? అనునది మరియొక ఏకవాక్యతలేని అంశము. విష్ణుపురాణము ఒకేదినపు యుద్ధమును చెప్పగా

హరివంశపు మలికథ రెండురోజుల యుద్ధమును చెప్పుచున్నది. బిల్వోదకేశ్వరక్షేత్రమాహాత్మ్య ప్రసంగమునకు అవకాశము కలిగించుటకే హరివంశము యుద్ధమధ్యమున ఒకరాత్రి విశ్రాంతిని చెప్పినది. రుద్రభట్టు తిమ్మన తిరువురకును బిల్వోదక క్షేత్రమాహాత్మ్య ప్రసంగమునందు అభినివేశము లేకుండుటచే వారిరువురికిని యుద్ధమధ్యమున బిల్వోదకేశ్వర పూజాదికమును చెప్పవలసిన అక్కర కలుగలేదు. అందుచే ఒకనాటిలోనే యుద్ధమును ముగింపజేసినారు.

మొత్తముమీద పురాణములందు విభిన్నములుగానున్న కథాంశములను సమన్వయము గావించుటలో రుద్రభట్టుకంటె తిమ్మన ఎక్కువ నేర్పును ప్రదర్శించినాడనుట నిర్వివాదము.

రసపోషణ :

[1] 'రసముచేతనే ఏదైనకావ్యము జీవించును. రసశూన్యమైనది కావ్యమేకాదు' [2] వాక్చమత్కృతి ఎంతయున్నను కావ్యమునకు రసమే జీవితము. [3] 'రసాత్మకమైన వాక్యమే కావ్యము' అని కావ్యములో రసమునకుగల ప్రాధాన్యము ప్రస్తుతింపబడినది. తిమ్మన పారిజాతాపహరణ కావ్యములోను రుద్రభట్టు పారిజాతహరణ కథాఘట్టముననను గావించిన రసపోషణను పరిశీలింతము.

పారిజాతాపహరణ కావ్యము రచింపబడి నేటికి ఐదు శతాబ్దులగుచున్నది. ఐనను అది నిత్యనూతనమై అనేకములైన పిల్లపారిజాతములకు మాతృకయై, జీవకళలతో తొణికిసలాడుచు అశేష సహృదయ పాఠకహృదయాహ్లాదకారి యగుచున్నది. పలువురు పండిత విమర్శకుల ప్రశంసలకు పాత్రమగుచున్నది. ఐనను ఈమధ్య కవిసమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారిచేత ఏలనో లఘూకరింపబడినది. పారిజాతాపహరణమును గూర్చి వారు "నిజానికి కావ్యమునందే రసమునులేదు.

---

1. రసేనైవ సర్వం జీవతికావ్యం నహిరసశూన్యం కావ్యం కించిదస్తి —లోచన.
2. వాగ్వైదగ్ధ్య ప్రధానేఽపి రసఏవాత్ర జీవితమ్—అగ్నిపురాణము.
3. వాక్యం రసాత్మకం కావ్యమ్ –సాహిత్య దర్పణము. I 3

ప్రథమాశ్వాసములో మాత్రము శృంగారరసమువలె కన్పించును"అనియు "ఈ కథలో ఒక వీరరసమునకు ప్రాధాన్యములేదు. మొదట కొంచెము శృంగార రసమునకు ప్రాధాన్యమున్నట్లు కన్పించునుగాని కావ్యపు నడుమను చివరను అదికూడలేదు." అనియు "ఈ కావ్యము నిన్ను రసలోకమునకు తీసికొనిపోదు. బహుశబ్దముల ప్రౌఢ ప్రయోగముచేత నిన్ను తన్మయత్వము పొందింపదు. కాని దీనియందు నీవు సుఖపడుదువు" [4] అనియు సెలవిచ్చినారు.

శ్రీ సత్యనారాయణగారు మహాకవులు, మహాపండితులు, గొప్ప విమర్శకులు. అట్టివారు కావించిన విమర్శ తప్పక విమర్శనీయమగు చున్నది. ఉపర్యుదాహృతములగు వాక్యములలో మొదటి దానినిబట్టి ఈకావ్యమునందే రసమునులేదు. అనగా నిది రసహీనకావ్యము, నీరస కావ్యము నన్నమాట, రెండవ వాక్యమున 'శృంగారమువలె కన్పించును' అనుటవలన ప్రథమాశ్వాసమున శృంగారమున్నట్లు కన్పించినను అది ఆభాసశృంగారమేగాని యథార్థశృంగారము కాదని మరల అదే అభిప్రాయము దృఢీకరింపబడినది మూడవ వాక్యములో "ఇందు వీరరసమునకు ప్రాధాన్యములేద"నుటచే అప్రధానముగనైన వీరరసపు ఉనికిని అంగీకరించినట్లయినది. నాలుగవ వాక్యములో "శృంగార రసమునకు ప్రాధాన్యమున్నట్లు కన్పించును."అనుటచే ఆభాసత్వము ప్రాధాన్యమునకే చెప్పినట్లయి శృంగారరసముకూడ అప్రధానముగనైన ఉన్నదని అంగీకరించినట్లయినది. ఇదికాక పుణ్యకవ్రత సందర్భమున తిమ్మన తులాభారపు కథను వ్రాయకపోవుటను మెచ్చుకొనుచు, "వ్రాసినచో నేమగును? ఈ శృంగారరసమంతయు ధ్వంసమగును....తిమ్మనచేసిన సృష్టికది కళంకమగును." అన్నారు. అనగా కావ్యాంతమువరకు తిమ్మన శృంగార రసమును అధికముగనే—లేదా ఎంతోకొంత- పోషించుచు వచ్చినాడనియే అర్థమగుచున్నది. మొత్తముమీద శ్రీ సత్యనారాయణగారి ఈవాక్యములు పాఠకునకు కొంత తికమక కలిగించునవిగనే యున్నవి.

ఇట్లే శ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు పారిజాతాపహరణ

---

4. పారిజాతాపహరణము - ఎమెస్కో ప్రచురణ - పీఠిక పుట 20.

మునుగూర్చి వ్రాయుచు "మొదటి యాశ్వాసమును, రెండవ యాశ్వాసమున 53 పద్యములను, నాలుగవ యాశ్వాసమున 4౧ పద్యములనుగాక కావ్యమందంతటను వీరరౌద్రహాస్య శాంతరసములేగాని శృంగారము కనబడదు. కాన పారిజాతాపహరణము శృంగార ప్రబంధమనుటకు అవకాశము కనబడదు." [5] అన్నారు. శ్రీ సత్యనారాయణగారికంటె శ్రీ సూర్యనారాయణశాస్త్రిగారు కొంత ఉదారమగు అభిప్రాయము నొసంగినారు. నాలుగవ ఆశ్వాసము సగముపైవరకు శృంగారరసపు ఉనికినివీరంగీకరించుచున్నారు. అంతేగాక వీరరౌద్ర శాంతహాస్యరసముల ఉనికినిగూడ అంగీకరించుచున్నారు. కాని మొత్తముమీద శృంగారప్రబంధ మనిపించుకొనుటకు కావలసినంత శృంగారము వీరికిని ఈ కావ్యమందు కన్పింపలేదు.

ఎందుచేతనో ఈ ఇద్దరు పండితులకు కానరాలేదుగాని పారిజాతాపహరణము నందలి శృంగారరసప్రాధాన్యము ఎందరో పండితులకు ప్రస్ఫుటముగా కనుపించినది. [6] ఇది శృంగారరస ప్రధానమగు కావ్యమని ముక్తకంఠముతో ప్రశంసించియున్నారు.

శ్రీ సత్యనారాయణగారే తిమ్మనగావించిన శృంగారరసపోషణను ప్రశంసించియున్నారు. "సత్యభామయే శృంగార సర్వస్వమున కాలంబనమని తెలిసినవారు సృష్టిలో ముగ్గురన్నముగ్గురే. మొదటివారు శ్రీకృష్ణదేవుడు. రెండవవారు తెలుగుకవి నంది తిమ్మన మూడవవారు సిద్ధేంద్ర

---

5. మనుచరిత్ర - వేంకటరామా & కో ప్రచురణ - పీఠిక - 88

6. "ఈ కావ్యము శృంగారరస ప్రధానమైనది." అని నాగపూడి కుప్పుసామయ్యగారు (పరిమళోల్లాస పీఠికపుట. 13.) 'శృంగార ప్రధానమగు నిక్కావ్యము' అని దూశి రామమూర్తిశాస్త్రిగారు (సురభి వ్యాఖ్యాపీఠిక పుట 9.) 'మృదువులైన శృంగార భావములను రసానుగుణమైన శైలిలో మనోహరముగా వర్ణించుటలో ముక్కు తిమ్మన కృతహస్తుడు.' అని దివాకర్ల వేంకటావధానిగారు (ఆంధ్ర వాఙ్మయ చరిత్రము పుట 42 )

యోగి" [7] అని వారి అభిప్రాయము. సత్యభామ శృంగారరస సర్వస్వమని సత్యనారాయణగారికెట్లు తెలిసినది? పైముగ్గురిలోనెవరైన తెలిపిననే గదా! ఈ విషయమును స్వయముగా శ్రీకృష్ణదేవుడే తమకు తెలిపినాడని సత్యనారాయణగారు అనరను కొందును. మిగిలిన ఇద్దరివలననే వీరికావిషయము తెలిసియుండవలెను. వారైను శ్రీ సత్యనారాయణగారితో ప్రత్యేక సంభాషణలో తెలిసియుండు అవకాశములేదు. వారు రచించిన గ్రంథములందు సత్యభామను శృంగార సర్వస్వమున కాలంబనముగ తీర్చిదిద్దిరని మాత్రమె శ్రీ సత్యనారాయణగారి మాటలకు అర్థము కాగలదు. అట్టిచో తిమ్మన కావ్యములో శృంగారరసము లేదను మాటనెట్లు సమన్వయించు కొనవలెనో తెలియకున్నది. సిద్ధేంద్రయోగి భామాకలాపములో సత్యభామ శృంగార నాయికాత్వము విశ్వరూపము ధరించియుండుట నిజమే. కాని సిద్ధేంద్రయోగికిని మార్గదర్శకమైనది తిమ్మనకావ్యమే. [8]

శ్రీకృష్ణుడు శృంగారరస సర్వస్వము. [9] "సత్యభామ శృంగార రసాధిదేవత సర్వభావములను, సర్వవిధనాయికలను సృష్టించినది ఆమెయే. ఆసృష్టినిఆతల్లి భగవదంకితము చేసినది" [10] అట్టి సత్యాకృష్ణులు నాయికానాయకులుగనున్న కావ్యములో శృంగారరసము ప్రాధాన్యము వహింపకుండుటెట్లు సాధ్యము?

పాఠకుడు పారిజాతాపహరణమునందు సుఖపడునని శ్రీ సత్యనారాయణగారనుచున్నారు. కావ్యమునందు లభించు సుఖమనగా నేమో గమనింపవలసియున్నది.

---

7. సంగ్రహ ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము. పుట 772.
8. 'సిద్ధేంద్రయోగి భామాకలాపముపై ముక్కుతిమ్మనగారి పారిజాతాపహరణ ప్రబంధ ప్రభావ మగుపించినది.' యస్వీజోగారావు (ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర. I భాగము. పుట 134.)
9. శృంగారరస సర్వస్వం శిఖిపించ విభూషణమ్
   అంగీకృత నరాకారం ఆశ్రయే భువనాశ్రయమ్
   (శ్రీకృష్ణకర్ణామృతము. I 92.)
10. విశ్వనాథ సత్యనారాయణ - ఏకవీర

కావ్యార్థమును గ్రహించుటలోని క్లేశరాహిత్యమే కావ్యగతసుఖమా? ఈ క్లేశరాహిత్యము బహుప్రచలిత పదప్రయోగము, సరళసమాస నిర్మాణము, అక్లిష్టాన్వయము అనువానివలన కలుగును ఈగుణములు తిమ్మన రచనలో సమృద్ధిగనున్నవి. ఐనను ఇది భాషకు, శైలికి, శయ్యకు మాత్రమే సంబంధించిన విషయము. తిమ్మన కావ్యములో భాషాగతమైన ఈసౌలభ్యముకంటె వేరేమియులేదా? ఐనచో తిమ్మనవరకు పోనేల? అధునిక వచన రచయితలు తిమ్మనకంటె సులభమైన శైలిలో వ్రాయుచున్నారు తిమ్మన కావ్యములో నిఘంటు సహాయ్యము నపేక్షించు పదములు అటనట దొరలుటకలదు. అధునిక వచన రచనలలో అట్టి కఠిన పదములు మచ్చుకైన దొరుకవు. సమాసరచన అతిప్రాథమిక దశను దాటిపోదు వాక్యములును అన్వయక్లేశరహితములుగ నుండును, ఇంతకంటె ముఖ్యమైన విశేషము తిమ్మన అనేక అలంకారములను, కవిసమయములను కొల్లలుగా వాడినాడు. అలంకారములన్నియు వక్రోక్తులే. వానిని చక్కగా అర్థము చేసికొనుటకు కొంత మానసిక పరిశ్రమ అవసరము. కవిసమయములుకూడ బహుకావ్య పఠనాభ్యాసము లేనివారికి కొరుకుడుపడవు. నేటి నవలలు నేటి నవలాలవలె ప్రాయికముగ నిరలంకార సుందరములు, సమయనియమాతీతములు, ఇట్లు చూడగా ఒక వ్యుత్పత్తి చాలని రచయిత రచించిన 'ఆధునిక సాంఘిక నవల'ను చదువుటలోనే ఎక్కువ సుఖమున్న దనవలెను.

ఇవి ఇట్లుండ 'ఈ కావ్యము నిన్ను రసలోకములకు తీసికొనిపోదు. బహుశబ్దముల ప్రౌఢప్రయోగముచేత నిన్ను తన్మయత్వము పొందించదు.' అనుటలోగూడ శ్రీ సత్యనారాయణగారి భావము స్పష్టమగుటలేదు. 'బహుశబ్దముల ప్రౌఢప్రయోగమువలననే తన్మయత్వము లభించును. ఆ తన్మయత్వమే రసలోకసంచారము.' అని వారి భావమై యుండును. ఐనచో బహుశబ్దముల ప్రౌఢప్రయోగమననేమో కూడ విచారింపవలసియున్నది. నిఘంటు శరణ్యములైన శబ్దముల, వ్యాకరణ శాస్త్రపాండిత్య నిష్పన్నములైన పదముల, గూఢార్థభావభరితములైన పదముల ప్రయోగమా? ఐనచో ఇవి కావ్యగుణములుకావు, పైపెచ్చు అప్రయుక్తము, క్లిష్టము, గూఢార్థమునను కావ్యదోషములే యగును.

శబ్దముల ప్రౌఢ ప్రయోగమనగా రసభావస్ఫోరకములైన శబ్దముల ప్రయోగమని అర్థముకావచ్చును. శబ్దములు అపాతమధురములై, సద్యో రసస్ఫూర్తిని కలిగించునవిగను, దీర్ఘదీర్ఘతర వ్యాపారవంతములై భావ భావాంతర బోధనాసమర్థములుగను ఉండవలెనని అర్థముకావచ్చును. జాతీయము, వ్యంగ్యము అని ఈ లక్షణములను సంగ్రహ స్వరూపమున తెలుపవచ్చును. తిమ్మన కవిత్వమున జాతీయములు కొల్లలు, వ్యంగ్య ములు అనేకములు.

లోకములో సుఖము, సంతోషము, ఆనందము అను పదములు కలవు. ఇవి సమానార్థకము లన్నట్లుగా వాడుటకూడ కలదు. కాని కమ్మనితిండి, వెచ్చని ఇల్లు, మెత్తని పాన్పు మొదలగు భోగములవలన శరీరమునకు లభించునది సుఖమనియు, బంధుమిత్ర దర్శనము, ధన లాభము, పుత్ర జననము మొదలగు నిమిత్తములవలన ఆయావ్యక్తులకు మాత్రమే కలుగు మానసికోల్లాసము సంతోషమనియు, కమ్మని సంగీత మును విన్నపుడు, చక్కని శిల్పములను చిత్రములను చూచినపుడు, మనోహరములగు నాట్యములను దర్శించినపుడు, రసవంతములగు కావ్య ములను పఠించునపుడు సర్వజనులును పొందు అలౌకికమైన ఆత్మాను భూతియే ఆనందమనియు చెప్పదగియున్నవి. భగవద్రతివలన ఆత్మ పొందు ఆనందమే బ్రహ్మానందము. కనుకనే కావ్యానందము బ్రహ్మా నంద సహోదరమనుట.

కావ్యానందమునే సుఖమని వ్యవహరించుట కూడకలదు. [11]'ఉత్తమ కావ్యమును భావనచేయు రసికుడు పరమమైన సుఖమును పొందు చున్నాడు.' [12]'పరిష్కారవంతమైన కావ్యమువలననే సుఖము లభిం

---

11. ఈదృశం భావయన్ కావ్యం రసికః పరమం సుఖం ప్రాప్నోతి— (సాహిత్యమీమాంస. VII)

12. సాహిత్యంసపరిష్కారం కవినాపరికల్పితమ్
భావయన్ రసికో లోకే సుఖమత్యంత మశ్నుతే-సాహిత్యమీమాంస. VII
(మంఖకుడో, రుయ్యకుడో చెప్పినది.)

చును.' [13] 'పరిష్కారమనగా దోషరాహిత్యము, గుణవత్త్వము, అలంకార సహితత్వము, రసమయత్వమును,' [14] 'కావ్యసంశ్రయమువలన అలౌకిక విభావమునుపొందిన వారికి సుఖము కలుగును.' [15] 'అది రసరూపమైన సుఖము, బ్రహ్మస్వరూపమైన నిత్యసుఖమునకును, విషయోద్భవమైన అనిత్యసుఖమునకును మధ్యస్థమైనదే రసరూపసుఖము. [16] రసమువలన ఆనందము లభించును. [17] రసమే ఆనందము.

కావ్య పఠనమువలన పాఠకుడు సుఖమును పొందుననగా ఆ కావ్యము రసవంతమైనదని పర్యవసితార్థము.

తిమ్మన పోషించిన శృంగారరసమును సాంగోపాంగముగా గుర్తించుటకు ముందు శృంగారమననేమో, ప్రబంధమున దానికిగల స్థానమెట్టిదో, తిమ్మన దానిని పోషించినరీతి ఎట్టిదో, కొందరు విమర్శకుల కది ఏల సంతృప్తి నీయకున్నదో పరిశీలింతము.

'శృంగారము రతిస్థాయిక' [18] మనియు 'రతిప్రభవ' [19] మనియు నిర్వచింపబడినది. కనుక ముందుగా రతియననేమో తెలిసికొనవలసియున్నది. 'రమ్' ధాతుజన్యమైనది 'రతి' శబ్దము, 'రమ్' ధాతువునకు 'క్రీడించు,' 'వినోదించు,' 'ఆనందించు' అను అర్థములున్నవి. కనుక

---

13. దోషత్యాగో గుణాధానమలంకారో రసాన్వయః
ఇత్థం చతుర్విధాక్లప్తా సాహిత్యస్య పరిష్కృతిః-(సా. మీ. I 6.)
14. అలౌకిక విభావత్వంప్రాప్తేభ్యః కావ్యసంశ్రయాత్
సుఖం సంజాయతేతేభ్యః సర్వేభ్యోపి కాక్షతిః—(సా. ద. III 7.)
15. సుఖం ద్వివిధైవకథితం నిత్యానిత్య విభేదతః
నిత్యం బ్రహ్మస్వరూపం హి అనిత్యం విషయోద్భవం
రసరూపసుఖం యత్తు తద్ద్వయోరపి మధ్యమమ్—
(రసరత్న ప్రదీపిక.)
16. రసగ్ హ్యే వాయం లబ్ధ్వాఽనందీభవతి—(తైత్తిరీయము.)
17. రసోవైసః— ( ,, )
18 శృంగారోరతిస్థాయికః
19. రతిప్రభవః శృంగారః

రతియనగా క్రీడ, వినోదము, ఆనందము అను అర్థము లేర్పడుచున్నవి. ఆనంద దాయకము, వినోదప్రదమునైన క్రీడ యనగా సంభోగమే కాదు 'ఇష్టమగు వస్తువునందు మనస్సు లగ్నమగుటే రతి' [20] ఈ విశాలమగు అర్థము తర్వాత సంకుచితమై 'యువతీ యువకులకు పరస్పరముండు ప్రీతియే రతి' [21]అను రూఢ్యర్థమేర్పడినది. ఇది 'సంభోగ విషయికమగు ఇచ్ఛావిశేషమే రతి' [22] యనియు, 'స్త్రీ పురుష సంభోగ కాంక్షయే శృంగారము. [23] అను నిర్వచనములకు దారితీసినది. ఐనను సంభోగ మనగా మైథునవ్యాపారమే కానక్కరలేదు. 'విలాసినీ విలాసులు పరస్పరము అనికూలురై దర్శన స్పర్శనాదులతో ఆనందించుటే సంభోగము [24] అనిచెప్పబడినది. మైథునవ్యాపారము సంభోగములో ఒక భాగము మాత్రమే.

ఆహార నిద్రాభయ మైథునములు జీవసామాన్య ధర్మములు. మైథున వ్యాపారమును గోప్యముగ నిర్వర్తించుట జంతువులలో కంటె మానవులలో కలిగిన ఉత్తమ సంస్కారములలో నొకటి. దానిని గూర్చిన ప్రసంగములుకూడ వాచ్యముగ గాక లాక్షణిక వ్యంగ్యార్థములతోచేయుట నాగరక ప్రవృత్తి. వాచ్యముగ చెప్పుట గ్రామ్యప్రకృతి. జుగుప్సా జనకములైన వివరములతో దానిని వాచ్యముగ వర్ణించుట నీచాభిరుచి ద్యోతకము. కనుకనే శృంగారము సభ్యముగనే పోషింపబడవలెను.

---

20. రతిర్మనోనుకూలేఽర్థే మనసః ప్రవణాయితం— (సా ద. III 176)

21. యూనోరన్యోన్య విషయాస్థాయినీచ్ఛాభవేద్రతిః— రససుధాకరము.
    తత్రస్త్రీ పుంసయో రన్యోన్యాలంబనః ప్రేమాఖ్య శ్చిత్తవృత్తి
    విశేషోరతిః— రసగంగాధరము. ౧౭

22. తత్ర సంభోగ విషయక ఇచ్ఛావిశేషోరతిః.

23. పుంసఃస్త్రియాం స్త్రియాః పుంసి సంభోగం ప్రతియా స్పృహా
    స శృంగార ఇతిఖ్యాతః క్రీడారత్యాదికారకః

24. దర్శన స్పర్శనా దీని నిషేవేతౌ విలాసినౌ
    యత్రానురక్తా వన్యోన్యం సంభోగోయము దాహృతః(సా.ద. III 210)

[27] ఇది కత్తిమీది సాము వంటిది. 'శృంగారము అత్యంత సుకుమారమైనది దానిని నిర్వహించుటలో కవి చాల మెలకువగలిగి వర్తింపవలెను. తప్పటడుగు వేసినచో సహృదయులమధ్య అతనికి నగుబాటు సంభవించును.' [28]

రసములన్నియు ఆనందమున పర్యవసించునవేయైనను విశేషించి శృంగారవీరములు అత్యంత హృదయాహ్లాదకరములు. కనుకనే నాటకములలో వీరశృంగారములలో నేదైన నొకటి ప్రధాన రసముగ నుండవలె. [29] నను అభిప్రాయ మేర్పడినది. ఇదే సిద్ధాంతము శ్రవ్యకావ్యములకును వర్తించుచున్నది. వీరశృంగారములలోకూడ శృంగారమునకుగలశక్తి అమేయము. [30] కనుకనే 'శృంగార మొక్కటే రసము.' [31] అను అభిప్రాయముకూడ ఏర్పడినది. నిజమునకు సంస్కృత దృశ్యకావ్యకోటిలో శృంగార ప్రాధాన్యముగలవే అధికము.

---

27a శృంగారః శుచి రుజ్జ్వలః—భోజుడు.

28. విశేషతస్తు శృంగారేసుకుమార తరోహ్యసౌ సర్వేభ్యోపి రసేభ్యః సౌకుమార్యాతిశాయిని శృంగారే కవిరవధానవాన్ ప్రయత్నవాన్ భవేత్. తత్రహి ప్రమాద్యతస్తస్య సహృదయమధ్యే క్షిప్రమేవ అవజ్ఞాన విషయతాభవతి— )ధ్వన్యాంలోకము. III 28)

29. 'శృంగారవీరశాంతానా మేకోంగీరస ఇష్యతే' —సా. ద.
శృంగారవీర యోరన్యతరస్య ప్రాధాన్యం —ప్రతాపరుద్రీయము.
(శృంగారో వీరఏవవా—భరతుడు)

30. శృంగారఏవ మధురః పరప్రహ్లాదనోరసః—ధ్వన్యాలోకము II 7
శృంగార రసోహి సంసారిణాం నియమేన అనుభవ విషయత్వాత్, సర్వరసాభ్యః కమనీయ తయా ప్రధానభూతః....కించశృంగారస్య సకలజన మనోభిరామత్వాత్— లోచన.)

31. శృంగార ఏవ ఏకోరసః—భౌజుడు.

భోజుని సిద్ధాంతమునకు తెలుఁగు కవులలో లభించినంత గౌరవము మరెచ్చటను లభించినట్లులేదు. తెలుగుకవులకుఁగల శృంగార రసాభినివేశమువల్ల మాలినది. శృంగారరస ప్రధానమగు కావ్యమే ప్రబంధమని పించుకోగలిగినది. పోనుపోను ప్రబంధములలో శృంగారము వెఱ్ఱితలలు వేసినది. యువతీమణుల అంగాంగవర్ణన, విప్రలంభమున చంద్రాద్యుపాలంభనలు, శైత్యోపచారములు, సంయోగమున వాత్స్యాయనీయము నంతటిని ఏకరవుపెట్టుట- ఇదే శృంగారమును నంతటిని నీచస్థితికి దిగజారినది. ఈఅసభ్య శృంగార వర్ణనను సరసులైన విమర్శకులెల్లరును గర్హించి యున్నారు.

నన్నెచోడుడు, శ్రీనాథుడు, నాచనసోముడు, పెద్దన, రామరాజభూషణుడు, పింగళి సూరన ఇత్యాదులు గావించిన రహఃక్రీడా బహిరంగ వర్ణనము అత్యంత జుగుప్సావహముఁగనున్నది. తరువాతి దక్షిణాంధ్ర యుగమున వెల్లివిరిసిన పచ్చిశృంగారముఁనుగూర్చి ఏమిచెప్పినను చాలదు. కనుక మానివేయుటే మేలు.

ఇట్లు వేలము వెఱ్ఱిగ పోటీపడినట్లు ఒకరినిమించి మరొకరు రచించిన హేయ వర్ణనలను చదివి చదివి అదియే శృంగార మనుకొను స్థితికి దిగజారిపోయినది రసజ్ఞత. అట్టి ముదురుపాకపు రసజ్ఞులను సంతృప్తిపరుపగలిగిన పదార్థము తిమ్మనవలన రావలసినంతగ లభింపని మాట నిజమే.

తిమ్మన శృంగారమును పోషించిన తీరేవేరు. సభ్యరుచికి వెలిగాని శృంగార మాయనది, అమలినము, సుకుమారమునైన శృంగారమును అసిధారావ్రతముగ నిర్వహించుటలో తిమ్మన చూపిన నిగ్రహము ప్రశంసనీయము. పారిజాతాపహరణమును తిమ్మన రచించినది రాయల యొక్కయు తదాస్థాన కవి పండితుల యొక్కయు ప్రశంసల నందుకొనుటకేగాక అంతఃపురపు అక్కర తీర్చుటకు కూడ నగుటయే ఇందులకు కారణము కావచ్చును.

'కన్యాంగ సౌందర్య కథన'మను పేర చాలమంది కవులు చేసినట్లు 'చికురాదియుం బదనఖాంతముగా' 'ఆరోహణా వరోహణముల వెంట

తిమ్మన శరీరాంగవ్యవచ్ఛేదకుని (Anatomist) పాత్ర వహింపలేదు. [34]కావలెనన్నచో సత్యారుక్మిణుల అంగాంగ వర్ణన చేయుటకు తిమ్మనకు అవకాశము లేకపోలేదు. కాని అది తిమ్మన దారికాదు. తిమ్మన తన పాత్రల సౌందర్యమును వర్ణింపడు; చిత్రించును. ఆ చిత్రణ కావ్య శరీరమంతట వ్యాపించియుండును. అనగా పాత్రల అంగాంగ వర్ణనలు లేక పోయినను, కావ్యమును ముగించుసరికి ఆయా పాత్రల స్వరూపములు పాఠకుని మనఃఫలకముపై స్ఫుటమైన ఆకార రేఖా వర్ణచ్ఛాయలతో ముద్రితములై యుండును. ఇది ప్రతిభాశాలియైన మహాకవికి మాత్రము చేతనైన కావ్య శిల్పము.

సత్యా కృష్ణుల రహఃకౌళిని వర్ణింపగల అవకాశము తిమ్మనకు రెండుసార్లు లభించినది. మరియొక కవియైనచో ఆ అవకాశము లను జార విడువక వాత్స్యాయనీయము నంతటిని ఏకరువుపెట్టెడువాడే కాని తిమ్మన

'యదువల్లభుండు సత్యయుందాను .... శయనాగారంబున వినోద కేలిం దేలి నిద్రాముద్రిత నేత్రుఁడై శయనించె' (II 53) అని యొక సారియు

ఆ రాత్రి సత్యఁగూడి ము
రారి ముదంబెసఁగ వైజయంతమున మనో
భూ రాజ్యసౌఖ్య నిద్రా
పారీణత నుండుచోఁ బ్రభాతంబయ్యెన్. (IV 48)

అని మరియొకసారియు సూచన మాత్రముగ చెప్పి ముందునకు సాగి పోయినాడు. విష్ణ్వవతారమైన కృష్ణుడును, భూదేవ్యవతారమైన సత్యయు జగత్పితరులు. వారి రహఃకేళివర్ణనము స్వమాతా పితృ రహఃకేళివర్ణనము వలె అనుచితము. ఈ పట్టున తిమ్మన చూపిన నిగ్రహము, ఔచిత్య పరిజ్ఞానము ఎందరో మహాకవులలో కూడ కానరాదు. కాళిదాస మహాకవియే కుమారసంభవములో జగత్పితరులైన పార్వతీపరమేశ్వరుల రహఃక్రీడను బట్టబయలుచేసి సహృదయ విమర్శకులచేత చీవాట్లు తినవలసిన వాడయ్యెను.

---

34. 'మనమీల నవఁజాలు ' I 56 అను పద్యము మాత్రమెట్లో తిమ్మనను గికురించి కావ్యములో చోటు చేసికొనినది.

సంయోగ శృంగారమునేగాక వియోగ శృంగారమును వర్ణించుటలో కూడ తిమ్మన ఇట్టి నిగ్రహమును, ఔచిత్యమునే ప్రదర్శించియున్నాడు. కృష్ణుని రాకకై ఎదురు చూచుచున్న సత్యభామయొక్క విరహమును వర్ణించుటలో తిమ్మన ఔచిత్యమును పాటించి అత్యంత సభ్యముగను, సహజముగను నిర్వహించినాడు. మరియొక కవియైనచో ఆమె వెన్నెల వేడికి, మలయానిలపు మంటకు ఓర్వలేక చంద్రాద్యుపాలంభనలు గావించుట, మరణ ప్రయత్నములు చేయుట, చెలులామెకు శైత్యోప చారములు సల్పుట మొదలగు అసహజ సంఘటనలను కూర్చి యుండెడి వాడు. వీనిని వదలివేయుట తిమ్మనార్యుని స్వతంత్ర దృష్టికిని ఔచితి పరిజ్ఞానమునకును తార్కాణ.

శ్రీకృష్ణుడు శృంగారశేఖరుడు. సత్యభామ శృంగార రసాధి దేవత. శృంగార సర్వస్వమున కాలంబనము.' అట్టి సత్యాకృష్ణులు నాయికా నాయకులైన పారిజాతాపహరణము శృంగార రసోప నిషత్తనుటలో అతిశ యోక్తియుండబోదు. ప్రథమాశ్వాసమంతయు నొక రసగుళిక. ప్రణయ కుపితమైన ప్రేయసి పాదములకు రసిక శిఖామణియైన శ్రీకృష్ణుడు మ్రొక్కిన సన్నివేశము శృంగారరస పరాకాష్ఠ. అది యా చక్కెరగుళిక లోని 'కోవా' నొక్కు. ద్వితీయాశ్వాసమందలి వెన్నెల విహారములు, తృతీ యాశ్వాసమునందలి అమరావతీ పౌర కాంతలు శ్రీకృష్ణుని సానురాగముగా దర్శించుట, సత్యాకృష్ణుల నందన వనవిహారము, చతుర్థాశ్వాసమునం దలి అచ్చరల పుష్పాపచయము, జలక్రీడలు మొదలగు వర్ణనలు ప్రథ మాశ్వాసమునందలి శృంగార రస ప్రవాహమును తెగిపోనీకుండ పంచమా శ్వాసమువరకు తెచ్చినవి. పంచమాశ్వాసములో సత్యభామ శ్రీకృష్ణుని పారిజాత వృక్షమునకు కట్టివేయుట, నారదునకు దానమొసగుట, మరల ధన మిచ్చికొనుట అనునవి సుస్మితములు, సుకుమారములునగు శృంగార సన్నివేశములు. ఇట్లు కావ్య శరీరమాద్యంతము శృంగార రసమవిచ్ఛిన్న ముగా ప్రవహించుచున్నది.

శృంగారము ధర్మార్థకామముల నాశ్రయించి త్రివిధమైనది. [35] సత్యాప్రణయము కామ శృంగారముగ ప్రారంభమై (I 71–73), అర్థ శృంగారముగ మారి (I 82 నుండి) చివరకు పుణ్యక వ్రత ఘట్టమున ధర్మ శృంగారముగ పరిణమించినది. (V 68 నుండి), సత్యాప్రణయ మునకీ క్రమ వికాసమును నిరూపించి తిమ్మన శృంగార ప్రయోజనమును కాంతా సమ్మితముగ ఉపదేశించినాడు.

మరియు శృంగారము వాఙ్నేపథ్య క్రియాత్మకముగా ముత్తెరంగు లయినది. [36] ఈ మూడు విధములైన శృంగారమును తిమ్మన చక్కగా నిర్వహించియున్నాడు.

వాక్ఛృంగారము: ప్రణయకుపితయైన సత్యను అనునయించుచు కృష్ణుడు పలికిన పలుకులు (I 115-119, 123) అచ్చమైన వాక్ఛృంగా రము. సత్యకు కృష్ణుడు మేరుపర్వతమును, అమరావతీపురిని చూపి వర్ణించుటలోను (II 85-100), నందనవన శోభను వివరించుటలోను (III 53-57), పారిజాత మహిమా వర్ణనములోను (IV 3–10), సత్య కృష్ణునకు సత్యభామా విధేయుడను బిరుదము నొసంగుటలోను (IV59),

---

35. త్రివిధశ్చాత్ర విధిజ్ఞైః పృథక్ పృథక్ కార్యయోగ విహితార్థః
శృంగారః కర్తవ్యో ధర్మే చార్థేచ కామేచ.
యత్రతు ధర్మ సమాపక మాత్మ హితంభవతి సాధనం బహుధా
వ్రత నియమ తపోయుక్తో జ్ఞేయోసౌ ధర్మ శృంగారః.
అర్థ స్వేచ్ఛా యోగాత్ బహుధా ప్రైవార్థతోఽర్థ శృంగారః
స్త్రీ సంప్రయోగ విషయేష్వ యదార్థ మపిష్యతేహి (ఖ) రతిః
కన్యా విలోభనకృతం ప్రాప్తా (విలోభనం వాప్రాప్తం)
స్త్రీ పుంసయోస్తు రమ్యంవా
నిభృతం వా సావేగం వా యస్య భవేద్వా(జానీయాత్)కామశృంగారః
నాట్యశాస్త్రము. XX 76–79.

36. శృంగారం త్రివిధం విద్యాత్ వాఙ్నేపథ్య క్రియాత్మకం -
నాట్యశాస్త్రము. (VI 77)

యుద్ధ మధ్యమున కృష్ణుడు సత్యతో సంభాషించుటలోను (V 20), పుణ్యకవ్రతాచరణ సందర్భమునందలి సత్యాకృష్ణుల సంభాషణలోను (V 77, 78) సరసమును సభ్యమునునైన వాక్శృంగారము తొంగి చూచు చున్నది. శ్రీకృష్ణుడు సత్యకొరకై చేసెడు ఆయా వర్ణనలలో సమయోచిత ములైన శృంగార భావములను కూర్చుట కృష్ణుని శృంగారి శేఖరత్వము నకు అనుగుణమైన కల్పన. మేరుపర్వతపు చరియలలో ప్రియుల-కు సందేశములు లిఖియించు గంధర్వ సౌగంధిక గంధులను, రతి శ్రమంబు లపనయించు యక్షపక్ష్మ లాక్షులను (II 88), కృష్ణుడు సత్యకు చూపించి వర్ణించును. అమరావతిని వర్ణించు సందర్భమున రణ నిహతులైన వీరులు సోమయాజులు, యోగులు 'ఈసురపుర కామినీవదన చుంబన మాత్ర కృతార్థ మానసుల్' (II 99) అనియు 'సారంగాక్షుల చూపు చోఱగములు' ఇత్యాదుల తప్పించుకొని సజ్జన నాపికుడీపుర ద్వీపమును చేరుననియు (II 100) కృష్ణుడు సరస శృంగార భావములను వెలిబుచ్చును. నందన వనశోభను వివరించుచు వసంతుడును వనవాటికా రమా తరుణియు సేసబ్రాలు చల్లుకొనుచున్నారనును. (III 54), చైత్రుడు లతాలలనల గండ దర్పణములపై కుంకుమ పత్ర భంగములు వ్రాసెననును. (55) 'చూతలతాలలన తలిరాకు మెఱుఁగు వాతెఱను కలకంఠ విటుఁడు' కొరికెననును. (56) ఒకపోతు తేటి తనబోటి కనుగప్పి వేరొక తేటి బోటి పొత్తున విరితేనె గ్రోలెననును. (57) సురవల్లభుడు శచినంక పీఠమున జేరిచి సోగ వెంట్రుకల చిక్కులు వాపి పారిజాతపు సరులతో అలంకరిం చుననును. (V 8) ఇట్లు శృంగార భావములను సమయానుకూలముగ వెల్లడించుటేగాక కృష్ణుడు మాటిమాటికిని సత్యను 'ఏణీశాబవిలోలనేత్ర' 'సకలేందు బింబముఖి' 'వారణరాజయాన' 'అలిప్రకరాద్వయ్యు వాదికైశిక' 'అదృష్ట సింహోదర సన్నివేశ' 'గంభీరవేదిగమన' 'హాయన మాత్రకురంగ లోచన' 'లలితేంద్ర నీలశకలోపమకైశిక' అని ఇట్లు సత్యా సౌందర్యమును సులలితపద బంధములతో పొగడును. వాక్శృంగార నిధానములైన ఈ సం బోధనలు సత్యనెట్లో పాఠకులను అట్లే గిలిగింతలు పెట్టును.

2. నేపథ్య శృంగారము: అంగాంగ వర్ణనము నెడ విముఖుడయ్యు నేపథ్య శృంగార వర్ణనకు తిమ్మన ప్రతికూలుడుకాడు. పారిజాత పుష్ప

మును సిగలో ధరించిన రుక్మిణి 'వలి గుబ్బలిముద్దు పట్టిలేత నెల ధరించినట్లు'ను (I 55) 'పులుగడిగిన ముత్తియము' వలెను (57), 'సానఁబట్టిన మకరాంకు శస్త్రము' వలెను (72) ఉన్నదట. చీకటింట చేరిన సత్య 'జలదాంత చంద్ర రేఖాసదృశాంగి'గా (99) నున్నదట. కోపోపశమనానంతరము అలంకరించుకొని కృష్ణుని యెదుటకు వచ్చిన సత్య హిమధామకళ వలెను, పద్మిని వలెను, నిర్మల సరసి వలెను, నవ మాలతి లతికవలెను (II 15) ఉన్నదట. భుక్తిశాలకు కృష్ణననుసరించు సత్య జలదమును వెన్నంటిన తటిల్లతవలె (II 17) నున్నదట. ఆకాశయానము గావించునపుడు అంబుధర జాలముక్తములైన జలకణములు సాత్రాజితీకైశికమున మౌక్తికస్తబకము వలె నున్నవట (79) పుష్పాపచయ శ్రాంతలైన వేలుపు వెలదులు వదలిన నీవి బంధములు మున్నగు లక్షణములవలన రతిశ్రమ ఖిన్నలను పోలియుండిరట (IV 18) జలక్రీడా సమయమున జీర్కు బండలపైనుండి జారెడు తరలాక్షులు 'పుష్పశరుని సంపెఁగ వాలికతూపులో' యన్నట్లున్నారట. (IV 38) దుకూలాంశుక ధారిణులైన అంగనలు 'ఒఱతోడి మారునియలుగుల' వలె నున్నారట (IV 40). ఇట్లు తిమ్మన గావించు నేపథ్య శృంగార వర్ణనలు సంగ్రహములయ్యు స్వరూప సాక్షాత్కార సమర్థములై సరసములు సభ్యములు నగుటచే సముచితములై యొప్పుచున్నవి.

3. క్రియా శృంగారము : శ్రీకృష్ణుడు సత్యకు వీవనతో విసరుట (I 109), ఆమె పాదములకు మ్రొక్కుట (I 120) మిగుల సున్నితములైన శృంగార క్రియలు, సత్యాకోపాగార ప్రవేశము కూడ క్రియా శృంగారమే. ఆమె కృష్ణుని తన్నుట యనునది అంతంత మాత్రపు రసికులు ఊహింపలేని, మెచ్చలేని, పరాకోటి కెక్కిన క్రియా శృంగారపు మచ్చుతునక. శ్రీకృష్ణుడు రుక్మిణీ సత్యలతో జూదమాడుట (I 43, II 29), సత్య కన్నీరు తుడిచి కౌగిట జేర్చుకొనుట (I 134), అమరావతి పౌరకాంతలు కృష్ణుని దర్శించువేళ గావించిన విభ్రమ చేష్టలు (III 13–20). కృష్ణుడు వానిని సత్యకు చూపుట, నందనవన విహారము, జలక్రీడ, సత్యభామ కృష్ణుని భుజముపై నూనికగొని నడచుట (IV 25), సత్యాకృష్ణులు ఒండొరుల కేలు దమ్ముల నూతగొనుచు వేలుపు కొలినులోనికి దిగుట

(IV 27), సత్య కృష్ణుని భుజాస్తంభమూది సలిల విహరణ మొనర్చుట (IV 35), కృష్ణుడు సత్యకు పారిజాతమును కర్ణావతంసముగ నిడుట (IV 12), నందనవన పాలకులతోనేమో పలుకబోవు కృష్ణుని సత్య కను సంజ్ఞతో నదల్చుట (IV 58) అనునవి సుకుమారములైన క్రియా శృంగార సన్నివేశములు. వీనికి తలమానికమనదగినది సత్య శ్రీకృష్ణుని పారిజాత వృక్షమునకు కట్టివైచిన సన్నివేశమును (V 79), నారదునకు దాన మొసంగిన సన్నివేశమును (V 82)

ఇట్లు త్రివిధమైన శృంగారము కావ్యమాద్యంతము పరిపుష్టమై యున్నది.

ఈ శృంగార రసపోషణలో దివ్యులు, మానవులునైన స్త్రీ పురుషులే గాక తిర్యక్కులును. వృక్ష లతాలును కూడ యథాశక్తి సహకరించినవి. [56] భృంగకుమారుడు (II 33), గరుడ దంపతులు (II 88), కలకంఠ విటుడు (III 56), అలి దంపతులు (III 57), చక్రవాక దంపతులు (IV 22), గీర్వాణ వారణ ద్వంద్వము (IV 23), కిన్నర ద్వయములు (IV 45) సమకూర్చిన మాధుర్యమును రసాభాసమని లాక్షణికులు లఘూకరించి శృంగారముద్ర నొసంగకపోయినను, అది సహృదయ హృదయావర్జకము కాకపోదు. కైరవిణి (II 48), కమలిని (II 67), చూతలతికలు (III 47, 56), గురివెంద, మావి (III 48), కుహళి (III 53), కల్పలతికలు (IV 54) కూడ శృంగార భావనల పంటకు దోహదముగా గావించినవి.

వీనితో తృప్తినందలేనివారికి చంద్రికా విహార వర్ణనలో (II 53) మరింత 'ఘాటైన' శృంగారమును కూడి తిమ్మన సంతరించి పెట్టినాడు. దేశకాల ప్రభావములనుండి పూర్తిగా తప్పించుకొనుట ఎవరికిని సాధ్యము కాదనగా రస లోలుపులైన కవులమాట చెప్పనేల? కనుకనే అత్యంత సభ్యతాయుతముగ రసపోషణ గావించు తిమ్మన రచనలోకూడ కొంత పచ్చియైన భావములతో కూడిన ఈ చంద్రికా విహార వర్ణనము, గతానుగతిక

---

36 తిర్యక్శృంగారమును సాహిత్యశాస్త్రకారులు రసాభాసముగ పరిగణించినను అది హృదయాహ్లాది కాకపోలేదు.

మైన రుక్మిణీ ప్రత్యంగ వర్ణనము (I 56), ఎడనెడ అత్యల్పముగనేయై నను కుచ సంభోగాది ప్రసంగములు చోటుచేసికొనియే తీరినవి. వీనికంటె ఆక్షేపణీయమైనది. రుక్మిణితో నారదుడు గావించిన తదీయ సురత ప్రసంగము (I 60), అనౌచిత్యజుష్టమైన ఈ యొక్క పద్యము తిమ్మన కవితా శరచ్చంద్రునియందలి మచ్చగ నెన్నవచ్చును.

నిజమునకు తిమ్మనది రసికహృదయము. శృంగారము ఆతని కవిత జీవనాడి. అందుచేతనే రసాంతరములుకూడ శృంగారముతో ఓతప్రోతములయి యుండును. అనేక సందర్భములలో వీర రౌద్రాది రసములను త్రోక్కిపట్టి శృంగారముతానే విజృంభించుటయు కలదు.

వీరరస విజృంభణతో రణరంగమునకు బయలుదేరు దేవతావీరులు తమ ప్రియురాండ్రయొద్ద సెలవు గైకొను సన్నివేశములను (IV 72, 73, 74) తిమ్మన వర్ణించినతీరు శృంగారమువలన వీరము మరుగుపడునట్లు చేయుచున్నది.

కృష్ణుడు గావించిన పారిజాతోత్పాటన వృత్తాంతమును వినిన ఇంద్రుడు రౌద్రరసావిష్టుడయ్యు శచీదేవిని గాంచి "జయబ్జాస్య, నీకేలవిన్నంబడ'నని ప్రేమతో ఓదార్పుతో (IV 62) రౌద్రరసము మెత్తబడినది.

యుద్ధరంగ వర్ణన భీభత్స రసాస్పదముగ గావించుచునే తిమ్మన మధ్యలో నొక అభాస శృంగారభావనను కూర్చినాడు. మూర్ఛితుడైన చంద్రుని మండలమునుండి కురంగము బయటి కరుదెంచినది. వాయుదేవుని వాహనమైన కురంగముకూడ తన యజమాని యుద్ధరంగమును వీడి పారిపోవుటతో స్వేచ్ఛగా సంచరించుచున్నది. చంద్రుని కురంగమునకు అదివరకే కృష్ణుని బాణముల వ్రేటువలన కొమ్ములు ఊడిపోయినవి కొమ్ములులేని ఈ చంద్ర కురంగమును వాయుకురంగము చూచి కురంగియను భ్రాంతితో దానిని వెంటాడుచున్నది. (V 13) కొంత హాస్యమును తోడు చేసికొనిన ఈ అభాస శృంగారము యుద్ధరంగపు భీభత్సరసమును అణగద్రొక్కినది.

తిమ్మన శృంగారరస ప్రియతకు ముఖ్యముగ ఉదాహరణీయము కాదగినది 'చుక్కల రాణివాసముల....' అను పద్యము (V 10). కృష్ణుని బాణ పరంపరాహతిచేత చంద్రుని రొమ్ము గాయపడి ఆతడు రక్తసిక్తాంగుడైయున్నాడు. ఈ భయానక దృశ్యమును వర్ణించుచు తిమ్మన చంద్రుని రొమ్ము చాల కఠినమైనదని చెప్పినాడు. ఆ కాఠిన్యమునకు కారణము చంద్రుని రొమ్ము కఠినమ్మైన తారాకామినుల వక్షోజముల రాపిడికి నిత్యము అభ్యస్తమైయుండుటయట. ఈ సరస శృంగారభావము భయానకమును పారద్రోలి పాఠక హృదయమున తానే ప్రభుత్వము చేయుచున్నది.

ఇపుడు సాంగోపాంగమైన శృంగారరసము "పారిజాతాపహరణము" నందు పోషింపబడిన తీరును గుర్తింతము.

**ఆలంబన విభావములు :**

1. పతి-శ్రీకృష్ణుడు-దక్షిణ నాయకమణి-శృంగారి శేఖరుడు.
2. పత్ని-ప్రధానురాలు-సత్య-స్వీయ, మధ్యా ప్రౌఢా, ధీరా ధీరాధీరా సమ్మిశ్రిత; ఖండిత, స్వాధీనపతిక.

అప్రధానలు-రుక్మిణీ, అప్సరసాదులు.

భృంగకుమారుడు, కలకంఠ విటుడు, అలికాంత, చక్రవాకి, మున్నగు తిర్యక్కులుకూడ ఆలంబన విభావనములైనవి.

**ఉద్దీపన విభావములు :**

1. యౌవనము -

"....ఎల జవ్వనముం బొలిపోని వారి...." (I 37)

"....జవ్వనంబున కొక వింత జవ్వనంబు" (I 56)

"....ఎల జవ్వనినంచు...." (I 66) ఇత్యాదులు

2. రూపము :

"కులమును రూపమున్ మగనికూరిమి యుం గలదాన" (I 43)

"చక్కదనమునకొక వింత చక్కదనము" (   56)

"చక్కనిదాన నంచు..." (I 70)

"వారిలోపల సౌందర్యవతియు..." (I 70)

రుక్మిణీ సౌందర్యము I 56,78 లలోను సత్యా సౌందర్యము II 15 లోను మనోహరముగ వర్ణింపబడినవి.

3. భూషణము :

జలకంబాడి మడుంగుగట్టి మణిభూషాదీప్య మానాంగియై
కలపంబెంతయు వింతగానలఁది చెంగల్వాల్ని జిన్నించ వే
నలిఁగీల్కొల్పి పసిండియందె రవళిక్రాయంచలంతంత రాఁ
జెలులుం దానును సత్యభామ సనుదెంచె న్నాథుఁడుప్పాంగఁగన్

(II 14). II 70, IV 40, 41, V 68 లలో కూడ భూషణ వర్ణనకలదు

4. కులము :

'కులమును రూపమున్...' (I 42)

5. చేష్టలు :

భావము-కృష్ణుని చూచు ప్రమదము వేల్పు స్త్రీలకగుట III 11
హావము-సత్యకృష్ణుని ప్రేమరసాలస వీక్షణంబులగనుట V 77.
హేల-వేలుపు వెలది చిలుకచే కృష్ణుని పిలిపించుట III 20.
విలాస, మాధుర్యములు-పారిజాతాలంకృతయైన రుక్మిణి I 55,56
ధైర్యము-IV 58 సత్యకృష్ణుని వారించి తానే నందనవన పాలకులను ధర్షించుట
లలితము-II 11, లలితాంగులు కృష్ణునకు స్నానము చేయించుట
విభ్రమము-ఒక మదవతి అంగదమును కంకణముగ తొడుగుట III 18.
లీల-లతలు గోపికా వస్త్రాపహరణమును తలపింపజేయుట III 50.
కిలికించితము-వేలుపుచిలుకల కొలికి కృష్ణుని చూపులతో నదలించుట III 20.
హసితము-58 పైధైర్యో దాహృతిలో సత్య నవ్వుట
విచ్ఛిత్తి II 14, సత్య అలంకరించుకొనుట.

# రసస్వరూపము (శృంగారము)
















ర స ము (శృంగారము)
సంయోగము
వియోగము
పూర్వము
పరము
దృఙ్మనస్సంగాదులు - 10
ఈర్ష్య
విరహ
ప్రవాస
కరుణ
భూత
భవత్
భావి

కుట్టమితము-చూతలత కలకంఠ, విటుని విదర్చుట-III 56.

మౌగ్ధ్యము-పార్వతి తన ప్రతిబింబమును గాంచి అసూయపడుట I 2

ఇట్టి తక్కిన చేష్టలకును మరికొన్నింటికి ఈ కావ్యమున లక్ష్యములున్నవి.

**ఉద్దీపన విభావములు :**

చంద్రుడు : II 53, IV 47.

మలయమారుతాదులు.

'అలికుల రావముల్ కిసలయాకుల కోకిలకాకు కాకలీ

కలకల నాదముల్ సెలఁగఁ గమ్మని తమ్మికొలంకు తెమ్మెరల్'

(I 72).

ఇతరములు-పరిసరములు.

'తన శృంగార వనంబులో నగరి పొంతం జక్కఁగా దిద్ది తీ

ర్చిన పూదేనియ యేటి కాలువ దరిం జెంగల్వ పుష్పాళ్ళు నిం

చిన చంద్రోపలవేది...' (I 71)

సత్యాశయ్యా మందిర వర్ణన (II 53).

**అనుభావములు :**

భంగ్యంతరమున అవియే చేష్టలుగా చెప్పబడినవి. అను భావము లలో చేరినవే సాత్త్విక భావములు.

స్తంభము-మురారిని గనుగొన్న అలికులవేణికి ప్రమాన్ పాటుకలుగుట III 17.

రోమాంచము : హరిని చూచిన చేడియకు గగుర్పాటగుట III 12.

సత్యపాద ప్రహారమున కృష్ణునకు పులకలు కలుగుట I 123.

అశ్రువు : I 110, 111, 132, 134, సత్య కన్నీరుకార్చుట

III 12, 17, 19. ప్రళయము : I 133 సత్యారోదనము

వైస్వర్యము : సత్య గద్గదభిన్న కంఠియగుట I 82, 132.

వేపథువు : సత్యకు కంపము కలుగుట I 100; ఆమె చలితాధర పల్లవాగ్రయగుట I 123, వేల్పు వెలదికి సాధ్వస కంపము గుట III 17.

జృంభ : [37]కమలినీ జృంభికలు (II 67).

స్వేదము : I 100, 113, 124, II 12, 17, 19.

సాత్త్వికభావములు రమ్యముగ వర్ణింపబడిన రెండు పద్యములను ఉదాహరణ ప్రాయముగ పఠింతము.

'అలఁదిన చందనంబు వృథయౌఁ జెమరింపఁగ, సమ్మదాశ్రులన్
దొలఁచిన యట్లు వోయెడు కనుంగవ కాటుక, బేటు లెత్తఁజె
క్కుల మకరీ విలాసము గగుర్పొడు వస్త్రరిఁ జూచువేళ నో
'చెలి కయిసేయుకమ్మ'యని చేడియ యొక్కతె పిల్చె నెచ్చెలిన్'
(III 12)

అలికులవేణి యొక్కతె మురారిఁ గనుంగొని ప్రమానుపాటు పై
నెలకొననున్నచో సడలు నీవిక లేఁజెమరంటి నిల్పె నం
జలి పరిపూర్ణ లాజలను సాధ్వసకంపము దాన చల్లె న
చ్చెలువకు సాత్త్వికోదయము చేసిన మేలిఁక నేమి చెప్పుదున్
(III 19)

సంచారిభావములు :

నిర్వేదము I 99, 115, 131, 132; శ్రమ II 53, III 15, 47, IV 4, 18, 25; దైన్యము I 73; జాడ్యము I 111; గ్లాని IV 23; శంక I 72 23; ఆర్తి I 100; రోషము I 82, 98, 124-133, III 20, 48; గర్వము I 42, 66, 79, IV 58, 59; ఆవేగము I 82, III 11, 14, 18, 19; ధృతి I 55, 137, IV 90; స్మృతి I 71, 95; చాపలము I 101; ఔగ్ర్యము I 113, 114, 121; అవహిత్థ III 15; త్రప V 77; విషాదము I 99, 100, 1305; మదము II 29, 53, 89; ఔత్సుక్యము I 70. IV 11; మతి I 85, 86, 87, 92, 96; నిద్ర II 53, IV 48; మోహము I 100; బోధ I 110, II 64, 67; V 33, 88; వితర్కము I 73; అసూయ ?, 42, 90, 100, III 16; చింత I 70, 71, 72, 98, 101; అపస్మారము I 192. ఉన్మాదము III 20

33. (భానుదత్తుని 'రసతరంగిణి' ననుసరించి)

ఇట్లు పరిపుష్టమైన శృంగారముయొక్క విభేదము.

సంయోగము :

I 1, 2, 4, 39, 40, 43, 134, II 53, 85 – 100; III 42 IV 48; V 53, 77-82; 104-107.

సంయోగ శృంగారమును తిమ్మన పోషించిన తీరు ఇదివరకే వివరముగా నిరూపింపబడినది.

వియోగము :

పూర్వము- (పూర్వరాగము)

చక్షుః ప్రీతి : సురకామినులు కృష్ణుని దర్శించుట III 11-22.

మనస్సంగము : III 21. సురకాంతల మనస్సులు కృష్ణునందు లగ్నమగుట.

హ్రీత్యాగము : III 20. ఒక సురకాంత కృష్ణుని చిలుకచే పిలిపించుట

పరము (విప్రలంభము)

ఈర్ష్య I 82-133, సత్యా సతత్నీగతేర్ష్య

విరహము I 70-73. సత్యావిరహము,

ప్రవాసము-భావి-IV 73, 74, 75. సురవరులు యుద్ధమునకు వచ్చువేళ ప్రియురాళ్ళయొద్ద సెలవు గైకొనుట.

శృంగార నాయకులు :

అనుకూలుడు : చక్రవాకుడు IV 22: గీర్వాణ వారణము IV 23

దక్షిణుడు : శ్రీకృష్ణుడు గ్రంథమంతట.

భృంగ కుమారుడు II 33.

ధృష్టుడు: కృష్ణుడే. I 89, 125, 126, 127.

శఠుడు : కృష్ణుడే I 128.

'.........నీవిట వచ్చుట పారిజాతవాసనప్రకటించి నాకునెక సక్కెము సేయన కాదె చెప్పుమా' అను సత్యభామ మాటలవలన ప్రియా

శయమాత్ర నివేద్య విప్రియు' డను శఠలక్షణము [38] కృష్ణునియందు అతికినట్లు కుదురుచున్నది.

శృంగార నాయికలు :

స్వీయ-రుక్మిణీ సత్యలు.

సామాన్యలు-రంభామేనకాదులు III 3, 8, IV 30.

అన్య : వసుధాపతి I 20; అభిసారికలు. II 35, 52

మరియొకవిధముగ - ముగ్ధ - I 2, III 13.

మధ్య-ధీరా ధీర-సత్య I 125-132

ప్రౌఢ-ధీర-రుక్మిణి V 74.

అధీర-సత్య-I 121.

తిమ్మన సత్యాపాత్రను మధ్యాప్రౌఢలకును, ధీరాధీరాఅధీరలకును సంగమస్థానముగా చిత్రించినాడను విషయమిచట గుర్తింపవలసియున్నది.

భంగ్యంతరమున నాయికలు :

స్వాధీన పతిక : సత్య I 94; II 24, 25, III 58, IV 3, 59. V 42, 79, 80, 90

రుక్మిణి I 43, 58, 62, 65.

శచి : IV 8, 62.

చక్రవాకి IV 22, అభ్రభము IV 23.

విరహోత్క-సత్య I 71, 72, 73.

ఖండిత-సత్య I 82-100;

మావి III 48.

తేటిబోటి III 57.

అభిసారిక :

జ్యోత్స్నాభిసారికలు-II 51, 52.

38. (కావ్యాలంకార సంగ్రహము II 10)

తమోభిసారికలు -II 34, 35, 36.

ప్రవస్యత్పతిక - [39] సురవీరుల కాంతలు - IV 73- 74, 75

ఇట్లు సాంగోపాంగమై నానావిధమైన శృంగారము పారిజాతాపహరణ మాద్యంతము వ్యాపించియున్నది. ఇది శృంగార రసవత్కావ్య శిరోమణి.

ప్రాయికముగ తెలుగు ప్రబంధములన్నియు శృంగార రస ప్రాధాన్యము కలవే. పారిజాతాపహరణముకూడ శృంగార రస ప్రధానమే. ఐనను తక్కిన ప్రబంధముల శృంగారమునకును పారిజాతాపహరణమందలి శృంగారమునకును ఒక ప్రధాన భేదము కలదు.

ప్రబంధములన్నింటీ యందును నాయికానాయకులకు వివాహపూర్వము వినుకలివలననో, కనుకలి వలననో కలుగు ప్రణయోదయము, వివాహ పర్యంతము వారిరువురు పొందు విరహవేదనలు, చంద్రాద్యుపాలంభనలు, దౌత్యములు, చివరకు వివాహములు జరుగుట సర్వసామాన్యము. నాయికానాయకుల తొలిరేయి చేతల విపుల వర్ణనలతోనో, కుమారోదయయుతోనో అవి ముగియుచుండును. పారిజాతాపహరణేతివృత్తము దీనికి పూర్తిగా వ్యతిరేకము. కృష్ణుని కుమారులైన ప్రద్యుమ్నాదులు దాదాపు తండ్రియంత ఎత్తు పెరిగిన తరువాతనే ఈ కావ్యపు ఇతివృత్త మారంభమగుచున్నది. యువతీయువకుల భౌతికాకర్షణమాత్ర జన్యమైన కామోద్రేకమునుగాక, చిరకాలము కలసి కాపురముచేసిన ఆలుమగలమధ్య పెరిగిన ఆత్మీయభావనతో కూడిన నిజమైన ప్రేమను పారిజాతాపహరణమున తిమ్మన పోషించినట్లు పోషించిన ప్రబంధము మరొకటిలేదు. అట్లని తిమ్మన చిత్రించిన సత్యాకృష్ణులు కాగి చల్లారిన పాలును కారు. వారి ప్రణయ క్షీరము లింకను పొంగులు వారుచునే యున్నవి. ప్రౌఢ దశనందుకొనిన వారి ప్రణయము కేవలము కామమునేకాక, అర్థమును ధర్మమునుకూడ ఆశ్రయించినదై పరిపూర్ణతనందినది. ఇట్టి వివాహానంతర ప్రౌఢ దంపతి శృంగారమును సభ్యముగా చిత్రించుటయే పారిజాతాపహరణపు విశిష్టత.

---

29. (రసమంజరి మతానుసారము)

వీరరసము : ఉత్సాహము స్థాయిభావముగాగలది వీరరసము. లోకోత్తరకార్యములు సాధించుటకుగల పూనికయే ఉత్సాహము. దేవలోకపు పారిజాతమును మానవలోకమునకు తేబూనిన కృష్ణుని ఉత్సాహము లోకోత్తరమైనది. అతడు మహావీరుడు సత్యభామకు అతడు పారిజాతమ్ము వాగ్దానము చేయు సందర్భమున వీరరసము పొంగులువారుచున్నది. 'దేవతాకేలి వనంబుఁజొచ్చి యనికిన్బల సూదనుఁడెత్తి వచ్చినన్ డీలుపడంగఁద్రోలియిటఁ దెచ్చెద నిచ్చెదఁ బారిజాతమున్' (I 135) అను కృష్ణుని ప్రతిజ్ఞయు, తన్నిర్వహణయు ఈ కావ్యమును వీరరస ప్రభావమున దగియున్నవి. కాని తిమ్మన తన కావ్యమును వీరరస ప్రధానముగ గాక శృంగారరస ప్రధానముగ కూర్చియున్నాడు.

తనకు చిన్ననాడు దేవేంద్రుడు కావించిన అపకారమునకు ప్రతీకారము గావింపవలెనను గరుడుని ఉత్సాహము (V 75) వీరరసోల్లాసము గల మరియొక సందర్భము యుద్ధమున గరుడుడు ప్రదర్శించిన పరాక్రమము (V 8) అతని ఉత్సాహమును కార్యరూపము ధరించిన విధమును వెల్లడించుచు వీరరస భరితమైయున్నది.

ప్రతి నాయకుడగు దేవేంద్రుని వీరరసోద్ధతియు తక్కువైనది కాదు. 'సత్యాగర్వ భారంబు దివ్యనగంబున్వెడిపింతు' (IV 61) ననునతని పూన్కి ఉత్సాహభరితమైనది భగవదవతారమూర్తియైన కృష్ణున్నెదిరించుటలో ఇంద్రుని సాహసము మేరమీరినదైయున్నది. ఇంద్రోపేంద్రుల యుద్ధము, ఇంద్రునకు బాసటయై యరుదెంచిన దిక్పాలుర శౌర్యము (V 22) వారి యుద్ధసంరంభములు (V 63-86) వీరరస భరితములుగనున్నవి. ఇట్లు తిమ్మన తన కావ్యమున వీరమునకు ప్రధానస్థానము నొసంగకపోయినను ద్వితీయస్థానమునకు తగినంత విపులముగనే యాతడు పోషించియున్నాడు. ప్రథమాశ్వాసమున కృష్ణుని ప్రతిన, ద్వితీయాశ్వాసమున గరుడుని విజృంభణ, తృతీయాశ్వాసమున అదితి కృతస్తోత్రము, వరాహ, పరశురామ, రామ, బలరామావతార వర్ణనలు (III 28, 31, 34, 35, 36), చతుర్థాశ్వాసమున దేవతా యుద్ధవీరుల యుద్ధ సంరంభము, పంచమాశ్వాసమున యుద్ధము-ఇట్లు వీరరసము కావ్యము ఆద్యంతము వ్యాపించియున్నది.

రౌద్రము : అదితికృత నరసింహావతార వర్ణన IV 32), ఇంద్రుడు రౌద్రాకారుడగుట IV 62), యమ, నిర్ఋతి, ఈశానుల వర్ణనలు (IV 79, 80, 85), ఇంద్రుడు వజ్ర ప్రయోగమునకు పూనుకొనుట (V 31) అను సందర్భములు రౌద్రరస స్ఫూర్తి గలిగియున్నవి.

బీభత్సము : శవ సంకులమగను, మేదుర మేదః పంకిలముగను, రుధిర పల్వల యుతముగను వర్ణింపబడిన యుద్ధరంగము (V 13) బీభత్సరసాస్పదముగ నున్నవి.

అద్భుతము : ఇంద్రోపేంద్రులు ఒకరికొకరిపై ప్రయోగించుకొన్న బాణములు ఒండొంటి చేరి మింట పందిరియగుట (V 14), ఇంద్రుడు ప్రయోగించిన అస్త్రములు కృష్ణుని శరీరములో లీనమగుట (IV 30), కృష్ణుడు వజ్రమును పట్టివేయుట (V 36) అనునవి అద్భుత రసాస్పదములైన సన్నివేశములు.

కరుణము :- అవతారికా భాగమునందు కృష్ణరాయుడు ప్రతాప రుద్రునందనుని కరుణామతితో కాచిన వృత్తాంతము(I 21), దేవేంద్రుని పరాజయానంతరము కృష్ణుడు అతనియెడ కృపార్ద్ర చిత్తుడైన (V 38) వృత్తాంతమును కరుణరస చ్ఛాయలను కలిగియున్నది.

శాంతము : నారదవర్ణన (I 44), యుద్ధ విరమణానంతరము ఇంద్రోపేంద్రులు పరస్పరము సంభావించుకొనుట (V 39, 40) శాంత రసస్ఫోరకములుగా నున్నవి.

భయానకము : ఇంద్రుడు కృష్ణునిపై వజ్రమును ప్రయోగింపగా 'లోకములు జలజ దళోదరోదకము చాడ్పున నల్లలనాదిన'వట (V 33) సురలు హాహారవములు ఘటించిరట (34), కుల వసుధా ధరావళికి కుంటితనం బొదవించిన ఆ జలితపు కైదువు ప్రచండతను తిమ్మన ఒక మహాస్రగ్ధరలో (VI 35) వర్ణించియున్నాడు. మహాస్రగ్ధరా ఛందస్సుకు తోడు ద్విత్వ, సంయుక్త, మహాప్రాణాక్షరములతో కూడిన దీర్ఘ సమాస ములతోడి ఈ పద్యపు నడక జెడిదములగు పిడుగులను వర్షించుచున్నట్లే యున్నది. భయానకత్వ మీసందర్భమున సువ్యక్తము.

హాస్యము : శృంగార వీరముల తర్వాత తిమ్మనచె పరిపుష్టము గావింపబడినది హాస్యరసము. హాస్యము పారిజాతాపహరణ మాద్యంతము అంతర్గతముగ వ్యాపించియున్నది వివాదములు పుట్టించి వినోదము చూడ, వలెనను నారదుని కుతూహలమే మొదటికి ఈ కథకు పునాది. దీనిని దృష్టిలో నుంచుకొనినచో నారదుని చేతలన్నియు హాస్యరసపూరితములే యనిపించును. ఎక్కడికక్కడ వికటములగు సన్నివేశములను అతిసహజ మైన విధముగ సృష్టించుటలోనే ఈ హాస్య మిమిడియున్నది. 16000 మంది పడతుల పతికి ఒక్క పుష్పమును సూడిదగా తెచ్చి ఇచ్చుట, దానిని రుక్మిణీ మందిరములో నుండగ నొసంగుట, పైపెచ్చు సత్యానింద గావించుట, అదియు ఆమె చెలికత్తె వినునట్లు గావించుట యనునవి కృష్ణుని సంకట పరిస్థితిలో పెట్టి వినోదించుటకు నారదుడు బుద్ధిపూర్వక ముగ చేసిన పనులే. మునియెడల గౌరవము, రుక్మిణియెదుట మొగమో టమి, సత్యయెడ భయము నను భిన్నభావముల మధ్య ఇరుకుకొనిన కృష్ణుని నిస్సహాయదశ బహుభార్యాత్వములోని ఇబ్బందులను వ్యంగ్య ముగ తెలుపుచు హాస్యజనకమైయున్నది. నారదదుని సేవకై ప్రద్యు మ్నుని నియోగించి సత్యాసౌధమునకు పరుగులు తీసెడు కృష్ణుడు హాస్య మునకు నిదానముగనున్నాడు. అల్పకారణమును పురస్కరించుకొని అనల్ప మగు కోపముదాల్చిన సత్యచర్యయు, ఆ సందర్భమున ఆమె తన అమా యకత్వమును, కృష్ణుని మాయావిత్వమును, రుక్మిణి మాయలమారితన మును గూర్చి చెలికత్తెల యెదుట తనగోడు చెప్పికొనుటయు హాస్యమునే పుట్టించును. కారణము రుక్మిణి సాధుశీలయనియు, సత్య కోపనయనియు పాఠకునకుగల పూర్వగ్రహము (Prejudice) అలకపానుపుపై దొరలుచు సత్య అనుభవించు తపనయంతయు పాఠకునకు గయ్యాళితనముగనే భాసించి హాస్యమునే కలిగించుచున్నది. ఇక శ్రీకృష్ణుడామెకు వ్యజనసేవ చేయుట, అనునయవాక్యములు పలుకుట (చప్పుడుకాని అడుగులతో సమీపించుట, తనరాక దేవికి తెలుపవలదని చెలులకు సైగచేయుట)హాస్య జనక సన్నివేశములు, సత్య కృష్ణుని శిరమును తన్నినపుడు 'గయ్యాళి పెండ్లమును కట్టుకొని నెత్తికెక్కించు కొన్నందులకు కృష్ణునకిది తగిన శిక్షయే' యని పాఠకుడు తనలోతాను నవ్వుకొనక మానదు. మగనినితన్ని

మరియు ఏడ్పెడు సత్య రాగతనము, తాను చనిపోయినచో తన భోగ సామగ్రి తన సవతులకెవరకు దక్కునోయను ఆమె చింత-ఇట్లు లోతుగ చూచినచో ప్రథమాశ్వాసమంతయు శృంగారరసము బహిర్వాహినిగను, హాస్యరసము అంతర్వాహినిగను ప్రవహించుచున్నట్లు గుర్తింపగలము

కొలదిక్షణముల క్రిందటనే సత్యానింద గావించిన నారదుఁడు అంత లోనే ఆమెను పొగడుటను గాంచినపుడు 'ఏరోటిదగ్గర ఆ పాట పాడెదు' నారదుని పోకడ నవ్వు కల్గింపకమానదు.

వజ్రాయుధమునకు ఈకనువైచి దాని నిస్సారత్వమును నిరూపించిన గరుడు నుద్దేశించి ఇంద్రుడు 'మదీయామోఘాశనిపాత మిట్టిదని యాహా తెల్పుడాయె' ననియు 'అలనాటి వన్ను మరచితె' యనుటయు ఇంద్రుని మతిమరపునే సూచించుచున్నవని సుపర్ణోపాఖ్యానమును మరువని పాఠకుడు చిరునగవు చిందింపక మానడు. [40] ఇవియన్నియు లోతుగ పరిశీలించిన మాత్రమే వ్యక్తమగు హాస్యములు. మానవ జీవితమంతయు ఇట్టి హాస్యముతోనే నిండియుండుటను సూక్ష్మబుద్ధులు గుర్తింపగలరు. ఇట్టి సహజమైన హాస్యమును సృష్టింపగల ప్రతిభగల కవులు మన ప్రాచీన వాఙ్మయముననేమి, ఆధునిక వాఙ్మయముననేమి అరుదుగామాత్రమే కానవచ్చుచున్నారు.

ఇవికాక వాచ్యములైన హాస్యసన్నివేశములును కలవు. అవతారికా భాగమందలి దేవతాస్తుతిలో శివుని యౌదల గంగలో తననీడ చూచుకొని వేరొక్క తొయ్యలియని అసూయను పొందు ఉమాబాల మౌగ్ధ్యమెవరికి హాస్యము గొలుపదు (I 2) అమరావతి రాజవీధి వెంట నడిగెడు కృష్ణుని దర్శించుటకై గవాక్షము నాక్రమించిన బాలను ఏదో కార్యము పేరిట ఈవలకు పిలచి దాని స్థానమును తానాక్రమించెడు అనిమిషవనిత ఉపాయము (III 13) అచటచేరిన ముగుదల కేకిసలకు కారణమైనట్లుగనే

40. వాయువాహనమగు కురంగపు అభాస శృంగారచేష్ట (V 13) యందలి హాస్యము ఇదివరకే(పు. 225) వివరింపబడినది. వైవస్వతుడును అతని వాహనమును శృంగభంగమువలన లాఘవము పొందిరను శ్లేషలో (V 12) హాస్యము తొంగి చూచుచున్నది.

పాఠకుని ముసిముసి నగవునకును కారణమగుచున్నది. ఇక సత్యకృష్ణుని పారిజాత వృక్షమునకు బంధించుట యందలి హాస్యము చర్వణైక మధురము. సమయమునకు తగినట్లు సత్యబోటులు 'వామనావతారములో నీవు బలిని బంధించితివని వినుటేగాని చూచినది లేదు. ఇప్పుడు మా చెలి నిన్నుబంధించుటను కనులారగాంచితి'మని కృష్ణుని పరిహసించుటయు (V 81), కృష్ణుని బావమరుదులైన ధర్మజాదులు ఆ బోటులను సన్నలతో నెసగొల్పుచు వారి మేలములకు తమలో తాము నవ్వుకొనుటయు అత్యంత సహజములైన హాస్యసన్నివేశములు, వీని యన్నింటికిని శిఖరాయమాణమైనది. సత్యచే కృష్ణుని దానముగా స్వీకరించిన నారదుడు అతని నవ్వులాటలకు పనులుగొనుట (V 86), నారదుని దర్శకత్వము క్రింద శ్రీకృష్ణుడిచట హాస్యనట చక్రవర్తియైనాడు.

సుకుమారము, సున్నితము, సహజము, సభ్యమునైన హాస్యము మన ప్రాచీనులలో చాలమందికి తెలియదనుట ఒక చేదైన సత్యము హాస్యమనగానే మనకు అశ్లీలములతోనిండిన ప్రహసనములే గుర్తునకు వచ్చును లేదా తిండిపోతు, జగడాలమారి, బుద్ధిహీనుడునగు విదూషకుడే గుర్తునకు వచ్చును. ఇట్టి హాస్యజలలవరహితమైన ప్రాచీనసాహిత్యపు మరుభూమిలో తిమ్మన మేఘుడు వర్షించు హాస్యపు పన్నీటిజల్లులకు పులకింపని సహృదయుడుండడు. [30]

ప్రేయస్సు : [11] కృష్ణుడు గరుడుని తన మిత్రునిగ భావించి తన సంసారములోని కష్టసుఖములను అతనితో చెప్పుకొనుట (II 74) లో ప్రేయోరస మిమిడియున్నది.

---

40a 'కథ చదువుచున్నంతసేపూ చిరునవ్వుతోనే చదివించగల చాతురి ఈ కవిలో ఉన్నంతగా మన తెలుగు కవులు ఎందరిలోనోలేదు. ఇలా వాక్క్రియా కలాపాలన్నింటిలోనూ హాస్యాన్ని అందించిన కవి ప్రబంధ కవులో ఈ ముక్కు తిమ్మనగారొక్కరే'—ముట్నూరి సంగమేశం—మన హాస్యం. పు. 116.

41. ప్రేయో వాత్సల్య భక్తులు నవరసములలో పఠింపబడకపోయినను కొందరాలంకారికులు వానికిని రసత్వము నంగీకరించుటచే ప్రదర్శింపబడినవి).

వాత్సల్యము : కామధేనువు నందిని అజ్ఞునాకుట (II 96), అదితి కృష్ణుని పుత్ర వాత్సల్యముతో మేనిమిరి శిరసు మూర్కొని దీవించుట (III 25, 26) వాత్సల్య రసమునకు చక్కని ఉదాహరణములు.

భక్తి : నారదుడు కృష్ణుని స్తుతించుట (I 49-51, V 91-101), అదితి కృత దశావతార స్తోత్రము (III 27–38), దిక్పాలురు కృష్ణునకు నమస్కరించుట (III 4, 5) దేవతాభక్తికిని, కృష్ణుడు నారదుని పూజించుట (I 45, 47); వసుదేవాదులకు నమస్కరించుట (V 49) గురు భక్తికిని లక్ష్యములు కాదగియున్నవి.

మొత్తముమీద పారిజాతాపహరణ కావ్యమంతట సాంద్రముగ వ్యాపించియున్నది అంగిరసమైన శృంగారము. దాని తరువాత అంగరసములలో ప్రాధాన్యము వహించినవి వీర, హాస్యములు, తక్కిన రసముల పోషణ అత్యల్పమనుట సత్యము, కరుణ, భయానక, బీభత్సాదుల పోషణ నామమాత్రమే అన్నను అనవచ్చును. దానివలన కావ్యగౌరవమునకెట్టి నష్టమునులేదు.

రుద్రభట్టు :

రసపోషణ :

రుద్రభట్టు తన కావ్యము "వైష్ణవ కావ్య రసార్ణవ" మని చెప్పికొనినాడు. జగన్నాథ విజయము రసవత్కావ్య మనుటలో సందేహములేదు. ఇందలి ఇతివృత్తమైన శ్రీకృష్ణుని ఏకోత్తరశత కృత్యములలో అధికభాగము అతనిని లోకోత్తర వీరునిగ నిరూపించునవే. కనుక ఇది వీరరస ప్రధానమైన కావ్యమగుచున్నది.

ఇతివృత్తమునుబట్టి 'పారిజాతాపహరణము' కూడ వీరరస ప్రధానమే కావలసియున్నది. రుద్రభట్టు ఈ కథాభాగమును వీరరస ప్రధానముగనే రచించినాడు. ఇందలి వీరమున కాలంబనమైనవారు ప్రధానముగా ముగ్గురు. నాయకుడైన శ్రీకృష్ణుడు, ప్రతినాయకుడైన దేవేంద్రుడు, నాయకుని సేవకుడైన గరుడుడు.

ఉత్సాహము స్థాయిభావముగా గలది వీరరసము. అసాధారణములైన కార్యములను నెరవేర్పబూనిన గట్టి పూనికయే ఉత్సాహము.[32] దేవతావృక్షమును దివినుండి భువికి గొనితెచ్చు లోకోత్తర కార్యమును సాధించుటకై కృష్ణుడు పూనిన ప్రతిన యందలి ఉత్సాహాతిశయమును రుద్రభట్టు రెండుసార్లు చక్కగా వెల్లడించినాడు. సత్యకు కృష్ణుడు ప్రతిన చేయుచు ఇట్లనును.

'రమణీ సీమునిదందమంతిళిదె నీగళ్ పారిజాత ప్రసూ
నమనా రుక్మిణీ గిత్తె నెంబుదొలవత్తా పుష్పమొందేనపూ
ర్వమె ? దేవేంద్ర ననందనక్కె పరియిట్టానావగం పారిజా
త మహీజాత సీద్బు తందు నినగీవెం కేళ్ ప్రతిజ్ఞోక్తియం(౧౨-109)

(రమణీ నీవు కోపించిన అందమును తెలిసికొంటిని. ఇపుడు పారిజాత పుష్పమును రుక్మిణిచ్చితినని అలిగినావు. ఆ పుష్పమేమి అపూర్వమా ? దేవేంద్రుని నందనవనమును చుట్టుముట్టి అంతటి పారిజాత మహీజాతమును లాగికొనివచ్చి నీకిచ్చెదను. ఈనా ప్రతిజ్ఞోక్తిని వినుము.)

మరల నొకసారి నారదుని యెదుట కృష్ణుడు ఈ ప్రతిజ్ఞను పునరుద్ఘాటించినాడు.

'కుడదందు పారిజాతమ
నెడెగుడ దిన్నా శచీకుచక్రీడిగె తా
నెడెగొళ్గుం కౌమోదకి
బిడౌజనతి విపుల మెనిప వక్షస్థలంమం. (౧3-29)
'ఈయదొడె పారిజాతమ
నీయుగా మోఘం సితాతపత్ర ప్రకర
చ్ఛాయెయ నస్త్రప్రకర
చ్ఛాయెయ నీగుం నిళింప చక్రిగె శార్ఙం. (—30)
త్రిదశపతి పారిజాత
ప్రదనాగ జొడాధిపత్యా సవనమదిన్నా

42. (ఆంధ్ర ప్రతాపరుద్ర యశో భూషణము—పుట 281)

గదు తన్నగారి గాగి
పృదుధారా ఖడ్గ సవనమం మత్ఖడ్గం. (—31)

32. "భూరుహమిదు దివ్యంబిడ, బారదెన ల్దేవరాజ్యకంఠికె తనగిం
బారదు బర్కం తన్నగ, వైరియ కంఠక్కె మత్సుదర్శన చక్రం."
(—32)

వ॥ ఎందునుడిదు ఆ దేవచక్రవర్తి విక్రమాక్రాంత బళినముచి పాకజంభ శంబరాది నిళింపారిజాత నెంబఖర్వ గర్వదిం పారిజాతమం తరలీ యెనెంబుదుం ఉబ్బగదిం సత్యభామెగాం మాడిద ప్రతిజ్ఞెయుం మాణ్దెనప్పొడె, ఈ మహీమండలం రసాతలక్కిళియెదెయుం, కుల శిఖరి గళ్నెలెయింతరళ దెయుం, సముద్రంగళ్సీమోల్లంఘనం గెయ్యెదెయుం, దిగ్గజగళ్నిజ స్థానమం బిట్టోడదెయుం, చంద్రసూర్య మండలంగళ్కాల చక్ర పరివర్తనదొళ్పరివర్తిసదెయుం, ఎంతు ప్రయుక్తం గళాగిర్దపు వెన్నవచన వ్యవస్థిత మాదందీ లోక వ్యవస్థెయుం కెట్టుపోకు మదు కారణదిం మదీయ పారిజాతహరణ ప్రతిజ్ఞె యెంతాదొడం సలువంతె మాడిదప్పె. నీ వృత్తాంతమం నీవె పోగిప్పేళ్దు నెగళ్తెవడె దేకాదశరుద్రరుం ద్వాదశాదిత్యరు మష్ట వసుగళు మష్ట లోక పాలకరుం గరుడ గంధర సిద్ధ విద్యాధరోరగ యక్ష రాక్షస కిన్నర కింపురుషాది సమస్త మరుద్గణం బెరసైరావత గజ స్కంధారూఢనుం వజ్రాయుధ కలిత కరతళను మాగి నాళిన దివసం దివసేంద్రోదయ సమయదొళా మహేంద్రనం సంగ్రామక్కె బరవేళునెమ్మ గరుడారోహణ నాగేకాంగడిం బంబసెవు"

(పారిజాతము నీయనిచో శచీకుచ క్రీడ కెడ మీయక కౌమోదకి బిడౌజుని విపులమైన వక్షఃస్థలమును తానే ఆక్రమించును. (29) పారిజాత మునీయనిచో నిలింప చక్రికి సితాతపత్ర ప్రకరచ్ఛాయ నీయక అమోఘ మైన శార్ఙమే అస్త్ర ప్రకరచ్ఛాయ నిచ్చును. (30, త్రిదపతి పారిజాత ప్రదుడు కానిచో అధిపత్య సవనమింక జరుగదు. అనగారికి మత్ఖడ్గము ధారాఖడ్గ సవనమును ఒదగించును. (—31)ఈ భూమిరుహము దివ్యము. ఈయరాదనినచో, తనకిక దేవరాజ్య కంఠికరాదు. ఆ నగవైరి కంఠమునకు

ముత్సుదర్శనచక్రమే వచ్చును." (—32) అని నుడివి యా దేవచక్ర వర్తి, "విక్రమౌక్రాంత బలన ముచి పాక జంభ శంబరాది నిలింప పారి జాతుడవను అఖర్వ గర్వముతో పారిజాతమును కొని పోవనీయననినచో, సత్యభామకు నేను ఉత్సాహముతో చేసిన ప్రతిజ్ఞను మానినచో, ఈ మహీ మండలము రసాతలమునకు క్రుంగకయు, కులశిఖరులు భూమినుండి చలింపకయు, సముద్రములు సీమోల్లంఘనము గావింపకయు, దిగ్గజ ములు నిజస్థానమును విడచి పారిపోకయు, చంద్రసూర్యమండలములు కాలచక్ర పరివర్తనమందు పరివర్తింపకయు —- ఎప్పటివలెను౹ డజాలవు. నా వచన మవ్యవస్థితమైననాడు ఈ లోకవ్యవస్థయు చెడిపోగలదు. ఆ కారణమున మదీయ పారిజాతహరణ ప్రతిజ్ఞ ఎట్లయినను చెల్లునట్లు గావిం చెదను. ఈ వృత్తాంతమును నీవె పోయి చెప్పి నెగడితకెక్కిన ఏకాదశ రుద్రులును, ద్వాదశాదిత్యులును, అష్ట వసువులును, అష్టలోకపాలురను గరుడ గంధర్వ సిద్ధ విద్యాధరోరగ యక్ష రాక్షస కిన్నర కింపురుషాది సమస్త మరుద్గణమును కూర్చుకొని, ఐరావత గజస్కంధా రూఢుడును, వజ్రాయుధ కలిత కరతలుడునై రేపటి దివసము దివసేంద్రోదయ సమయ మందు ఆ మహేంద్రుని సంగ్రామమునకు రమ్మనుము. నేనును గరుడా రోహణుడనై ఏకాంగుడనై వచ్చెదను.")

కృష్ణుడు ప్రతిన గావించిన తొలి సందర్భమున ఈ వీరమునకు ఉద్దీపకమైనది ప్రియురాలి అలుకయు, తత్సాంత్వనేచ్ఛయును, కనుకనే అది శృంగార మిళితమైయున్నది. ద్వితీయ సందర్భమునందలి వీరము నకుద్దీపకమైనది నారదుని మాటలవలన వ్యక్తమైన ప్రత్యర్థియగు దేవేం ద్రుని గర్వమును, కృతఘ్నతాభావమును, కనుకనే ఇది రౌద్రమిళితమై యున్నది. ఈ ద్వితీయ ప్రకటనకు ముందు 'వీరావేశవిందు' (వీరావేశ ముతో) అని రుద్రభట్టు కూర్చియున్నాడు. కృష్ణుని వీరావేశము పొంగులు వారుచుండుట అతని బహువిధములగు ఉద్రిక్తవచనములలో రుద్రభట్టు చక్కగ వ్యక్తమొనరించినాడు.

శ్రీకృష్ణుని అమరావతీ దండయాత్రను రుద్రభట్టిట్లు వర్ణించినాడు.

'హరిదర్పమనపహరిసల్
హరివీరదె హరిశత్రుపక్షం తళ్ళర్దు మనో

హరివెరసు హరి హరిన్ముఖ
భరితానక నినద నేఱిదం ఖగపతియం." (౧౩—42—A)

(హరిదర్పము నపహరించుటకై హరిశత్రుప్రభుడగు హరి హరి పీఠ మునుండి లేచి మనోహరితోగూడ హరిన్ముఖ భరితానక నినదుడై ఖగపతిపై నెక్కెను.)

హరిశబ్ద పునరుక్తివలన కృష్ణుడు హరిశౌర్యుడని ధ్వనించునట్లు రుద్రభట్టు కూర్చియున్నాడు.

పారిజాతాపహరణ సందర్భమునను, యుద్ధ సందర్భమునను ఈ వీరరస స్ఫూర్తి అత్యుత్కటముగా నున్నది.

పారిజాతోన్మూలనము గావించిన వెంటనే కృష్ణుడు గావించిన శంఖ ధ్మానమును రుద్రభట్టిట్లు వర్ణించినాడు.

'నెరవం పేళురగేంద్ర నిన్నురగరం, దిక్పాలకశ్రేణి నీం
నెరవాగెంపడి మాతెలేరవి, యెలేమాదేవెలే బొమ్మ, కే
ళ్దిరె నీముం నెరవాగి మీకులిశిగెంతుం గెల్వనేకాంగదిం
మురవిధ్వంసకనెందు సారువ పాలాఱ్తూ పాంచజన్య వినం'
(౧౩—48)

('ఉరగేంద్రా, నీ ఉరగులను సహాయమడుగుము. దిక్పాలకశ్రేణి, నీవును సహాయముకమ్ము. ఓయి రవీ, ఓయి మాదేవా, (మహాదేవా) ఓయి బొమ్మ (బ్రహ్మ) వింటిరా ? మీరును ఈ కులిశికి సాయమురండు మురవిధ్వంసకుడు ఏకాంగుడై గెల్వగలడు.' అని చాటుచున్నట్లా పాంచజన్య స్వనము మ్రోసెను.)

కృష్ణుని ఈ యుద్ధాహ్వానమెంత వీరరస భరితముగా నున్నదో, యుద్ధ ప్రారంభమున నతడు గావించిన ధనుష్టంకారము గూడ అంతే వీరరస భరితముగా నున్నది.

'పవిసిర్ఘోషోపమానం, ప్రళయఘనఘటా గర్జనాభం, మహాభై
రవదుర్వారాట్టహాస ప్రతినిధి, యమ బాహా పరిస్ఫాలన ప్ర

ఖ్యమైన ల్దూతాహిలోకం, భ్రమదవనితళం, ప్రోచ్ఛలద్వార్ధి నిర్భి
న్న విరించాండం, పొదళ్దత్తసురరిపు ధనుర్దండ చండప్రణాదం.
(౧౩—74)

(అసురరిపు ధనుర్దండ చండప్రణాదము పవినిర్ఘోషోపమానమును, ఘనఘటా గర్జనాభమును, మహాభైరవ దుర్వారాట్టహాస ప్రతినిధియును, యమ బాహాపరిస్ఫాలన ప్రఖ్యమును అనునట్లు ధూతాహిలోకమును, భ్రమదవనితలమును, ప్రోచ్ఛలద్వార్ధి నిర్భిన్న విరించాండమునై పొదివెను.)

కృష్ణుని యుద్ధమును రుద్రభట్టిట్లు వర్ణించినాడు.

"మాలెగొళుత్త మొత్తరిసి పాయ్వసరళ్గళినుణ్మి విస్ఫులిం
గాళి ఖరల్సరల్మళె సిడిల్మళెయంగెలె వందు దెంబినం
శైలధరం కఱుత్తు కఱెయుత్తిరె మార్గణ వృష్టియం లయ
జ్వాలశిఖాళియంతె విశిఖాళిగళుర్చిద వింద్ర సేనెయం' (౧౩-76)

(మాలగొని ఒండొంటినంటీ వెలువడు బాణములనుండి విస్ఫులింగాళి వెలువడగా, బాణవర్షము అశనివర్షమును గెలువగలదన్నట్లు శైలధరుడు చెలరేగి మార్గణవృష్టిని కురిపింపగా విశిఖాళులు లయజ్వాలశిఖాళివలె ఇంద్రసేనను ముంచివేసెను.)

ప్రతినాయకుడైన ఇంద్రుని శౌర్యముకూడ తక్కువదికాదు. ఇంద్రుని పరాక్రమమును రుద్రభట్టిట్లు వర్ణించినాడు.

'నరనీ వజ్రియసూను వాదనదటం బిల్బల్తెయిం లోకదొ
ళ్బరియంతానెనె వజ్రిగావనొ పమం బిల్బల్మెయిం దెంబినం
శరదిందం శరమం నివారిసి, మహాస్త్రక్కెచ్చు దివ్యాస్త్రమం
హరిశౌర్యం హరితెఱిదం హరియ సామర్థ్యక్కె సామర్థ్యమం
(౧౩—94)

నరుడీ వజ్రి కుమారుడు. అందుచే విల్బల్మెయందు లోకమునందు తానే పెద్దనను వజ్రికి విల్బల్మెయందు సముడెవ్వడనునట్లు శరముతో శరమును నివారించి, మహాస్త్రమునకు హెచ్చైన దివ్యాస్త్రమును ప్రయో

గించి హరిశౌర్యుడైన హరి హరి సామర్థ్యమునకు ప్రతి సామర్థ్యమును ప్రదర్శించెను.)

"అరిదల్లిందిన రావణ ప్రముఖ దైత్యాధీశరం గెల్దుదీ
సురచక్రేశననాంతు గెల్వ్వదరిదెం దాగళ్జయ ప్రాప్తియొళ్
హరిగం సంశయబుద్ధి యాదుదెనె బేఱుత్ప్రేక్షిసల్ బేఱెబి
త్తరిపల్ బేఱభివర్ణిసల్కవణె బాహావిక్రమం శక్రనా' (౧౩—95)

(నాడు రావణప్రముఖ దైత్యాధీశులను గెల్చుట అరుదు కాదు. నేడు ఈసురచక్రేశు నెదుర్కొని గెల్చుట అరుదు అని జయప్రాప్తియందు హరికి సంశయబుద్ధి యైనదనగా శక్రుని బాహా విక్రమమును వేరుగ ఉత్ప్రేక్షించుట, వేరుగ విస్తరించుట, వేరుగ వర్ణించుట సాధ్యమా).

లోకమునందలి విలుకాండ్రలో అర్జునుడే మొనగాడు. దేవేంద్రుడా అర్జునుని అబ్బ. అతనితో పోరునప్పుడు కృష్ణునికి తన రామావతారానుభవములు గుర్తునకు వచ్చినవి. రుద్రభట్టే చెప్పినట్లు ఇంద్రుని శౌర్యమును ఇంతకంటె వేరువిధముగా ఉత్ప్రేక్షించుట, విస్తరించుట, వర్ణించుట అసాధ్యము. ఇచట రుద్రభట్టు గూడ ప్రతివీరుని వంశ వీర్య శ్రుతాద్యుత్కర్షను వర్ణించి, తజ్జయమువలన నాయకోత్కర్షను ధ్వనింపజేయుట యను నిపుణ మార్గమునను సరించినాడు.[43]

చిత్రమేమనగ ఇంద్రుని యుద్ధోత్సాహమునకు ఉద్దీపకములైనవి కూడ ప్రియాసాంత్వనేచ్ఛయు, నారద వాక్యములునే, భర్తల కష్టసుఖములను గుర్తింపలేని ఆడువారి హఠమును, ఇల్లాండ్ర మెప్పుదలనెల్లైన సంపాదింపవలెననెడి మగవాండ్ర కాంక్షయు, విగ్రహములు కల్పించి వినోదము చూచు జగడాల పోతుల మచ్చునాలికతనమును, వారి మాటలను నమ్మి కయ్యములకు కాలు దువ్వు శూరుల బుద్ధిహీనతయునే లోకోపద్రవకారులగు కలహములకు కారణములని రుద్రభట్టు చేసిన కల్పనల వలన నిరూపితమగుచున్నది.

---

43. కావ్యాదర్శము–I 21.

మంచిచెడ్డలను గుర్తింపలేని మగువయగు శచీదేవి పురికొల్పగా, బుద్ధిశాలియగు బృహస్పతి భగవంతుడగు కృష్ణునితో వైరము వలదని హితవు ఉపదేశింపగా డోలాందోళిత మనస్కుడైన ఇంద్రుడు నారదుని పుల్ల విరుపుమాటలతో యుద్ధమువైపునకే మొగ్గెను. అప్పటి యాతని వీర రభసమును రుద్రభట్టిట్లు చెప్పించినాడు.

'బగెగెందుం పంపగజ్జం గళనతిపువ నిన్నుక్తియంతిర్కె దైత్యా
రిగడం మారాంతు బందంగడ సురకుజమం సత్యెగిత్తంగడం కా
దిగడం నమ్మల్లి గెల్వంగడి మెనగెగడీ గళ్గడం బుద్ధిపేళ్ద
ప్పెగడం దేవేజ్యనిల్లీ యదుకుల కుటిలంగాన లావావెసోల్వెం.
(౧౩—55)

(దేవేజ్యా, పందకజ్జములను బోధించు నీ ఉక్తినటుండనీ, దైత్యారి మార్గొగ్గి వచ్చియున్నాడుగదా. సురకుజమును సత్యకిచ్చి యున్నాడుగదా. మనతో పోరి గెల్వనున్నాడుగదా. నీవు నాకు బుద్ధి చెప్పుచున్నావు. నిలుపుము. యదుకుల కుటిలునడ్డుకొనుటకు నేను చాలనో ?

'దివిజ మహీజమం మనుజనొయ్దెడె, సైరిసె, పుట్టుగుం పరా
భవమదరింద మీమునిప నీసురరీ శచీదేవి యెందక
జ్జవె బగెవొత్కు దిన్నెమగె సామద భేదదుపప్రదాన దొం
దవసరముల్తు, దండ మెవలుద్యమ మింపెఱపింగి రంగిరా !
(౧౩—60)

(అంగిరా, దివిజ మహీజమును మనుజుడెత్తికొనిపోగా, సైరించినచో పుట్టువునకే పరాభవము. అందుచేత ఈ మునిపుడు, ఈ సురలు, ఈ శచీదేవి చెప్పిన కజ్జమే మదికెక్కుచున్నది ఇపుడు మనకు సామమునకు, భేదమునకు, ఉపప్రదానమునకు అవసరముకాదు. దండమేగదా ఉద్యమమైనది. నీవు వెనుకకు తగ్గుము )

తన ముఖ్యతరాస్త్రము నిర్వీర్యమైనను ఇంద్రుడు తన ఓటమినంగీకరింపక ఐరావతమును ముందునకు దూకించినాడు. ఇంద్రుని 'రణరసాడంబరము'ను రుద్రభట్టిట్లు కృష్ణునకు తీసిపోవని యట్లు వర్ణించినాడు.

నాయకుని సేవకుడైన గరుడుని వీరము అతని రంగప్రవేశమునందే వ్యక్తమగుచున్నది. కృష్ణునిచే స్మరింపబడిన గరుడుని రాకను రుద్రభ ట్టిట్లు చిత్రించినాడు.

"నిజపక్షానిలనిం తెరళ్దుళురె మేఘానీక వాకాశసిం
ధుజళం తుళ్కె రవీందుగళ్సెదరె పారావార దొళ్వీచికా
వ్రజముజ్జృంభిసె భూతళంనడుగె శైలశ్రేణీజీరేళె వి
శ్వజగత్ క్షోభకర స్వభావగతియిం బందం విహంగాధిపం."

(౧3—47)

(నిజపక్షానిలము వలన మేఘానీకము చెదరిపోవగా, ఆకాశ సింధు జలము తొలుకాడగా, రవీందులు చెదరగా, పారావారమందు వీచికా వ్రజము ఉజ్జృంభింపగా, భూతల మడగిపోగా, శైలశ్రేణి మిట్టిపడగా విశ్వజగత్ క్షోభకర స్వభావగతితో విహంగాధిపు డరుదెంచెను.)

వచ్చుచునే గరుడు డిట్లనును.

"తవె దిక్చుండాలమంతుత్తువ, దశదిశెయం సుత్తువ, ఆకాశమం ము
త్తువ, చంద్రాదిత్యరం మీంటువ, కడలనళుర్తింటు
వింద్రాద్యరం సీం
టువ, యక్షాధీశనం కట్టువ, జవనెర్దెయం మెట్టువీశంగె బూత
ట్టువ గుర్వం తోఱిదప్పెంబెనను బెససిదేను"....(౧3—38)

(దిక్చుండాలములను కబళింతునో, దశదిశలను ఒకటిగా చేయుదునో, భూమ్యాకాశములనేకము గావింతునో, చంద్రాదిత్యులను మీటి వేయుదునో, సముద్రములను పీల్చివేయుదునో, ఇంద్రాదులను పిసికి పిడుచ గావింతునో, యక్షాధీశుని కట్టివైతునో, యముని ఎదమెట్టుదునో, శివుని పరాభవింతునో, ఏమి గావింపుమందువో ఆజ్ఞాపింపుము.)

ఐరావత వర్ణన (౧3—62), దిక్పాలకుల యుద్ధ సంరంభము (౧3—63), దిక్పాలకుల వర్ణన (౧3—65—73) లలో కూడ వీరరసము నిండియున్నది.

శృంగారము :

వీరము తర్వాత చెప్పవలసిది శృంగారము. ఇది ప్రధానముగ సత్యాకృష్ణులాలంబనముగ పోషింపబడినది. అందునను ఈర్ష్యా విప్రలంబమే ప్రాధాన్యము వహించుచున్నది. (౧౩—76—110) కోపాగారగతయైన సత్యను రుద్రభట్టు వర్ణించినతీరు మనోహరముగ నున్నది.

"పరమక్రోధాది దేవార్చనమెనె పరిదొట్టుత్తె లీలాబ్జ పత్రో
త్కరమం చింతాలతా వృద్ధియనొడరిసలోరంతె నీర్వొయ్వపాంగిం
సురివుత్తం బాష్పధారాజల పరికరమం స్నేహశాస్త్రక్కె టీరం
బరెవుత్తిర్పందదిందుంగుటదె బరెవుతం భూమియం భామె యిర్దళ్
(౧౩—81)

(పరమ క్రోధాది దేవార్చనమో యన లీలాబ్జ పత్రోత్కరమును త్రెంపివేయుచు; చింతాలతా వృద్ధి నొనరింప నీరు పోయుచున్న దోయన బాష్పధారాజలపరికరమునుసురియ జేయుచు, స్నేహశాస్త్రమునకు టీక రచియించు చందమున భూమిని ఉంగుటముతో రాయుచు భామయుండెను.)

సత్యాప్రణయ కోపముకూడ కృష్ణునకు రాగోదయ కారణమే యైనదట.

'కోపోన్మీలిత దృష్టియి
నా పంకజపత్రనేత్రె మునిదీక్షిసుతి
ర్దాపాంగు పడెదుదెనసుం
శ్రీ పురుషోత్తమనొళతను రాగోదయమం' (౧౨—86)

(కోపోన్మీలిత దృష్టితో ఆ పంకజ నేత్రపత్ర కోపముతో వీక్షించుచున్నవిధము శ్రీ పురుషోత్తమునియందు అతను రాగోదయము నధికముగా కలిగించెను.)

'సమసందొల్మొగె ముం ప్రసన్నవతి యాగిర్దందినా రూపవి
భ్రమవా సాధ్వసభావవా రతి కలాచాతుర్యవా వాక్యవ

క్రమవా హాసవిలాస వన్నెగమదిం మాణ్డిర్కె కృష్ణంగదొం
దు ముదంబెత్తుదు సత్యభామెయ మహాక్షేపాక్షి విక్షేపమం'

(౧౨—87)

(పూర్వము ప్రేమతో దరికిజేరు ప్రసన్నవతియైన అనాటి ఆ రూప విభ్రమము, ఆ సాధ్వసభావము, ఆ రతికళాచాతుర్యము, ఆ వాక్యవక్రి మము, అహాస విలాసము ఆవేళ మానుటయు, సత్యభామయొక్క మహా క్షేపాక్షి విక్షేపణము కృష్ణునికది యొక ముదమును కలిగించెను)

సత్య కన్నీటిని కృష్ణుడు దోసిట గ్రహించి తన వక్షమునకు రుద్దు కొని సుఖానుభూతినందెనని రుద్రభట్టు చెప్పినది అత్యంత రమ్యమైన శృంగారభావన. (౧౨—94) (చూ. పుట. 40)

సంయోగ శృంగారమున కూడ రుద్రభట్టు తగుమాత్రముగ పోషిం చినాడు. పదునారువేలమంది గంధర్వకన్యలు 'తనరూప సౌందర్యమును గాంచి సాధ్వసవేగ పృథుస్వేద పులకితలగుటను తదీయ వదనవిభ్రమము వలన తెలిసికొని మదన మౌహూర్తికుడిడిన లగ్నమున' శ్రీకృష్ణుడు పెండ్లా డెనని (౧౨—53 వ) రుద్రభట్టు చెప్పినతీరు ముచ్చటగనున్నది. రుక్మిణి కృష్ణునితో అర్ధాసనాసీనురాలగుట ఆమె స్వాధీనపతికయని సూచించు చున్నది. సత్యాకృష్ణుల సంయోగ శృంగారమును తిమ్మనవలెనే రుద్ర భట్టుకూడ సభ్యతాయుతముగ వర్ణించినాడు. శచీంద్రుల శృంగారమును కూడ రుద్రభట్టు ఒకచోట హృద్యముగ చెప్పినాడు.

"ఇదనె తలె దొడవు మాడియె
పదపద్మక్కెరగిపళ్ శచీ వధువంతా
త్రిదశేంద్రన..' (౧౨—67)

(దీనిని తలతొడవు గావించుకొనియే (పారిజాతపుష్పమును) శచీ వధువు ఇంద్రుని తన పాతపద్మముల కెఱగునట్లు చేసికొనినది.)

ఈ సరస శృంగారభావమును వెల్లడించినవాడు నారదుడేయైనను, ఇది సభ్యతా పరిధిని మీరనిదగుటచే తిమ్మన నారదునిచే చెప్పించిన 'అలి నీలక...' పద్యమువలె అనౌచిత్య దోషమునకు గురియైనదికాదు.

స్త్రీ సౌందర్యవర్ణనలో కూడ రుద్రభట్టు ఔచితిని పాటించినాడు. గంధర్వకన్యలను వర్ణించుచు రోహణశైలగుహాగ్ర భాగమున వారు నిలచియుండగా ఆ పర్వతము పదునారువేల శశిబింబము లుదయించినసభమో యన్నట్లున్నదని (౧౨ — 53) సుకుమారముగ చెప్పినాడు. రుక్మిణీ సౌందర్య వర్ణన సందర్భమునను అంగాంగ వర్ణనలజోలికిపోక "ఆ విలాసము, ఆ విభ్రమము, ఆ భావము, ఆ విడంబము, ఆ సొగసు, మురారికి అనంగ భావమును, సపత్నులకు అసూయను కలిగించినవని (౧౨ — 66) సున్నితముగ చెప్పినాడు. సత్యభామా సౌందర్యమును రుద్రభట్టు వర్ణించినతీరు ఆమెను మన్మథుని అరవబాణము చేయుచున్నది.

> 'తుడువుద్వ్రిం కర్వువిల్లం పరపువ, కడెగణ్ణిం మనోజాస్త్రమం సా
> లిడువుద్యన్మేఖలా కూజితది నతనుకోదండటంకారమం క
> న్నడిపంఘ్రిన్యాసదిం తావరె గదరువ మందస్మితోద్యోతదిం దిం
> గడిలం బేఱొందనుత్పాదిసువ తెఱది నానందిదిం దేవి బందళ్'
> (౧3—3)

(వంకబొమతో చెరకుగడను ఎక్కిడి, కడకన్నునుండి మనోజాస్త్రమును సారించి, ఉద్యన్మేఖలాకూజితముచే అతను కోదండటంకారమును ప్రతిధ్వనించి, అంఘ్రిన్యాసముతో తామరలనుచల్లి, మందస్మితోద్యోతముతో వేరొక క్షీరసముద్రము నుత్పాదించు విధమున అనందముతో ఆ దేవి వచ్చినది.)

ప్రకృతి వర్ణనలో కూడ రుద్రభట్టు శృంగారమును మిళితము చేసినాడు. "సత్యాకృష్ణులకు మదనరాగ మతిశయించుచున్నది. వారు అనందముతో చంద్రికోత్సవము నెరపుకొని సుఖింతురుగాక' అని సూర్యుడు త్వరగ పగటిని ముగించి అస్తమించినాడట. (౧౨ — 34). మృగమదతిలకముతో శోభిల్లు సత్య ముఖచంద్రునకు సరిపోలునట్లు మృగధరుడైన చంద్రుడు ప్రకాశించినాడట. (౧౨—35)

ఇతర రసములనుకూడ రుద్రభట్టు ఈ కథాభాగమున యథావకాశముగ పోషించియున్నాడు.

హాస్యము :

శ్రీకృష్ణుడు సత్యాకోపగృహమును సవ్వడికాని అడుగులతో ప్రవేశించుట, చెలులకు సైగచేయుట, ఆమెకు వీవనతో విసరుట, ఆమెకోపముతో చూడగా ఆమెవెనుక నక్కి దాగినట్లు నటించుట హాస్యజనక సన్నివేశములు. సత్య దేవేంద్రుని కులగోత్రవైరి, బలదలనుడు మొదలగు శబ్దముల శ్లేష నాశ్రయించి పరిహసించుటలో హేళనతోకూడిన హాస్యము కలదు. కౌశిక శబ్ద శ్లేష నాశ్రయించి పరిహసించుట కొంతమేర మీరిన హేళన యనక తప్పదు. ఇంద్రుని వేయికన్నుల ప్రశంసను శచీదేవి గావించి నపుడు సత్య 'మా బావగారైన దేవేంద్రునకు వేయికన్నులు లభించిన దుస్థితి నాకును తెలియును లె'మ్మనుటలో సరసమైన హేళనతో కూడిన హాస్యమున్నది.

రౌద్రము :

శ్రీకృష్ణుడు దేవేంద్రునకు నారదముఖమున సందేశము పంపునప్పటి అతని మహోగ్రాకారము రౌద్రరసభరితముగ నున్నది.

'పర శౌర్యోత్కర్షమం మాళ్పణకదనుడి గళ్కర్ణమంతాగె కోప
స్ఫురిత భ్రూకోటియుం కంపిసువధరముత్ఫుల్ల నాసాగ్రముం ని
ర్ఝరఘర్మక్లిన్నగండ స్థళము మరుణ నేత్రాబ్జముం కణ్గుర్వా
గిరెదైతేయాంతకంసహృతిసమయ మహోగ్రాంతకాకారనాదం.'

(౧3—28)

(పరశౌర్యోత్కర్షమును హీనపరచు నుడులు కర్ణమును తాకగా, కోపస్ఫురిత భ్రూకోటియును, కంపించు అధరమును, ఉత్ఫుల్లనాసాగ్రమును, నిర్ఝర క్లిన్న గండస్థలమును, అరుణనేత్రాబ్జమును, కంటికి భయంకరముకాగా దైతేయాంతకుడు సంహృతి సమయ మహోగ్రాంతకాకారుడయ్యెను.)

ఇచట "వీరావేశదిం" అని రుద్రభట్టు చెప్పినను వర్ణన రౌద్రరస స్ఫోరకముగనే యున్నది. కనుకనే ఇచట వీరమునకు క్రోధము—రౌద్ర రసపు స్థాయిభావము—సంచారియైనదని లోగడ చెప్పికొనియున్నాము. (పుట. 246)

కృష్ణుడు సత్యకు దిక్పాలురను చూపి వర్ణించు పద్యములలో కూడ-ముఖ్యముగ యమ, నిర్యతి, రుద్రుల వర్ణన (౧3—67, 68, 72) రౌద్ర రసస్ఫోరకములుగా నున్నవి.

ఇంద్రుని వర్ణన ఇట్లున్నది.

"అసమక్రోధ కృశానుపర్చె, మనదిం పర్వాంగమంకూడె, భీ
దిసి పొఱ్మర్గుదు తచ్ఛిఖాశకల దుర్పింబంతె కెంపేఱిద
క్షిసహస్రం రుధిరోక్షితాక్షత సహస్రాకారదిం తన్నొళు
ర్విసె యుద్ధాపజయక్కె పక్కుగుదువం తిర్దం సహస్రాంబకం."
(౧3—61)

(అసమక్రోధ కృశానుడు హెచ్చగా, మనస్సునుండి సర్వాంగమును వ్యాపింపగా, భేదిల్లి వెలిగ్రక్కుచున్న తచ్ఛిఖా శకలముల ఉబ్బరమువలె కెంపెక్కిన అక్షిసహస్రము రుధిరోక్షితాక్షత సహస్రాకారముతో తనయందు భయము గొలుపుచుండగా సహస్రాంబకుడు యుద్ధాపజయమునకు ఆశ్రయమిచ్చువానివలె నుండెను.)

బీభత్సము :

యుద్ధరంగ వర్ణమున "వాహసమితి సంసక్త రక్త ప్రవాహయైపారె" (౧3—76వ) నను మొదలుగాగల వర్ణన బీభత్సమును సూచించుచున్నది

**భయానకము :**

ఇంద్రుడు వజ్రమును కృష్ణునిపై ప్రయోగింపబూను ఘట్టమున భయానకము కొలదిగాగలదు.

అద్భుతము :- కృష్ణుడు వజ్రమును పట్టివేయుట, గరుడుని రెక్కల గాడ్పునకు ఐరావతము ఎగిరిపోయి పారియాత్రముపైబడుట, ఇంద్రోపేంద్రులకు సఖ్యము కుదుర్చుటకై బిల్వోదకేశ్వరుడు దిగివచ్చుట అద్భుత రస సన్నివేశములు.

**శాంతము :**

నారదవర్ణన (౧౨—63), సత్యాప్రణయకోప ప్రశాంతి (౧౨-110), ఇత్యాదులు శాంతరసమునకు తావులుగానున్నవి.

కరుణము :- 'సంగ్రామ భంగాన్వితుడైన' ఇంద్రునియెడ కృష్ణుడు 'సకారుణ్యు' డయ్యెననుచోట 'కరుణ' నామమాత్రముగ కనుపించుచున్నది.

భక్తి :- అదితికృత శ్రీకృష్ణస్తోత్రము (౧౨—56, 57) భక్తిభావభరితముగానున్నది.

వాత్సల్య, ప్రేయోరసములను రుద్రభట్టు ఈ కథాభాగమున పోషింపలేదు. అదితికృష్ణునియెడ పుత్రభావమును చూపక కేవల భగవద్భావమునే ప్రదర్శించుటయు, కృష్ణుడు గరుడునియెడ సహచర భావమును చూపక కేవల సేవక దృష్టితోనే చూచుటయు వలన ఈ రసములను పోషించుటకు రుద్రభట్టునకు అవకాశము లేదయ్యెను.

**సారాంశము :**

మొత్తముమీద తిమ్మన రుద్రభట్టు లిరువురును చక్కగా రసపోషణ గావించినవారే. శృంగారవీరములు ప్రధానరసములుగా పరిపుష్టములైనవి. శృంగార రసపోషణలో తిమ్మనయు, వీరరసపోషణలో రుద్రభట్టును ప్రదర్శించిన నేర్పు సాటిలేనిది.

శృంగార రసపోషణలో రుద్రభట్టు తిమ్మన సమీపమునకైనరాలేదు. సత్యాప్రణయ కోపవచనములు, కృష్ణుని సాంత్వన వాక్యములు రుద్రభట్టు రచించినవి అలంకారికముగ పలికిన చిలుకపలుకులవలె నున్నవి. తిమ్మన పలికించినవి సహజ సుందరములుగానున్నవి. రుద్రభట్టు చిత్రించిన సత్యాకృష్ణులు కాగి చల్లారిన పాలవలెనున్నారు. తిమ్మన సృష్టించిన సత్యాకృష్ణులు రాగక్షీరము పొంగులువారు దశలోనున్నారు. కృష్ణుడు సత్యపాదములకు నమస్కరించుట, ఆమె యతని శిరమును తన్నుట, అతడామె పాదము నొచ్చునేమోయని బాధపడుట యను సన్నివేశపు కల్పనతో తిమ్మన సత్యాకృష్ణులను శృంగారరస సామ్రాజ్యమునకు సార్వకాలిక మకుటాధిపతులను గావించినాడు.

వీర రౌద్ర రసపోషణలో తిమ్మన రుద్రభట్టునకు చాలడు. శ్రీకృష్ణుడు సత్యకు పారిజాతమును వాగ్దానమును గావించు సందర్భమున ఇరువురుకవులు చెప్పిన పద్యములును దాదాపు సమమగు వీరరసస్ఫూర్తినే కలిగియున్నవి. కృష్ణుడు నారదముఖమున ఇంద్రునకు యుద్ధ సందేశ మును పంపించు సందర్భమున రుద్రభట్టు చెప్పిన పద్యములు వీరరౌద్ర రసోత్కటములుగా నున్నవి. కథాప్రణాళికయందలి విభిన్నత్వమువలన తిమ్మన ఈ సందేశమునే చెప్పలేదు. ఇంద్రుని వీరరౌద్ర రసావేశములు కూడ రుద్రభట్టు వ్యక్తము చేసినట్లుగ తిమ్మన చేయలేకపోయినాడు. గరుడుని రాకను, అతడు కృష్ణునితో నాడిన పలుకులను రుద్రభట్టు రజో వీరరసోద్ధతియుతములుగా రచింపగా తిమ్మన నిబ్బరమైన సాత్త్విక వీర రసయుతములుగా చెప్పినాడు. తిమ్మన చేసిన యుద్ధవర్ణన 'చెండ్లాట' వలె నున్నదిగాని యుద్ధమనిపించునట్లులేదు. రుద్రభట్టు చేసిన యుద్ధవర్ణన కూడ అంత తీవ్రముగ లేకున్నను తిమ్మన వర్ణనకంటె నిశ్చయముగా మెరుగే.

ఇట్లు శృంగార వీరరసపోషణలలో తిమ్మన రుద్రభట్టులు ఒకరొక రిని మించిపోయినను తిమ్మన కావ్యమునకు లభించినంతగ రసజ్ఞ పాఠక లోకపుటభిమానము రుద్రభట్టు కావ్యమునకు లభింపలేదు. దానికి కార ణము శృంగారరస విశిష్టత. వీరము శృంగారమంత మధురమైనదికాదు. శృంగారము రసరాట్టు. అది పరహృదయ ప్రహ్లాదనము. కనుకనె 'శృంగార ఏవ ఏకోరస' అనినట్లు 'వీర ఏవ ఏకోరసః' అని ఎవరును అనలేదు. మరియు 'శృంగార వీర శాంతములలో నేదైనను మహాకావ్యమున అంగిర సము కాదగు'నని లాక్షణికు లంగీకరించినను కవులు శృంగారమునే విశే షముగ నభిమానించుచు వచ్చిరి. తిమ్మన కావ్యమట్టి శృంగార రసము నకు పట్టము కట్టినదగుటచే వన్నెకెక్కినది. వీరరస ప్రధానమగు రుద్ర భట్టు కావ్యము వాసికెక్కలేకపోయినది.

హాస్యరసపోషణలో కూడ తిమ్మనదే పైచేయి. రుద్రభట్టు కూర్చిన హాస్య మత్యల్పము. అదియు ఎక్కువగ వాచ్యమై హేళనాగర్భితముగ నున్నది. తిమ్మన కూర్చిన హాస్యము కావ్యమందంతట వ్యాపించియుండు టేగాక సున్నితమును, సుకుమారమును నైయున్నది.

భక్తిరసపోషణలో ఇరువురును సమానులే.

వాత్సల్య ప్రేయోరసములను తిమ్మన హృద్యముగ పోషించినాడు. రుద్రభట్టు వానిని స్పృశింపనైనలేదు.

కరుణరస పోషణ ఇరువురును నామమాత్రముగనే చేసినారు.

భయానక, బీభత్స, అద్భుత, శాంతరసముల పోషణకూడ ఇరువు రును అంతంత మాత్రముగనే చేసిరనవలెను.

రసముననేక విధములుగ విభజించి, వానికి వేరువేరు పేర్లుపెట్టి పిలచుటయంతయు బౌద్ధికవ్యాపారము. హార్దికమైన అనుభూతికి రస మొక్కటే. [46] ఆ దృష్టితో చూచి చెప్పినచో పారిజాతాపహరణ జగన్నాథ విజయములు రెండును రసవత్కావ్యములే.

---

46. (ఏకోవైరసః-)

# అలంకారములు

ప్రతి కవియు తన కావ్య కన్యకను తన శక్తి కొలది అలంకారములతో భూషించుటకుత్సహించును. తిమ్మన కూర్చిన అలంకారములన్నియు ఆతని సొంతములే. మాతృకల నుండి ఆతడు గ్రహించిన అలంకారములు నాలుగే నాలుగు. వానినైనను అతడు యథాతథముగ వాడుకొనలేదు. వానికి తన మెరుగులు దిద్దియే అతడు తన కవితాకుమారికి తొడిగినాడు.

1. కోపావిష్టురాలైన సత్యను హరివంశమిట్లు వర్ణించినది:

'వహ్నేస్తదా శ్రీరివ వర్ధితేంధనా' ( ౬౫I-51)

తిమ్మన ఇంధన స్థానమున ఆజ్యమును చేర్చినాడు.

'. . . నేయి వోయ భగ్గన దరికొన్న భీషణహుతాశన కీలయనంగ' (పారి. I. 82)

2. సత్య కోపాగార ప్రవేశమును హరివంశమిట్లు వర్ణించినది :

'వివేశ తారేవ ఘనం సతోయమ్.' ( ౬౫- 52)

తిమ్మన తారకు మారుగా చంద్రరేఖను చెప్పినాడు.

'జలదాంత చంద్రరేఖా సదృశాంగియై పొరలె.' (పారి. ( I. 99)

3. సత్య కన్నీటిని హరివంశమిట్లు వర్ణించినది :

'కుశేశయ పలాశాభ్యామవశ్యాయం జలం యథా.' ( ౬౬ 24)

తిమ్మన కుశేశయ పలాశములకు మారుగ లవలీ దళమును చెప్పినాడు. మూలము నందలి పద్మపత్రములు సత్యనేత్రములకు ఉపమానములు, కాగా అనువాదము నందలి లవలీదళమామె చెక్కిలికి ఉపమానము. ఇక అశ్రుబిందువులు మంచునీటికి మారుగ మరందబిందువులతో పోల్చబడినవి.

'బాష్పంబుల్, పలుచని చెక్కుల లవలీ
దళపతిత మరంద బిందుతతిఁ బురుడింపన్' (పారి. I. 111)

4. కోపతాపము వలన కాంతి తరిగిన సత్యను హరివంశమిట్లు వర్ణించినది.

'మధ్యాహ్నే పంకజస్య చ' ( ౬౬ - 28) తిమ్మన పంకజమునకు మారుగ తీగను చెప్పినాడు.

'మధ్యందిన భానుమండల కరావళి హోవళి వాడియున్న తీ

గం దలపించునమ్మగువ. . . . ' (పారి. I.108)

ఇవి గాక మిగిలిన అలంకారములన్నియు తిమ్మన సొంత కల్పనలే.

తిమ్మనకు అర్థాలంకారములందున్న మక్కువ శబ్దాలంకారములపై లేదు. ఐనను స్వయం సంప్రాప్తములైన అనేక శబ్దాలంకారములాతని రచనలో చోటు చేసికొనినవి.

వృత్త్యనుప్రాస :

'కలకలములఁ గలకలనగు

పలుకుల మెలపొలయ విన్నపము గావించెన్' (II. 5)

ఇందలి 'క''ల'ల పునరుక్తి వలన శౌరిని జలకమునకు పిలిచిన కులుకులాడి కలికి పలుకులందలి కలకలలు శ్రావ్యములగుచున్నవి.

. . .'మఱియు నొకచోట సురపతి తఱచు మెఱుఁగు లడరు కఱకు భిదురముఁ గొని తఱిమి యెఱకలు విఱుగ నఱికిన యెడల పెలలకు నిడిన జలగల పొలుపునం జఱుల నెరగొని పారలు జరదజగర నికరంబులును. . .' (II. 88)

ఇందలి లఘ్వలఘురేఫముల పునరుక్తి వలన చిలువలు జరజర పరుగు లిడుచున్నట్లే భాసించుచున్నది.

మగమీల నగఁజాలు తెగఁగీలు కొనువాలు. . . .

వలిజక్కు వలపెక్కు వలుతక్కు వగ నిక్కు. . . .

ఎలతుమ్మె దలదిమ్మె వెలిఁజిమ్ము చెలువమ్ము. . .

అలచెందొ వలవిందు చెలువెందు వెదచిందు. . . .( II. 56)

ఈ సీసపద్యపు పాదముల పూర్వార్ధములందలి గణములన్నియు (ఒకటి

రెండు తప్ప) ప్రాసమైత్రియు, అంత్యాను ప్రాసమైత్రియు కలిగియున్న 'సల'గణములే. ఇట్టి పద్యమాంధ్ర వాఙ్మయమునవే మరియొకటి లేదు.

ఇంకను ( I. 30, II. 120, III. 38, 41. 52, V. 105 లలో మెత్తని వృత్త్యనుప్రాసలు కలవు.

**యమకము :**

'అలరుంబోఁడుల లోపల
వలరుం బోడుములు నీకు వగ్గలమగుచున్
దలపూ వాడక యుండుము
దలపూవు ధరించి వికచ తామరసాక్షీ.' (I. 64)

'ముగ్ధరమణీ రమణీయ విలాస రేఖలన్' (III. 50)

తిమ్మన యమకములలో రామరాజ భూషణునకును, చేమకూర వానికిని గురుత్వము వహించినాడనవచ్చును. మరికొన్ని ముచ్చటైన యమకములు (V.17,7,103)

**అంత్యానుప్రాస :**

1. ముక్తరోమంథ నిష్పంద గోబృందమున్
   వ్యక్తగోవర్ధన గ్రావ నిష్యందమున్
2. మంద మందాంశుమన్నందనావేగమున్
   కందళన్నీరసారణ్య జీర్ణాగమున్. . .
3. ఘోర భౌమాసుర గ్రామణీ శిక్షకా
   కౌరవాకర్షిత ద్రౌపదీ రక్షకా
4. భేద సందర్గ సాందీపసూను ప్రదా, వేదశాఖా శిఖాంచత్ప్రవాళత్పదా
5. మాధవా, సత్యభామాధవా (II. 38)

అంత్యానుప్రాసయుక్తములైన పై నాల్గుజతల సమాసములు వాల్గేసి

రగణములతో కూడినవగుట చే సమాన ధైర్ఘ్యము కలిగినవి, ప్రాసమైత్రి కలిగినవి కూడనగుట వలనవాని సౌందర్యమిమ్మడియైనది. ఈ అంత్యానుప్రాసలు పోతనామాత్యుని తలపింపచేయునట్లున్నవి.

ఇంకను II. 85, IV. 49, V. 8 లలో అందమగు అంత్యానుప్రాసలు కలవు.

'ఆద్యమప్రాప'[1]

'వాసవ, వహ్ని, వైవస్వత, వాసతేయీచరణ, వాయు, వసువల్లభ, వామదేవుల వరుస వీడ్కొల్పి. . . ' (III. 41)

'మరుదధిప, మలినపథ, మహిషరథ, మాంసాశన, మకరేశ, మాతరిశ్వ, మనుష్యధర్మ, మాహేశ్వరులకు మానవుండీడగునే (IV. 67)

ఇచట తిమ్మన శ్రీనాథుని అడుగుజాడల ననుసరించుచునే అతనిని మించి సంచరించినాడు.[2]

గుణితక్రమము :

శరధిక్రోడనివేశ, శార్ఙ్గధర, శిష్టధ్యేయ శీతాంశుభా
స్కరనేత్రద్వయ, శుభ్రపంకరుహ భాస్వన్నాభ, శూరావ్యయా
భరణా, శేషశయాన, శైలధర, శోభారమ్య పర్యాంగ, శౌ
ర్యరసోదంచిత, శంఖచక్రధర,శర్వాణీసహాయ ప్రియా ( II. 57)[3]

ద్విప్రాసము :

వనితా జనతా స్మరునకు
ఘనతాపని తారకాధిక ద్యుచరగవీ
ఘనతాయన కారక స
త్వనితాత్మనితాంత దాన పరతంత్రునకున్ (I. 32)

ద్వ్యక్షరి[4] :

మనమున ననుమానము నా

వను నీనామయేను మనుమననముమ నేను
మ్మున మాన నన్ను మన్నన
మనుమను నానాముసీన మానానూనా (V. 97)

## ప్రాసయతి :

ఉపజాతిఛందస్సులలో యతికి మారుగా తిమ్మన విస్తారముగ ప్రాసయతినుపయోగించినాడు. ప్రాసయతి సాధారణయతికంటె స్ఫుటముగ ధ్వనింపబడుటచే శ్రావ్యతను చేకూర్చుచున్నది. కనుక దీనిని శబ్దాలంకారముగ పరిగణింపవచ్చును.

కాంతిఁ జెన్నారి వికసిత స్వాంత యగుచు
గలఁక యెంతయు దిగఁద్రోచి చెలువమెసఁగఁ
జేర వచ్చిన ప్రియభామ గారవించి
యున్న యత్తఱి మురవైరి సన్నిధికిని (II. 15)

ఈ పైయెత్తు గీతమందు నాలుగు పాదములలోను సాధారణయతికి మారుగా ప్రయోగింపబడిన ప్రాసయతి వలన లభించిన శ్రావ్యత గమ నింపదగినది. ఉపజాతికి చెందిన పద్యములలో సాధారణముగ ప్రతి పద్యము నందును ఒకటో రెండో పాదములలో తిమ్మన ప్రాసయతిని ప్రయోగించును. ఆ పాదముల స్థానములందలి వైవిధ్యము వలన చిత్ర విచిత్రములైన లయ విన్యాసములను సాధించును. పారిజాతాపహరణము మొత్తము మీదగల 48 సీస పద్యములు, 41 గీతపద్యములకుగల 740 యతి స్థానములలో 200కు పైగా తిమ్మన ప్రాసయతులను ప్రయోగించినాడు. ఇది తిమ్మన కవిత్వమున కొక విశిష్టతను చేకూర్చుచున్న దనవచ్చును.

తిమ్మన అర్థాలంకార ప్రియుడు. అతని రచనలో సాధారణముగ ఏదోయొక అర్థాలంకారము లేని పద్యముండదనుట అతిశయోక్తి కాదు. సాధారణముగా ప్రతి పద్యమునందును రెండో మూడో అర్థాలంకారములుండును. అవి సంసృష్టి సంశ్లిష్ట సంకరములై పరస్పర శోభావర్ధకములగుచుండును. ఇపుడు తిమ్మన సృష్టించిన కొన్ని అర్థాలంకారయుక్త భావముల స్వారస్యమును దిఙ్మాత్రముగ పరిశీలింతము.

## ఉత్ప్రేక్ష :

'ఉత్ప్రేక్షా దాక్షిణాత్యేషు'[5] అనునుడి కనుగుణముగ తిమ్మనకు అత్యంతాభిమాన పాత్రమైన అలంకారము ఉత్ప్రేక్ష.

శ్రీమదికిం బ్రియం బెసఁగ, జేర్చిన యుయ్యెల లీల వైజయం
తీమిళితాచ్ఛ కౌస్తుభము నిద్దపుఁ గాంతిఁ దనర్చి యాత్మవ
క్షోమణివేదిఁ బొల్పెసఁగఁ జూడ్కుల పండువు సేయు వేంకట
స్వామి కృతార్థుఁ జేయు వరసక్షితినాథుని కృష్ణరాయనిన్ (I.-1)

ఈ తొట్టతొలి పద్యమునందే ఒకరమ్యమైన స్వరూపోత్ప్రేక్ష దర్శనీయమగుచున్నది. విష్ణువక్షోవాసినియగు శ్రీదేవికి కౌస్తుభరత్నము ఊయెలపలకయో యన ఆసనయోగ్యముగ నుండుటయు, నిడుపుగ వ్రేలాడు వైజయంతీమాలయొక్క రెండు చేరులును కౌస్తుభమున కిరుప్రక్కలందు ఊయల చేరులో యనునట్లుండుటయు, అట్టి యూయెలపై నాసీనయై శ్రీదేవి ఊగుచుండుటయు ఈ చక్కని స్వరూపోత్ప్రేక్ష రూపుకట్టించి సహృదయుని మనోనేత్రమునకు పర్వమొనరించుచున్నది. లక్ష్మీ నారాయణుల విలాసము వలన వ్యంజితమైన శృంగార రసధ్వనియు, 'శ్రీమది కింబ్రియంబెసఁగ' అనుటలో వ్యంజితమైన పత్యాతిరుమల దేవుల మనోరంజనమను కావ్యేతివృత్త ప్రయోజన ధ్వనులును ఈ ఉత్ప్రేక్షాసౌందర్యమును ఇమ్మడి చేయుచున్నవి. ఇట్టి శుభారంభముగల కావ్యములో పాఠకునకు విందుల మీద విందులవంటి రసవంతములగు అర్థాలంకారములు కొల్లలుగ లభింపగలవనుటకీ ఉత్ప్రేక్ష-యొక శుభసూచనగనున్నది.

పారిజాత ప్రసవ ధారణమువలన రుక్మిణి 'సానఁ బట్టిన మకరాంకు శస్త్రమనఁ గ తేజరిల్లినదట (II.- 8). రుక్మిణి అదివరకే మకరాంకుని శస్త్రము. ఇప్పుడా శస్త్రము సానబెట్టినట్లయినది. ఇక నది కృష్ణుని హృదయములోని కెట్లు దూసికొనిపోవునో ఊహింపదగియున్నది. ఇదియొక పసందైన ఫలోత్ప్రేక్ష.

కృష్ణుడు పెల్లగించుటకై సమీపించుచున్న పారిజాత తరుచక్రవర్తి వాతవిధూత శాఖయై చలించుట చూడగా భగవంతుడైన శ్రీకృష్ణుడు తనను గొనిపోనున్నాడని ఆనందముతో నర్తించుచున్నదో యన్నట్లున్నదట (IV.- 51) ఈ రమణీయ

హేతూత్ప్రేక్షకు భావుకుని హృదయమే ఆనందముతో నర్తించును.

ఉత్ప్రేక్షా కుసుమ మాలికలుగ సీసములను రచించుట తిమ్మనకొక ముచ్చట. II.- 15, 19, 34, 37, 39, 59, IV.77 ఇట్టి ఉత్ప్రేక్షా మాలికలగు సీసములు. పరశ్శతముగ తిమ్మన కల్పించిన ఉత్ప్రేక్షలలో కొన్నింటిని I.- 44, 82, 113, II.- 40, 64, III.- 47, 48, IV.- 40, 53, IV.- 28 లలో చూడగలము.

## రూపకము :

ఉత్ప్రేక్ష- తరువాత తిమ్మనకు అభిమానపాత్రమైనది రూపకాలంకారము.

కడక వ్రేచలిగట్టుపట్టిఁ దను వేద్కం గూర్ప నేతెంచి పై

జడిగాఁ జుక్కల తూపు లేయఁ గినుకన్జాబిల్లి ముక్కంటి దాఁ

బొడుపుంగెంపను వేఁడికంట విరులమ్మావిల్తుమేనేర్చి చా

ప్పడఁ దద్భూతి యలందెనా నపుడు బింబంబొప్పెఁ బాండుద్యుతిన్ (II.- 45)

ఇందలి ఉత్ప్రేక్ష కాధారభూతమైన పరంపరితరూపకము నందలి ప్రత్యంగ సౌష్ఠవము ఎంతటి భావనా బలముతో కూడినదోగదా.

కలకంఠ విటుడు చూతలతాలలన యొక్క తలిరాకువాతెఱను కొరుకగా ఆమె అలికంకణముతో మ్రోగెడు విటపహస్తముతో విదల్చినదట. (III.- 56) ఈ సావయవ రూపకమునందలి లలిత శృంగారము చర్వణైక మధురము.

I-24, IV-49,V.- 105 సీసములు రూపక మాలలుగా కూర్చబడినవి. లెక్కకు మిక్కిలిగాగల చక్కని రూపకములలో కొన్ని I.-17,19,24,137, ( ౬౬ II.46, 47, III.- 31, 35, IV.- 30, 31, V.- 11, 12లలో కలవు.

## ఉపమ :

తిమ్మన సృష్టించు ఉపములు కాళిదాసుని ఉపమలకు తోబుట్టువులు, వర్ణ్యవస్తు స్వరూప, స్వభావ చరిత్రలకు ఈ ఉపమలు సూత్ర ప్రాయమైన వ్యాఖ్య లనవచ్చును.

రుక్మిణీ మందిర వార్తను చెలికత్తె వలన వినిన సత్య 'వ్రేటు వడ్డ

యురగాంగనయుం బలె' నైనదట (I.- 82) సత్య తీవ్ర రోష స్వభావమును, ఏతద్వృత్తాంత శ్రవణము వలన ఆమె అభిజాత్యమునకు కలిగిన అఘాతమును, ఆమె సన్నని మైదీగ స్వరూపమును, తన్నెగనిగ్యమును - ఇన్నింటిని ఈ ఉపమ అతి సూక్ష్మముగ వ్యక్తీకరింప జాలియున్నది.

భోజనశాలకరుగు నారదుడును, అతని ననుసరించు సత్యా కృష్ణులును చంద్రుని వలెను, మెరపుతీగెయు మేఘము వలెను నుండిరట. (II.-17). ధవళ స్నిగ్ధ కాంతి మూర్తియగు నారదుని, విద్యున్నిభజ్వలత్ప్రకాశ తనుతరగాత్రయైన సత్యను, సజల జలదశ్యాముడైన కృష్ణుని మూర్తులను ఈ ఉపమ కన్నులకు కట్టినట్లు చేయుచున్నది.

మరికొన్ని మనోహరములైన ఉపములు I.- 99, III.- 85, 97, IV.- 3, 32, V.- 15, 31 లలో చూడగలము.

## ఉల్లేఖము :

వర్ణ్య వస్తువును నానా ముఖముల నుండి పరిశీలించి అనేక విధముల వర్ణించినగాని తిమ్మనకు తృప్తిలేదు. కనుకనే ఉల్లేఖాలంకార మాతనికి అభిమానపాత్రమైనది.

'వలిమల యల్లుహాఁడు తలవాఁక ధరించిన పూవు గుత్తి, వే
ల్పులగమి జీవగట్టు, యుడివోవని చల్వల టెంకి, వెన్నెల
ల్మొలచినపాదు, పాల్కడలిముద్దులపట్టి, నృసింహ కృష్ణరా
యల కరుణారసంబు నినుపారెడి చూపులఁ జూచుఁగావుతన్ (ఐ.6)

ఐదు విధములగ వర్ణింపబడిన చంద్రుని జన్మప్రభృతి చరిత్ర నంతటిని సంగ్రహముగ చెప్పుటేగాక అతని సన్మాన్య, సౌశీల్య, సౌమనస్య, సౌజన్య, సౌకుమార్యములను కూడ పై పద్యము వ్యక్తీకరింపజాలియుండుటచే నిది చంద్రుని సమగ్ర వర్ణనమైనది.

I.- 41, లో చంద్రుని, IV.- 49లో సూర్యుని, I.- 24లో కృష్ణరాయల ఖడ్గమును, II.- 15లో సత్యను ఇట్లు బహుదృక్కోణముల నుండిచేసిన పరిశీలనాత్మక వర్ణనలు కలవు. I.- 60, II.- 34, 37, 39, IV.- 37లలో కూడ సుందరములైన ఉల్లేఖములున్నవి.

## అర్థాంతరన్యాస :

అర్థాంతరన్యాసములను ప్రయోగించుటలో కూడ తిమ్మన కాళిదాసుని తలపించును. ఆతని అర్థాంతరన్యాసములు లోకమును కాచివడబోసి తేర్చిన విజ్ఞానానుభవమంతయు ముద్దకట్టినట్లుండును. లోకోక్తులుగా వాడుకొన దగినవి తిమ్మన అర్థాంతరన్యాసములు. ఆయా కథా సందర్భములను అర్థాంతర న్యాసములతో సమర్థించుటలో తిమ్మనకు గల నేర్పు నిరుపమానమైనది.

'పేరలుకం జెందినయట్టి కాంతలుచితవ్యాపారముల్ నేర్తురే' (I.- 121) అను తిమ్మన సమర్థనమును వినిన పిమ్మట ప్రణయకుపితయైన సత్య శ్రీకృష్ణుని పాదతాడనము గావించుట అనుచితమని ఎవరనగలరు?

'ఎఱుంగునే పనుల కాపరి భావజకర్మ మర్మముల్' (I.- 125) కృష్ణుని ఎడ్డె తనమును పూర్వ పక్షమునకవకాశము లేకుండ నిరూపించిన మాటకారి మగువగ సత్యను సృష్టించిన తిమ్మన లేఖిని ఎంతనికొనియాడగలము.

'ధూర్తలంగనల్' (I.- 20), 'రాజవల్లభలసూర్యంపశ్య లౌదుర్గదా' (II.- 69) సహవాసుల దుఃఖము నెయ్యురోర్తురే' (I.- 33), 'చాల గాంభీర్యశాలురు సంక్షోభము వొందువారి నెచటన్ లోగొంచు వర్తింపరే' (IV.- 29), 'వల్లభలు ప్రాణవిభుం బెడఁ బాయ నేర్తురే (IV.- 54) ఇట్టివి తిమ్మనార్యుని అర్థాంతరన్యాసలు.

## శ్లేష :

శ్లేషనుపయోగించుటలో తిమ్మనకు గల ప్రతిభ సాటిలేనిది. సభంగ, అభంగశ్లేషలను నిర్వహించుటలో అతడు సూరనకును, రామరాజ భూషణునకును ఆచార్యుడనదగియున్నాడు. సూర్యోదయమును వర్ణించు ఈ సీసము తిమ్మన శ్లేష నైపుణికెత్తిన పతాకమో యనునట్లున్నది.

యామినీ సమయంబు నాశాతటప్రదే
    శంబుఁ బ్రసన్న భావంబు నొందెఁ
బ్రియచుంబితాంగనా బింబాధరంబులు
    నుడురాజు నవపరాగయుక్తిఁ దోఁచె

నఖిల వస్తువులుఁ బ్రాగచల కూటవిటంక

తలములు నతిరోహితంబులయ్యె

నుత్తుంగ పురగోపురోపరిస్థలులు సా

రసములు నాత్త సౌరభములయ్యెఁ

దరుణగోతర్ణకంబులు సురపథాంత

రంబులును విచ్యుతప్రగ్రహంబులయ్యె

నియమపరతంత్ర భూదేవచయముఁ గౌశి

కవ్రజంబు సమాధియోగమునఁ బరఁగె (II.- 68)

శ్లేష బలముతో శ్రీకృష్ణ, శ్రీ కృష్ణ, దేవరాయచరిత్రలకు సౌమ్యము చెప్పు I.- 19, రుద్రులయొక్కయు కుబేరుని యొక్కయు ఓటమిని వర్ణించు V.- 11, 'ఓహో' యనిపించు శ్లేషలు, తిమ్మన ప్రయోగించు ఎన్నో అలంకారములు శ్లేషానుప్రాణితములై యుండును, వానిలో కొన్ని I.-9, II.- 30, 43, 47, 62, 66, 69, 88, III.- 6,V.- 11, 12.

'తామసము', 'ఉగ్రుడు,' 'పౌరుషము', 'రాజు', 'నరుడు,' అను పదములకుగల అర్థభేదముల వలన తుళువ ఈశ్వర నాయకునకు ఈశ్వరుడు సాటిరాడని (I.- 9) వ్యతిరేకాంకారమును శ్లేషోత్థాపితము చేసి తిమ్మన చమత్కరించినాడు. (౬౬ I.- 28)

ఇంకను తిమ్మన సృష్టించిన అలంకారముల పట్టిక ఇట్లున్నది.

అనన్వయము - V.- 29

అనుగుణము - I.- 18

అపహ్నవము - I- 20 II.- 36, 69

అసంగతము - I-16, III.- 18

ఉదాత్తము - I-71, II-53, 86, 88,V.-70

ఏకావళి - III.- 21

సముచ్చయము - I101, II 9, III 19.

సామాన్యము - I V 6, 32

సూక్ష్మము - I83.

స్మరణము - I-20,108, III 28, 50.

శృంగగ్రాహికగా పేర్కొనబడిన పై అలంకారముల వలన తిమ్మనకుగల అలంకారప్రీతి వెల్లడికాగలదు. ఆలంకారికశైలి ప్రబంధ లక్షణములలో నొకటిగదా.

## రుద్రభట్టు అలంకారములు

రుద్రభట్టు తిమ్మన వాడినంత ప్రచురముగా అలంకారములు వాడడు. అట్లని ఆతడు అలంకారప్రియుడు కాకనుపోలేదు. అతనికి అర్థాలంకారముల పైకంటె శబ్దాలంకారములపై మక్కువ ఎక్కువనిపించును.

వృత్త్యనుప్రాస : 'మహోక్షేపాక్షి విక్షేపమం' (XII-87) ఆనందదిం దేవి బందళ్ (XIII-3) అక్షి సహస్రం రుధిరోక్షితాక్షర సహస్రాకార (XIII-63), 'పదార్థ సార్థంగళం' (XII-52, వ), 'పదార్థవర్ధి సార్థావధి' (XII-61), ఇట్లు రుద్రభట్టు ప్రయోగించు వృత్త్యనుప్రాసలు తరచు పునరుక్తము లగుచుండును. 'పంకరుహాక్ష నంకమంసోంకి తత్పర్యంకదొళ్' (XIII-4వ) 'పారిజాత మహీజాతమ నగజాతె కండు' (XIII-20వ) మొదలగు వృత్త్యనుప్రాసలు సుందరముగనే యున్నవి. కాని ఇట్టివి కొలదిగనే కానవచ్చుచున్నవి. 'అన్నెగం పన్నగారి వాహనం' (XIII-48వ.) 'బరలంజి కంజనాభం' (XII-80వ), 'పంకరుహనాభం కింకరభావది.' (XII-83వ), 'సత్యభామె నికామ ప్రణయకుపితె యాగి' (XIII-5), 'ఎందు మునీంద్ర వృందారకం నుడియలు' (XIII-17) ఇట్లు ఏక పర్యాయమాత్ర పునరావృత్తములైనవే ఎక్కవగనున్నవి. ఇవియు వచన భాగములందే అధికముగా కానవచ్చుచున్నవి. మొత్తము మీద వృత్త్యను ప్రాసముపై రుద్రభట్టునకు ప్రీతి వ్యక్తమైనంతగ చమత్కృతి వ్యక్తమగుట లేదు.

ఇంకను XII-62, 65, XIII-50, 60 మొదలగు పద్యములలో వృత్త్యనుప్రాసలు కలవు.

**యమకము :**

'బళివిధ్వంసిగె కొట్టవాహవరస ప్రస్యందన స్యందనం

గళ సంగచ్ఛవిసత్త్వ రూపశుభ చేష్టావాహ వాహంగళం

జళద శ్యామ సదానగండ రదనిర్భిన్నాగ నాగంగళం

విళసద్రత్నగణ ప్రభాపరికర వ్యాకోశ కోశంగళం (XII-52)

'రోహణశైలం బెర సారోహణమం మాడి' (XII-54)

'వాసవం నిజ జననీ గర్భావాసవం పుగువంతె సుగియెయుం, జాతవేద సపజయ జాతవేదననాగి. . . కీనాశం త్రిలోకీనాశ మిదక్కుం. . . ప్రచేతం నిరతిశయాకంప్రచేతనాగి. . . ' (XIII-76వ.)మొదలగు యమకములు సుందరముగనే యున్నవి. కాని రుద్రభట్టు తరచు యమక వ్యామోహమున పదములను పునరుక్తిగావించు చుండును.

'వైహాయసగతి చతురం

వైహాయస పథది నైదిదం' (XII-5)

'నతనాగుత్తిరలెందళ్

నతనాగదిరు. . . ' (XII-55)

'సొబగీ యలరం ముడిదరె

సొబగేకచ్ఛత్ర మాయ్తు. . . ' (XII-71)

ఇట్టి యమకాభాసములు చమత్కృతి జనకములుగా లేవు. XII-83వ, (XII-28, 29, 57లలో రుద్రభట్టు రమ్యములైన యమకములను కూర్చినాడు.

**అంత్యానుప్రాస :**

'అపూర్వాకారదం వారదం' (XII-64), అను నొక్క అంత్యానుప్రాస మాత్రము నిజముగా రమ్యముగా నున్నది. అంత్యానుప్రాస వ్యామోహముతో రుద్రభట్టు తరచు విభక్త్యంత పదములను గుప్పించుచుండును. పైన యమకమునకు ఉదాహరణగానీ

యబడిన 'బళివిధ్వంసిగె. . . .' అన్న పద్యమంతయు 'గళం'అను ద్వితీయాబహువచన ప్రత్యయాంత పదములతోనే కూర్చబడినది. అట్లే 'గళిం' అను పంచమీ బహువచన ప్రత్యయాంత పదములతో (XII-58, 'దిం' అను పంచమ్యేక వచన ప్రత్యయాంత పదములతో XIII-25, 47 పద్యములు నింపబడినవి. వీనిలో రామణీయకత పూజ్యమనునది ప్రత్యేకించి చెప్పనక్కరలేదుగదా.

### ముక్తపదగ్రస్తము :

'ముక్తపదగ్రస్త చక్ర వాళగద్య' అను పేర రుద్రభట్టు అదితిచేతనొక దీర్ఘమైన శ్రీకృష్ణస్తుతి చేయించినాడు. అది 'జయసకళకళంక విగత ప్రభావ, భావైక రమ్యమాన, మానసాది ప్రవర్తనాధార, ధారణాది యోగ మార్గ ప్రత్యక్ష, అక్షయాకార. . .' ఇట్లే చిన్నవి పెద్దవి చేరి 50 సమాసముల వరకు సాగినది. (XII-57వ.) ఈ సమాసములు కూర్చబడిన క్రమమునకు ముక్త పదగ్రస్త సంబంధ మొక్కటి తప్ప భావగత సంబంధమేమియు లేదు. రుద్రభట్టు ఎంతకును ముక్త పదగ్రహణము కొరకేపాటు పడినాడుగాని, అర్థ స్వారస్యముపై దృష్టి మంచినవాడు కాడు. కనుకనే ఈ గద్యలో దశావతారములను క్రమరహితముగా పరశురామ, వామన, నరసింహ, మత్స్య, వరాహ, రామ, బుద్ధ, కృష్ణావతారములను వరుసలో చెప్పినాడు. ముక్త పదగ్రహణమునకు అనువుగాకనో, లేక క్రమరాహిత్యము వలన కలిగిన మరపువలనో కూర్మావతారమును చెప్పక విడచినాడు. అట్లే శ్రీకృష్ణావతార చర్యలను క్రమరహితముగా కాళియమర్దన, గోవర్ధనోద్ధరణ, కువలయాపీడవధ, పూతనావధ, చాణూర ముష్టిక సంహార, కేశిధేనుక సంహార, కంసవధ, రాసక్రీడల వరుసలో చెప్పినాడు[6]. అర్థ స్వారస్య దృష్టిలేని శబ్దాలంకార వ్యామోహము రుద్రభట్టు నిట్లు హాస్యాస్పదుని గావించినది.

### ఉత్ప్రేక్ష :

రుద్రభట్టువాడిన అర్థాలంకారములు చాల తక్కువ. వాడినంతలో ఉత్ప్రేక్షలను కొంత అధికసంఖ్యలో వాడినాడు. 'ఉత్ప్రేక్షా దాక్షిణాత్యేషు' అను సూక్తి ఇతనికినివర్తించుమనన్నమాట.

శ్రీకృష్ణుని దర్శించుటకై గుహలో నుండి బయటకు తొంగిచూచుచున్న 16000 మంది గంధర్వ కన్యల ముఖచంద్ర బింబముల వలన వారు గుహలో బంధింపబడియున్న మణిశైలము 'షోడశ సహస్రశశులుదయించిన నభమో' యన్నట్లు

న్నదట[7]. ఇది చక్కని స్వరూపోత్ప్రేక్ష.

సత్యాకృష్ణులు చంద్రికోత్సవము గావించుకొను అవకాశమొసంగుటకు సూర్యుడస్తమించి నాడట. మరల సురరక్షకుడైన శ్రీకృష్ణుడు సురలతో పోరాడు వింతను దర్శించు వేడుకతో ఉదయించినాడు[8]. ఇవి ముచ్చటయైన హేతూత్ప్రేక్షలు.

కృష్ణుని గదాయుధము అసురులపాలిటి యమ దండమో యన భయంకరముగానున్నదట[9]. ఇదయొక సార్థకమగు ఫలోత్ప్రేక్ష.

రుద్రభట్టు కూర్చిన అందమైన ఉత్ప్రేక్షలలో కొన్ని XII- 79,81,XII-3, 35, 42, 43, 50, 109, 110 లలో కలవు.

## ఉపమ :

రుద్రభట్టు ఉపమలను కొలదిగనే వాడినాడు.

యుద్ధసన్నద్ధుడైన రుద్రుని తృతీయనయనార్చి అతని కిరీట భుజంగ భోగరత్నప్రకరార్చివలెను. నిటలత్రిపతాక కరత్రిశూల హేతి ప్రతిబింబము వలెను. తనుదీధితి రౌద్రరసాంబు రాశి ఫేన ప్రభవలెను మన్నదని[10] రుద్రభట్టు చేసిన వర్ణన రుద్రుని రౌద్రరసమూర్తిని కనులకు కట్టినట్లు చేయజాలియున్నది.

శిలీముఖములు (తుమ్మెదలు) పుష్పించిన నవకర్ణికార తరువును చుట్టుకొనినట్లు ఇంద్రునిచే ప్రయుక్తములైన శిలీముఖములు (బాణములు) పీతాంబరధారియైన కృష్ణుని చుట్టివేసిన వనుట[11] రుద్రభట్టు కల్పించిన మరియొక చక్కని ఉపమ.

XII.- 76, 96, 105, 106 లలో కొన్ని మనోహరమైన ఉపమలు కలవు.

## రూపకము :

రుద్రభట్టు వాడిన రూపకములు కూడ కొలదియే.

ఆనక వీచిరవము, ధ్వజమీనము, శేషాక్షతాంబు కణములతో ప్రకాశించెడు గరుడుడను మైనాకుడు భూమియనెడు సముద్రము నుండి ఆకసము వంకకు ఎగిరినాడను సావయవ రూపకము[12] రుద్రభట్టు కల్పనాప్రతిభకొక చక్కని మచ్చుతునక.

'వీరశ్రీమయూరాంగన' (XII.- 51), 'చింతాలత' (XII.- 81), 'వీరరసాబ్ధి' (XII.- 57) మొదలగు రమ్యములైన రూపకములు మరికొన్ని (XII.- 92, XII.- 61, 69 లలో చూడగలము.

<u>అర్థాంతరన్యాస :</u>

ఈ కథా భాగములో రుద్రభట్టు రెండే రెండు అర్థాంతరన్యాసములు ప్రయోగించినాడు. వీనిలోనైనను చెప్పదగిన చమత్కృతి గోచరింపదు. 'తన భార్యను లోకులపహాస్యము చేయుటను ఎవడైన విని సహింపగలడా?[13] 'తన భార్య కిష్టమైన వస్తువును వీరులు అన్యులకిత్తురా?[14]

<u>శ్లేష :</u>

రుద్రభట్టునకు పాండిత్య ప్రకర్షా ప్రకటన వాంఛమెండు. అందుచే అతడు తరచు నానార్థవంతములైన పదములను ప్రయోగించును.

'హరిదర్పము నపహరిసల్

హరిపీఠదె హరి శతప్రభం తళర్దు మనో

హరివెరసు హరిహరిన్ముఖ

భరితానక నినదనేఱిదం ఖగపతియం' (XII.- 42)

(హరి (దేవేంద్రుని) దర్పము నపహరించుటకై హరి (సింహ)పీఠము నుండి హరి (సూర్య) శతప్రభవహించి హరిత్ (దిక్) ముఖములను ఆనక ధ్వనులతో నిండించుచు, హరి (కృష్ణుడు) మనోహరితో కూడి ఖగపతి నధిరోహించెను.)

'శరధియనుగుళ్వ శరమం

శరధియి నసురారి తెగెదు. . . ' (XII.- 28)

(అసురారియైన కృష్ణుడు శరధి (అమ్ములపొది) నుండి శరధి (సముద్రము)ని కక్కెడు వారుణాస్త్రమును తీసి. . .)

అని ఇట్లు కవిగా రుద్రభట్టు తన పాండిత్య ప్రకర్షను చూపినంత వరకు బాగుగనేయున్నది. కాని కావ్యగత పాత్రలైన శచీసత్యలు వాగ్యుద్ధమందు తమ నానా

వర్గ పాండిత్యమును ప్రకటించుటమాత్రము అసహజముగానున్న దనక తప్పదు.

శచీదేవి సత్యతో ఇట్లనుచున్నది.

రథచరణపాణి బలమం

మథియిసె, జంభారిగాయ్తు గీర్వాణహతి

వ్యథె నీం గీర్వాణహతి

వ్యథెయం మత్తేకె తంగి పడెదపె యెనగం. (XIII.- 80)

(కృష్ణునిచే దేవతా సైన్యము పారద్రోలబడినందున ఇంద్రునకు గీర్వాణ (దేవతా) హతివ్యధ కలుగనే కలిగినది. చెల్లెలా సత్యా, నీవు నాకు కూడ ఏలనీ గీర్వాణ (వాగ్బాణ) హతి కలిగించెదవు?)

సత్యభామ పాండిత్యము తక్కువదికాదు. ఆమె మాటలివి :

'కులగోత్ర వైరియుం బల

దలనను మెంద మరపతియ నొల్లదె పోదర్

కులగోత్ర వీరభటరుం

బలనాథరుం. . . ' (XII.- 78)

(ఇంద్రుడు కులగోత్ర) (పర్వత) వైరియు, బల (రాక్షస) దళనుడు నగుటచేతనే కులగోత్ర (వంశ) జులము, బల (సైన్య) నాధులునైన వీరభటులు ఆతనిని వదలిపోయిరి.)

'నాగాంతకనీ గరుడం, నాగనదైరావతం. . . ' (XIII.- 85)

(గరుడుడు నాగాంతకుడు (సర్పవైరి) ఐరావతమో నాగము (ఏనుగు) మాత్రమే)

'పగె కౌశికంగె పగళే, పగలం కిడిసిదనదర్కె కౌశికం' (XIII.- 89)

(కౌశికము (గుడ్లగూబ)నకు పగలు (దినము) పగ (శత్రువు). కనుకనే కౌశికుడు (ఇంద్రుడు) (అంధకార శర ప్రయోగముచేసి) పగటిని చెరచినాడు.)

కవికల్పనలుగా ఇవి చమత్కారయుత భావములే. కాని పాత్రల సంభాషణగా

అసహజములు అగుటచే వికారములును.

## దృష్టాంతము :

కుపితయైన సత్య సిందూర వస్త్రమును వీడి శ్వేతాంబరమును ధరించుట వలన ఆమె నుండి సంతోషము పూర్తిగ తొలగిపోయినదని చెప్పుచు 'అబ్జినికి బాలా తపము వలన కలుగు సంతోషము చంద్ర కాంతివలన కలుగునా?' అని రుద్రభట్టు దృష్టాంతాత్మకముగా ప్రశ్నించుట చాల సరసముగ నున్నది. (XII.- 77) (చూ.పుట. 101)

## విదర్శన :

శ్రీకృష్ణుడు సత్యను 'నిర్మోకము దాల్చిన నాగకన్నిక అందమున నభినయించుచుంటివేమి?' (XII.- 98) అని విదర్శనాత్మకముగా ప్రశ్నించుట సత్యాపాత్ర శీలమున కనుగుణముగ నుండుటచే మిక్కిలి సహజముగను రమణీయముగను నున్నది. (చూ.పుట. 102)

. రుద్రభట్టు వాడిన మరికొన్ని అర్థాలంకారములు.

అతిశయోక్తి : XII.-37, 62, 95, 107.

అర్థాపత్తి : XII.- 67, XII.- 87, 94

ఉదాత్తము : XII.- 58.

రత్నావళి : XIII.- 25, 76.

సముచ్చయము : XIII.- 74

సారము : XII.- 63

స్వభావోక్తి : XIII.- 50

పరిణామము : XII.- 78.

ప్రతివస్తూపమ : XIII.- 41

మొత్తము మీద రుద్రభట్టు కూర్చిన శబ్దాలంకారములు అతనికి వానియెడల గల వ్యామోహమును వెల్లడించినంతగ రమణీయతను వెల్లడించునవిగ లేవు. తిమ్మన కూర్చిన శబ్దాలంకారములు కొలదియే యయ్యు సుందరములైయున్నవి.

రుద్రభట్టు కల్పించిన అర్థాలంకారములు సంఖ్యలో తక్కువయైనను రమణీయకతలో తిమ్మనకూర్చిన అర్థాలంకారములకు తులతూగునట్లున్నవి. తిమ్మన

ప్రతిపద్యమునకను రెండు మూడు చొప్పున అలంకారములను కూర్పగా, రుద్రభట్టు రెండు మూడు పద్యములకొకటిగా అలంకారములను కూర్చి వాడనవచ్చును. దీనికి కొంతవరకు కావ్య స్వభావమును, కొంతవరకు కాలప్రభావమును కారణములన వచ్చును. తిమ్మన కావ్యము కంటె రుద్రభట్టు కావ్యము బృహత్పరిమాణము కలది $5^{1/2}$ రెట్లు పెద్దది. తిమ్మనవలె ప్రతి పద్యమును శిల్పఖండముగా తీర్చిదిద్దుటకు రుద్రభట్టునకు సాధ్యముకాదు. తిమ్మన కావ్యము నందలి ఇతివృత్తము అల్పమైనది. రుద్రభట్టు కావ్యేతివృత్తము అతి విస్తృతమైనది. అందుచే అతడు ప్రధానముగ కథాకథనముపై దృష్టిని కేంద్రీకరించ వలసియున్నాడు. అనగ తిమ్మనది ప్రబంధ ధోరణికాగా, రుద్రభట్టుది పురాణ ధోరణియని చెప్పవచ్చును. కాలమును బట్టి కూడ రుద్రభట్టు పౌరాణిక యుగమునకును తిమ్మన ప్రబంధయుగమునకను చేరినవారగుచున్నారు. 'ప్రతి పద్యచమత్కృతి' దృష్టి ప్రబంధయుగపు కవులలో ఏర్పడినంత బలముగ పురాణ యుగపు కవులలో ఏర్పడియుండలేదు. ఆ యీ కారణముల వలన రుద్రభట్టు కావ్యము విరళాలంకృతియుతమగుటయు, తిమ్మన కావ్యము ప్రచురాలం కృతియుతమగుటయు సహజమేయగు చున్నది. కనుక అలంకృతుల సంఖ్య తక్కువైనంత మాత్రమున రుద్రభట్టు ప్రతిభ తక్కువదని అర్థముకాదు. సంఖ్యా పరిగణనము వస్తుస్థితి నిరూపణ మాత్రప్రయోజనము కలది.

ఇక శబ్దాలంకార వ్యామోహము, పాండిత్య ప్రకర్షా ప్రకటన వాంఛ యనునది మాత్రము రుద్రభట్టులోని లోపములని చెప్పక తప్పదు. ఈ లోపములు లేకున్నచో ఆతని కావ్యము మరింత రమణీయముగ నుండి యుండెడిది.

## వర్ణనా నైపుణి

'వర్ణనీయమైనదే కావ్యము,'[1] 'వర్ణనా నిపుణుడేకవి[2] ప్రతిభా నేత్రముతో తాను దర్శింపగలిగిన లోకోత్తర సౌందర్య తత్త్వమును కవి ఇతరులకు పంచిపెట్టు కృషియే వర్ణన. 'తత్త్వ దర్శనము చేయగలిగి, వర్ణన చేయగలిగినవాడే కవియను ప్రసిద్ధిని పొందగలుగుచున్నాడు.[3] ' లోకోత్తర వర్ణనా నిపుణుడైన కవి యొక్క కృతియే కావ్యము.[4]

కావ్యము నందుండవలసిన వర్ణనలెన్ని? అవి యేవి? అను విషయమును గురించి అలంకారికులు, కవులు పలుతీరులుగ చెప్పియున్నారు.

512 గద్య పద్యములు గలపారిజాతాపహరణములో 260 వరకు అనగా అర్ధభాగము వర్ణనలే ఆక్రమించినవి జగన్నాథ విజయమందలి పారిజాతకథా భాగమైన 265 గద్యపద్యములలో వర్ణనలకు 50 మాత్రమే వినియుక్తములైనవి. అనగా కావ్యమందు వర్ణనా భాగము ఐదవ వంతు మాత్రమే ఆక్రమించినదన్న మాట. అలంకారముల విషయములో వలెనే దీనికిని కావ్య స్వభావము, కాలప్రభావము కారణములు. శ్రీకృష్ణుని సంపూర్ణ జీవిత చరిత్రను చెప్పబూనుకొనిన జగన్నాథ విజయము పురాణ ధోరణినాశ్రయించి కథాకథనమునకే ప్రాధాన్యమొసంగ వలసియున్నది. వర్ణనా భాగములను తీసివేసినచో మిగిలెడి కేవల కథా కథనాత్మక భాగము ఇరువురి కావ్యములందును దాదాపు సమానముగు దైర్ఘ్యము గలిగియున్నదనుట గమనింపదగియున్నది. రుద్రభట్టు కాలమునాటికి కింకను ప్రబంధధోరణి పూర్తిగా రూపుగొనియుండక పోవుట రెండవ కారణము.

కేవల వర్ణనల సంఖ్యవలనగాని, వర్ణనాత్మక పద్యముల సంఖ్య వలనగాని కవియొక్క ప్రతిభను లెక్కింపరాదు. ఆలంకారికులు చెప్పిన అన్ని వర్ణనలు ప్రతి కావ్యము నందును ఉండి తీరనక్కరలేదు. సంధ్యంగముల వలెనే వర్ణనలను కూడ ఇతివృత్త వశాయాతములైన వానినే కూర్పదగుమగాని కేవల శాస్త్ర సంపాదనేచ్ఛతో బలిమిని కొనితెచ్చి పులిమిపెట్టరాదు.[5] కొన్ని వర్ణనీయాంశములను వర్ణింపకున్నను కావ్యగౌరవమునకు నష్టములేదు. చేసిన వర్ణనలు హృదయంగమములుగా నున్నచో చాలును.[6]

వర్ణనలకు సహజమైన చక్కని అవకాశము గల ఇతివృత్తము నెన్నుకొనుటలో కూడ కవియొక్క ప్రతిభ గోచరించుచున్నది. తిమ్మన ఎన్నుకొనిన ఇతివృత్తము ఆయా వర్ణనలకు అనుకూలమైనది. 'అష్టాదశవర్ణనలు చేయుటకు తిమ్మనకు కథావస్తువే అనుకూల్యము నొసగినది. అతనికి లేనిపోని సందర్భములు కల్పించుకొనవలసిన గతి పట్టలేదు.[7] రుద్రభట్టు కూడ ఈ కథాభాగమున వర్ణనలను బలవంతముగ పట్టి తేలేదు. కాని గ్రంథమందలి ఇతర భాగములలో కొన్నిచోట్ల అసందర్భవర్ణనల గావించినాడని విమర్శకుల ఆక్షేపణలకు లోనైనాడు.

వర్ణనలు కవి శక్తిని వెల్లడించుట మాత్రమే ప్రయోజనముగా గలవి.[8] కావ్యపు యోగ్యత ఇతివృత్త నిర్వహణ, రసపోషణ, ఔచితీపాలనలపై ఆధారపడి యుండును. కనుక పరిణత బుద్ధులైనవారు వర్ణనలకంత ప్రాధాన్యము నొసగరు. వర్ణనలు నాతి

దీర్ఘముగను, కథా సూత్రమునకు భంగము రాని విధముగను ఉండవలెను.[9] తిమ్మన గావించిన వర్ణనలన్నియు ఇట్టివే. రుద్రభట్టు గావించిన వర్ణనలు మరింత సంగ్రహముగ మున్నవి. సాధారణముగ అవి ఒక పద్యమును దాటిపోవు. చాల వర్ణనలు ఒకటి రెండు పద్యపాదములకే పరిమితములైనవి.

ప్రధానములగు వర్ణనలలో కుమారోదయమును తిమ్మన వర్ణింప లేదు. సముద్ర వర్ణనము కూడ లేనట్లే. మొదటిదానికి (కుమారోదయము) తిమ్మన కథాప్రణాళికలో స్థానము లేదు. రెండవ దానిని (సముద్రము) ఎట్లో పట్టితేవచ్చును. కాని తిమ్మన ఉపేక్షించినాడు. రుద్రభట్టు ఈ కథాభాగములో ఋతు, మధుపాన, ద్యూత, జలక్రీడలను వర్ణింపలేదు. సముద్ర, వనవర్ణనలు కూడ నామమాత్రములే. రుద్రభట్టు దృష్టి కావ్య సమష్టి మీదయుండుట చేత ఒకటి రెండాశ్వాసములలో ఆయా వర్ణనలు లేవని ఆతనిని తప్పు పట్టలేము.

తిమ్మనగావించిన వర్ణనలలో సత్యా, నారద, అమరావతి, మేరు సూర్యాస్తమయ, అంధకార, చంద్రికా, అభిసారికా, సూర్యోదయ, వనవిహార, జలక్రీడా వర్ణనలు అత్యంత రమ్యములుగనున్నవి. రుద్రభట్టు గావించిన వర్ణనలలో సత్యా, నారద, సూర్యాస్తమయ, చంద్రోదయ, సూర్యోదయ వర్ణనలు రమ్యములుగ నున్నవి.

ఇరువురును వర్ణించిన ఒకటి రెండంశములను తీసికొని ఉభయుల వర్ణనలను పోల్చిచూచుట ఉచితము గానుండును.

పుణ్యకవ్రతాచరణను ఇద్దరును వర్ణించినారు పుణ్యకమునకు విశిష్టమైన భర్తృదానాదికము మాట యటుంచి సర్వవ్రతసాధారణమైన ఉత్సవ వర్ణననే పోల్చి చూచినను రుద్రభట్టు వర్ణన తిమ్మన వర్ణనకంటె చాల పేలవముగా మున్నది. రుద్రభట్టు చేసిన వర్ణనమిది :

> 'కెదఱిర్దుత్తమపుష్పమొక్క ఘుస్పృణం, చెల్లిర్ద కస్తూరి, సూ
> సిదపోతాశ్రియ కర్పురం, నెగెవ ధూపోద్దామ ధూమం, వధూ
> వదనాంభోరుహగంధమం, కెదడుపుద్యచ్చామరౌఘానిలం
> ముదమం మాడె సరోజనాభ సభె చెల్వాగిర్దు దొడ్డో లగం. (XII-62)

(చెదరియున్న పుష్పములు, పరచిన కుంకుమపువ్వు, చల్లిన కస్తూరి, వెదజల్లిన కర్పూరము, పైకెగయుచున్న ధూపధూమములు, వధూ వదనాంభోరుహ గంధము,- వీని నన్నింటిని అంతట ప్రసరింపజేయు చామరముల గాలి ముదమును గూర్చుచుండగా సరోజనాభుని సభ నిండుకొలువై చెలువారు చుండెను.)

రుద్రభట్టు చేసిన ఈ వర్ణనలో పుష్పములు, కుంకుమ పువ్వు, కస్తూరి, కర్పూరము, ధూపము, వధూవదనాంభోరుహములు-వీని పరిమళముల గుబాళింపు మాత్రమే కలదు. తిమ్మన సంభార సేకరణ, వ్రతమండప నిర్మాణము మొదలుకొని ఉత్సవ దర్శనాయాత దేవతా జనపు సందడి, రాజఋషి లోకపు త్రొక్కిడి, దానమీయబడు గోవుల అంభారవములు, అధికార నియుక్త పురుషుల సంభ్రమాలాపములు, వేత్ర హస్తుల తర్జనలు, పురోహితుల వేదపఠనములు, వాద్య ఘోషలు, పురోహితులకు గావింపబడిన పూజాదికము, సత్యారుక్మిణీ కృష్ణులు వ్రత మండపమున కరుదెంచు వైభవము - ఇత్యాదులన్నింటిని12 గద్య పద్యములలో (V 64-75) విపులముగ చెప్పినాడు.

నారదవర్ణనమును చెరియొక పద్యములో చెప్పినారు. రుద్రభట్టు హంస, తెలిమేఘము, సుధావార్ధి, మృడహాసము అను ధవళ వస్తువుల పేర్లను పునరుక్తిగావించి నారదుడు వానికంటే ధవళ తరుడని చెప్పిముగించినాడు. (XII-63), (చూ. పుట. 98). నారదుని శరీర ధావళ్యమును రుద్రభట్టు అద్భుతావహముగ చిత్రించిన మాట నిజమే. కాని అంతకుమించి మరేమియు. చెప్పలేదు. తిమ్మన సీసపద్యపు (I-44) ఎత్తుగీతి ఒక్కపాదములో 'దేహకాంతులకాల చంద్రికలనీన' అని నారదుని శరీరధావళ్యమును ఒక్క ముక్కలో ముచ్చటగ వర్ణించినాడు. ఇక నారదుని భుజము నుండి వ్రేలాడు మహతి, అందుండి వెడలు సరిగమపదనిసలు, చేతియందలి మణికమండలువు, అందలి భాగీరథీ పయస్సులు కర్ణశష్కులికయందు వ్రేలు స్ఫటికాక్ష వలయము, భుజాగ్రమున చమరవాలము, కక్షపాల, మోక్షద్రు పల్లవ శంకకలిగించు జడలతో నారదుని సంపూర్ణ మూర్తిని మన మనోనేత్రము నెదుట సాక్షాత్కరింపజేయుచున్నాడు.

కోపోపశమనానంతరము సత్యచేసికొనిన 'ముస్తాబు'ను రుద్రభట్టు ఒక్కపద్యములోను, తిమ్మనరెండు పద్యములలోను చేసియున్నారు. రుద్రభట్టు వర్ణన ఇది :

'కుడుపుర్బ్విం కర్బువిల్లం, పరపువ, కడెగణ్ణిం మనోజాస్త్రమం సా
లిడు,వుద్యన్మేఖలా కూజితది నతను కోదండ టంకారమం క
న్నడి, పంఘ్రిన్యాసదిం తావరె గెదరువ, మందస్మితోద్యోతదిం దిం
గడలం బేటొందనుత్పాదిసువ తెఱది నానందదిం దేవి బందళ్' (XIII-3)

(వంపు దీరిన కనుబొమ్మలతో చెరకువింటిని ఎక్కిడి, కడగంటితో మనోజాస్త్రమును సారించి, ఉద్యన్మేఖలాకూజితముతో అతనుకోదండ టంకారమును మొరయించి, అంఘ్రిన్యాసముతో తామరలను చల్లి, మందస్మితోద్యోతముతో మరియొక పాలకడలినుత్పాదించు తెరగున సత్యాదేవి ఆనందముతో నరుదెంచెను). రుద్రభట్టు సత్యను మన్మథుని ఆరవ బాణమో యనునట్లు చేసిన ఈ వర్ణన శృంగార రసభరితమై మనోహరముగ నున్నది. తిమ్మన ఒక పద్యములో (II-14) సత్య ముస్తాబును వర్ణించి, రెండవ పద్యములో (II-15) ఆమె కోపోపశాంతిని, మనఃప్రమోదమును రూపకోత్ప్రేక్షాక్రమాలంకార సహితముగ చెప్పినాడు. ఈ సీసపద్యము భావమునంతటిని రుద్రభట్టు (ఆనందదిం' అని ఒక్క ముక్కతో ముగించినాడు. సత్యా సౌందర్యమును తిమ్మన వర్ణించిన తీరుకంటే రుద్రభట్టు వర్ణించిన తీరు మేల్తరముగా నున్నదనక తప్పదు.[10]

తిమ్మన గావించిన పారిజాతపుష్ప వర్ణనము ముందు రుద్రభట్టు గావించిన వర్ణన సూర్యుని ముందు దీపము వలెనున్నది. ఈ విషయమై ఇంతకు ముందే విశదము గావింపబడినది. (పుట. 190).

సత్యాకృష్ణుల నాకలోకయాత్రను రుద్రభట్టు మూడు కందములలో వర్ణింపగా, తిమ్మన 27 గద్య పద్యములలో (II77-103) వర్ణించినాడు. (చూ.పుటలు 108).

రుద్రభట్టు గరుడుని శరీరకాంతులను శ్రీకృష్ణుని శరీరకాంతిని, ఆతని పీతాంబర శంఖ చక్రముల కాంతులను మాత్రమే వర్ణించినాడు. గరుడుని గమన వేగమును వర్ణింపలేదు. తిమ్మన గరుడుని గమన వేగమును, చాతుర్యమును మూడు పద్యములలో (II-77, 82, 83) వర్ణించినాడు. కృష్ణుని పంచాయుధములను ఒక పద్యములో (II-78) వర్ణించినాడు. గగనయానము వలన సత్యాకృష్ణుల సౌందర్యమునకు గలిగిన పెంపును రెండుపద్యములలో (II-79, 80) వర్ణించినాడు. ఇది గాక కృష్ణునిచే సత్యభామకు మార్గమందలి మేరువు. కామధేనువు, యక్షులు, అమరావతీ నగరపు దృశ్యము మొదలగు విశేషములను 16 పద్యములలో (II-84-100) వర్ణింపజేసినాడు.

ఈ సందర్భమున రుద్రభట్టు కృష్ణునిచే సత్యభామకు ఇట్లు చెప్పించినాడు.

"అడకిల్గొండూర్ధ్వలోకప్రతతి విపుల దేవాలయం, చంద్రసూర్యర్

సొడర్గళ్, తారాళి పుష్పం, సురనది వసుధారాప్లవం, ద్వీపవేళుం

కడలేళుం వృత్తపీఠం, కనకగిరి మహాలింగవెంబంతు చెల్వం

పడెదత్తీ విశ్వవస్మజ్జఠరకమలభూ కల్పితం సత్యభామె." ( ౧౩I-45).

(దొంతరగా పేర్చియున్న ఊర్ధ్వలోకప్రతతి విపుల దేవాలయము; చంద్రసూర్యులు దీపములు; తారాళిపుష్పములు; సురనది వసుధారాప్లవము; ఏడు ద్వీపములును, ఏడుకడలులును వృత్తపీఠము; కనగగిరి మహాలింగమును అనునట్లు చెలువము పడయుచున్న ఈ విశ్వము అస్మజ్జఠరకమలభూ కల్పితము, సత్యభామా)

అనంత బ్రహ్మాండము నంతటిని ఒక్క పద్యములో అతి సంగ్రహముగ ఉత్ప్రేక్షాభరితముగ వర్ణించిన రుద్రభట్టు ప్రతిభను ప్రశంసింపక తీరదు. ఐనను మార్గమధ్యమందలి దర్శనీయ విశేషములను తిమ్మన వలె రుద్రభట్టు విపులముగ వర్ణింపకుండుట ఇంపునింపకున్నది. ప్రియుడు ప్రియురాలికి దారియందలి వింతలను చూపి వర్ణించుట సరసమైన భావముగదా[11].

సూర్యాస్తమయ, చంద్రోదయ, సూర్యోదయములను తిమ్మన క్రమముగా ఏడు (II-30-33, IV-42-44) పద్యములలోను, పండ్రెండు (II-38-48; IV-47) పద్యములలోను, పదమూడు (II-59-70; IV-49) పద్యములలోను వర్ణింపగా రుద్రభట్టు ఒక్కొక్క పద్యము చొప్పున మాత్రము (౧౩ 34, 35, 36) మాత్రము వ్రాసిముగించినాడు. (చూ. పుట. 106, 107) వానిని కథా సందర్భముతో అనుసంధానము చేసిన నేర్పు మాత్రము ప్రశంస నీయము.

దేవేంద్రుడు కృష్ణునిపై ప్రయోగించిన వజ్రమును రుద్రభట్టు చిన్న చిన్న పదములతో గూడిన ఒక కందములో వర్ణించినాడు. ( ౧౩ -105)

హరనేత్ర వహ్నియుం సం

హరణాగ్నియు మిదఱ కాయ్పునొళ్ దొరెయక్కుం

దొరె యల్తు గర్జనాడం

బరదాళిదర్కొనిప వజ్రదిం వృషనిట్టం (౧౩-105)

('హరనేత్ర వహ్నియు, నంహారణాగ్నియు దీనికి వేడిమియందు సరిగావచ్చును. గర్జనాడంబరమున మాత్రము దీనికి సరికావు,' అనునట్లున్న వజ్రముతో వృషుడేసెను.)

శాంత శృంగార రసములకు గూడ మహోగ్రవగ్ధరలను, తెగబారెడు సమాసములను, పరుష సంయుక్త రూక్షాక్షరవంత శబ్దములను ప్రయోగించు రుద్రభట్టు కోమల పదబంధముతో, కందపద్యమందు వజ్రాయుధమును వర్ణించుట వలన ఆతని వర్ణనౌచితీజ్ఞానమునే శంకింపవలసి వచ్చుచున్నది. సహజముగ మృదుపదబంధమున కలవడి, చంపకోత్పల ప్రియుడైన తిమ్మన ఈ పట్టున కట్టిన మహోగ్రగ్గర బెడిదములగు పిడుగులను వర్షించుచు గర్జనాడంబరముతో సాగినది. తిమ్మన వర్ణనౌచిత్యమును పాటించినాడని వేరుగా చెప్పవనిలేదు.

"శతధారాజాయమాన జ్వలనముఖ శిఖాచ్ఛాదితాభ్ర స్థలంబై
వితతాభీల ధ్వనిశ్రీ విలసవ బధిరోద్విగ్న దిగ్వారణంబై
కృతలోకాలోక ముఖ్యాఖిలగిరి చలవ క్షిప్త భూమండలంబై
పతయాళు ద్వాదశాత్మ ప్రకరఖరకరౌప్యమై యేగు దేరన్." (V-35)

సత్యాకృష్ణులరహః కేళివి తిమ్మన ఎట్లుసభ్యముగను, సంగ్రహముగను వర్ణించి ఔచిత్యమును పాటించినాడో (II-53; IV-48) రుద్రభట్టు కూడ అట్లే సభ్యముగను, సంగ్రహముగను వర్ణించి ఔచిత్యమును పాటించినాడు. ఐనను ఈ సందర్భమునం దాతడు ప్రయోగించిన 'సురతార్ణవ' పదము మాత్రము వెగటు గొలుపుచున్నది. (౧౩ 35వ.).

మొత్తము మీద చూచినచో రుద్రభట్టు గావించిన వర్ణనలు సంగ్రహములనియు, తిమ్మనవి విపులములనియు చెప్పవలెను. రుద్రభట్టు వర్ణ్యవస్తువు యొక్క ఏదేని యొక్క విశేషమును మాత్రము చెప్పుటతో తృప్తి చెందును. తిమ్మనకు దాని సమగ్ర స్వరూపమును చిత్రించినగాని తృప్తిలేదు. అనగా రుద్రభట్టు దృక్కోణైక మాత్ర పరిశీలకుడు; తిమ్మన అనేక దృక్కోణ పరిశీలకుడు. దీనికి ఆయా కవులెన్ను కొనిన ఇతివృత్త స్వభావము కూడ చాలవరకు కారణమనక తప్పదు. రుద్రభట్టు శ్రీకృష్ణుని

సంపూర్ణ జీవిత చరిత్రను రచింపబూనిన వాడగుటచే కావ్యమార్గము కంటె విశేషముగ పురాణమార్గము నాశ్రయింపవలసిన వాడైనాడు. తిమ్మన ఎన్నుకొనిన ఇతివృత్తము అల్పమైన దగుటచే విస్తృతములగు వర్ణనలను గావించి కావ్యమునకు గాత్రవృద్ధి గావింప వలసినవాడైనాడు. ఇరువురును తమ తమ మార్గములలో అందెవేసిన చేతులే.

# కవిసమయములు

కీర్తియు, హాసమును తెలుపనియు, అనురాగమును కోపమును ఎరుపనియు, అపకీర్తియు పాపమును నలుపనియు కవులు వర్ణించుచుండును. వానికా వర్ణములు కవిసమయ సిద్ధములు. ఈ కవిసమయములకు భావనయే ఆధారము. చకోరములు వెన్నెలను త్రాగుట, పాములుగాలిని తినుట, పందికోరలు వెదుళ్ల మున్నగు వానిలో ముత్యములు పుట్టుట మొదలగునవి లౌకిక సత్యములు కావు. కావ్యలోక సత్యములు. కవులది అది యొక ప్రత్యేక లోకము. భౌతిక లోకమున అసంభవములైనవి. కవుల భావనాలోకమున సుసంభవములగును. కనుకనే కవిభారతి నియతికృతినియమ రహితయు, హ్లాదైకమయియునమట, నిరంతర కావ్య పఠన వ్యసనులు, రసాస్వాదన సమర్థులైన రసజ్ఞులకు మాత్రమివి అమృతగుళికలు. కవితోబాటుగ కవితా లోకమున విహరింపగల భావుకుడైన పాఠకుడే అలౌకికమై, బ్రహ్మానంద సహోదరమగు కావ్యానందము ననుభవింపగలడు.

ప్రకృతి విరుద్ధములైన కవి సమయములను కావ్యములలో నిబంధించుట కవి యొక్క లోకజ్ఞతా విహీనతకుగాక కావ్యలోకజ్ఞతకు ద్యోతకము, ఖ్యాత విరుద్ధత కవి సమయములలో దోషముగాక గుణమే యగును.[1] నిరంతర బహుకావ్యాసంగము గల కవికి మాత్రమే కవి సమయములు వాచో విధేయములు కాగలవు. కవిసమయములను తన కావ్యమున అధికముగ చొప్పించిన కవి ప్రతిభయేగాక వ్యుత్పత్తి గూడ కలవాడని తెలియగలము.

తిమ్మన రుద్రభట్టులు తమ కావ్యములలో వాడుకొనిన కవి సమయములను గుర్తింతము.

తిమ్మన తన కావ్యమంతటను కవి సమయములకు కొల్లలుగ వాడినాడు. వాని వలన ఆతని కావ్యమాధుర్యము ఎన్నియో మడుంగులతిశయించినది. తిమ్మన

వాడిన కొన్ని కవి సమయములను దిఙ్మాత్రముగ పరామర్శింతము.

కొందరు పౌరాణిక వ్యక్తులను, కొన్ని వస్తువులను, కొన్ని భావములను ఒకానొక వర్ణము గలిగన వానిగ కవులు వర్ణింతురు.

నారదుడు, శివుడు, బలరాముడు, గంగ, కీర్తి హాసము తెలుపు.

నారదుడు, తెలుపు I 44, II 17 గంగానది తెలుపు II 47,53, V28

శివుడు తెలుపు I 24, II 45, కీర్తి తెలుపు - I 24, II 52

బలరాముడు తెలుపు I 24, II 45 హాసము తెలుపు - I 20, II 53

ఐరావతము తెలుపు - I 28

కోపము ఎరుపు - I13

కృష్ణుడు, మన్మథుడు, వినాయకుడు, పార్వతి రాహువు, రాక్షసులు, యమునానది, బురద, ఖడ్గము, దానము, ధూమము నలుపు.

కృష్ణుడు నలుపు - II 17,35,81 యమున నలుపు - III 47,81, IV37

మన్మథుడు నలుపు - II35 పంకము నలుపు - II 34

గజమదము నలుపు - I27, II32, III38, IV46 వినాయకుడు నలుపు - 35

ఖడ్గము నలుపు - I24, IV46 పార్వతి నలుపు - I24, II35, 45

రాహువు నలుపు - II88 ధూమము నలుపు - IV46

రాక్షసులు నలుపు - II53, IV46 అపకీర్తి నలుపు - III35

విషము నలుపు - II62 ఆకాశము నలుపు - II34

అనేక కవిసమయములు పరస్పరానుప్రాణితములై ఒకే భావములో గుదిగ్రుచ్చ బడి యుండుట తిమ్మన కల్పనలలోని విశిష్టత, కృష్ణరాయల ఖడ్గము మేను సగము యశోమహేశానునకును (I 24) అను తేటగీతి పాదములో అర్ధనారీశ్వర

స్వరూపము భావింపబడియున్నది. ఈ కల్పనలోని స్వారస్యము కీర్తి తెలుపు, ఖడ్గము నలుపు శివుడు తెలుపు, పార్వతి నలుపు అను కవిసమయములపై ఆధారపడియున్నది. మచ్చగల చంద్రుడు అను బలరాముడు తమోయమునను భంగము నొందింపగా చంద్రికా పూరమను గంగానది దానిని తేర్చుటకు వచ్చెనను కల్పన (II47) బలరాముడు తెల్లని వాడనియు, అతడు నల్లని వస్త్రమును ధరించుననియు, యమున నలుపనియు, గంగ తెలుపనియు గల కవిసమయులను గుర్తింపనిదే బోధపడదు, తమోభిసారికలు అంధకారమును శాశ్వతము గావింపుడని మన్మథుని, శ్రీకృష్ణుని, కాళికను, వినాయకుని ప్రార్థించిరి, ఆయా దేవతల కిష్టములైన నల్ల చెరుకు, నేరేడు పండ్లు మొదలగు పదార్థములను సమర్పించు కొందుమని మ్రొక్కుకొనిరి, ఆపదార్థములన్నియు నల్లనివే, ఆదేవత లందరును నల్లని వారే. నల్లని దేవతలకు నల్లని పదార్థములను నివేదించుకొనినచో నల్లని చీకట్లు శాశ్వతముగనుండునని ఆ తమోభిసారికల ఆశ, (II35)[2]

మరి యొక విశేషము. లోకమున భిన్న వర్ణములుగ అనుభూతములగుచున్న నలుపు, నీలము ఆకుపచ్చ అనువర్ణములు కవిలోకమున ఒకే వర్ణముగ చెల్లు బడియగుచున్నవి. కనుకనే పైన పేర్కొనిన (II35) పద్యములో తిమ్మన నల్ల చెరకు, నల్లగలువలు, కప్పు కప్పడము, కస్తూరి, కాటుక, నేరేడు పండ్లు, పింఛము, చిలుక, వనమాలిక, దూర్వలు - అన్నింటిని గుదిగ్రుచ్చి నల్లనివిగనే చెప్పినాడు.

కవుల ప్రత్యేకాభిమానమునకు పాత్రమైన కొన్ని పక్షులు కలవు - కోకిల, హంస, చకోరము, చక్రవాకము ఇత్యాదులు, వాని తిండి తీర్థములను గురించి కొన్ని కవిసమయములు కలవు.

కోకిలలు మామిడి చివుళ్ళనే తినును - I72, 133, III49,56

వాని కంఠము పంచమ స్వరమును పోలియుండును -

ఆడుకోయిలలు కూడ కూయును - I133.

సరస్సులు, నదులలో హంస లీదులాడును - IV35.

అవి శరదృతువులోనే వచ్చును - II50.

వాని కంఠధ్వని అందెల రవళిని పోలియుడును - II14.

సత్యభామ పసిడి యందెల రవళితో నడువగా హంసలు ఆమె నను సరించుచు వచ్చెనట. (II14), ఆమె యందెల రవళి రాయంచల కూతలను భ్రమగొలుప జాలియుండెనని అర్ధ శక్తి మూలాలంకారధ్వని.[3]

చకోరములు వెన్నెలను త్రావును - II49,59

వెన్నెల భాజన గ్రాహ్యముగనుండును - II49

చకోరపు పేరంటాండ్రు కులము సాముల నందరను కూర్చుండ బెట్టి చిగురు విలుకాని జాతర వేళ పెట్టిన వెన్నెల బువ్వపు బంతి విందు (II49) రసజ్ఞలోకమునకు నోరూరింప జేయునదిగ నున్నది.

చక్రవాకములు రేజీకటి పక్షులు, వాని జంటలకు రాత్రివేళ ఎడబాటు తప్పదు. తెల్లవారులు విరహవేదనకులోనగు చక్రవాక దంపతులను చూచుచు జాలిపడుట కవులకును తప్పదు II31,53, IV49.

తుమ్మెదలు కవులకు అపరిహార్యమైన కవితాద్రవ్యము. వానిని ఆశ్రయించు కొనినవి ఎన్నో కవి సమయములు :

తుమ్మెదలు పుష్పముల పై ముసురు కొనును - III5

గజమదమునకు ముసురుకొనును - V18.

తుమ్మెదల ఝుంకారము విరహిణులకు గిట్టదు - I 72.

సంపెంగ వాసన తుమ్మెదలకు గిట్టదు - III51, 57[4]

ఒక తుమ్మెదకు గోరంట పుష్పమును చూచినోరూరియు, దానికి ప్రక్కనే సంపంగి యుండుటచే సమీపింప లేక ఉస్సురు మని మరలి పోయినదట. (III51)

తామరలు, కలువలు రెండును జలజములే, ఐనను కేవల భిన్న స్వభావము గలవి. వానిన రాగ ద్వేషములు భిన్నములు, సూర్యోదయ సమయమున పద్మములు వికసింపగా కుముదములు ముకుళించును. చంద్రుని చూచి కలువ కన్నె మొగము విప్పారును, పద్మిని మొగము ముడుచు కొనును. ఈ కవి

సమయముల పెట్టుబడితో తిమ్మన సంపాదించిన లాభముల పట్టిక:

పద్మ వికాసము - II5.; ముకుళనము - II31,33,41,64, IV49

కుముద వికాసము - II41 ముకుళనము - II65,67,69

చంద్ర కరస్పర్శకు కలువలు వికసించుటయు, కమలములు ముకుళించుటయు కారణముగ చంద్రుడు 'కుముదంబుల చక్కలిగింత 'నవసారసలక్ష్మి తొలంగు బావ' ఐనాడు (II41). సూర్య కిరణముల సోకునకు పద్మిని వికసించుటను జృంభికలతో మేల్కాంచుటగను (II67), కుముదిని ముకుళించుట అది రాజ వల్లభయగుటచే అసూర్యంపశ్యయగుటగను (II69) తిమ్మన సరసమైన కల్పన గావించినాడు. సంజవేళ పద్మములు ముకుళించు నపుడు తుమ్మెదలు వానిలో చిక్కువడి పోవుటయు మరునాటి వేకువవేళ పద్మములు వికసించునపుడు అవి విడుదల యగుటయు ముమ్మారు (II41, 64, IV69) చిత్రింపబడినది.

పద్మములు వర్షర్తువులో శోభింపవు

శర దృతువులో జాజిపూలు శోభిల్లవు - II50.

గ్రీష్మర్తువులో నవమాలతి పుష్పించదు - II15.

శరదృతు ధర్మములను వెన్నెల రాత్రియం దారోపించి వెన్నెల రాత్రిని శరదృతువుగ వర్ణించుట (II50) తిమ్మన ఊహా శక్తి కొకమచ్చుతునక.

షడృతువులకు యుగపత్ స్థితి - III45, 46.

వర్ష ర్తువులో మేఘ ధ్వనికి నెమళ్ళు నృత్యము చేయును - I137.

సంస్కృత వ్యాకరణమునమసరించి వృక్ష శబ్దము పుంలింగము లతాశబ్దము స్త్రీలింగము. ఈ వ్యాకరణ సమయ మాధారముగ కల్పింపబడిన కవిసమయము లతావృక్ష దాంపత్యము (IV54).

భూర్జ వృక్షములు హిమ వంతము పైనుండును - II90.

సూర్య చంద్రులు మేరుగిరిని ప్రదక్షిణింతురు - II85.

చంద్రునిలో జింక కలదు - II87.

చంద్ర కాంతికి చంద్ర కాంత శిలలు ద్రవించును - II49,53.

శివుని శిరోభూషణము బాల చంద్రుడు - I2.

దేవతలు అనిమిషులు - IV64.

ఐరావతము చతుర్దంతము - IV78.

సర్పములు చందన కోటరములలో నివసించును - I98.

ఉద్యానములలో పూదేనె ఏరులై పారును - I71.

నదిని కుల్యగను దీర్ఘిగను చెప్ప వచ్చును - II42, IV28.

నదులలో పద్మములు, నాచు ఉండును - IV26,30,31,33,34,36,39.

తామ్రపర్ణిలో ముత్యములు దొరకును - IV37.

ముత్యములు సముద్ర గర్భమున ముత్యపు చిప్పలలో పుట్టు ననియే లోకమెరుగును. కాని కవులకు తెలిసిన మౌక్తికోత్పత్తి స్థానములు చాల గలవు. ఏనుగుల తలలు, మేఘములు, పంది కోరలు, శంఖములు, చేపలు, పాములు, వెదుళ్ళు, చెరకు గడలలో కూడ ముత్యములు పుట్టునని కవులు నమ్మెదురు. ఈ నమ్మిక ఆధారముగ తిమ్మన కల్పించిన భావములు - I34,II28,III38,60,V28

శ్రీకృష్ణుడు ఐరావతపు తల వ్రయ్యలు చేయగా జారిన ముత్యపుజాలు హిమవత్పర్వత శిఖరాగ్రముల నుండి క్రిందికి దుముకు గంగా ప్రవాహాము వలెనున్నదట (V28) హిమాలయ, ఐరావత, గంగా మౌక్తికములన్నియు తెల్లనివే.

అందగాడైన పురుషుని చూచినప్పుడు యువతులకును, యువతీ సాంగత్యము వలన పురుషులకును స్తంభప్రళయ రోమాంచాది సాత్త్విక భావము

లంకురించును. (II48,III12,15,17, 18,19,V25) సౌధాగ్రము నుండి కృష్ణుని దర్శించుచున్న వేలుపు జవరాలొకతె అతని సౌందర్యమునకు చొక్కి సాత్త్విక భావములకు లోనై గ్రూమ్పాటు చెందినది. ఆమెకు తన నీవిక సడలినదే తెలియదు. జనను స్వేదమంకురించి చీరను జారిపోకుండ కాపాడినది. ఆచారలాజలను చల్లుటను సాధ్వస కంపము తానే నిర్వర్తించినది. (III17).

దోహదములది అది యొక ప్రత్యేకశాస్త్రమే, దోహదమనగా అకాల పుష్పోత్పాదన కృషి, ఏచెట్టున కేది దోహదమను విషయమున కవిసమయ శాస్త్రజ్ఞులలో స్వల్పమైన అభిప్రాయభేదము కాన వచ్చుచున్నది.

ఆయావృక్షములకు ఆయాదోహదములు గావించినపుడవి పుష్పించునని ప్రాచీన శాస్త్రము, తిమ్మన మరొక నూతన విషయమును తెలిపినాడు. స్త్రీలు ఏ పుష్పమునైన మనసులో కోరుకొనిగాని (IV9), కోరుకొనకుండగాని (IV10) పారిజాతమున కాయా దోహదములు చేసినచో అది ఆయా పూలు పూయునట.

ఈ దోహదశాస్త్రాను గుణముగ తిమ్మన అల్లిన ఒక అల్లిక: ఉష: కామిని పక్షికూజితములను సల్లాపములతో పాడువుకొండయును కొండ గోగునకు దోహదమొనరింపగా, అది పాటల వర్ణరంజితమైన పుష్ప గుచ్ఛమును విడచినది. ఆపూగుత్తి పేరే సూర్యుడు. (II70).

తిమ్మన ఉపయోగించుకొనిన కవి సమయములు అతని సంప్రదాయ జ్ఞతకును, వ్యుత్పత్తికిని సూచకములు కాగా, ఆసమయములను ఆధారము చేసికొని అతడు చేసిన వర్ణనలు, కావించిన కల్పనలు ఆతని ప్రతిభకు సూచకములగుచున్నవి. ప్రతిభావ్యుత్పత్తులు రెండును చేరినప్పుడే గదా సుందర కావ్యసృష్టి కాగలిగినది.

5. 'ప్రతిభావ్యుత్పత్తీ మిథ: సమవేతే శ్రేయస్యౌ' ఇతి యాయావరీయ:- కావ్యమీమాంస.

రుద్రభట్టు కవిత్వములో కవిసమయముల కొరకై దుర్భిణితో వెదుక వలసియున్నది. అట్లు వెదుకగా పారిజాతాపహరణ కథా భాగమందలి 265 గద్య పద్యములలో ఐదారు చోట్ల మాత్రము కవి సమయచ్ఛాయలు కన్పించు చున్నవి.

నారదాగమమును వర్ణించు సందర్భమున అతడు తెల్లని వాడను కవిసమయానుసారి వర్ణన చేయుబడినది. నవ్వు, అమృతము తెలుపను కవిసమయమునకనుగుణముగ అతడు మృదహాసముతోను, సుధావారిధితోను పోల్చబడినాడు. (XII63. చూ.పుట 163) ఇదే కవిసమయ మాధారముగ సత్య భామా సౌందర్య ప్రశంసా సందర్భమున ఆమె మందస్మితము మరియొక క్షీరసముద్రమును ప్ప తిల్ల జేయుచున్నదని ఉత్ప్రేక్షింపబడినది. (XIII3.చూపుట 279)

మేఘగర్జనకు నెమలి నృత్యము చేయునను కవిసమయ మాధారముగ నరక వధానంతరము దేవానక ఘన రవమునకు వీర శ్రీ మయూరాంగన వర్తించెనని రూపకముతో జోడించి చెప్పబడినది.

శరచ్చంద్ర కాంతికి కలువలు వికసించునను కవి సమయ మాధారముగ శ్రీ కృష్ణుడు 'నందగోప మన: కుముదినీ చంద్రు'డని అదితి కృతస్తోత్రములో సంబోధింప బడినాడు (XII57). సత్యభామ శ్వేత వస్త్రమును వీడి సిందూర వస్త్రమును ధరించుట వలన ఆమె సంతోషము మరింతగ క్షీణించినదని చెప్పుచు 'అబ్జినికి బాలాతపము వలన కలిగిన సంతోషము చంద్ర కాంతి వలన కలుగునా?' అని దృష్టాంత పూర్వకముగ రుద్ర భట్టు ప్రశ్నించినాడు (XII77. చూ.పుట 101).

కృష్ణుడు పీతాంబరధారియను కవిసమయము నాధారముగ గొని 'సూర్యుడు కృష్ణుని వస్త్ర కాంతులచే అపహృతమైన స్వీయ ప్రభ గలవాడై అస్తమించె' నను చక్కని వర్ణనము రుద్రభట్టు చేసినాడు (XIV34,చూ.పుట 106)

సూర్య కిరణ స్పర్శ వలన సూర్య కాంతము ప్రజ్వరిల్లునను కవిసమయము పై ఆదారపడినది - ' అర్కకాంతి వలననే అర్క గ్రావము ప్రజ్వరిల్లు నట్లు, నీసామర్ధ్యము కంటే వేరైన నా విక్రమ మే మున్నది? అని కృష్ణు నుద్దేశించిన వైనతేయుని వినయోక్తి (XIII 41, చూ.పు 107)

గజములు నలుపని, వాని గండ స్థలముల నుండి మద జలము ప్రవించుచున్నదని (XII 52), ఒక మారును, ఐరావతము తెలుపని (XII62) ఒక సారియును కల్పనారహితములగు సాధారణోక్తులలో చెప్పబడినది.

ఇంతకు మించి ఈ కథా భాగములో రుద్రభట్టు కవిసమయముల

నాశ్రయించిన సందర్భములు కనుపింపవు.

వందల కొలది కవి సమయ ప్రయోగ యుత రమణీయ భావములకు నిధియైన తిమ్మన కవిత్వముతో పోల్చి చూచినప్పుడు రుద్ర భట్టు కవిత్వము కొంత పేలవమనిపించి తీరును.

## ఔచిత్య పోషణ

రస వంతమగు కావ్యమునకు ఔచిత్యమే[1] జీవితము అనౌచిత్యమున కంటె రసభంగమునకు కారణము లేదు.[2] కనుక తిమ్మన రుద్రభట్టులు తమ కావ్యములలో ఔచిత్యము నెంత వరకు నిర్వహించిరో పరిశీలింతము.

తిమ్మన చేసిన కొన్ని కల్పనలు, వర్ణనలు అనౌచిత్య దోషజుష్టములని పలువుర విమర్శకు పాత్రములైనవి. అవి 1. పారిజాత మహిమావర్ణన సందర్భమున నారదుడు రుక్మిణి యెదుట రతి ప్రసంగము చేయుట, 2. శ్రీ కృష్ణుడు సత్యపాదములకు నమస్కరించుట, 3. సత్య కృష్ణుని శిరస్సును తన్నుట, 4. కృష్ణుడు దేవేంద్రుని చేత సత్కృతుడై పారిజాతమునపహరించుట, 5. యుద్ధములో ఇంద్రుని ఓటమి. ఈ సందర్భములలో ఒక్కొక్క దానిలో అనౌచిత్యమెంత వరకు కలదో, దానిలో తిమ్మన ఎంత వరకు బాధ్యుడో పరిశీలింతము.

1) 'అలినీలాలక.......' పద్యము (I60) వ్రాసినందులకై దాదాపు విమర్శకులందరి చేత తిమ్మన చీవాట్లు తినినాడు, తిమ్మన శైలీలాలిత్యచీ మాధుర్యములకును, వర్ణనానైపుణికిని, కల్పనా శక్తికిని, గ్రంథ మంతట పాటించిన ఔచితీ నిర్వహణమునకును జోహారులు పలిపిన వారే ఈ పద్యమునకై తిమ్మనను మొగ మాటము చూపక విమర్శించిరి. ఈ సందర్భమున తిమ్మన 'తప్పుడుగు నై చె' ననియు, 'పప్పులో కాలునై చె' ననియు, 'ఇదిఘోరమైన అనౌచిత్య' మనియు మరియు ననేక విధముల విమర్శకులు ఆక్షేపించియున్నారు. ఇంత వరకు ఈ ప్రసంగమును సమర్థించిన వారు ముప్పురు మాత్రమే కనుపించివారు: శ్రీయుతులు నాగపూడి కుప్పుసామయ్య, దూశి రామమూర్తి శాస్త్రి, విశ్వనాథ సత్యనారాయణ గార్లు.

శ్రీ కుప్పుసామయ్య గారి సమర్థనము మూడు వాదములు నాశ్రయించినది:

మొదటిది: 'హరివంశ మందు వ్యాసుడు వర్ణించి యుండుటచే దిమ్మకవియు బైకనినచొప్పున వర్ణించుట యనుచితము కాదు.' అనునది, ఇట్లని కుప్పు సామయ్యగారు 3 శ్లోకములను ఉదాహరించినారు.[3] ఈ శ్లోకములు ఏ సందర్భములోనివో కాని నారదకృత పారిజాత మహిమావర్ణన సందర్భములోనివి మాత్రము కావు. ఔచిత్య మనునది సందర్భమును బట్టి గదా నిర్ణయింపబడవలెను. ఈ సందర్భమున హరివంశములో నారదునిమాటలుగ 'ప్రదీప కర్మ రాత్రౌచ కరోతి కమలేక్షణే' (65 అధ్యా. 27శ్లో) అని మాత్రమే చెప్పబడినది. రాత్రి వేళ దీపము వలె నుపరికరించునను మూలము నందలి సాధారణ భావమును తిమ్మన శృంగార రసమిళితము చేసి విస్తృతపరచి. రహస్య క్రీడ, లతాంతాయుధ సంగరము, రతిశ్రమ తనూసంజాత ధారాళ ఘర్మలవములు మొదలగు వానిని కల్పించినాడు. కనుక ఈ అనౌచిత్య దోషము తిమ్మన దేగాని వ్యాసునిది కాదు. ఈ సందర్భమునే రుద్ర భట్టు విస్తరించిన విధము కూడ పరిపోల్చి చూడ దగియున్నది. మూలము నందలి 'దీపము' అనువొక్క పదము చే స్ఫూర్తిని పొందిన రుద్రభట్టు 'ఈ పుష్పము కృతకాద్రియగును, వనావళి యగును రత్న దీపమగును, మధు మాసమగును, నవోజ్జ్వల చంద్రికమగును, ఇది కానిది లేదు. ఇది సర్వా భీష్ట సిద్ధికరము (XII68) అని చాల సభ్యమైన కల్పన గావించి యున్నాడు. రుద్ర భట్టు ఔచితిని పాటించినాడనుట స్పష్టము.

శ్రీ కుప్పుసామయ్య గారి రెండవ సమర్ధనము: "ఇది రతిక్రీడా వర్ణనము కాదు. పారిజాతము రత్యుత్సాహజనకంబని మాత్రమే కవి వర్ణించెను, కేవల రతిక్రీడా వర్ణనంబుల , జేయడయ్యె," అనునది. ఇచట ఆక్షేపణీయమగుచున్నది. "సాక్షాద్ర తివర్ణనమా? రతిక్రీడా పూర్వానంతర దశా వర్ణనమా?" అనునది కాదు. నారదుని వంటి బ్రహ్మచారియగు మహర్షి రుక్మిణి వంటి సాధ్వీమణితో మాట్లాడు నప్పుడు రతిప్రసంగమును తేవచ్చునా? అనునదే విచారణీయాంశము.

శ్రీ కుప్పు సామయ్య గారి మూడవ సమర్థనము! "అట్టియసహ్యములగు శృంగారవర్ణన లాంధ్ర మహా కావ్యములలో, బ్రాయికముగ నన్నిటి. యందు గాంచనగు" నని. నిజమే ఆంధ్ర సంస్కృత మహాకావ్యములలో ఇంత కంటె పచ్చి యైన వర్ణనలు పుష్కలముగ నున్నవి, కాని ఆ సందర్భములు వేరు. జితేంద్రియుడైన, అస్ఖలితబ్రహ్మచారి యైన మహర్షి యొకడు ఒక మహా సాధ్వితో నిట్టి ప్రసంగము కావించిన సందర్భము

మాత్రము మృగ్యము.

చివరకు కుప్పు సామయ్యగారు కూడ "మఱియెచ్చోటను నిట్టి రతి ప్రస్తావమే లేని ఈ కావ్యమున నిదియు లేకుండిన లెస్సగా నుండు నని చెప్ప వలసి యుండు" నని ఈ పద్యమునెడ తమ అసంతృప్తిని వ్యక్తము చేయక తప్పినది కాదు.

శ్రీ దూశి వారి సమర్థన మిట్లున్నది: "వక్త నిరీహుఁడగుటను, వక్తవ్యము సుమమూల సుఖాతిశయము కావలసి యుండుటను, తమ్మూలమున నితర వనితల కసూయం గూర్ప మౌని తలచి యుంట నిట్టి ప్రసంగమే తలచిన దానిం గూర్ప సమర్థమై యుంటను, బై ప్రసంగము దుష్టము కాదని యెన్న వలయును." ఈ సమర్థనము కూడ పరీక్షకు నిలచునది కాదు. పారిజాత మహిమా ప్రకటనకు గాని, సవతి పోరు సృష్టించుటకు గాని ఇంత పచ్చి ప్రసంగము చేసి తీర వలసిన అవసరము లేదు. ఈ యెక్క పద్యము లేకున్నను నారదుని ప్రయోజనము నెరవేరుటకు తక్కిన ప్రసంగము చాలియున్నది. ఇక వక్త నిరీహుఁడగుట. దోషని రాసకము కాక పోగ, దోష స్థాపకమే యగు చున్నది. వక్త నారదుని వంటి మహర్షియు, శ్రోత రుక్మిణి వంటి మహా సాధ్వియు గాక ఎవరో కామమంజరీ మంచన శర్మల వంటి విటీ విటులైయున్నచో ఈ ప్రసంగము అనౌ చిత్యమనిపించుకొని యుండెడిది కాదు. ఆయా పాత్రల శీల స్వభావములకు అనుగుణమైన పాత్రోచిత ప్రసంగము ఔచితీ శోభితమేయగును గాని అనౌచిత్య మెట్లగును?

విశ్వనాథ వారి వాద ధోరణి కూడ దూశి వారి మార్గము వే అనుసరించినది: మరి కొంత ముందున కేగినది: "చెప్పిన వాని యందు అంత నిర్మమతయున్నది. వినెడు తల్లి మహాలక్ష్మి. ఆ రుక్మిణీ కృష్ణులకు దాని యందు భావమే లేదు. ఉన్నట్లు నటింతురు. వట్టి చమత్కారము. వారికిది శృంగార రసము కాదు."

నారదుడు నిర్మముడనుటలో ప్రత్య వాయము లేదు. కాని రుక్మిణీకృష్ణులు నిర్మోహులనుట నిదానించి ఆలోచింప వలసిన విషయము రుక్మిణీకృష్ణుల దివ్యత్వము భక్తి భావనకు పరిమితమైనది. కృష్ణుని చిలిపి చేష్టలను, గోపికా జారత్వమును వేదాంతార్థపరములగు వ్యాఖ్యానములతో సమర్థించుట కలదు. కావ్యప్రపంచమున మనకా వేదాంతార్థములతో పని లేదు. కావ్యమున రుక్మిణీకృష్ణులును ప్రాకృత

స్త్రీపురుషులే, వారి దాంపత్యము కూడ అందరు ఆలుమగల దాంపత్యము వంటిదే, తిమ్మన తన పాత్రలను అరిషడ్వర్గములకు అతీతులైన అవధూతలుగా చిత్రింప లేదు. తిమ్మన చిత్రించిన శ్రీకృష్ణుడు అమరావతికేగి రాగల శక్తిశాలి కావచ్చును: దేవేంద్రుని జయింపగల పరాక్రమ శాలి కావచ్చును, ఏకకాలమున 16000 ఇండ్లలో ప్రత్యక్షము కాగల మహిమోపేతుడును కావచ్చును. కాని స్త్రీ లౌల్య విషయమున అతడును సాధారణ పురుషుడే. కాదా మహారసికుడు అనవచ్చును. "అతడొక సంపన్న లౌకిక గృహస్థు. అనుకూలవతియైన భార్యతో కాపురము చేయు దక్షిణుడైన నాయకుడు.."[4] "మరి రుక్మిణి కూడ రాగ ద్వేషాదులకు అతీతురాలు కాదు సత్యతో సమానముగ రుక్మిణి కూడ 'కులమును రూపమును మగని కూరిమియు' చూచుకొని గర్వించునదియే: పారిజాతపుష్పము లాభించి ఆమె పుణ్యకవ్రతము కూడ చేసికొను చుండుట చూచి లోలోన బాధపడినదే. పర్యవసానయము రుక్మిణీ కృష్ణులు నిర్మోహులు కారనుట, ఒక వేళ వేదాంతపరుల 'అంతరార్థము' ప్రకారము వారు నిజమునకు నిర్మోహులే కావచ్చును. కాని లీలా మానుష వేషధారులై యుండుట వలన వారును సాధారణ మానవ మర్యాదలనే పాటించినట్లు 'నటింతురు' గదా ఆ 'నటన'ను సాధారణ మానవ నైతిక సూత్రములనను సరించియే గదా విమర్శింప వలసియుండును.

వక్తయు శ్రోతయు నిర్మోహులే యైనచో ఇట్టి ప్రసంగము రానేరాదు. నిర్మోహులు గాకున్నను సభ్యతాయుతులైనచో ఇట్టి ప్రసంగము రారాదు. ఎట్లయినను అనౌచిత్య దోషము తప్పునది కాదు.

విశ్వనాథ వారు మరియొక విధముగ గూడ సమర్థించు చున్నారు. "నారదుడు తాతగారి వంటి వాడు. వీరు పసి పిల్లలు కొందరు వృద్ధులు యౌవనములో నున్న పడుచు వాండ్రతో దగ్గర బంధుత్వమున్నచో, ముఖ్యముగా ప్రేమయు చనవునధికముగా నున్నచో నింత స్వాతంత్ర్యము తీసి కొందురు. ఇది లోక సహజము." నిజమే, 'కొందరు వృద్ధులు' ఇట్లు పచ్చిగా మాట్లాడుట కలదు. అందరు కాదు. ఎవరు మాట్లాడుదురు? యౌవనములో నుండగ రసికులైయుండి, వార్ధక్యము వలన దేహములో పటుత్వము నశించియు, కోర్కలు నశింపని వారు ఇట్టి వాఙ్మాత్ర రతితో ఉబలాటము తీర్చు కొనుచుందురు. నారదుడట్టి వాడా? నిజముగ సన్యాసి యైన ఒక యోగి ఇట్లు పలుకునా? పలికినచో, అతని యందు మూఢభక్తి గల వారు తప్ప, ఇతరులు మెత్తురా?

2) రెండవది 'పాటలగంధి...' పద్యము (I120) ఎంతటి భార్యా విధేయుడైనను శ్రీకృష్ణుడు ఒక ఆడు దాని పాదములకు మ్రొక్క వచ్చునా? అని ఒక ఆక్షేపణకలదు. కృష్ణుని లాలసతా ద్యోతకమైన ఈ చర్య పురుషజాతికే తలవంపులు తెచ్చుచున్న దన్నట్లు కొందరు పురుషపుంగవుల ఆక్రోశము. "ఇది చాల నీచముగ నున్నది. శ్రీకృష్ణపాత్ర జుగుప్సాకరముగ రూపొందినది, రసికత ఔచిత్యమును మర్యాదను జయించినది."[13] "అతనికి ఒక ధరాధీశ్వరున కుండ వలసిన గుణములన్నియు లుప్తమై పోయినవి."[14] అని విమర్శకులు శ్రీ కృష్ణుని చర్యను నిరసించియున్నారు.

రసికత ఒక్కొక్క సమయమున మర్యాదను జయించుట యనునది ప్రకృతి ధర్మము. ప్రకృతి ధర్మములను ఆక్షేపించి ప్రయోజనము లేదు. ప్రకృతి ధర్మానుసరణము ఉచితమే గాని అనుచితము కాజాలదు. 'రతి చక్రే ప్రవృత్తేతు నాస్తి శాస్త్రం న చ క్రమః' అనిన ప్రాచీనులును 'All is fair in love and war' అను పాశ్చాత్యులును ఇదే సత్యమును వెల్లడించినారు.

ప్రణయకుపితయైన ప్రేయసికి రసికుడైన పురుషుడు పాద ప్రణామమునాచరించుట మన ప్రాచీన శాస్త్రము తెల్ల ముక్త కంఠముగ ఆదేశించిన సదాచారము,[15] ధీరోదాత్తులైన మన ప్రాచీన వాఙ్మయ నాయకులందరును ఈ శాస్త్రా దేశమును శిరసా వహించిన వారే, రసిక చక్రవర్తి యైన శ్రీకృష్ణుడును ఈ ప్రాచీన సముదాచారమునే పాటించినాడు. కొందరకు కృష్ణుని చర్య నీచముగా కనిపించుచున్న దనగా దానికి మన రాసిక్యమర్యాదానభిజ్ఞతయే కారణము.

3) పై పద్యము వెంటనే మరి రెండు పద్యములున్నవి:

'జలజాతాసన వాసవాది సురపూజా భాజనంబై తన
ర్చు లతాంతాయుధు కన్న తండ్రి శిరమచ్చో వామ పాదంబునన్
దొలఁగన్ ద్రోపె లతాంగి; యట్లయగు నాథుల్ నేరముల్ సేయఁ బే
రలుకం జెందిన యట్టి కాంతలుచిత వ్యాపారముల్ నేర్తురే (I 121)
'నను భవదీయ దాసుని మనంబున నెయ్యపు గిన్కఁ బూని తాఁ

చిన యది వాకు మన్ననయు, చెల్వగు నీ పద పల్లవంబు మ
త్తను పులకాగ్ర కంటక వితానము సోకిన నొచ్చునంచు నే
ననియెద నల్క మానవు గదా యికనైన వరాళకుంతలా! (I 123)

మొదటి పద్యమున సత్య శ్రీకృష్ణుని శిరమును ఎడమ కాలితో తన్నుటయు, రెండవ పద్యమున కృష్ణుడు మరింతగ 'దిగ జారి పోయి' సత్యను అనునయించుటయు చెప్పబడినవి. ఎంతటి కోపనయైనను ఒక ఆడుది మగనిని తన్న వచ్చునా? అన్నది మొదటి ప్రశ్న, అంతటితోనైన పౌరుషము తెచ్చు కొనక ఈ 'మగ పురుషుడు' మరింత దిగజారి పోవచ్చునా? అన్నది రెండవ ప్రశ్న.

మొదటి ప్రశ్నకు తిమ్మనయే సమాధాన మొసగియున్నాడు. పేరలుకం జెందిన యట్టి కాంతలుచిత వ్యాపారముల్ నేర్తురే? అని. "ఇట్లు సమర్థించిన కవి చిత్త వృత్తి ఎంత లాలసమో ఊహకే అందుట లేదు."[10] అని ఈ సమర్థనము ఆక్షేపింపబడినది. ఈ చిత్తవృత్తి లాలసతా జన్యమే యైనచో ఆ లాలసత తిమ్మనది మాత్రము కాదు. 'సత్యా పాత్రము ముదిరి వసయైనది.' 'సత్య శ్రీకృష్ణుని తన్నుట చాల నీచముగా నున్నది.' అను విమర్శలు సత్యకును, తిమ్మనకును న్యాయము చేకూర్చుట లేదనవలెను. ప్రాచీన శాస్త్ర కారులుపదేశించిన మార్గమునే తిమ్మనార్యుని సత్య అనుసరించినది.[11] ఆమెకు గురుత్వము వహించిన మానవతీమణులు గీర్వాణాంధ్రవాఙ్మయములో నెందరో యున్నారు.[12]

'సామాన్యుడగు కవీశ్వరుడిట్టి యౌ చిత్యమును (పాదప్రహారమును) తన పాత్రమునకు సంఘటించుటకు వెనుదీయును.[13] రాయల యుగము నందలి కవులందరి యందు తిమ్మన అతిస్వతంత్రుడు గడసరి, ప్రజ్ఞావంతుడు.[14] 'తిమ్మన వాత్స్యాయనుని దడవి మన కొక ప్రత్యేక జాతికి చెందిన నాయికను చూపించుచున్నాడు.'[15] 'సత్య శృంగార రసాధి దేవత' 'సత్యభామయే శృంగార సర్వస్వమని తెలిపిన వారు సృష్టిలో ముప్పురన్న ముప్పురన్న ముప్పురే, మొదటి వాడు శ్రీకృష్ణుడు. రెండవ వాడు తెలుగు కవి నంది తిమ్మన్న, మూడవ వాడు సిద్ధేంద్రయోగి.'[16]

ఆ సరస సన్నివేశమునకు జీవము పోయు ఈ రసవత్తర కల్పనమును నీరసపరుచు సమర్థనయు ఒకటి కలదు, " 'తొలగన్ ద్రోసె' అన్నమాటకు 'తన్నెను'

అని అర్థం చెప్ప కూడదు. ఈ తొలగ ద్రోయటాన్ని తన్నుగా చేసినా వాడు కుహనా గోపాలుడే,"[17] "నిజమునకు సత్య తన్న లేదు. శ్రీకృష్ణుని శిరస్సును కాలితో తొలగించినది అంతే, అది అసహ్యాముము తెలిపే అమాయకపు చర్య"[18] అని సత్యను నిర్దోషురాలినిగా నిరూపించుటకై పాటుబడవలసిన పని లేదు. ఒక వస్తువును కాలితో తోలగించులకే తన్నుటయని పేరు. ఈ రెండును వేరువేరు వ్యాపారములుకావు. 'తన్నుట' లో కంటె 'తొలగద్రోయుట'లో కొంత మృదుత్వము, లాలిత్యము, సౌకుమార్యము నున్న ననవచ్చును. సత్య శ్రీకృష్ణుని తన్నిన దన్నచో కృష్ణుని మాట ఎట్లున్నను పాఠకుని మనస్సు నొచ్చును గదా. అందుచే తిమ్మన 'మృదూక్తి' నాశ్రయించినాడు, అది నిజముగా తన్ను కానిచో, అందులో అనౌచిత్యాభాస లేనిచో 'పేరలుకం జెందినయట్టి కాంతలుచిత వ్యాపారముల్ నేర్తురే.' అని తిమ్మన సమర్థింప వలసిన అవసరమే లేదు గదా.

తేలిన సారాంశము: 'జల జాతాసన..... పద్యము రసగుళిక.'

సత్యచే తన్ను తిన్న తర్వాత నైన కృష్ణుని 'ప్రణయోన్మాదమువదల,' లేదు. అతని 'చాపల్యము' మరింత ముదిరినది. 'నీవు తన్నినది నాకుమన్ననయే,' అన్నాడు. ఇది కొందరు తలచునట్లు అతని నిర్లజ్జతకును పౌరుష హీనతకును కాక అతని రసిక సార్వ భౌమత్వమునకు సూచకముగ నున్నది. కుపిత నాయికా పాదప్రహారము అందరకును లభింపగల అదృష్టము కాదు.[19] ఈ భావము తిమ్మన సొంత కల్పన కాదు. శాస్త్రకారులును, కవులును పలువురు వెల్లడించిన అభిప్రాయమే.[20] ఈ ప్రకరణమున శాస్త్ర పరిజ్ఞాతయు, నరనతా నిర్మాతయునగు నంది తిమ్మ కవీశ్వరుండిమ్మెయి వర్ణించుట సముచితంబును, శృంగార రసపోషకంబును, సహృదయ హృదయంగమంబునై యలరారెడు.[21]

సత్యా పాద ప్రహారము వలన శ్రీకృష్ణుడు అశోకుడైనాడు.[22]

'కోపముతో భార్య తన్నినచో లోకములో నిద్దరు భర్తలే యూరకుందురు ఒకడు శ్రీకృష్ణుని వంటి రసికుడు. రెండువ వాడు వట్టి అసమర్థుడు.[23] హరివంశ కృష్ణుడు గాని, జగన్నాథ విజయ కృష్ణుడు గాని ఈ రసికతా శిఖరాగ్రమున కెక్క లేక పోయివారు.

ఇట్లు 'అలినీలాలక.....' పద్య సందర్భమున తప్ప తిమ్మన అనౌచిత్యమునకు

పాల్పడె ననెడు తక్కిన అక్షేపణలన్నియు విమర్శాసహములని తేలినది. 'అలినీలాలక....' పద్యమును తిమ్మన నిర్మలయశశ్చంద్రు నందలి ఏకైక కళంకమని భావించి సహృదయు చూచియు చూడక వదలవలసినదే.[24]

ఇక రుద్రభట్టు పారిజాతహరణ కథ సదర్భమున కావించిన ఒకటి రెండు చిన్న అనౌచిత్యములను కూడ గుర్తింతము.

1) తిమ్మన గారి నారదుడు 'అలినీ లాలక....' పద్యము వలన నర్మసచివుని స్థానమునకు దిగిపోగా, రుద్రభట్టు గారి కృష్ణుడు తనకు సత్యతో నడచిన ప్రణయ కలహ వృత్తాంతము నంతటిని ఒక్క అక్షరమైనను విడువక నారదునికి పూసగ్రుచ్చి నట్లు నివేదించి అతనిని నర్మసచివుని స్థానమునకు దింపి వేసినాడున. (XIII6-5) తిమ్మన కృష్ణునిచే ఇట్లు నారదునకు చెప్పింప లేదు సరిగదా నర్మసచివ కల్పుడైన గురుడునితోనైన తన ప్రతినకు దారి తీసిన పరిస్థితులను అతి సంగ్రహమున చెప్పినాడే గాని వివరములలోనికి పోలేదు. తిమ్మన ఆ దివ్యర్షి పెద్దరికమును, కాపాడి, కావ్యౌచిత్యమును కూడ కాపాడినాడు. రుద్రభట్టు నారదుని పెద్దరికమును ఔచిత్యమును కూడ భంగ పరచినాడు. 'కాపురముగుట్టు' అను పాంపారిక ప్రథమసూత్రము తెలియని వానినిగ కృష్ణుని చిత్రించుట కూడ రుద్రభట్టు సొంతముగ చేసిన ఈ విస్తరణ వలన జరిగి ఈ అనౌచిత్యము ద్విగుణీకృతమైనది.

2) రుద్రభట్టు నారదుని కేవలము మచ్చువాలుక వానినిగ చిత్రించినాడు. కృష్ణుని యెదుట దేవేంద్రుని నిందించినాడు. అమరావతికేగి ఇంద్రుని యుద్ధమునకు ప్రోత్సహించినాడు. హరివంశములో శాంతి ప్రియుడుగ నున్న నారదుని ఇట్లు రుద్ర భట్టు కేవలవిరుద్ధ శీలముగల వానినిగ చిత్రించుట అనుచితముగ నున్నది. తిమ్మన కథలో కూడ నారదుడు కలహాశనుడే కావచ్చును. కాని అట్లని అతని మాటలలో ఎక్కడను దొరకడు. అతడు వాగ్విదాంవరుడు, కనుకనే వాచంయమియు. రుద్రభట్టు నారదుడు వాచాలుడు. అతడు ఇక్కడ పలికిన పలుకులు అక్కడగాని, అక్కడ పలికిన పలుకులు ఇక్కడ గాని పొక్కినచో నికనాతడు తల ఎత్తుకొని తిరుగ లేడు. తిమ్మన గారి నారదున కట్టి ప్రమాదమెన్నడెను కలుగదు. రుద్రభట్టు నారదుని కలహ ప్రియత్వము అతనిని ఔచిత్యమును గుర్తింప నిచ్చి నదికాదు. శచీదేవిని పట్టుకొని 'గతభాగ్యవు' అనిపించినది. ఇంతకంటెను ఘోరమైన అనుచిత ప్రసంగము "ఎవడైన బలశాలి శచీదేవినే

ఇమ్మని కోరినచో ఆమెను దేవేంద్రుడు వానికి సమర్పింప వలసిన దేవా?" యనుట, (చూ.పు.ట.) ఈ మాటలు బృహస్పతి, దిక్పాలురు మొదలగు పెద్దలందరు వినిడిన కొలువులో, శచీదేవి ఎదుటనే పలుకుట ఎంతయైన అనుచితముగనున్నదనక తప్పదు. రుక్మిణి యెదుట అతడు కావించిన సత్యానింద కూడ మేర మీరినదే. తిమ్మన నారదుని చే చేయించిన సత్యానింద అతి సంగ్రహముగను, సున్నితముగను నున్నది. నారద పాత్రను రుద్రభట్టు అనవసరముగను, అనుచితముగను చెడగొట్టినాడు.

3) అదితి కృష్ణునిస్తుతించు సందర్భమున రుద్రభట్టు ఆమెచే 'నమస్తే నమస్తేనమః' అనిపించినాడు (XII 57 ముక్తపద గ్రహణ చక్రవాళగద్య) శ్రీకృష్ణుడు భగవంతుని అవతారమేయైనను పూర్వ భవమున అదితికి కుమారుడు. అతడామెకు నమస్కరించుటయు, ఆమె అతనిని ఆశీర్వదించుటయు మాత్రమే ఉచితముగా నుండును. తిమ్మన ఇట్లే చెప్పినాడు. అదితిచే కృష్ణస్తుతిని దండకరూపమున చేయించియు, సాధారణముగ దండకములతుది యందుండు 'నమస్తే నమస్తే నమస్తేనమః' అను మాలు పలికింపక సంబోధనాంతముగనే ముగింప జేసి ఔచిత్యమును పాటించినాడు. రుద్రభట్టు గావించిన ఈ అనౌచిత్యమునకు మూలము విష్ణుపురాణ మందే కలదు.[25] రుద్రభట్టు అనౌచిత్యమును సరిదిద్ద లేదు. తిమ్మన నేర్పుతో ఆ అనౌచిత్యమును తొలగించినాడు.

తల్లిచే తనయునకు నమస్కరింప జేయక ఔచితిని పాటించిన తిమ్మన అగ్రజుడైన దేవేంద్రునిచే అనుజుడైన ఉపేంద్రునకు స్వాగతమొసగు సమయమున సాగిలబడి మ్రొక్కజేసి ఔచితీభంగమునే కావించినాడు. హరి వంశపు తొలికథలో కృష్ణుడే దేవేంద్రునకు నమస్కరించినాడు.[26] ఇది ఉచితముగా నున్నది. విష్ణుపురాణము ఎవరెవరికి నమస్కరించినారో తెలుప లేదు. రుద్రభట్టు కూడ ఈ విషయమును అస్పష్టముగనే వదలినాడు. తిమ్మన మాత్రము విష్ణు పారమ్య బుద్ధితో ఇంద్రోపేంద్రులకు గల సంబంధమును మరచి కృష్ణునొక సార్వ భౌమునిగను, ఇంద్రునొక సామంతునిగను చిత్రించి అనౌచితికి పాల్పడినాడు.

ఇవి యన్నియు చిన్న చిన్న అనౌచిత్యములు, వీనివటుంచి తిమ్మన రుద్రభట్టు లిరువురును ఔచితీ నిర్వహణలో ప్రదర్శించిన ప్రశంసనీయమగు సంయమముతో కూడిన సందర్భమును గమనింతము సత్యాకృష్ణుల రహఃక్రీడలను వీరిరువురును సభ్యత మేర

మీరనంత వరకే వర్ణించి ఆ జగత్పితరుల యెడ చూపవలసిన పూజ్య భావమును ఔచిత్యమును చక్కగా కాపాడినారు. తిమ్మనకు సత్యాకృష్ణుల రహః క్రీడలను వర్ణింపగల సందర్భములు రెండు లభించినవి. ఒకసారి శయనాగారమును, అందలి భోగ సామగ్రిని విపులముగ వర్ణించి 'యదు వల్లభుండు సత్యయుందాను.... శయనాగారంబున వినోద కేలిందేలి నిద్రాముద్రిత నేత్రుఁ డై శయనించె' (II 53) అనియు, మరొకసారి.

ఆ రాత్రి సత్యఁ గూడి ము

రారి ముదం బెసఁగ వైజయంతమున మనో

భూరాజ్య సౌఖ్యనిద్రా

పారీణత మందుచోఁ బ్రభాతంబయ్యెన్ (IV 48)

అనియు అతిసంగ్రహముగను సభ్యముగను సూచించి ముందునకు సాగి పోయినాడు. రుద్రభట్టునకు ఇట్టి సందర్భము ఒక్కసారి వచ్చినది. అతడు కూడ

'ఆరాత్రి యొళ్ మధు సూదనం సత్య భామెయ సూళ్గె వందు సురతా మృతార్ణవ దొళోలాడి సుఖసుప్తియిం దిర్పినం.....' (XIII 35వ)

(ఆరాత్రి మధుసూదనుడు సత్యభామ వంతునకు వచ్చి సురతామృతార్ణవ మందోలాడి సుఖ సుప్తి యందుండగా)

అని సంగ్రహముగను సభ్యతా యుతముగను చెప్పినాడు. రుద్రభట్టు 'సురతా మృతార్ణవ' పదము కొంత జుగుప్సా జనకముగనే యున్నను ఇట్టి సందర్భములందు ఇతర కవులు ప్రయోగించు పదములు, చేయు వర్ణనలతో పోల్చిచూచినపుడు ఎంతయైన సభ్యముగ నున్నదని చెప్పక తప్పదు.

ఇట్లీ ఇరువురును ఈ సందర్భమున పాటించిన సంయమముతో కూడిన ఔచిత్యము ముందు వీరివురిలో దొరలిన ఒకటి రెండు చిన్న అనౌచిత్యదోషములు మరుగున పడుచున్నవన వచ్చును.

మొత్తము మీద రుద్రభట్టు తిమ్మన లిరువురును ఔచిత్య పోషణలో సమస్కందులు.

# నామౌచిత్యము

కావ్యమును రచించుట ఒక ఎత్తు. దానికి నామకరణము గావించుట ఒక యెత్తు. కావ్యమునకు నామకరణము గావించుటలో కూడ కవిప్రతిభ దర్శనీయ మగుచున్నది.

రుద్రభట్టు కావ్యమున జగన్నాథుడైన శ్రీకృష్ణుని ఏకోత్తరశత కృత్యములు అభివర్ణితములైనవి. అందుచే అతడు తన కావ్యమునకు జగన్నాథవిజయమని పేరు పెట్టుట సార్థకముగను ఔచిత్యవంతముగను నున్నది.

కృష్ణుని ఏకోత్తర శతకృత్యములలో 'పారిజాతాపహరణ' కావ్యకథతో సంవదించు భాగమును రుద్రభట్టు పదికృత్యములుగా పేరు పెట్టినాడు. 1. నరకవధ, 2. షోడశ సహస్ర దివ్యకాంతాస్వీకరణం. 3. విబుధజననీ కుండల ప్రదానం, 4. రుక్మిణీ పుణ్యక వ్రతం, 5. ప్రద్యుమ్నాది సహస్రకుమారోత్పత్తి, 6. నారద దత్త పారిజాత ప్రసూన నిమిత్త సత్యభామా ప్రణయ కలహం, 7. పారిజాతహరణం, 8. సత్యభామాపౌలోమీ సోపహాసవచనం, 9. సురేశ్వరాపజయం, 10. త్రిపురాంతక దర్శనం ఈపది పేర్లలో 'నరక వధ', 'పారిజాతహరణం' మొదలగు కొన్ని పేర్లు మట్టసముగ, ముచ్చటగ నుండగా, 'నారదదత్త పారిజాత ప్రసూననిమిత్త సత్యభామా ప్రణయ కలహం' మొదలగునవి 'కొండవీటి చేంతాడు' వలె అతి దీర్ఘముగానున్నవి అందువలన ఈ పేర్లకు సమరూపత లోపించినది.

శ్రీకృష్ణుని కృత్యములు అని చెప్పబడిన వీనిలో నరకవధ, దివ్య కాంతా స్వీకరణము, కుండల ప్రదానము, పారిజాత హరణము అనునవి మాత్రమే శ్రీకృష్ణుని కృత్యములు, మిగిలిన వానిని కావ్యగత కథాంశములు అనినచో చెల్లును గాని శ్రీకృష్ణుని కృత్యములు అని చెప్పుట అసంగతముగ నున్నది.

తిమ్మన తన కావ్యమునకు 'పారిజాతాపహరణము' అని పేరు పెట్టినాడు, ఈ కథ సంస్కృత హరివంశ భాగవతములలో 'పారిజాతహరణము' అని మాత్రమే చెప్పబడియున్నది.[1] బమ్మెర పోతరాజు గారు ఈకథను 'పారిజాతాపహరణము' అని చెప్పియుండుటను తిమ్మన గమనించియుండెను. 'గోపికా వస్త్రాపహరణము' అనినట్లు

గనే 'పారిజాతాపహరణము' అనుటే శ్రీకృష్ణుని లీలలకు అనుగుణముగ నున్నదని ఆయన తలచియుండును. 'హరణము' కంటే 'అపహరణము' ధూర్తత్వమును ప్రకటించుటలో అధికసమర్థము. ఇందలి కథా నాయకుడు 'ధూర్తగోపాలుడు' గదా.

'పారిజాతాపహరణము' అనుటలో నొక శ్లేషయునిమిడి యుండ వచ్చును. ఈ సమాసమును 'పారిజాత + అపహరణము' అనియే గాక 'పారిజా+తాప+హరణము' అని కూడ విభజించుటకు వీలున్నది. 'పారిజా' 'పారిజాత' శబ్దములు సమానార్థకములు, 'పారిజా' కారణముగ కలిగిన సత్యా కోపతాపమును హరించుట అను అర్థాంతరము స్ఫురించు అవకాశమున్నది. పారిజాతము వలన క్రోధాగ్ని తప్తయైన సత్యభామ యొక్క సాంత్వనము అన్నమాట.[2]

'పారిజా' అనగా లక్ష్మీదేవి అని కూడ అర్థము. ధ్వని ప్రధానమైన ఈ కావ్యమున శ్రీకృష్ణ దేవరాయడే ఆదినారాయణుడుకాగా అతని పట్ట పురాణియగు తిరుమలదేవి లక్ష్మి దేవియగుచున్నది. తిరుమల దేవి యొక్క విరహతాపమును హరింపజేయుటకే ఈ కావ్యము పుట్టినదని కింవదంతి కలదుగదా.[3]

తిమ్మన కావ్య నామౌచిత్యమును గూర్చి శ్రీవిశ్వనాథ సత్యనారాయణ గారు చాల అర్థవంతమగు ఒక అభిప్రాయమును వెల్లడించినారు. "ఈ పుస్తకము పేరు పారిజాతాపహరణము అని పెట్ట కూడదు. నిజానికి ఈ పుస్తకము పేరు సత్యభామ సంసారము అని పెట్టవలయును.[4]

రెండు కారణముల వలన శ్రీసత్యనారాయణ గారి అభిప్రాయము సమర్థనీయమగుచున్నది. 1) ఇతి వృత్తము, 2) రసము.

1) ఈ కావ్యము నందలి పంచమాశ్వాసము 52వ పద్యముతో పారిజాతా పహరణ కథ ముగియుచున్నది. అపైన గల 55 పద్యముల గ్రంథము పుణ్యక వ్రతమునకు సంబంధించినది. పుణ్యకవ్రతాచరణ సందర్భముగా పారిజాతవృక్షమునకు ప్రాధ్యానమున్నను పారిజాతాపహరణ గ్రంథనామమునకు పుణ్యకవ్రతముతో నెట్టి సంబంధమును లేదు.

2) పేరును బట్టియే 'పారిజాతాపహరణము' వీరరసప్రధానము కావలసియున్నది. కాని తిమ్మన దీనిని శృంగార రసప్రధానముగా రచించియున్నాడు.

వీరరసమును అంగరసముగ మాత్రమే పోషించియున్నాడు.

ఈ కారణముల వలన ఈ కావ్యమునకు శ్రీసత్యానారాయణగారు సెలవిచ్చినట్లు 'సత్యభామ సంసారము' మనియో, లేక రాయలవారివలె 'సత్యాసాంత్వన' మనియో 'ప్రీణన' మనియో పేరు పెట్టిన మరింత బాగుండెడింది.

'దీనిని నాటకముగా నారద విజయమని గాని, శచీగర్వభంగమని పేర్కొనదగును', అని శ్రీవేటూరి ప్రభాకర శాస్త్రిగారి అభిప్రాయము.[5] తిమ్మన విష్ణుపురాణ కథనే పూర్తిగ అనుసరించియున్నచో 'పారిజాతాపహరణము' శచీగర్వభంగమైయుండెడిది. తిమ్మన కథా ప్రణాళిక నను సరించి శచీ దేవికి గర్వమున్న సూచనయే లేదు. ఇక ఆమెకు గర్వభంగప్రసక్తి ఎక్కడిది? నారదుని సన్నుగడ నెరవేరినందున ఇది 'నారద విజయము' కావచ్చునేమో, నారదుడు సత్యా కృష్ణులకుగాని, కృష్ణ దేవేంద్రులకు గాని కలహమును బుద్ధి పూర్వకముగ కల్పించిన సూచన 'పారిజాతాపహరణము' నందెచ్చటనులేదు. నారదుని దీవెనల వలన ప్రయోజనమును పొందినది సత్య భామయే. కనుక ఈ కావ్యమునకు 'సత్యావిజయము' అని పేరు పెట్టినచో సార్థకమై యుండెడిది[6].

## నాటకీయత

సంస్కృతమున గల నాటకముల[1] వంటివి తెలుగులోను కన్నడములోను రచించు వాడుక ఏర్పడియుండని కాలములో దృశ్య శ్రవ్యకావ్యోభయ ప్రయోజనములను సాధించుటకై ఉభయ లక్షణ లక్షితములై ప్రబంధములు రచియింపబడినవి, ప్రబంధ జాతికి చెందిన జగన్నాథ విజయ పారిజాతాపహరణ కావ్యములందు నాటకీయత ఎంత వరకు పోషింపబడినదో పరిశీలింతము.

నాటకీయతను ఇతి వృత్త సంధానము, సన్నివేశకల్పన, సంభాషణా వైచిత్రి అని మూడు అంశములుగా విభజించు కొనవచ్చును.

### ఇతివృత్త సంధానము

నాటకమునకు వస్త్వైక్యము, నాయకైక్యము, రసైక్యము అనునవి అవశ్యకములు. రుద్రభట్టు తిమ్మన లిరువురును తమగ్రంథములలో ఈ త్రివిధములగు ఐక్యములను పాటించినారు.

1. వస్త్వైక్యము : తిమ్మన కావ్యమున పారిజాతాపహరణమే వస్తువు. పుణ్యక వ్రత వృత్తాంతము దీనికి పుచ్ఛభూత మైయున్నది. సత్యభామ కృష్ణుని పారిజాత వృక్షమునకు బంధించి నారదునకు దాన మొసంగినది. కాని పారిజాతా పహరణ కథతో ఈ పుణ్యకవ్రతమున కెట్టి సంబంధమును లేదు. కనుక పుణ్యకవ్రతోదంతమును చేర్చుట వలన తిమ్మన కావ్యములో వస్త్వైక్యము భంగమైనదని కొందరు పండితులు చేసిన విమర్శలో కొంత సత్యము లేక పోలేదు. తిమ్మన తన కావ్యమునకు పారిజాతాపహరణ మనిగాక 'సత్యావిజయ' మని నామకరణము గావించియున్నచో ఈ కథను చేర్చుట ఒప్పియుండెడిది, రుద్రభట్టు కావ్యమున శ్రీకృష్ణుని పుట్టుక మొదలు సాల్వవధ వరకు గల ఏకోత్తరశత కృత్యములు అభివర్ణితములు. శ్రీకృష్ణావతార చరిత్రను సమష్టిగ గైకొనినచో జగన్నాథ విజయ కావ్యమున వస్త్వైక్యము కలదనియే చెప్ప వలెను. పారిజాతహరణ కథా భాగమును మాత్రమే గైకొనినను అందు వస్త్వైక్యము కలదనుట స్వయం సిద్ధము.

2. నాయకైక్యము : ఈ రెండు కావ్యములందును నాయకుడు శ్రీకృష్ణుడే. రెండింటి యందును నాయకైక్యము చక్కగా పాటింపబడినది. నాయకుడగు శ్రీకృష్ణుడు నాట్య శాస్త్ర పరిభాష ననుసరించి ధీరోదాత్తుడు, దక్షిణుడు, దివ్యాదివ్యుడు నగుటచే నాటకమున నాయకుడగుటకు తగియున్నాడు. ఉభయ కావ్యములలోను పారిజాతహరణ కథా భాగమున ప్రతి నాయకుడనదగిన దేవేంద్రుడు ధీరోద్ధతుడగ చిత్రింపబడియున్నాడు.

3. రసైక్యము : నాటకమున వీర శృంగారములలో నేదైన నొకటి అంగిరసముగను, తక్కిన రసములు అంగరసములుగను ఉండదగునని రూపకలాక్షణికుల నిర్దేశము. తిమ్మన కావ్యమున అంగిరసము శృంగారము. అంగరసములలో వీరము ప్రధానమైనది. కాగా రుద్రభట్ట కావ్యము మొత్తము మీదను, పారిజాతహరణ కథా భాగమున కూడ వీరరసము అంగిరసముగను, శృంగారము ప్రధాన అంగరసముగను, పోషింపబడినవి. కనుక ఉభయకావ్యములలోను రసైక్యము నిర్వహింపబడినది.

సన్నివేశకల్పన :

పారిజాతాపహరణకావ్యము ఐదంకములుగ విభజించు కొనదగియున్నది.

ప్రథమాంకము (రుక్మిణీ మందిరాంకము) :- రుక్మిణీ కృష్ణుల ద్యూత

వినోదము, నారదాగమనము, పారిజాత పుష్ప ప్రదానము, పారిజాత మహిమా రుక్మిణీ సౌభాగ్యము ప్రశంస, సత్యానింద, కృష్ణనిర్గమనము (I 43-67, 103)

ద్వితీయాంకము (సత్యా మందిరాంకము):- సత్యా నిరీక్షణ, చేట్యాగమనము, పారిజాత వృత్తాంత నివేదనము, సత్యామానము, కోపాగార ప్రవేశము. శ్రీకృష్ణాగమనము, సత్యా అనునయము, ప్రతిజ్ఞా కరణము, నారదాగమనము, అతిథ్యము, సందేశ ప్రేషణము (I 38-136- II2-29)

తృతీయాంకము (ప్రయాణాంకము):- గరుడునిరాక, వార్తాలాపము, అమరావతీ వర్ణన, దేవతా స్వాగతము, అదితి దర్శనము, కుండల ప్రదానము, వైజయంత ప్రవేశము వనవిహారము (II 72-103, IV2-41)[2]

చతుర్థాంకము (యుద్ధాంకము):- పారిజాత దర్శనము, ఉత్పాటనము, వనరక్షుల తర్జనము, ఇంద్రోపేంద్రుల యుద్ధము[3] ఇంద్రపరాజయము, క్షమాపణ కోరుట, సత్యాకృష్ణులు ద్వారకకు తిరుగు ప్రయాణమగుట (IV 50-906 V2-42)

అర్థోపక్షే పకము (ప్రవేశకము లేక విష్కంభము):- పారిజాత స్థాపన, నారదా గమనము, పణ్యకవ్రతోపదేశము, వ్రతసన్నాహములు (V 43-75)

పంచమాంకము (పుణ్యకవ్రతాంకము) :- వ్రతాచరణ, దానము, ప్రతిగ్రహము, నారదకృత వినోదము, నారదకృత కృష్ణస్తుతి, భరత వాక్యము (I76-103)

జగన్నాథ విజయ మందలి పారిజాతహరణ కథ భాగమును కూడ ఇట్లే రుక్మిణీ మందిరాంకము, సత్యామందిరాంకము, సుధర్మాంకము, సుధర్మాంకము, యుద్ధాంకము అని నాలుగంకములుగ విభజింపవచ్చును.

మొదటి రెండు అంకములును తిమ్మన రుద్రభట్టుల కావ్యములలో దాదాపు సమానమే. కథా ప్రణాళిక యందలి భేదము వలన తృతీయ చతుర్థాంకములు భిన్నములు. తిమ్మనలో పంచమాంకము అదనము.

మొత్తము మీద సన్నివేశ కల్పన ఉభయ కావ్యములలోను నాటకీయముగనే మలపబడినదని చెప్ప వచ్చును.

సంభాషణ వైచిత్రి:- దృశ్య శ్రవ్య కావ్యములకు గల ప్రధాన భేద మిచ్చుటనే

యున్నది. శ్రవ్య కావ్యములు కథా కథనాత్మకములు దృశ్యకావ్యములు ఉక్తి ప్రత్యుక్త్యాత్మకములు. శ్రవ్య కావ్యములలో కవి తనకు తానై ఎన్ని ప్రసంగముల నైనను చేయ వచ్చును. దృశ్య కావ్యములలో కవికి ప్రత్యక్షముగా స్థానము లేదు. అతడేమి చెప్ప దలచినను ఏదోయొక పాత్ర ముఖముననే పలికింప వలసియున్నది.

తిమ్మన పారిజాతాపహరణమున తానై చెప్పిన కథ తక్కువ, ఎక్కువగ పాత్రలనోటి మాటలుగనే కథను చెప్పినాడు తిమ్మన గావించిన వర్ణనలలో ఆ నాటకీయత మరింత స్ఫుటమగుచున్నది. మేరుపర్వత, అమరావతీ, నందనవన పారిజాతతరు వర్ణనలను తిమ్మన తానై చేయక కృష్ణునిచే చేయించినాడు ప్రభాత వర్ణనను నైతాళికుల చేత చేయించినాడు. సంధ్యా అంధకార, చంద్రికా, వైజయంత, పుణ్యక సంరంభ వర్ణనలను మాత్రము శ్రవ్యకావ్య పద్ధతిలో తానే కావించినాడు.

ఇప్పుడు తిమ్మన కూర్చిన సంభాషణల తీరును పరిశీలింతము.

ప్రథమాంకమగు రుక్మిణీ మందిరాంకమున అభ్యాగతుడగు నారదునితో.

శ్రీకృష్ణుడు : 'సురసంయమివర....మునీ (I 47) అని పలుకగా
నారదుడు : 'మర్త్యుఁ డాడెడు రీతిన్....మురారీ (I 48-51) అని
ప్రత్యుత్తర మొసంగును నారదడొసగిన పుష్పమును చేతబూని
కృష్ణుడు : (స్వగతము) 'ఇది భోజాత్మజ..... సంపఁగా' (I 54)
అని వితర్కించు కొనును పారిజాత మహిమను రుక్మిణితో.
నారదుడు: 'జలజాక్షి.... అరుగున్ అని ప్రసంగించును.
కృష్ణుడు : (స్వగతము) 'మునినాకిచ్చిన....కల్పించెనో' (I 103)
అని తనలో తాను తర్కించు కొనును. ఇది యంతయు దృశ్యకావ్యమునే తలపింప జేయుచున్నది. ఇదిగాక నారదునకు ఆసనము కొని తెండని రుక్మిణి పరిచారికలకు కనుసన్న చేయుట, పుష్పమును రుక్మిణి కొసగుమని నారదుడు కృష్ణునకు కన్నుసన్న చేయుట మున్నగు అభినయ సూచనలను తిమ్మన సమయాను కూలముగ వ్రాసినాడు.

ద్వితీయాంకమున దగిన సత్యామందిర సన్నివేశములో సత్య తనకు కలిగిన దశ్శకునములను దాసితో

సత్యా: 'అకటయదేమియో... ఏమిసేసెనో. (I 73) (అనునంతలో)

దాసి: (ప్రవేశించి) 'అమ్మా ఏమని.... వారిజనేత్రా' (I 75-81)

సత్య : 'ఏమేమీ.... చెలియా' (I 82-97) అని ఇట్లు సంభాషణ సాగును సత్య కోపాగారమున ప్రవేశించిన తరువాత.

కృష్ణుడు : (స్వగతము) 'కనక పంజర.... వాక్కా' (I 106)

అని శంకించుచు సత్యను సమీపించును. తరువాత సత్యా కృష్ణుల సంభాషణ లిట్లుసాగును.

కృష్ణుడు : 'ఇందునిభాస్య.....నీ చెఱుంగవే' (I 115-118)

(సత్యభామ పై చెఱంగొడియును)

సత్య: (చేవిరిదమ్మి వ్రేయుటకు నైయుంకించి జంకించును)

కృష్ణుడు : (సత్య పాదములకు మ్రొక్కును).

సత్య : (కృష్ణుని శిరమును వామపాదమున తొలగద్రోయును).

కృష్ణుడు: 'నను భవదీయదాసుని... అరాళకుంతలా (I 123)

సత్య: (నిక్కి, కచపంక్తిని ముడిన్వెడ దోపుచు, పై చెఱంగు చనుదోయి జేర్చుచు) ఈ నయగారపుం... ఎవ్వతెగాజూచితిని (I 125-123) (ముఖము పై చేల చెఱంగిడి యేడ్చును).

ఇట్లు వ్రాసినచో నిది నాకటమనుటకు ఆక్షేపణ ఏమి కలదు?

రుద్రభట్టు కావ్యము ఏకోత్తర శతకృత్యములతో అతి దీర్ఘ వస్తుసమన్వి తమగుటచే నాతి దీర్ఘమగు వస్తువు గల తిమ్మన కావ్యము వలె నాటకీయమగ ఉక్తి ప్రత్యుక్తులతో కూర్చుటకు అంతగా అనువైనది కాదు. ఐనను పారిజాతాపహరణ కథా భాగమునాతడు చాల వరకు నాటకీయ సంభాషణ ధోరణిలోనే సంతరించినాడు. ఈ ఈ కథా భాగమందలి నాటక ధర్మమాతనిని ఆకర్షించిన దనుట స్పష్టము:

ప్రథమాంకమన దగిన రుక్మిణీ మందిర సన్నివేశమును నారదుడు: 'ఇదనె తలదొడవు....సభె యొళ్ (XIII 67-74) అని నాటకీయముగనే ప్రసంగించును.

ద్వితీయాంక మన దగిన సత్యామందిర సన్నివేశమున సత్యా కృష్ణుల సంభాషణ ఇట్లునడచినది.

కృష్ణుడు: 'పారావత వులియదర.... చందన రసమం' (XII 88-92)

సత్య: 'నీ వతీదు....కొఱచాడువుదే' (XII 93) (కన్నీరు కార్చును)
కృష్ణుడు: (కన్నీటిని దోసిట గ్రహించి వక్షమునకు పులుముకొనును.)
సత్య: 'ప్రియమప్ప వస్తువం.... అనుజ్ఞెయం (XII 98-99)
కృష్ణుడు: 'పంకరూహ వదనె.... పెఱ తొందుంటే (XII 98-99)
సత్య: 'ప్రియమప్ప వస్తువం.... అనుజ్ఞెయం (XII 100-108)
కృష్ణుడు: 'రమణీ... ప్రతిజ్ఞోక్తియం. (XII 109)

తరువాత కృష్ణనారదుల సంభాషణ ఇట్లు నడచినది.

కృష్ణుడు: 'సవతిగె కొట్ట... ప్రతిజ్ఞెయం (XII 15)
నారదుడు: (స్వగతము) కలహం పుట్టిదలే.... కలహోలో కార్థి
(ప్రకాశము) దేవ... బల్లరే (XIII 16-17)
కృష్ణుడు: 'దేవియరత్తియం.... కళెదు కొండనిల్ల' (XIII 20వ)
కృష్ణుడు: 'అగజేశంగె... అమోఘం'. (XIII 21,22)
నారదుడు: 'దేవ నీవప్పొడె... మన దాగ్రహమం' (XIII 23-27)
కృష్ణుడు: 'ఎలె నారద కేళు... బందపెవె,' (XIII 28వ-32వ)

కృష్ణవైన తేయుల సంభాషణ మిట్లుసాగినది.

గరుడుడు: 'తవె దిక్కుండాలమం.... బెససి దేను' (XIII 38)
కృష్ణుడు: 'అనుపమతర్క్య.... విక్రమగుణం. (XIII 39, 40)
గరుడుడు : 'దేవర సామర్ధ్య..... విక్రమవెన్నొళ్ (XIII 40)

సుధర్మారంగమున శచీ, దేవేంద్ర, నారద, బృహస్పతుల సంభాషణ నాటకీయముగ నడచిన విధము గుమనింపదగియున్నది.

వనపాలకరు: (శచితో) 'తనకే కగ్గద...ఉత్సాహదిం' (XII 49)
శచి : (ఇంద్రునితో) ఎనగతి ఖేద... దూసతిం' (XIII 51)
బృహస్పతి : 'కలహ క్రీడెగె.... మరుద్భూజమం (XIII 52)
నారదుడు : 'దివిజాధీశన.... ఎంబందమే (XIII 53,54)
ఇంద్రుడు : 'బగెగెందుం.... సోల్వెం. (XIII 55)
నారదుడు : ప్రాకృత మర్త్య.... శచీ (XIII 59)
శచీ: 'అనిమేషానొకహం.... నిల్వై (XIII 59)

ఇంద్రుడు : 'దివిజమహీరుహం..... అంగిరా' (XIII 60)

యుద్ధ రంగమున శచీ సత్యా వాగ్వివాదము రుద్రభట్టు ఉక్తి ప్రత్యుక్తి రచనా నైపుణ్యమునకు పతాకా ప్రాయముగనున్నది.

సత్య: 'కులగోత్రవైరి.... చిత్రం' (XIII 78,79)

శచి: 'రథచరణ పాణి.... పోలంగళిం' (XIII 80,81)

సత్య: 'భగమొదర్చె.... మహేంద్రనా' (XIII 82)

శచి: 'సిడిలెవ్నో పంగె..... సత్యభామె' (XIII 83)

సత్య: అసురయమదండ..... ఇంద్రత్వముం' (XIII 84-86)

శచి: 'ఒందు విటలాక్షి.... అస్పదనే' (XIII 87)

సత్య: 'ఉసిరల్బేడ.... పరోజాక్ష నాళ్' (XIII 88)

రుద్రభట్టు రచనలో అధిక భాగము ఉక్తి ప్రత్యుక్త్యాత్మకముగనే యున్నది. నిజమునకు విస్తృతమైన ఇతి వృత్తము వెన్నుకొనిన రుద్రభట్టున కంటె పరిమితమైన ఇతి వృత్తము వెన్ను కొనిన తిమ్మన ఉక్తి ప్రత్యుక్తుల నింకను ఎక్కువగ కూర్ప గలిగి యుండెను. అది కావ్యగాత్ర వృద్ధికి కూడ సహాయకమై యుండెడిది. కాని తిమ్మన విస్తృతమైన వర్ణనల కిచ్చి నంత ప్రాధాన్యమును ఉక్తి ప్రత్యుక్తులకీయ లేదనుట యథార్థము

## సంధులు - సంధ్యంగములు

తిమ్మన నాట్య శాస్త్ర మర్యాదలనను గుర్తించి తన ప్రబంధమును రచించిన వాడు. కనుకనే 'పారిజాతాపహరణము'లో అర్థ ప్రకృతులు, కార్యావస్థలు, సంధులు, సంధ్యంగములు గుర్తించుటకు వీలగుచున్నది. రుద్రభట్టు తన కావ్యమందలి ఏకదేశమైన 'పారిజాతహరణ' కథా భాగమును ప్రత్యేకముగ నాటక లక్షణ లక్షితముగ నిర్మింప వలెనను ప్రయత్నమును సహజముగనే చేయ లేదు. అందుచేత తిమ్మన కావ్యములో వలె ఆయా నాటకాంగముల నన్నింటిని రుద్రభట్టు కావ్యములో గుర్తించుట అసాధ్యము. ఐనను చాల వరకు నాటక చ్ఛాయలగల రుద్రభట్టు కావ్యగత పారిజాతహరణ కథా భాగము నుండి కూడ సాధ్యమైనంత వరకు ఆయానాటకాంగములను గుర్తించుటకు ప్రయత్నింతము.

<u>కార్యావస్థలు :</u>

తిమ్మన తన కావ్యమును ఐదు ఆశ్వాసములుగ విభజించి యున్నాడు. ఈ ఆశ్వాస విభజన అంక విభజనతో సరిపోవుచున్నదని ఆచార్య పింగళి లక్ష్మీ కాంతము గారు సెలవిచ్చి యుండిరి[7] కాని తిమ్మన తన ఆశ్వాసములను అంకములుగా ఏర్పరచి యుండ లేదు అనుటకు ఇంతకు ముందుగా (పుట 304) మనము గుర్తించిన అంక విభజనమే సాక్షి. కార్యవస్థా పంచకమునే ఆశ్వాస పంచకముగా తిమ్మన రూపొందించి యున్నాడు.

'ఫలప్రాప్తికై నాయకుడు కావించెడు ప్రయత్నములే కార్యావస్థలు[8] ఆరంభ, యత్న, ప్రాప్త్యాశా, నియతాప్తి, ఫలాగమములని కార్యావస్థలు అయిదు.

1. ఆరంభమా: "ఇదుగో, ఈ ప్రయోజనమును నేను సాధించి తీరెదను," అను నాయకుని పూనికయే ఆరంభమనబడును.

'పారిజాతాపహరణము' ప్రథమాశ్వాసములో పారిజాతమును సత్యభామ పెరటిలో నాటింతుననె కృష్ణుని ప్రతినయే ఆరంభము. 'జగన్నాథ విజయములో కూడ ఈ కథా భాగము గల (XII 61-110) భాగము ఆరంభము

2. యత్నము: "రెట్టింపైన కడంకతో తొందరలో ఆకార్యఫలమును సాధించుటకు చేయునట్టి చేష్టాదికము యత్నము."

'పారిజాతాపహరణము' ద్వితీయాశ్వాసమున శ్రీకృష్ణుడు తాను అమరావతికి వచ్చుచున్నట్లు నారదుని ద్వారా ఇంద్రునకు సందేశము సంపుట పారిజాతాహరణమునకై గరుడారూఢుడై బయలు దేరుటే యత్నము. 'జగన్నాథ విజయము'లో కూడ ఈ కథా భాగము గల గ్రంథ భాగము (XII 1-44) యత్నము.

3. ప్రాప్త్యాశ: "కావ్యఫల లాభము అనిశ్చితమైనచో అది ప్రాప్త్యాశ."

తృతీయాంకమున పారిజాత దర్శన పర్యంతము కార్యఫల లాభము అనిశ్చితమగు వలన అదియే ప్రాప్త్యాశ 'జగన్నాథ విజయము'లో ద్వారక నుండి తిన్నగ పారిజాత వృక్షము వద్దకే ఒకే ఉదుటున వచ్చిచేరినారు. కనుక జగన్నాథ విజయములో 'ప్రాప్త్యాశ' లేదు.

4. నియతాప్తి: "ఈప్సితార్థము నిక్కముగా చేకూరునను దృఢనిశ్చయమే నియతాప్తి."

చతుర్థా శ్వాసములో కృష్ణుడు పారిజాతోత్పాటనము గావించి గరుడుని స్కంధము పై నుంచినాడు ఈప్సితార్థము నెరవేరునను నిశ్చయ మేర్పడినది. కనుక 'పారిజాతావహరణము'లో చతుర్థాశ్వాసమే నియతాప్తి. 'జగన్నాథ విజయము'లో ఈ కథా భాగము అతి సంగ్రహముగ నున్నది. (XIII 46-47). ఈ రెండు పద్యములే అందు నియతాప్తి.

5. ఫలాగమము: "ఏ ఫల లాభమునకై పూనిక వట్టెనో యట్టి ఫలము సంపూర్ణముగా లభించుటయే ఫలాగమము."

పంచమాశ్వాసములోనే కృష్ణుని విజయము, పారిజాతమును సత్యభామ పెరటిలో నాటించి కృష్ణుడు తన పూనిన ప్రతినను నెరవేర్చు కొనుట జరిగినది. కనుక ఇది ఫలాగమము. 'జగన్నాథ విజయము'లో కూడ ఈ కథా భాగము గల గ్రంథ భాగము (XIII 48-100, XIV 1-3) ఫలాగమము.

కార్యావస్థలకు పిమ్మట అర్థ ప్రకృతులను గుర్తింతము.

'అర్థ ప్రకృతులనగా ఫలహేతువులు.[10] ఇవియైదు. బీజ, బిందు, పతాకా, ప్రకరీ, కార్యములని వీని పేర్లు.

1. బీజము : "బీజమను నీయర్థ ప్రకృతి ప్రథమమున అల్పముగ నుండి పోను పోను నాయ కోపనాయక ప్రతి నాయకులకు సంబంధించిన కథాంశములతో విస్తరిల్లి త్రివర్గ రూపమగు ఫలమునకు హేతువై అన్వర్థమగుచున్నది."

పారిజాతాపహరణ కథా మహావృక్షమునకు నారదుడు కృష్ణునిచే రుక్మిణికి పారిజాత పుష్పమిప్పించుటే బీజము, ఉభయ కావ్యములకును ఇది సామాన్యమే

2. బిందువు: "అప్రధానములగు కథాంశముల వలన ప్రధాన కథకు విచ్ఛేదము కలుగ నుండ వట్టి విచ్ఛేదము కలుగు నీయకుండుటకు హేతువైనది బిందువనబడును.

పారిజాత పుష్పధారణము వలన రుక్మిణీ సౌభాగ్యాతిశయము, సపత్నులు

ఆమె యాధిక్యము నంగీ కరించుట యను విచ్ఛేద కథాంశముల నడుమ సత్యభామ కోపాగారమును ప్రవేశించుటతో పారిజాపహరణ ప్రయత్నము విస్తరిల్లినది. కనుక సత్యామానమే బిందువు. ఇదియును ఉభయకావ్యములకు సామాన్యమే.

3. పతాక: "ప్రధాన కథకు అంగమై తత్పోషకమై కొంత దూరము ప్రధానకథతో పాటు వ్యాపించు నట్టి కథ పతాక యనబడును."

పతాక కథా నాయకునికే పీఠమర్దుడని నామాంతరము. ఇతడు ప్రధాన నాయకుని కన్న కొంచెము తక్కువ గుణములు కలవాడు[11]

'మఱియు నితడు ప్రాసంగికేతి వృత్త మునకు నాయకుడగుటచే నీతనికి ప్రత్యేక ప్రయోజనము కూడ కలదు.[12]

'పారిజాతాపహరణము'లో ప్రధాన కథానాయకుడైన కృష్ణునకు సహాయకుడైన గరుడుడే పతాకానాయకుడు. ఒకప్పుడు ఇంద్రునిచే వజ్రాయుధముతో కొట్టబడియున్న గరుడునకు నాటి నుండి ఇంద్రుని పై గల పగ చల్లార లేదు. శ్రీకృష్ణుని పారిజాతాపహరణ ప్రయత్నమును విన్నంతనే గరుడుడు 'ఆ పగనీగెద నేఁడు నీకృపన్' అని సంతోషించినాడు. పిదప యుద్ధమున వీర విహారము గావించి ఇంద్రుని బలమును చీకాకు పడ జేసి స్వామి కార్యముతో పాటు స్వప్రయోజనమును కూడ సాధించుకొనినాడు. కనుక గరుడుని వృత్తాంతమే పతాక.

'జగన్నాథ విజయము'లో గరుడుడు పతాకానాయకుని స్థానమున కెక్క లేక పోయినాడు. అందతనికి స్వప్రయోజనము లేదు. అతడు కృష్ణునకు వాహనము, సేవకుడు మాత్రమే, కనుక 'జగన్నాథ విజయ' మందలి పారిజాతహరణ కథలో పతాక లేదు.

4. ప్రకరి: "పతాక వలె ప్రధాన కథతో సుదూరము వ్యాపింపక కొంత దూరము మాత్రమే సాగునట్టి ఉపకథ ప్రకరి యనబడును."

సత్యా కృష్ణులు అదితిని దర్శించి ఆమెకు కుండలముల నొసంగుటయు, ఆమె వారిని దీవించుటయు 'పారిజాతాపహరణము' నందు ప్రకరి.

'జగన్నాథ విజయము'లో ఈ కథా భాగమునకు పారిజాతహరణ కథతో

వెట్టి సంబంధమును లేదు, నారదుడు కృష్ణునకు పారిజాత పుష్పము నొసంగక పూర్వమే ఈ వృత్తాంతము నడచి నట్లు రుద్రభట్టు రచించియున్నాడు. కనుక 'జగన్నాథ విజయ' మందలి పారిజాతహరణ కథలో ప్రకరి లేదు.

5. కార్యము : "ప్రధాన ఫలమును నిర్వహించునట్టి కట్ట కడపటి కథానయము కార్యమనబడును.

ప్రధాన ఫలమైన పారిజాతహరణమును నిర్వహించు నట్టి ఇంద్రో పేంద్రుల యుద్ధమే కార్యము. ఇది ఉభయ కావ్యములకును సామాన్యమే.

<u>సంధులు :</u>

ఇప్పుడు క్రమ ప్రాప్తములైన సంధులను గుర్తింతము.

సాంకేతిక పద జాలమును తొలగించినచో. ఇతి వృత్త విభాగములకే సంధులని పేరు[13] నాటక సంధులైదు. ముఖ, ప్రతిముఖ, గర్భ, విమర్శ, నిర్వహణములు.

1. ముఖ సంధి : "బీజ సముత్పత్తియే ముఖ సంధి"

నారదుడు కృష్ణునిచే రుక్మిణికి పారిజాత పుష్పము నిప్పించుటయే బీజమని ఇది వరలో (పుట 310) గుర్తించి యున్నాము. కనుక ఈ కథా భాగము గల రుక్మిణీ మందిరసన్ని వేశమే ముఖ సంధి.

2. ప్రతిముఖ సంధి: "బీజము ప్రకాశించుటయే ప్రతిముఖ సంధి."

సత్యామాన, సాంత్వన కథా భాగములు గల సత్యా మందిర సన్నివేశమే ప్రతి ముఖ సంధి.

3. గర్భసంధి: "వ్యక్తావ్యక్త మైన బీజము నన్వేషించుటే గర్భసంధి."

పారిజాతహరణమునకై బయలు దేరుటే గర్భసంధి.

4. విమర్శ సంధి: "బీజార్థమును గూర్చి చేయబడు పర్యాలోచనము విమర్శ సంధి"

యుద్ధము వరకు నడచిన పారిజాతాపహరణ సంబంధ సంభాషణాదికమే విమర్శ సంధి.

5. నిర్వహణ సంధి: "బీజయుక్తములగు ముఖ్య సంధ్యా ద్యర్థములకు ఎందు ప్రధాన ప్రయోజనము కలుగునో అది నిర్వహణ సంధి."

సత్యా మందిరకేళీ వనమున పారిజాతమును ప్రతిష్ఠించుటే నిర్వహణ సంధి.

ఈ సంధులు కావ్య ద్వయమునకు సామాన్యములుగనే యున్నవి.

సంధ్యంగములుగ చెప్పబడిన ఉపక్షేపాదులను కూడ తిమ్మన పారిజాతాపహరణమున గుర్తింపగలము. బృహద్గ్రంథ మందలి ఏకదేశ మాత్రమగు రుద్రభట్ట 'పారిజాతాపహరణము'న వీని నన్నింటిని గుర్తింపలేము.

ఇతివృత్త సంధానము నందు పతాకా ప్రకరులను తిమ్మన కూర్చినాడు. రుద్రభట్టు కూర్పలేదు గనుక తిమ్మనదే పై చేయి. సన్నివేశకల్పనలో ఇరువురును సమానులే. సంభాషణ నైచిత్రిలో రుద్రభట్టెక్కుడు నేర్పును ప్రదర్శించినాడు. మొత్తము మీద నాటకీయత ఇరువురి రచనలలోను చక్కగ పోషింపబడినది.

'ప్రబంధములలో నాటక కౌశలమున్పగ్య' మను విమర్శ యొకటి కలదు.[14] ఈ విమర్శ ఇతర ప్రబంధములకు చెల్లును, కాని పారాజాతాపహరణమునకు చెల్లదు. పండిత విమర్శకులు పారిజాతాపహరణ ప్రబంధ నాటకీయతను వేనోళ్ళ పొగడుచున్నారు.

## పాత్ర చిత్రణ

కవి యొక్క ప్రతిభను ప్రకటించు అంశములలో పాత్ర చిత్రణ మొకటి. పాత్రలను సజీవములుగా తీర్చిదిద్దుట ప్రతిభావంతుడైన కవికే సాధ్యము. తిమ్మన రుద్రభట్టులు ఆయా పాత్రలను మలచినరీతులను తులనాత్మకముగ పరిశీలింతము. వారివురకు మార్గదర్శకములైన హరివంశ, విష్ణుపురాణములలో ఆయా పాత్రలు చిత్రింపబడియున్న తీరునుగూడ గమనించిననేగాని వారి వారి స్వతంత్రసృష్టి స్వరూపము గోచరింపదు. కనుక ఒక్కొక్క పాత్రను ఆ రెండు పురాణములును, ఈ రెండు కావ్యములును రూపొందించిన రీతులను పరిశీలింతము.

**శ్రీకృష్ణుడు :**

హరివంశపు తొలి కథననుసరించి కృష్ణుడు కేవలము కన్నపుదొంగ.

దేవేంద్రునకు అతిథియైయుండి అతని అనుమతితో నందన వన విహారము గావించుచు పారిజాతము కనుపించగనే దానిని పెల్లగించుకొని వెంటనే ద్వారక దారి పట్టినాడు.

విష్ణు పురాణ కథ ననుసరించి కృష్ణుడు మహావీరుడు. పారిజాతమును పెల్లగింపగనే పారిపోవక, దేవేంద్రుడు యుద్ధసన్నద్ధుడై వచ్చువరకు వేచియుండి, ఆతనిని ఓడించిగాని నందన వనమును దాటిపోలేదు. పారిజాతము నపహరించుటకు కూడ ఆతనికి ఆ సుర తరువుపైగల ఆశగాక, తన భార్యకు కలిగిన అవమానమునకు ప్రతీకారము చేయు తలంపే కారణము.[1] కనుకనే ఇంద్రుని ఓడించిన పిమ్మట పారిజాతము నాతనికీజూపి తన పరద్రవ్య విముఖత్వమును ప్రకటించినాడు. తనచే పరాజితుడైన ఇంద్రుని తానే క్షమాపణ కోరుకొనుటలో గూడ అతని వినీత భావము వెల్లడియగుచున్నది. ఇట్లు విష్ణు పురాణము నందలి శ్రీకృష్ణుడు సర్వవిధముల ధీరోదాత్తనాయకుడన దగియున్నాడు.

హరివంశపు మలికథ యందలి కృష్ణుడు. స్త్రీ లోలుడు. అలిగిన ఇల్లాలిని చల్లబరచుటకై ముందు వెనుకలాలోచింపక సురులసొత్తును తెచ్చి ఇత్తునని వాగ్దానమొనర్చినాడు. అనాలోచితముగ తాను గావించిన ప్రతిన భంగమైనచో లోకములు తలక్రిందులగునని చెప్పి తన పట్టుదలను సమర్థించుకొనినాడు. తాను దేవేంద్రునకు అనుజుడు గనుక తాను కోరినదే తడవుగ తన కోరికను తీర్చవలసిన బాధ్యత అగ్రజుడైన దేవేంద్రునిపై కలదట. అట్లాతడు అడిగినంతనే మరియాదగ పారిజాతము నొసంగనిచో కౌమోదకీ గదతో ఆతని వక్షమును మోదెదనని ఈ బుల్లి తమ్ముని బెదిరింపు. 'చంకదుడ్డు శరణార్థి' యను నానుడికి శ్రీకృష్ణుని సందేశము చక్కని ఉదాహరణ. ఇంతకంటే దురాగతము వేరుండబోదు. దేవేంద్రుని వక్షము నెమ్మటలో గూడ ఈ కృష్ణుడు గావించిన శచీ (వక్షోజమ్మదిత) ప్రసంగము ఆతడు అన్న వదినలయెడ అణుమాత్రమైన గౌరవము లేనివాడని తెలుపుచున్నది. ఈ కృష్ణుడు తన ముద్దుల పెండ్లపు మురిపెమునే చూచు కొనినాడుగాని, తన భుజబలమునే చూచుకొనినాడు గాని, ధర్మా ధర్మములను గాని, న్యాయాన్యాయములనుగాని, చుట్టరికపు మరియాదనుగాని చూచినవాడుకాడు. సంఘములో గొప్పవాడు నడచిన మార్గమునే సామాన్యులును అనుసరింతురని[2] తెలిసియుండియు కృష్ణుడు లోకమునకు తన నడవడి వలన మంచి నరవడి నేర్పరుపలేదు.

తన భార్యలు పుణ్యక వ్రతము నాచరింప గోరుచున్నారు. గావున, దానికై

పారిజాతవృక్షమును అరువుగా నొసంగుమని శ్రీ కృష్ణుడు దేవేంద్రునకు సందేశమంపినాడు. ఈ సందేశమును పంపుటలో కృష్ణుని ఉద్దేశ్యము ఏమో తెలియకున్నది. ఏమనగా కృష్ణుని పత్నులు ఇంతవరకు పుణ్యక వ్రతపు పేరైన వినియుండలేదు. సత్యాకృష్ణులకు నారదుడప్పుడే ప్రసంగ వశమున పుణ్యక వ్రతపు పేరు తెలిపియున్నాడు. అంతకు ముందే కృష్ణుడు పారిజాతమును తెచ్చియిత్తునని సత్యకు వాగ్దానము గావించి యున్నాడు. సత్య పారిజాతమును కోరినది రుక్మిణి కంటె తన ఆధిక్యమును నిరూపించు కొనుటకేగాని పుణ్యకవ్రతాచరణకు కాదు. తానామెకు పారిజాతమును శాశ్వతముగ నుండునట్లు తెచ్చి యిత్తుననియే వాగ్దానము చేసి యున్నాడు గాని నాలుగు దినములపాటు ఉంచుకొని మరల ఇచ్చునట్లు కాదు. కృష్ణుని ఈ సందేశము కపటముతో కూడియున్నది.

పారిజాతము కొరకు అమరావతిపై దండెత్తిపోవుట అధర్మమని కృష్ణునకు తెలియును. బలరామ, వసుదేవాదులకీ సంగతి ముందుగా తెలిసినచో వారు తన దురుద్యమమును ఆక్షేపింతురనియు, ప్రయాణము నడ్డగింతురనియు కృష్ణుని భయము. అందుచేతనే తన అమరావతీ ప్రయాణమును రహస్యముగనే ఉంచినాడు. మృగయా వ్యపదేశమున రైవతకాద్రికేగి అటునుండియే అమరావతి కేగినాడు.

కృష్ణుడు వీరుడనుట మాత్రము నిశ్చయము. రేపటి రేపకడనే నేను దండెత్తి రానున్నానని నారదుని ద్వారా ఇంద్రునకు ముందుగనే సందేశ మంపినాడు. అదే విధముగ దండెత్తిపోయి పారిజాతము మత్పాటించినాడు. వెంటనే ద్వారకా మార్గము పట్టి రాక ఇంద్రుని రాకను నిరీక్షించుచు అమరావతికి ప్రదక్షిణము లాచరించుచుండినాడు. యుద్ధ మధ్యమున ఐరావతము గరుడునిచే భంగపడినపుడు నేటికి యుద్ధము, విరమించి, విశ్రాంతి గైకొని, రేపటి యుదయము మరల యుద్ధము ప్రారంభింపుమని చెప్పి ఇంద్రుని పంపి తన వీరత్వపుటౌదార్యమును వెల్ల డించినాడు. ఐనను ఈ హరివంశ కృష్ణునకు విష్ణు పురాణ కృష్ణుని వలె దేవతా సైన్యముతో ఒంటరియై పోరాడగల ధైర్యము లేదు. కనుకనే తనకు బాసటగా సాత్యకి ప్రద్యుమ్నులను వెంటనిడుకొని పోయినాడు. వీరు ఇరువురును యుద్ధమున కృష్ణునకు చాల సాయము గావించినారు. వీరి తోడ్పాటు లేనిచో కృష్ణుడు పారిజాతమును రక్షించుకొనలేకపోయెడివాడే.

అదితి కశ్యపులయెడ కృష్ణుడును ఇంద్రునితో సమముగ భక్తిని నెరపినాడు.

"అల్ప కారణమును పురస్కరించుకొని అసోదరుల వలె ఇట్లు కారాడుకొనుట మీకు తగదు." అని ఇంద్రునితోపాటు కృష్ణుడు కూడ అదితి చేత చీవాట్లు తినినాడు. "అగ్రజ గౌరవము లేకుండ ప్రవర్తించితివి" అను దేవేంద్రుని ఎత్తి పొడుపునకు తలయొగ్గినాడు, అదితికిగాని, ఇంద్రునకుగాని, కృష్ణుడు ఏమియు సమాధానము చెప్పుకొన లేకపోయినాడు.

కృష్ణుడు పుణ్యక వ్రతపు వంక చెప్పుటచే అదితి ఇంద్రునిచే కృష్ణునకు పారిజాతము నిప్పించినది. కాని వ్రతము ముగియగనే తిరిగి పారిజాతమును తెచ్చి నందన వనమున స్థాపింపుమని కృష్ణుని గట్టిగ హెచ్చరించినది. అందులకు కృష్ణుడు తన సమ్మతిని తెలిపి పారిజాతముతో ద్వారక చేరినాడు. ఏ మాట కామాట చెప్పికొనవలెను. పెద్దల యెదుట గావించిన వాగ్దానమునకు కృష్ణుడు కట్టుబడినాడు. తన భార్యలందరిచే పుణ్యక వ్రతము నాచరింపజేసి ఏడాదికాగనే తిరిగి పారిజాతమును గొనిపోయి దేవేంద్రుని కప్పగించినాడు. అందులకు సత్యనెట్లంగీకరింప జేసినాడో తెలియదు.

కృష్ణుని శృంగార నాయకత్వమును గురించి చెప్పి కొనవలసినది ఎంతైన కలదు. అతడు దక్షిణ నాయక శిరోమణి 16,000 మంది ఇల్లాండ్రతో సంసారము సాగించుట ఆ మహానుభావునకే చెల్లినది. రుక్మిణి ఎదుట నున్నపుడు రుక్మిణీ ప్రియునివలెనే మెలగును. సత్య సముఖమున సత్యావిధేయుని వలెనే సంచరించును. అలక పానుపు నెక్కిన సత్యను లాలించి అనుకూలముగావించు కొనుటలో అతడు ప్రదర్శించిన నేర్పు, ఓర్పు, కపటనటనలు, మాటకారితనము మెచ్చదగినవి. సత్యకు సేవకుని వలె వీవనతో విసరినాడు. వలపు లొలుక బోసినాడు. బూటకపుటొట్లు పెట్టుకొనినాడు. చేయరాని వాగ్దానములు చేసినాడు; చివరకు నెగ్గినాడు.

సత్యా పుణ్యక వ్రతావసానమున నారదునకు కింకరుడై అతని చేతిలో కోతివలెనాడి తన శృంగార రసికతనే గాక హాస్యరసికతను గూడ కృష్ణుడు వెల్లడించినాడు. అతిథియగు నారదుని ఆదరించి పూజించి భోజనాదులచే సంతృప్తుని గావించి గృహస్థ ధర్మమును పరిపాలించినాడు.

రుద్రభట్టు చిత్రించిన శ్రీ కృష్ణుడు శృంగార నాయకుడుగ హరి వంశ కృష్ణుని

అడుగుజాడలనే అనుసరించినాడు. పుణ్యక వ్రతమున నారదునకు సేవలు చేయు ప్రసంగమీ కథయందు లేనందున హాస్య రసపోషణకంతగా అవకాశము లేకపోయినది. ఐనను సత్య కృష్ణుని వంక కోపవీక్షణములను ప్రసరింపజేయగా ఆతడు భీతుని వలె నటించుచు ఒక మూలకొదుగుట కొంత నవ్వు పుట్టించును. ఈ కృష్ణుడు పారిజాతము కొరకై పుణ్యక వ్రతపు వంక చెప్పలేదు. ఉన్న నిజమునే చెప్పినాడు. తన అమరావతీ యాత్రను గురించి ముందుగా బలదేవాదులకు చెప్పినాడో లేదో తెలియదు. దేవేంద్రునకు మాత్రము ముందుగనే హెచ్చరిక గావించియే పారిజాతము నపహరించినాడు. ఆ సంగతి అందరకును తెలియునట్లు శంఖము పూరించి యుద్ధాహ్వానము గావించినాడు. ప్రద్యుమ్న సాత్యకి సహాయుడైగాక సత్యా ద్వితీయుడై దేవతా కోటితో పోరి గెలిచిన ఈ రుద్రభట్టుని కృష్ణుడు హరివంశ కృష్ణుని కంటె అధిక వీరుడగుచున్నాడు. ఈ విషయములో ఈతడు విష్ణు పురాణ కృష్ణుని పోలుచున్నాడు. కాని విష్ణు పురాణములో వలె పారిజాతమును తిరిగి దేవేంద్రునకీజూపు ఔదార్య మిందు ప్రదర్శితము కాలేదు. రుద్రభట్టు చిత్రించిన కృష్ణుడు కలహ భోజికి కలహ భోజనమునే పెట్టినాడు. నిజమగు భోజనమును పెట్టినవాడు కాడు. ఇతడు గావించిన శచీకుచ క్రీడా ప్రసంగము హరివంశమందు కంటె వాచ్యముగను, అవాచ్యముగను నున్నది. మొత్తము మీద ఈ కృష్ణుడు స్త్రీ లోలుడు, వీరుడువని చెప్పవలెను. మాయావి కాడు; కాని మరియాద లెరుగని మోటుమానిసి యగుట మాత్రము నిజము. కనుకనే విజయము పొందియు బిల్వోదకేశ్వరుని మందలింపునకు లోనైనాడు.

తిమ్మన చిత్రించిన కృష్ణుడు ధూర్తగోపాలుడు; జగన్నాటక సూత్రధారి, శృంగార రస రసికుడుగ హరి వంశకృష్ణుని, యుద్ధవీరుడుగ విష్ణు పురాణ కృష్ణుని ఇతడు పోలియున్నాడు. ఆయా లక్షణములలో వారి కంటె మేటి. ఈతనికి సత్యయెడ భయ భక్తులు మెండు. తనను గూర్చి ఆమెకు చెలులు గిట్టని సంగతులేమి చెప్పెదరోయని వారికి లంచములిచ్చి మంచి గావించు కొనుచుండును. నారదుడు తనకు పారిజాతము నీయగనే ఈతని మనసులో సత్యయే మెదలినది. ఆమె ననునయించుటలో ఈతడు పలికిన నయగారపు ప్రియములు, మొగమిచ్చుమాటలు, పోయిన పలుపోకల మాయదారి నటనలు హరివంశ కృష్ణుని మించి పోయినవి. కొంతకు కొంత పచ్చిగా గూడనున్నవి. ఇవి యేవియు సత్యా గురుకోపమును శమింప జేయలేక పోగా ఇతడు ఆమె పాదములకు

నమస్కరించి తన కామ శాస్త్ర పాండిత్యమును ప్రయోగాత్మకముగా ప్రదర్శించినాడు[3]. సత్యా వామ పాద ప్రహార భూషితుడై ధన్యుడై 'అశోకుడైనాడు. ఈ పట్టున ఈతడు కుపితుడుగాక మరింతగ వినయమును ప్రదర్శించి తాను రసిక శిఖామణి, శృంగారి శేఖరుడునని నిరూపించు కొనినాడు. ' కోపముతో భార్య తన్నినచో లోకములో నిద్దరు భర్తలేయూరకుందురు. ఒకడు శ్రీకృష్ణునివంటి మహారసికుడు, రెండవ వాడు వట్టి అసమర్థుడు [3].

అమరావతీ పుర రాజవీధుల వెంట నూరేగుచు తన మోహన రూపముతో వేల్పు వెలదులకు వెఱ్ఱులెత్తించియు, ఆలమంద నడిమి ఆబోతువలె అచ్చరలతో కలసి వన విహార జల క్రీడాదులు నెరపియు, ఈతడు తన శృంగార పరాయణతను చక్కగా ప్రకటించినాడు. తనను గాంచి సురసుందరీమణులు గావించు విభ్రమ చేష్టలను సత్యభామకు చూపి ఆమె మనసునకు గిలిగింతలు పెట్టి కొంటెతనమును ప్రదర్శించినాడు ఇక పుణ్యక వ్రత సందర్భమున నారదుని దర్శకత్వము క్రింద నీతడు అభినయించిన కపట నటనలు ఈతనిని హాస్యరసికులలో కూడ అగ్రేసరుని గావించుచున్నవి.

ఏకాంగవీరుడై, కళత్రవంతుడై దేవతా సైన్యమును, దిక్పాలురను, దేవేంద్రుని గెల్చుటలోను, దేవేంద్రునకు పారిజాతమును తిరిగి ఈజూపుటలోను ఇతడు విష్ణు పురాణ కృష్ణునే పోలియున్నను 'నీమఱందలీ కొమ్మ కోరిన'దని సన్నసన్నగా అంటించినాడు. పాపము దేవేంద్రుడు బావగారి 'బడాయీ' చూపుటకై ఇష్టము లేకున్నను పారిజాతమునకు నీరు వదులు కొనక తప్పినది కాదు. ఇది కృష్ణుని మాటకారి తనపు గెలుపు.

మాయావిత్వము నందును తిమ్మనగారి కృష్ణుడు అందరను తలదన్నుచున్నాడు. తన అమరావతీ యాత్ర యందలి ప్రధానోద్దేశము పారిజాతాపహరణమేయైనను ఆ విషయము నెక్కడను వెలిబుచ్చినావాడు కాదు. అదితి కుండలముల నామెకు సమర్పించుటకే నాకమునకేగు చున్నట్లు నాటకమాడినాడు. నారదుని ద్వారా దేవేంద్రునకట్లే సందేశము పంపినాడు; బలరామాదులకును అదే విధముగ చెప్పినాడు. తనకు అత్యంతాప్తుడగుటచే వైనతేయున కొక్కనికి మాత్రము ఉన్న నిజమును చెప్పినాడు. తన కన్ను పారిజాతముపై పడినదను విషయము ఏ మాత్రము పొక్కినను దేవేంద్రుడు ముందుగనే జాగ్రత్తపడి దానిని తన కంట పడకుండు

వట్లు చేయవచ్చును. లేక 'భోళాశంకరుని' మోసపుచ్చినట్లే ఏదో యొక కథవల్లి తన ముందరి కాళ్ళకు బంధము వైచి సామముతోనే 'పారిజాతము నా కక్కరలేదులెమ్మ' అని తన చేతనే అనిపింపవచ్చును. కనుకనే కృష్ణుడు పారిజాతమును పెల్లగించు వరకు దేవేంద్రునికెట్టి సందేహమును కలుగ కుండునట్లు జాగ్రత్తపడినాడు.

మొత్తము మీద తిమ్మన చిత్రించిన శ్రీకృష్ణుడు స్త్రీలోలుడు, రసిక చక్రవర్తి, పరిహాస ప్రియుడు, మాటకారి, మహావీరుడు, మాయావి, పరద్రవ్యాపహారి. ధీరోదాత్త లక్షణములతోబాటు కొలదిగ ధీరోద్ధత, ధీరలలిత లక్షణములను కూడ తనలో సంతరించుకొనినవాడు. శృంగార నాయకులలో ప్రధానముగ దక్షిణ నాయకుడుగ ఉదాహరణీయుడైనను ఎడనెడ ధృష్ట, శఠ లక్షణములకు గూడ లక్ష్య భూతుడగుచున్నాడు. శృంగార రస సర్వస్వమనదగినవాడు[4].

'కృష్ణుడీ కథాభాగములో ఒక సాధారణ గృహస్థు. మానవాతీత శక్తుల నెక్కడను కనబరచడు. బహుభార్యలను కలిగియుండుట వలన వచ్చు అనర్థములకు గురియై అగచాట్లు పడినాడు[5] 'శ్రీ కృష్ణునకు శృంగారము రసికతగా గాక దొడ్డ చాపల్యముగా పరిణమించినది. దీనియందు అతనికి ఒక ధరాధీశ్వరునకుండ వలసిన యన్ని గుణములు లుప్తమైపోయినవి. ఈ శ్రీకృష్ణుడొక లాలసతా స్వరూపము. శృంగారమునకు మచ్చుతునక; ఉద్రేకి, ఈ కృష్ణుని వెనుక లీలగా రాయ లున్నాడు.[6]

**సత్యభామ :**

'భామాశబ్దము స్త్రీ సామాన్యవాచి. సత్యభామకు భామయనియు రూఢ్యర్థమున పర్యాయ వ్యవహారము కలిగినదనగా ఆమెలో భామాత్వము మూర్తీభవించిన దన్నమాట[7] "ఈ సత్యాపాత్ర నిర్మాణము ఆంధ్రులదే అగుట విశేషము[8]". ఆంధ్ర వాఙ్మయమున తొలుదొల్త ప్రబంధనాయికగా సత్యభామ పాత్రను సర్వాంగ సుందరముగా తీర్చిదిద్దిన వారు ముక్కు తిమ్మనగారు[9]

'ఆంధ్రులు అల్లారు ముద్దుగా అతి గారాబంగా చూసుకొనే కావ్యనాయిక సత్యభామ. కూచిపూడి వారి ధర్మమా అని ఈమె కలాపమంతా తెలుగునాట మారుమ్రోగింది. అయితే ఈమె రూపు రేఖలూ, కోపతాపాలూ, తొలిసారిగా ప్రస్ఫుటంగా చిత్రించిన కవి నంది తిమ్మనగారు[10]

హరివంశపు తొలికథలో పారిజాతాపహరణ సమయమున సత్యభామ శ్రీకృష్ణుని ప్రక్కన గలదన్న మాటయే గాని ఆమె నిర్వహించిన పాత్ర యేమియు లేదు. కనీసము ఆమె పారిజాతమును కోరనైనలేదు. శ్రీకృష్ణుడే ముచ్చటపడి దొంగిలి తెచ్చికొన్నాడు. పూర్వభవమున అత్తగారైన అదితికి భక్తితో మ్రొక్కి సత్య ఉత్తమ వధువనిపించుకొన్నది.

విష్ణు పురాణమునందు కూడ ఆమె అత్తగారి యెడ భక్తి నెరపినది. ఐనను ఇచట ఆమె ప్రధానముగ అభిమానవతిగ, రోషశాలినిగ, ప్రతీకారపరాయణగ కనిపించుచున్నది. తనకు పారిజాత పుష్పమొసంగక అవమానించిన శచీదేవికి శృంగభంగ మొనర్చినగాని ఆమె కోపము శాంతింపలేదు. "పారిజాత పుష్పధారిణినై సపత్నుల మధ్య శోభిల్లెదను." అని మాటలో మాటగా పలికినను, పారిజాతాపహరణమునకు కృష్ణుని ప్రేరేపించుటలో ఆమె ప్రధాన లక్ష్యము శచీగర్వ భంగమే. కనుకనే ఇంద్రుని పరాజయానంతరము పరస్వత్వాపహార దోషము లేకుండ పారిజాతమును దేవేంద్రునకామెయే తిరిగి ఈజూపినది. ఔద్ధత్యమునకే సత్య మారుపేరు. పారిజాతాపహరణము నడ్డగించిన వనపాలకులకు సమాధానమొసంగుటకు కృష్ణునకవకాశ మీయక తానే ముందునకు వచ్చినది. ఆమె పలికిన పలుకులు ఆమె పలుకుల లోనే 'గర్వోద్ధతాక్షరములే' తన మానుషీత్వమును వాక్కి వక్కాణించి దేవతల కెందును మానవులు తీసిపోరని నిరూపించినవి. యుద్ధాంతమున పలాయన పరాయణుడగుచున్న బావగారగు ఇంద్రుని పరిహసించుట మాత్రము కులవధూ మర్యాదకు మీరినదని చెప్పక తప్పదు. కృష్ణుడామె కొసంగిన మితి మీరిన చనవు, తాను వీర వనితనను అహంకారము ఆమె చేనట్లు పలికించినది.

హరివంశపు మలికథ యందలి సత్య రూప యౌవన సౌభాగ్యగర్విత, మానిని, స్పర్ధాళువు, కోపన, త్రేతాయుగములోని కైకమ్మ తరువాత కోపగృహము నలంకరించిన లలనామణి ద్వాపర యుగమందలి సత్యాదేవియే. "మొగుడి మీద అలిగే భార్యలలో సత్యభామకే అగ్రతాంబూల మివ్వాలి.[11]" ఐనను ఈమె కులవధూ మర్యాదను మీరిపోలేదు. ఎంత సేపటికిని తన దురదృష్టమునే నిందించు కొన్నదిగాని, గట్టిగా కృష్ణుని తిట్టనైన లేదు. పూలు దాల్చిన చోటనే కట్టెలు మోయవలసి వచ్చినందున జీవితము వ్యర్థమని, సంసారము నిస్సారమని భావించినది. అందుచే తపస్సునకేగ గోరినది. కాని

భర్త అనుమతి లేనిదే తపోవ్రతాదులు గావించు స్వాతంత్ర్యము కూడ మగనాలికి లేదుగాన కృష్ణుని అనుమతిని కోరినది. ఈ సత్య కల్ల కపటము లెరుగని అమాయకురాలు. నిగూఢమానమును ప్రదర్శించుట చేతగాని ముద్దరాలు. "నీకోపమునకు కారణమేమి? అని కృష్ణుడు ప్రశ్నింపగనే "నీవు పారిజాతమును రుక్మిణికొసంగుట వలనను, నారదకృత రుక్మిణీ ప్రశంసను, అస్మన్నిందను నీవు విని హర్షించుట చేతను అలిగితి"నని మరుగు లేకుండ చెప్పివైచినది. "నీకు పారిజాత వృక్షమునే తెచ్చి యిచ్చెదనని కృష్ణుడు పలుకగనే" అట్లైన నా అలుకపోయినది," అని పలుకు సత్య ఎంత బేలయో అనిపించును. కొలది గడియలకు ముందే తనను నిందించిన నారదుడు తన ఇంటికి అతిథియై రాగా అతనిని భక్తితో పూజించుట సత్యలోగల క్షమాగుణమునకు సూచకముగ నున్నది. పారిజాతాపహరణమునకై అమరావతి కేగుచున్న మగని వెంట సత్య తానును బయలుదేరలేదు. తన స్థానము అంతఃపురముననేగాని రణరంగమున కాదని ఆమె తలచియుండును. 'అల్లరి తనది, అనుభవము అందరిది' అనునది ఈ సత్య యెడ సార్ధకమైనది. సత్య పుణ్యామా అని ఆమె సపత్ను లందరును పారిజాతమున కధికారిణులైనారు; అందరును పుణ్యక వ్రతము నాచరించ గల్గినారు. అందులకు సత్య అభ్యంతరము చెప్పలేదు. ఏడాది దాటగనే తిరిగి పారిజాతమును నందన వనమును చేర్చుటకు కూడ ఈ సత్య అడ్డు చెప్పలేదు. మొత్తము మీద జగన్నాథ విజయ, పారిజాతాపహరణ కావ్యములందలి సత్య కన్న ఈ హరివంశ పౌరాణిక సత్య చాల సాధువన వలసియున్నది.

రుద్రభట్టు చిత్రించిన సత్య సపత్నీ మాత్సర్యము నందును, కోప గృహప్రవేశము నందును, పూలరేకులు త్రుంచి వేయుటలోను, చందన చషకమును నేలపై కొట్టుటలోను, తపస్సు కనుమతి నిమ్మని కృష్ణుని కోరుటలోను తు.చ. తప్పక హరివంశ సత్య అడుగు జాడలనే అనుసరించినది. ఐన ఈమె మగని వెంట యుద్ధరంగమునకును బయలుదేరినది. వనపాలురతో గర్వోద్ధతోక్తులు పలుకలేదు. కాని శచీదేవితో వాగ్యుద్ధమే కావించినది. శచీదేవి ఎంత మాట నేర్పు లేనిదో, ఈమె అంత మాటకారి. శచి పలికిన ఒక్కొక్క మాటను ఆమెకే త్రిప్పికొట్టి ఆమెను నిరుత్తరురాలిని గావించిన సత్య వాక్చాతుర్యము మెచ్చదగినది. ఈ పట్టున ఆమెలో వెల్లడియైనది వాక్పారుష్యము కంటే వాక్చాతుర్యమే అనవలెను. ఐనను దేవేంద్రుడు

అంధకాస్త్రమును ప్రయోగించినపుడు 'కౌశిక' శబ్దశ్లేష నాశ్రయించి ఆతనిని 'గూబ' యనుట మాత్రము వాక్పారుష్యమే అనక తప్పదు.

తిమ్మన చిత్రించిన సత్య శృంగార నాయికా శిరోమణి. రూపయౌవన సౌభాగ్య గర్వము, సపత్నీ మాత్సర్యము, అనుగుణములకు ప్రపంచ వాఙ్మయములో ప్రథమోదాహరణము కాదగినది తిమ్మనగారి సత్య, ఆమె అభిమాన పరురాలో, అహంకార పరురాలో చెప్పుట కష్టము.

అది యొక శృంగార వనము. దానిలో నొక క్రీడా పర్వతము. దాని పొంత చక్కగా తీర్చి దిద్దిన పూదేనియ ఏటికాలువ. దాని దరిని చెంగల్వ పుప్పొళ్ళు నించిన చంద్రోపలవేది. ఆ వేదికపై వాసీనురాలై సత్య మనకు ప్రథమ దర్శనము ననుగ్రహించును. ఆ సన్నివేశపు సొబగే ఆమె అభిరుచులలోని లాలిత్యమును వెల్లడించు చున్నది. అపుడామె చెలులతో సరస గోష్ఠి గావించుచున్నది. గోష్ఠీ విషయము శౌరికథలే. రేయింబవళ్ళు, జాగ్రత్స్వప్న సుషుప్తులందు ఆమెకు శ్రీ కృష్ణ ధ్యానమే. ఆమె నిరంతర శ్రీ కృష్ణ పరాయణ, మధుర భక్తి ప్రతీక.

రుక్మిణి ఇంటనున్న శ్రీకృష్ణుని వద్దకు తానంపిన దూతిక పునరాగమనమును నిరీక్షించుచున్న సత్యకు దక్షిణాంస చూచుక నయన ప్రకంపమయ్యెను. ఈ అశుభసూచన వలన ఆమెకు కలిగిన భయ మొక్కటియే - 'ప్రాణనాథుడొండొక చపలాక్షి గూడినను నొల్లని చెయ్దము లేమిచేసెనో' అని మాత్రమే. తనకు కలుగగల ఆపద అది యొక్కటే, సపత్నీ మాత్సర్యము ఆమె హృదయములో ఎంత లోతుగప్రాతుకొని పోయినదో ఈ ఒక్క మాటతో తిమ్మన అతి నిపుణముగ నిర్దేశించినాడు.

కృష్ణుడు సపత్నికొక పుష్ప మిచ్చినాడన్న వార్త చెవిని బడియు ప్రాణము లింకను మేన ధరించియే యుంటినే; ఇంకను ఎట్టి దారుణవార్తలు వినవలసియున్నానో అని సత్య విచారించినది. అతని మేలు కీళ్ళకు లోనయి విహరించినది తానొక్కతెయే. కనుక ఆతనిపై సర్వ స్వత్వములును తనవేనని ఆమె భావము. ఆతడింత వరకును తన ప్రవర్తన వలన ఆమెకు అట్టి నమ్మికను కలిగించినాడు. నేడు రుక్మిణి మాయలోపడి అతడు తనను మరచు నేమోయని ఆమె భయము. నిజమే. ధనమిచ్చి పుచ్చుకొన్నను ఓర్వవచ్చును. కాని మగడు మగువకు మనసిచ్చి మరల పుచ్చుకొన్నచో నెట్లు

మనవచ్చునా?

సత్య పతివ్రతా శిరోమణి.'సతికి పతియే ప్రాణ సదృశ బంధువు, పతియే దైవము; పతియే యేడుగడ.' అని ఆమె నమ్మినది. అట్టి పతియే మేర దప్పినచో కుల కాంతకు మరణము కంటె వేరుగతి యేమున్నది?

సత్యకు తాను మృతి పొందుటను గూర్చి చింతలేదు. కాని తన తరువాత తన భోగ సామగ్రియంతయు సపత్నుల పాలగుననియే చింత. ఆ భోగ సామగ్రిలో తొలి వస్తువు కృష్ణుడే.

తిమ్మన సత్యను వ్రేటు వడ్డ ఉరగాంగనతో పోల్చినాడు. ఆమె మానసికావస్థనంతటిని ఒక్క ముక్కలో ముక్తసరిగ చెప్పినాడు. మాసిన చీరగట్టి, చీకటి గదిలో ముసుగు పెట్టి పవళించిన సత్య జలదాంత చంద్ర రేఖా సదృశాంగియై భాసించినదట. ఆమె పై కాంతికిది సూత్రప్రాయమైన వ్యాఖ్య.

తరువాత శ్రీకృష్ణుడు ప్రవేశించినాడు. అతని మేని కంటుకొనిన పారిజాత వాసనలనామె గుర్తించినది. అతనిని చూచి మరింత గట్టిగా ముసుగు పెట్టికొనినది.

శ్రీకృష్ణుడామెకు వ్యజనసేవ చేసినాడు. ఎన్నో నయగారములు పలికినాడు. ఆమె కతడన్న చనవు; అతని కామెయన్న భయము. ఆమె చెలికత్తెలన్నను భయమే. వారికతడు లంచము లొసగి మంచి చేసికొనును. ఆమె కతనిపై వలపు. అతనికామెపై మోహము. ఆమె ప్రణయ సామ్రాజ్ఞి. అతడామె కింకరుడు.

తన ననునయించు కృష్ణుని చేవిరి దమ్మితో కొట్టడోయి నట్లు సత్య ఉంకించి జంకించినది. తన పాదములపై మోపిన ఆలతాంతాయుధు కన్న తండ్రి శిరమును వామపాదముతో తొలగద్రోసినది. ఇపుడామె పేరలుక జెందియున్నది. ఉచితానుచిత మీమాంస చేయగల ఓర్పిపుడామెకు లేదు.

తరువాత ఆమె ఏడ్చినది - బాల పల్లవ గ్రాస కషాయ కంఠ కలకంఠ వధూకల కాకలీ ధ్వనితో, ప్రబంధ నాయికలందరు ఏడుపు కచ్చేరీలు చేసినవారే. కాని ఇంత ముద్దు ముద్దుగా ఏడ్చిన ముద్దులాడి 'నభూతో నభవిష్యతి! మగనిని తన్ని మరియు వేడ్చిన మగువ కూడ 'నభూతో నభవిష్యతి,'

ఏడ్చుచునే సత్య కృష్ణుని తిట్టిన తిట్లు ఇన్నన్ని కాదు. వల్లవీకింకరుడు, పసుల కాపరి, కల్లరి, మాయల మారి - ఇంకెన్నో.

తిమ్మన సత్యను మధ్యా ప్రౌఢా దశలకును, అధీరా ధీరాధీరా స్వభావములకును సంగమ స్థానముగా చిత్రించినాడు.[12] మొదట ఆమె అధీరాప్రౌఢవలె సంచరించినది; ప్రియుని తన్నినది. అంతలో ధీరాధీరా మధ్యయైనది రుదిత ప్రధానములగు వచనములతో తన కోపమును వెల్లడించినది. 'తిమ్మన వాత్స్యాయమని దడవి మనకొక ప్రత్యేక జాతికి చెందిన నాయికను చూపించు చున్నాడు.[13] "కామకేళికిన్ గటుకులు కాని మానములు కావె ప్రదీపన సిద్ధి హేతువుల్'[14] అన్న కిటుకు తిమ్మనగారి సత్యకు తెలిసినంతగ మరియే ఆడు కూతునకును తెలియదు.

తిమ్మనగారి సత్య కృష్ణుని 'కల్లరి'యని, 'వల్లవీ కింకరు'డని, 'పసుల కావరి'యని నిందించినది. రుద్రభట్టుగారి సత్య అట్లు దూషింపలేదు. కుపితురాలైయున్నప్పుడు కూడ 'కృష్ణ', కంస విధ్వంసకా,' 'కమలాక్ష', 'అధీశ', 'విభూ' అని గౌరవభక్తులతో సంబోధించినది. తిమ్మనగారి సత్య చనిపోవు దునన్నట్లు బెదరించినది. రుద్రభట్టుగారి సత్య తపస్సునకై అనుజ్ఞ వేడినది. రుద్రభట్టు చిత్రించిన సత్య ప్రణయ కోప మందుకూడ తన సతీత్వ మర్యాద నుల్లంఘింపలేదు. అనగా ఆమె కూడ రుక్మిణి వంటి శాంత స్వభావురాలే యన్నమాట. ఆమె అందరు స్త్రీలలో తానును ఒకతెగనేయుండిపోయినది గాని ఎట్టి విశిష్ఠతను చూపలేక పోయినది. తిమ్మనగారి సత్య ఒక అపూర్వ సృష్టి. ఆమె లోకొత్తర శృంగారనాయిక. ఆమెకు కోపము వచ్చినపుడు భర్త యనిగాని, పరమేశ్వరుడనిగాని సంశయింపక ఆతని శిరస్సుకు వామ పాదముతో తన్నినది. అనగా ఆమె కోపమట్టిది; ఆమె దర్పమట్టిది; ఆమెకు గల చనవట్టిది; ఆమె స్వాతంత్ర్యమట్టిది. పదునారు వేల చిల్లర పడతులకు పతియైన కృష్ణుడు ఆమె ఆడినదాట పాడినది పాటగా సాగనిచ్చి నాడనగా ఆమె అందమట్టిది; ఆమె అభిమాన మట్టిది; ఆమె ఐశ్వర్యమట్టిది. అన్నింటికిని మించి ఆమె రసికత యట్టిది. కనుకనే కన్నడ పండితులు కూడ 'సత్యాపాత్ర సృష్టి ఆంధ్రులదే,'[15] అని అంగీకరించుచున్నారు.

తిమ్మన చిత్రించిన సత్య హరివంశ సత్యవలె ముగ్ధ మాత్రము కాదు. గంభీర స్వభావురాలు. కనుకనే తన కోపకారణము వాచ్యముగ నెంత మాత్రమును తెల్పినదికాదు.

'నీవిట వచ్చుట పారిజాతవాసన ప్రకటించి మాకు వెకసక్కెము సేయన కాదె? అనుటలోగల పారిజాత ప్రసంగము వలన ఆమె కోపకారణము నూహించు కొనవలసినదే.

సత్య మానినీ మణి. సతులకు మానమే తొడవు. అఖిల సమ్మానములకు మానమే మూలము. మాన రహితమైన బ్రతుకు మానిని బ్రతుకలేదు. ఇన్ని దినములుగ సవతుల మధ్య తాను తల ఎత్తుకొని తిరిగినది. ఇప్పుడు వారు తనను తలలెత్తి చూతురు. తానది సైపలేదు. అత్తగారింత వరకు తనను నెత్తిన పెట్టుకొనెడిది. తానిక ఆమె మొగమునైన చూడలేదు. కనుక తాను చనిపోయినైన 'మానిని నవమానింప రాదను' నీతిని కృష్ణునకు నేర్పుదమనుకొన్నది. అంత దూరము పోకుండగనే కృష్ణుడామెకు పారిజాతమును వాగ్దాన మొనర్చినాడు. దానితో నామె కోపము చల్లారినది. ఇట్లు 'మహాకవియగు తిమ్మన మానక్రోధ వివశయైన సత్యభామ నొకయాట బొమ్మవోలెనాడించినాడు.'[16]

తిమ్మనగారి సత్య తనను తాను బహువచనములో చెప్పి కొనును.[17] ఆమెకు గల స్వాతిశయమునకది ద్యోతకము. ఆమె చెలికత్తెలు శారికలకు చక్కెరపెట్టి చదివింతురు. కరతాళములతో మందిర మయూరముల నాడింతురు. క్రొవ్వాడి గోళ్ళతో తంత్రులు మీటి వీణియలను పలికింతురు. కలికి రాయంచ బోదల నలయించి నడిపింతురు. ఇట్టివి వారి వ్యాసంగములైనచో వారి యజమానురాలి నాగరక ప్రవృత్తి ఎట్టిది కావలెను? ఎట్టిది కాకున్న శృంగారి శేఖరుడగు శ్రీకృష్ణునంత వానిని పట్టుకొని 'పసుల కాపరి భావజకర్మ మర్మము లెఱుంగునే' యని ఈసడింపగలదు.

నందన వన విహార సమయమున పారిజాతము కనిపింపగనే 'వానిని పెకలింపు'మని సత్య శ్రీకృష్ణుని తొందరపెట్టినది. ఆమె తొందరపాటు స్వభావమునకది సంకేతము. 'తిమ్మన సృష్టించిన సత్యకు నోరు చాల పెద్దది.[18] వనపాలకులతో ఆమె పలికిన పలుకులు విష్ణుపురాణ సత్య పలుకులకు మెరుగులు దిద్దుచు, ఆమె వాక్పారుష్యమునకును, వాద నైపుణ్యమునకును సూచకములుగ నున్నవి. తాను వీరపత్నినను స్వాతిశయము ఆమెకు వల్ల మాలినంత. లోకములో స్వాధీనపతిక లెందరోయున్నారు. కాని కృష్ణునకు 'సత్యభామా విధేయు'డను బిరుదమను నిర్భయముగ, బహిరంగమున సత్య ప్రకటింపగలిగినట్లు తన భర్తను గూర్చి ప్రకటించుకొనగల ఇల్లాలు మరియొకతెకనుపింపదు.

హరివంశములోవలె పుణ్యక వ్రతమును కృష్ణుని భార్య లందరిచేత చేయింపక సత్యచేత మాత్రమే చేయించి సపత్నులలో ఆమెకుగల విశిష్ఠ స్థానమును తిమ్మన చెప్పగా నిరూపించినాడు. వ్రతాంతమున ఆమె నారదుని నుండి శ్రీకృష్ణుని విలిచి కొన్నదిగాన అది వరకు కాకున్నను నాటి నుండి యైన కృష్ణదామెకు అక్షరశః క్రీత దాసుడేనని సత్యభామకు కృష్ణునిపైగల ప్రత్యేకాధికారమును తిమ్మన స్పష్ట పరచినాడు.

వ్రత సందర్భముగ సత్య స్వయముగ సపత్నుల ఇండ్లకేగి వారిని ఆహ్వానించి తోడి తెచ్చి, పూజించి, పారిజాత ప్రసూనములను కనకపాత్రలలో నింపి వాయనము లొసంగినది. అభ్యుదయ వేళ యందు అణకువ గలిగియుండుట. సజ్జన లక్షణము గదా. ఇట్లు చివరకు సత్య సపత్నీ మాత్సర్య బుద్ధిని జయించి స్నేహశీలగ పరిణమించినట్లు చిత్రించి తిమ్మన ఆమె సౌశీల్యమును సమగ్రతా సంపన్నము గావించినాడు.

'సత్య శృంగార రసాధి దేవత సర్వ విధనాయికలను, సర్వ భావములను సృష్టించినది ఆమెయే. ఆ సృష్టిని ఆ తల్లి భర్తయగు భగవంతున కంకితము చేసినది.' 'సత్యభామయే శృంగార రస సర్వస్వమున కాలంబనమని తెలిపినవారు సృష్టిలో ముగ్గురన్న ముగ్గురే. మొదటి వారు శ్రీ కృష్ణ దేవుడు, రెండవ వారు తెలుగు కవి తిమ్మన. మూడవవారు సిద్ధేంద్ర యోగి'.[19]

**నారదుడు :**

హరివంశపు తొలికథ, విష్ణుపురాణముల ననుసరించి పారిజాతా పహరణముతో నారదునకెట్టి సంబంధమును లేదు.

హరివంశపు మలికథయను మహావృక్షమునకు బీజావాపనము నారదుని వలననే జరిగినది. 16008 మంది భార్యలున్న కృష్ణునకు, నారదుడు ఒకే ఒక పారిజాతపుష్పమును తెచ్చి యిచ్చుటతో ప్రశాంతముగనున్న ఆతని సంసార సాగరమున సంక్షోభము బయలుదేరినది. దాని నుండి సత్యా ప్రణయకోప హాలాహల ముద్భవించినది. కృష్ణుడు దానిని గరళకంఠుని వలె దిగమ్రింగినాడు. తరువాత దివి నుండి భువికి పారిజాతావతరణమను అమృతోత్పత్తి యైనది. దాని ప్రయోజనమును ద్వారకా వాసులందరును పొందినారు. ఇట్లు నారదుని చర్య తాత్కాలికముగ కొంత కల్లోలమునకు కారణమైనను కడకు లోక కల్యాణకారిగ పరిణమించినది.

నిజమున కింత గ్రంథము నడచునను ఊహగాని, నడువ వలెనను కోరికగాని నారదునకున్నదో లేదో తెలియదు. త్రికాలజ్ఞుడైన ఆ మహర్షికి సర్వము కరతలామలకమే యనవచ్చును. ఏమైనను బ్రహ్మ మానస పుత్రుడును, సర్వ సంగ పరిత్యాగియు, నిరంతర నారాయణ నామ స్మరణైక పరాయణుడునగు ఆ దేవర్షి ఆలోచితముగ గాని, అనాలోచితముగ గాని చేయు కార్య మేదియైనను లోక కళ్యాణకారిగాక మరేమగును? అయినను లోకములో నారదునకు కలహప్రియుడనియే ప్రసిద్ధి యేర్పడినది. నిప్పులు చెరుగు గ్రీష్మాతప తీవ్రత లేనిచో లోకమునకు వర్షామృత భాగ్యము కూడ లేదు. ప్రసవ వేదన లేని నందనాభ్యుదయము లేదు. ఈ ప్రకృతి సత్యమును గుర్తింపలేని వారే ఈ మహనీయుని కలహాశనుడని తృణీకరింతురు.

ఈ సందర్భమున హరివంశము నారదుని ఎన్ని సార్లైన దేవర్షి, మునివరుడు, తపోధనుడు అనియే పేర్కొనినది గాని ఒక్క సారియైన కలహాశనుడని పేర్కొన కుండుట గమనింప దగియున్నది. ఒక్కసారి మాత్రము కృష్ణుడు నారదుని 'అక్లిష్ట కర్మకృత్త'ని నాడు. నిజమే నారదుడు కనిష్ఠ పక్షము రెండు పారిజాత పుష్పములను తెచ్చియున్నను, లేదా ఒక్క పుష్పమునైనను శ్రీకృష్ణుడు సత్యామందిరగతుడైయుండగ నాతనికి సమర్పించియున్నను కృష్ణుని కీ సంకటమేర్పడి యుండెడిది కాదు.

పారిజాతపుష్ప ప్రదాన సమయమున నారదుడు ఆ పుష్ప మహిమను పళ్ళు పులియునట్లు వర్ణించినాడు. రుక్మిణీ సౌభాగ్యమును అతిశయోక్తులతో ప్రశంసించినాడు. ఆమె సౌభాగ్యాతిశయమును వినిన సపత్నులు అవమానాతి రేకమున నిస్పృహను పొందుదురనినాడు. కృష్ణ పత్నులను పేర్కొనుటలో జాంబవతీ గాంధారీ (?) త్యాదులతో బాటుగ సాత్రాజితీ దేవి పేరు గూడ ఒక మారు స్మరించినాడు. అంతకు మించి అతడు ప్రత్యేకముగ గావించిన సత్యానిందలేదు. అతడు వదతాంవరుడు, మేరమీరి ప్రసంగించువాడు కాడు.

సర్వ జగద్భయంకరమైన ఇంద్రోపేంద్రుల యుద్ధము జరుగకుండ నివారించుటకై నారదుడు తన శక్తి కొలది ప్రయత్నించినాడు. కృష్ణుడు పారిజాతము కొరకైన తన పట్టుదలను సడలించుకొనునను ఆశతో ఇంద్రుడు పారిజాతము నొసంగడను తన నమ్మకను తెలిపినాడు. పారిజాతమును కోరిన ఇల్లాలిని శివుడేదో విధముగ సంతృప్తి పరచిన వృత్తాంతమును తెలిపి నీవును అదే విధానము ననుసరించుట యుక్తమని

ధ్వనించినాడు. కృష్ణుడు పట్టిన పట్టు విడువడని నిశ్చయమైన పిమ్మట దేవ దేవుడు దేవతారక్షకుడునగు శ్రీకృష్ణునితో వైరము నీకు వలదు. పారిజాతము నొసంగి ఆతః అనుగ్రహమునకు పాత్రుడనగుట శ్రేయస్కరము." అని దేవేంద్రునకు ఎన్నో విధముః బోధించినాడు. కాని దేవేంద్రుడును తన హితోక్తిని పెడ చెవి నిడుటచే చేయునది లేః తటస్థుడైన ప్రేక్షకునివలె నుండి పోయినాడు.

పుణ్యక వ్రతమున ప్రధాన దాన పరిగ్రహమునకు శుచి, దాంతుడు, జ్ఞాః విజ్ఞాన కోవిదుడునగు ద్విజుడే అర్హుడని ఆ వ్రతకల్పము చెప్పుచున్నది. ఏవంగుణగణ విశిష్టుడగు దానగ్రహీత నారదున కంటె యోగ్యుడు మరిలేడని స్వర్గమర్త్య లోకములంద వ్రతము నాచరించిన వారందరును భావించిరి. పార్వతి, అరుంధతి, అదితి, శచి ఫాల్గుణి, రోహిణి, రుక్మిణి, సత్య అందరును భర్తృ దానమునకు నారదునే ప్రతిగ్రహీతా నెన్నుకొనినారు. ఆ మహానీయుని సౌశీల్యమునకు వేరు ప్రమాణ మెందులకు? సత్యా పుణ్యక వ్రతావసానమున జగత్ప్రభుడైన కృష్ణుని తనకు కింకరుని గావించుకొని బహువిధములగు పరిహాసములను నెరపి తన హాస్యప్రియతను, భక్తునకు భగవంతుని యొద్ద గల చనవును లోకమునకు ప్రకటించినాడు.

రుద్రభట్టు సృష్టించిన నారదుడు మునీశ్వరుడైనను కలహాశనుడే. కలహ తృషితుడే, ఆయోధన పునస్సంధాన విశారదుడువని కవి వర్ణించుటయే గాక నారదుడే తనను తాను 'కలహాలోకార్థి'నని చెప్పి కొన్నాడు[20] పారిజాత పుష్ప మాహాత్మ్యమును, రుక్మిణీ సౌభాగ్యమును ప్రశంసించుచున్న నారదునకు సత్యా పరిచారిక కంటపడగనే 'సపత్నీ వ్యాకోప జనన యత్న తత్పరుడై' సత్యానిందకుపక్రమించినాడు. అదే పనిగ 5 పద్యములలో సత్యానింద గావించినాడు. 'రుక్మిణికాలిగోటి సొబగు సత్య నొసటనైన లేదు.' ఇత్యాదిగాగల ఈనింద చాల తీవ్రమైనది. నారదుని వంటి తటస్థుడు చేయదగినది కాదు. ఆతని కలహాప్రీతి అట్టిది. అది ఔచిత్యమును గమనింపనీయదు. పరిమితులను పాటింపనీయదు.

ఇంద్రొపేంద్రుల మధ్య వైరము పుట్టించుటకై ఇతడు గావించిన ప్రసంగములు కూడ అనుచితమైనవే. కృష్ణుని యెదుట శాంతి ప్రియుని వలెనటించుచు పారిజాతముపైగల కోరికను మరచిపొమ్మని హితవు చెప్పినాడు. కాని ఆ శాంతి వచనముల ధోరణి మాత్రము కృష్ణుని పట్టుదలను మరింతగ ప్రకోపింపజేయునట్లు

జాగ్రత్తపడినాడు. "దేవేంద్రుడు దురహంకారి. తనకు దిక్పాలురు, రుద్రాదిత్య వసువుల సాయము కలదు; తన ఆయుధమగు వజ్రము అప్రతిహతము; తాను దేవేంద్రుడునని అతనికి గర్వము. నీవు మానవ మాత్రుడవని నీవనిన అతనికి నిరసన భావము. అందుచే అతడు నీకు పారిజాతము నొసంగడు. కనుక నీవే నీ ప్రతిన నుపహరించుకొనుము." అని నారదుని హితవు. నిజముగ శాంతిని కోరువాడు ప్రసంగించవలసిన ధోరణి ఇది కాదు. వీరుడైన, పౌరుష శాలియైన కృష్ణుని కోపాగ్నికి యథాశక్తిగ ఇంధన దోహదము గావింపగోరియే నారదుడిట్లు ప్రసంగించి నాడనుట స్పష్టము. కృష్ణుని యెదుట నిషేధ రూపమగు వ్యంగ్యముతో ప్రసంగించిన నారదుడు దేవేంద్రుని యెదుట తన నిజస్వరూపమునే ప్రదర్శించినాడు. కృష్ణునితో వైరము వలదని బృహస్పతి దేవేంద్రునకు హితోపదేశము గావించుచుండగ నారదుడు జోక్యము కలిగించుకొని ఇంద్రుని బలగమగు దేవతా గణమును, ఆతని వాహనమగు ఐరావతమును, ఆతని ఆయుధమగు వజ్రమును పొగడి "అట్టి దేవేంద్రుడు ముకుందుని గెల్వ లేడనుట యుక్తియుక్తముకాదు' అని బృహస్పతిని మందలించినాడు. ఇంకను ముందున కేగి "నేడు కృష్ణుడు పారిజాతమును కోరినాడని దాని నాతని కొసగినచో రేపు మరియొక బల్లిదుడరుదెంచి శచీదేవినే తన కర్పింపుమని కోరినను వానికామెను సమర్పింప వలసినదేగదా?" అని నిడ్డూరమగు ప్రశ్నను వైచినాడు. శచీదేవి యెదుటనే ఇంద్రునితో ఇట్టి అవాచ్యపు ప్రసంగము చేయుట వలన కలహ సృష్టికై ఈ నారదుడు ఎంత అనుచిత ప్రసంగమైన చేయగలవాడని తేలిపోయినది. మరల శచీదేవి నుద్దేశించి," వీరకాంతయైన సత్యాకర స్పర్శవలన మానవ మాత్రుడైన కృష్ణుని శౌర్యము పెంపొందినది. గతభాగ్యవైన నీ కరస్పర్శ దేవేంద్రుని నిసర్గశౌర్యమును కూడ నిర్మూలించినది." అని పుల్ల విరుపుగా పలికినాడు. ఇట్లు శచీంద్రుల అభిమానపు పుండుపై కారము చల్లి, వారికి ఉడుకెక్కించి, వివేకమును కోల్పోవజేసి, వారిని యుద్ధోన్మత్తులను గావించినాడు. ఆ తరువాత యుద్ధరంగము నుండి దిక్పతులు పలాయితులు కాగా, వారి దారినే పట్టుజూచుచున్న దేవేంద్రుని శౌర్యమును పొగడి ఆతనిని మరల పోరునకై ప్రోత్సహించినాడు.

రుద్రభట్టు చేతిలో నారదుడిట్లు తంపులమారిగా రూపొందినాడు.

తిమ్మన చిత్రించిన నారదుడు పారిజాతాపహరణ నాటక సూత్రధారుడు, అతడును కలహాశనుడే, అయినను ఎచ్చటను తన కలహప్రియత్వమును వెల్లడి

గానీయడు. తాను అందరకును ఆప్తునివలె సంచరించును. నిష్కపటముగ, నిష్పక్షపాతముగ, సహజముగ, సత్యమునే పలుకువాని వలె ప్రసంగించును. ఆ పలుకులలో కలహ బీజములను జాగ్రత్తగ పొదిగియుంచును. దేశ కాలమును గమనించి వానిని చక్కగ వెదజల్లును. తాను సంబంధము లేని వానివలె దూరముగ నిలబడును. సమృద్ధిగ పండిన జగడపు పంటను పుక్కింటిబంటిగ భుజించును. ఈతడు అడుగు పెట్టినచోట జగడము పుట్టి తీరునని అందరు నెరుగుదురు. ఆతడు వచ్చినాడనిన అందరకును భయమే. కాని అతని యెదుట ఎవరును ఆ మాటననలేరు. ఆతని రాకను నిషేధింప లేరు. ఆతనిని పూజింపకను మానరు. అతడన్న అందరకును భయము, భక్తి, చనవును, అతని మాటలనందరను సందేహింతురు. ఐనను విశ్వసింతురు. ఈ రామాయ స్వస్తి రావణాయ స్వస్తి వాచకుని వ్యక్తిత్వము విశ్లేషణాతీతము.

నారదుని రాక అకారణము కాదని కృష్ణుడు ముందుగనే అనుమానించినాడు. ఆ మాటనే వ్యంగ్యముగ వెళ్ళబెట్టినాడు. నారదుడు పట్టీయలేదు. కృష్ణుని దశావతారధారివని, రుక్మిణిని లక్ష్మివని పొగడి ఉబ్బించినాడు. ఇచ్చకపు సూడిదగా పారిజాతసుమము నొసగినాడు, దానిని రుక్మిణి కిమ్మని కృష్ణునకు సైగ చేసినాడు. ఇరుకున బెట్టి ఇప్పించినాడు. పారిజాతమహిమను ప్రస్తుతించినాడు. రుక్మిణిని ఆకాశమున కెత్తినాడు. మాటలో మాటగ సత్యాదేవి నిక్కును, విఱ్ఱవీగుటను తడవినాడు. సత్యాదాసి పొంచియుండుటను నారదుడు గమనించియే యున్నాడు. ఇచ్చట నడచిన వృత్తాంతమంతటిని అది సత్యకు నివేదింప వలెను. అదియట్లు నివేదింపకపోయినచో తాను చల్లిన కలహబీజములు మొలకెత్తవు. అందుచే ప్రుక్కకయున్నె నీ మహిమ నూచిన బోటులు విన్నవించివవ్' అన్నాడు. ఈ మాట వినిన సత్యాదాసి 'ఈ వృత్తాంతమును యజమానురాలికి తప్పక విన్నవింప వలసినదే' అని తీర్మానించుకొన్నది. ఈతని మనస్తత్వ వేతృత్వము అబ్బురపాటు గొలుపుచున్నది.

ఈ సందర్భమున నీతడు గావించిన రుక్మిణీ రహస్య క్రీడాప్రసంగము మాత్రము అతని నోట రాదగినదికాదు.

సత్యాదాసి వెడలిన కొలది క్షణములకే కృష్ణుడును చల్లగా జారు కొనినాడు. అతడు అంతటి అడావుడిగా పరుగెత్తినది ఎచ్చటికో, ఏ రాచకార్యము మీదనో నారదునకు

తెలియును. తాను వాటిన విత్తనము మొలకెత్తినదో లేదో, ఏపుగా ఎదిగినదో లేదో చూడవలెను. అవసరమైనచో కొంత దోహదము కూడ చేయవలెను. అందుచేత ఒకటి రెండు గడియలాగి తాను కూడ సత్యామందిరమున కేగినాడు. ఇప్పుడే తాను సత్యను లఘూకరించి మాట్లాడియున్నాడు. అట్టి చోటికి ఇంతలోనే మరొకడైనచో పోలేడు. పోయి తన మరియాదను కాపాడుకొనలేడు. కాని నారదున కట్టి భయము లేదు. ఎట్టి పట్టునైన తన గౌరవమునకు వెలితిరాకుండ నెగ్గుకొని రాగల నేర్పాతనికి కలదు.

నారదుడేగు సరికి సత్యామందిరము ప్రశాంత నిర్మలముగ జడివాన కురిసి వెలిసినట్లున్నది. కృష్ణుడు ప్రేటు తప్పించుకొని వెక్కిరించు వానివలెనున్నాడు. నారదుడాతనికి మరియొక సమస్యను సృష్టించినాడు. తనకు మ్రొక్కిన సత్య నాశీర్వదించు "నీ నాథుడు అనికైన నిన్ను బాసి చనడు." అని పొగడినాడు. దానితో కృష్ణుడు అమరావతికి తనవెంట సత్యను గూడ కొనిపోవలసిన వాడైనాడు. సత్యకు కలిగిన, కలుగగల అభ్యుదయమున కంతటికి తన దీవెనలే కారణమన్నట్లు నారదుడు ప్రసంగించినాడు. అందులో కొంతయైన నిజము లేకపోలేదని సత్యయు గ్రహించినది. అతనికి భక్తితో ఆతిథ్యము నెరపినది. కృష్ణుని అమరావతీ యాత్రను రూఢి చేసికొని దేవేంద్రునకీ వార్తను తెలుపుటకై నారదుడు బయలుదేరినాడు. కృష్ణుడు తెలుపకున్నను ఈ యాత్ర యందలి ఆంతర్యము నారదునకు తెలియును.

ఇంద్రోపేంద్రుల యుద్ధ సమయమున రణాశనమౌని నింగిపై నిలచి ఈ వినోదమును వీక్షించుచు 'కుతుకరసాతి రేకమున కుంచియ వీచి నటించినాడు.

కృష్ణుడు పారిజాతమును తెచ్చి సత్య పెరటిలో నాటి తన మాట నెగ్గించుకొనినాడు. అంతలో నారదుడు మరల ప్రత్యక్షమైనాడు. విడ్డూరమగు భర్తృదాన వ్రతమొకదానిని సత్యకుపదేశించినాడు. నారదుడు చెప్పినదాని కంటె, సత్య ఆశించిన దానికంటె ఎక్కువ వైభవముగ వ్రతమును నెరవేర్చినాడు కృష్ణుడు. నారదుడు పెట్టిన పరీక్షలన్నిటిలో కృష్ణుడు నెగ్గినాడు. అందులకు కృష్ణుని కంటె నారదుడే ఎక్కువగా ఆనందించినాడు.

జగత్పితయు జగత్పతియునైన శ్రీహరిని బిడ్డగా, సోదరునిగా భర్తగా, తండ్రిగా, ప్రభునిగా సారథిగాపొందగలిగిన అదృష్టవంతులెందరో కలరు. కాని ఆ జగత్ప్రభుని

తనకు సేవకుని గావించుకొనగలిగిన భాగ్యము నారదున కొక్కనికే దక్కినది. అతడు బ్రహ్మానందము నందినాడు. ఆ యానందమును చిత్ర కవితారీతులలో వెల్లడించి కృతార్థుడైనాడు.

## దేవేంద్రుడు :

హరివంశపు తొలి కథయందలి దేవేంద్రుడు చాల ఉత్తముడు. కృతజ్ఞతా గుణశోభితుడు శ్రీకృష్ణుని వలన తానుపొందిన మేళ్ళను స్మరించి పారిజాతాపహరణమును ఆమోదించి మిన్నకుండినాడు.

విష్ణు పురాణమునందలి దేవేంద్రునకు కృష్ణుని యెడ కృతజ్ఞతా భావము మాట ఎట్లున్నను, కృష్ణుడు దేవదేవుడను నమ్మిక కలదు. ఐనను శచీదేవి పురికొల్పగా పారిజాతసంరక్షణార్థము యుద్ధోన్ముఖుడైనాడు.[21] తన వజ్రాయుధము కృష్ణుని చేతిలో నిర్వీర్యమగుటతోడనే పలాయన పరాయణుడై సత్యభామ పరిహాసమునకు పాత్రుడైనాడు. కృష్ణుడు మరల పారిజాతము నీ జూపినను గైకొనక అతనినే కొనిపొమ్మని చెప్పి, తొలి తొందరపాటు చర్యవలన చెడిన పెద్దరికమును తుదికెట్లో నిలుపు కొన గలిగినాడు.

హరివంశపు మలికథ యందలి దేవేంద్రుడు కృతజ్ఞతా గుణ విహీనుడు, అవివేకియు. కృష్ణుడు తన దేవేరులచే పుణ్యక వ్రతము నాచరింపజేయుటకే పారిజాతము నిమ్మని దేవేంద్రుని కోరినాడు. వ్రతము ముగియగనే తిరిగి పారిజాతము నప్పగింతునని కూడ తెలిపియున్నాడు. అట్లు కొలది దినములపాటు పారిజాతమును అరువుగా నిమ్మని కృష్ణుడు కోరినప్పుడు అతని వలన ఎన్నియో మేళ్ళను పొందియున్న దేవేంద్రుడు సంతోషముతో అంగీకరించి యుండ వలసినది. అన్నగారుగా దేవేంద్రుని పెద్దరికము నిలచియుండెడిది. కాని ఈ దేవేంద్రుడు కృతఘ్నుడు. కృష్ణుడు తనకెన్నడును అగ్రజ గౌరవము నీయలేదనియు, తన కెల్లప్పుడును వ్యతిరేకముగనే సంచరించు చున్నాడనియు, రాక్షస వధ గావించినను అది స్వీయ ప్రతిష్ఠ కొరకేగాని తన (దేవేంద్రుని) మేలుకోరి కాదనియు - ఇట్లు కృష్ణునిపై నేరము లెన్నుచునేయుండినాడు. యుద్ధ విరమణా నంతరము కూడ దేవేంద్రుడు కృష్ణుని అవినయమును ఎత్తిపొడుచుట మానలేదు. ఈ దేవేంద్రునకు కృష్ణునియెడ భక్తి భావమెన్నడును లేదు. ఐన నీతడు పరాక్రమములో కృష్ణునికి సమస్కంధుని వలెనున్నాడు. అదితి కశ్యపులడ్డుపడనిచో యుద్ధ పర్యవసాన

మేమై యుండెడిదో తెలియదు.

జగన్నాథ విజయమందు కృష్ణుడు పారిజాతమును వ్రతార్థము గాక సత్యా ప్రీణనార్థమే అడిగినాడు. అదియు తాత్కాలికపు ఎరువుగ కాదు; శాశ్వతముగనే కనుక దేవేంద్రుడా కోరికను తిరస్కరించుట బాత్తుగా కృతఘ్నతయని చెప్ప వీలు లేదు. ఐనను ఆతడు తన బలమును ఎదిరి బలమును పరిగణించుకొని యుండవలసినది. ఈ విషయమై బృహస్పతి హితోపదేశమునైన అతడు పాటింపవలసియుండెను. కాని ఒకవంక శచీదేవియు మరొక వంక నారదుడును పోటు మాటలతో పురికొల్పుటతో దేవేంద్రుడు స్వపరబల తారతమ్య జ్ఞానమును కోలుపోయి యుద్ధమునకు సిద్ధమైనాడు. ఐనను బలపరాక్రమములలో ఈతడును తక్కువవాడు కాడు. 'లోకమున కెల్ల పాటిలేని మేటి విలుకాడగు అర్జునుని అబ్బను' అని నిరూపించుకొనినాడు. 'రామాద్యవతారములలో రావణాదులను జయించుట ఏమంత కష్టమనిపించలేదు. నేడీతనిని జయించుట అసాధ్యముగా తోచుచున్నదే." అని శ్రీకృష్ణుడే వెరగందినాడనగా దేవేంద్రుని శౌర్యమును వేరుగ వర్ణింపనక్కరలేదు. అతడు నిజముగ హరిశౌర్యుడే. తన వజ్రాయుధమును శ్రీకృష్ణుడు నిర్వీర్యమును గావించిన పిమ్మట కూడ ఈతడు తన ఓటమి నంగీకరింపలేదు. ఐరావతమును కృష్ణునిపైకి పురికొల్పినాడు. ఇది ఈతని హఠస్వభావమును తెలుపుచున్నది. ఐరావతమును గరుడుడు పారియాత్రముపై బడునట్లు విసరి వేసిన పిమ్మట పరాజయ ఖిన్నుడైనాడు. ఇతోధిక పరాభవము నుండి ఆతనిని కాపాడుటకు బిల్వోదకేశ్వరుడు దిగిరావలసి వచ్చినది.

నాటకములలో ప్రతి నాయకుడు సాధారణముగ ధీరోద్ధతుడుగ నుండును. రుద్రభట్టు చిత్రించిన దేవేంద్రుడు ధీరోద్ధతుడనదగి యున్నాడు. ధీరోద్ధతుడు మాయాపరుడు, ప్రచండుడు, చపలుడు, అహంకార దర్ప భూయిష్ఠుడు, ఆత్మశ్లాఘానిరతుడు,[22] ఈ లక్షణములలో మాయావిత్వ మొకటి తక్కువగా తక్కినవన్నియు రుద్రభట్టు చిత్రించిన దేవేంద్రునిలో కొలదిగనో గొప్పగనో కనిపించుచున్నవి.

తిమ్మన చిత్రించిన దేవేంద్రుడు కూడ ధీరోద్ధతుడే. ఇతనిలో ప్రధానముగ కనిపించు లక్షణము చపలత్వము. శ్రీకృష్ణుడు దేవదేవుడని దేవేంద్రుడు నమ్మియే యుండవలెను. లేనిచో 'అంస విలంబచేలము నడుమన్బిగించుచు, ఇలా నిహితాత్మ

శిరఃకిరీటుడై' ఆతని అడుగుల మీద వ్రాలడు గదా. అట్లే చివరకు తన వజ్రాయుధము నమ్మయిన పిమ్మట 'సొమ్మనవెద్ది? ఏమనగ సొమ్మునకెవక్కడ? కర్తనీవు. నీ సొమ్మె అఖిల ప్రపంచమును' అని కృష్ణుని జగన్నాథునిగ గుర్తించిన ఇంద్రుడు మధ్యలో అవివేకము నశించి కృష్ణుని కేవలము 'యాదవుడు' అని తృణీకరించుట బుద్ధి చాపల్యము కాక మరేమి?

ఈ చాపల్యమునననుసరించిదే దేవేంద్రుని ఆత్మ శ్లాఘాపరా యణత. తన వజ్రము లోకమునకెల్ల సాటిలేని మేటి ఆయుధమని ఆతని భ్రమ. దాని బలుప్రేటున కోర్చినచో కృష్ణుడు వీరుడని తాను గుర్తించునట. సత్యాగర్వ భారమును, పారిజాతమును విడిపింతునని ఆతని ప్రగల్భోక్తి. ఈ ఆత్మశ్లాఘానిరతి బుద్ధిమాంద్యమునకును దారితీసినదనవలెను. 'తార్క్ష్యుడైనను మదీయామోఘాశని పాతమిట్టిదని కృష్ణునకు తెల్పడాయెనే' అని ఇంద్రుడు ఆశ్చర్యమును ప్రకటించుట హాస్యాస్పదముగ నున్నది. వజ్రాయుధపు శక్తి యెట్టిదో ఒక ఈకను రాల్చి సుపర్ణుడు చిన్నవాడే నిరూపించియున్నాడు. 'అలనాటి నన్ను మఱచితే?'అని ఇంద్రుడు గరుడుని బెదరించుట కూడ ఆతని బుద్ధిమాంద్య సూచకమే. నిజమున కీ మాట ననగలవాడు గరుడుడు. పసివాడుగ నుండగనే గోవర్ధనోద్ధరణము గావించి తనకు మారొడ్డి నిలచి గెలిచిన కృష్ణుని శక్తిని ఇంతలోనే మరచుట కూడ ఇంద్రుని బుద్ధిమాంద్యమే. ఆ క్రిందటి దినమే ఇంద్రుని ఎదుటనే అదితి కృష్ణుని స్తుతించుచు ఈ కథను జ్ఞప్తికి తెచ్చియున్నది కూడ.

కన్నులు వేయిమండియు కనుగానక పోవుటకు దేవేంద్రుని అహంకారమే కారణము. ఆతనిలో నిద్రాణమైయున్న అహంకారము కృష్ణుని పారిజాత హరణోదంతమును, సత్యాగర్వోద్ధతోక్తులను విన్నంతనే వెలికుబికినది. అదియట్లు పెల్లుబుకుటకు శచీ సాన్నిధ్యము కూడా కారణమైనది. ప్రేయసీ సమక్షమున తన మగటిమిని ప్రకటించు కొనవలెనను కాంక్ష ప్రతి పురుషునిలో నుండును దేవేంద్రుడు దానికి నెలికాడు. ఇంద్రుని విజృంభణకు శచీకృత ప్రోత్సాహము కూడ అక్కర లేక పోయినది. అతడు తనంతకు తానే మండిపడినాడు. అతడు క్రోధరూపము వహించి, రౌద్రాకారుడై పేర్చి, కన్నులు వేయును జేవురింప ప్రచండాకృతి దాల్చినాడు.

దేవేంద్రుని దర్పము కూడ తక్కువది కాదు. కృష్ణునిపైకి యుద్ధమునకు నడుపుడని దిక్పాలకులకు ఆతడు నోటిమాటగా చెప్పలేదు. ఊరక వారి దిక్కు చూచినాడు.

ఆ చూపులోనే అతని ఆజ్ఞ ఇమిడియున్నది. అతని దర్పమట్టిది. కృష్ణుని చేపరాజితులై పారిపోవుచున్న దేవతా వీరులను పారిపోకుడని 'తిట్టియదల్చుట' కూడ ఆతని దర్పమునే సూచించుచున్నది. అతడట్లు తిట్టగనే వియచ్చర వాహిని వెనుదిరిగి కృష్ణుని డీకొనినది. అతడంతటి చండశాసనుడు.

ఇంద్రుని పరాక్రమము అల్పమైనదికాదు. 'ఇతనికి తండెసాటి' యను చారణసిద్ధ సాధ్యగణముల ప్రశంసకు పాత్రుడైనాడు. పేరు వలననేగాక పరాక్రమము వలన గూడ ఇంద్రుడు హరిసదృశుడే. పక్షీంద్రు నొక సామాన్యపు పక్షివలె అలుగులపెనుగూట చిక్కునట్లు చేసినాడు. ఇంద్రుని వజ్రాయుధము నిజముగ ప్రళయాశనియే. ఇంద్రుడు దానిని చేతబూనగనే లోకములల్లల నాడినవి. తీవ్రతలోనది శ్రీహరి సుదర్శన మునకును, పరమశివుని త్రిశూలమునకును మాత్రమే తక్కువైనది.

తిమ్మన చిత్రించిన దేవేంద్రుడు పరమలౌకికుడు. 'అందిన జుట్టు అందకున్న కాళ్ళు' అనునది అతని మతము. తన ప్రధానాయుధము కృష్ణుని చేతిలో నిర్వీర్యముకాగనే, అతడు కృష్ణునకు సాష్టాంగప్రణిపాతము గావించి తన యపరాధమును మన్నింపుమని ప్రార్థించినాడు. "నీ సొమ్మును నీవే గైకొమ్ము" అని కృష్ణుడు పారిజాతము నీయ జూపినను "వేననగ సొమ్మున కెవ్వడను. నీ సొమ్ము అఖిల ప్రపంచమును." అని చెప్పి పారిజాతము నిచ్చి పంపించినాడు. శ్రీకృష్ణుని అనుగ్రహమును తిరిగి సంపాదించుకొనినాడు.

మొత్తము మీద రుద్రభట్టు చిత్రించిన ఇంద్రుని కంటె తిమ్మన చిత్రించిన ఇంద్రుడు ధీరోద్ధత లక్షణమునకు మరింత చేరువగానున్నాడు.

## శచీదేవి :

హరివంశపు తొలి కథయందలి శచీదేవి మిగుల యోగ్యు రాలుగా చిత్రింపబడినది. తమ లోకమునకు అతిథి యైయరుదెంచిన సత్యనామె యథోచితముగ గౌరవించినది. అత్తగారైన అదితి పాదములకు సేవించినది. పారిజాతాపహరణమునకు ఆమె ప్రతిక్రియ ఏమియు చెప్పబడలేదు. కనుక దేవేంద్రుని వలె ఆమె కూడ కృతజ్ఞతాగుణ బద్ధయై సత్యాకృష్ణుల చర్యను ఆమోదించి యూరకుండెననియే తలంపవలసియున్నది.

విష్ణు పురాణము ప్రకారము శచీదేవి అహంకార, గర్వ, అవివేకములు ముద్ద గట్టిన మూర్తి. ఆతిథేయ మర్యాదకు విరుద్ధముగ సత్యకొక పుష్పమైన నొసంగక ఆమె యెదుటనే తాను పారిజాత పుష్పముల నలంకరించుకొన్నది. పైగ మానవకాంతలు దివ్యకుసుమ ధారణకు అయోగ్యలని సత్యవినునట్లుగనే విరసన పూర్వకముగ పలికినది. తన దివ్యత్వమునెడ గర్వమును, సత్యామానుషీత్వమునెడ విరసనయు ఆమెలో నిండుకొని యున్నవి. పారిజాతాపహరణోదంతమును నందనవన పాలకులు శచీదేవికే తెలిపిరి. ఆమె యే దానికి అధికారిణి. శచీదేవికి కృష్ణునియెడ కృతజ్ఞతా భావము లేకున్నను, ఆతడు తన భర్తకంటె పరాక్రమవంతుడనియైన ఆమె గుర్తింపవలసియుండెను. కాని ఆమె వివేకహీనురాలై కృష్ణునిపై యుద్ధము నకు ఇంద్రుని పురికొల్పినది. ఇంద్రుని పరాజయానంతరము శచీదేవి ఏమి చేసినదో సంస్కృత విష్ణు పురాణము చెప్పుటలేదు. కాని తెలుగు విష్ణు పురాణము మాత్రము శ్రీకృష్ణుడు దేవేంద్రునిపై సుదర్శ నమును ప్రయోగింప నుద్యుక్తుడుకాగా 'ఇంద్రాణి పుండరీకాక్షునకు వినయ వినమితో త్తమాంగయై[23] భర్తృప్రాణభిక్ష యాచించినదని చెప్పుచున్నది. శచీగర్వ భంగము సంపూర్ణమైనది.

హరివంశపు మలికథలో నందన వనపాలకులు పారిజాతాపహరణ వృత్తాంతమును దేవేంద్రునకే నివేదించిరి. అప్పుడు అచ్చట శచీదేవి ఉన్నదో లేదో తెలియదు. ఏమైనను ఆమె దేవేంద్రుని యుద్ధమునకు పురికొల్పినది లేదు. యుద్ధము ముగిసిన తర్వాత ఇంద్రుడు కృష్ణునిపై నేరము లెన్నుచునేయున్నను శచీదేవి మాత్రము సత్య కొరకై అనేక ఆభరణముల నొసంగినది. ఇట్లు శచీదేవి స్నేహశీలయేగాక పుణ్యక వ్రతము నాచరించిన పుణ్యశీల కూడనని ఈకథ తెలుపుచున్నది.

విష్ణు పురాణమునందు దేవేంద్రుని పోరునకు పురికొల్పుటకై శచీదేవి పలికిన పలుకులు తెలుపబడలేదు. రుద్రభట్టు ములుకులవంటి ఆమె పలుకులను విపులముగ తెలిపినాడు. పారిజాపహరణము వలన తన కతి ఖేదమైనదని, నందన వనము శూన్యమైనదని, అనిమిష లోకపుకీర్తి మలీమసమైనదని ఆమె ఆక్రోశించినది. (చూ.పు. 284) ఇంద్రుడు ఒక పట్టాన కదలలేదు. శ్రీకృష్ణునితోవైరము వలదని హితవు దెలుపుచున్న బృహస్పతి మాటలకు ఊగొట్టుచున్నాడు. అప్పుడు శచీదేవి మరల ఇట్లనినది. "పారిజాతము చేజారి పోవుచున్నదని వినియు ఇంకను కూర్చుండినావేమి? ఐరావతము

నధిరోహింపవేమి? వజ్రమును చేబూనవేమి? కృష్ణుని పైకెత్తి పోవేమి? పౌలోమినైన నా నాథుడవనిపించు కొనుము. కృష్ణునకెదురొడ్డి నిలువుము." (చూ.పు. 284) సురగురువు, సురముని, దిక్పాలురు మున్నగువారందరి యెదుట నిండుకొలువులో భర్త నీ విధముగ ములుగర్రతో పొడుచు ఆడుది ఉత్తమ కాంతా సహజములైన లజ్జా వినయముల నెరుంగని రాలుగాయి యనవలసి యున్నది. ఆమె యానభ కరుదెంచునప్పటి సొబగును గూడ రుద్రభట్టు నిపుణముగ చిత్రించియున్నాడు. (చూ.పు. 177) ఆమె తన యంతఃపురము నుండి కొలువు కూటమునకు ఎంత ఉరవడిగ పరుగు తీసినదోగాని స్తనకంపము వలన కంఠమందలి ఏకావళి తెగిపోయినది. కాలియందెలూడి పోయినవి, కురులు చెదరినవి; నిట్టూర్పు దళమైనది; కొప్పు నుండి పూలమాలలు జారిపడిపోయినవి. ఇట్లే శచి అపజయశ్రీయో యనునట్లు ఇంద్రుని సమీపించినది. ఇది చాలదోయనునట్లే శచి యుద్ధరంగమునకు కూడ నరుదెంచినది. వీరవనితయని ఖ్యాతి నందియున్న సత్యను వాగ్యుద్ధముననైన జయించి తాను వీరవనితా శిరోమణి ననిపించు కొనగోరినదేమో. కాని వాగ్యుద్ధము నందు సత్యదే పైచేయియైనది. శచి పలికిన ఒక్కొక్క మాటయు ఆమె తెలివి తక్కువ తనమును వెల్లడించునదిగనేయున్నది. ఈ శచీ దేవి ఇంతకు ముందు సత్యభామ నవమానించి యుండలేదు. కనుక నిరపరాధినియైన ఈమె నిష్కారణముగ పారిజాతమును కోల్పో వలసి వచ్చినందులకు సహృదయుల సానుభూతికి పాత్రురాలు కావలసియుండగ, పరిహాసమునకే పాత్రురాలగునట్లుగ రుద్రభట్టు చిత్రించినాడు.

తిమ్మన చిత్రించిన శచీదేవి పరమసాధువు. గోవు వంటి ఇల్లాలు. పుణ్యక వ్రతమాచరించిన పుణ్యశీల. భర్తృ వాల్లభ్యమునకు నోచుకొనిన అదృష్టవంతురాలు. తన భర్త అంకపీఠమందాసీనురాలై, ఆతడు తనసోగ వెంట్రుకల చిక్కువాపి పారిజాతపుటెత్తులతో స్వయముగ అలంకరింపగ ఆనందించెడిది. అత్తగారి పాదములు తన తొడలపై నుంచుకొని సంవాహనము గావించుచు మనకీమె తొలిసారిగా కనుపించుచున్నది. సత్యాకృష్ణులు విడిది చేయుటకై వైజయంతము నామె స్వకర రచితములైన పారిజాత కుసుమోపహారములతో నలంకరించినది. పారిజాతాపహరణ వృత్తాంతమును వనపాలకులు దేవేంద్రునికి నివేదించి నప్పుడు ఈమె ఆతని పార్శ్వమందేయున్నది. కాని పెదవి కదపనైన లేదు. ముఖమున విన్నబాటు మాత్రము

కనబరచినది. తన చేతిలోని లడ్డుకమును కాకి తన్నుకొని పోగా ఏడ్చుట కూడ తెలియక బిక్క మొగముతో నిలచిన పసిబిడ్డవలె తిమ్మన చిత్రించిన శచీదేవి సహృదయుల సానుభూతికి పాత్రురాలగు చున్నది.

మొత్తము మీద రుద్రభట్టు విష్ణు పురాణము నందలి శచీ పాత్రను, తిమ్మన హరివంశపు మలికథయందలి శచీపాత్రను మరింతగ మెరుగె క్కించి చిత్రించి నారనవచ్చును.

రుక్మిణి :

హరివంశపు తొలి కథయందును, విష్ణు పురాణము నందలి పారిజాతపహరణ కథాభాగమున నందును రుక్మిణి పేరైన లేదు. హరి వంశపు మలికథ మాత్రము రుక్మిణీ ప్రసంగము తోనే ప్రారంభమగుచున్నది. అప్పుడామె ఏదో ఉపవాసవ్రతము నాచరించుచున్నది. ఈ కథా భాగపుటంతమున ఆమె పుణ్యక వ్రతము నాచరించినది. ఐనను పుణ్యకాదివ్రతోత్పత్తి, ఆచరణ విధానము, మహిమలను గురించి రుక్మిణియే నారదుని ప్రశ్నించి తెలిసికొనినది. ఆమెయే ప్రధానశ్రోత, ఆమె వ్రతోపవాసాదులందు శ్రద్ధాభక్తి విశ్వాసములుగల పుణ్యశీలగ కనుపించుచున్నది. సపత్నులందరును ఆమెను అర్హ, జ్యేష్ఠ, పుత్రమాతయని గౌరవించుచుండిరి. ఇంతకు మించి రుక్మిణీ గుణగణము లేవియు ఈ కథా సందర్భమున వ్యక్తముకాలేదు. నారద దత్త పారాజాతకుసుమ లాభము వలన ఆమె మనస్సులో ఎట్టి భావములు కలిగెనవో కూడ వెల్లడి కాలేదు.

రుద్రభట్టు ఈ కథా సందర్భమున ఈ మాత్రముగనైన రుక్మిణీ పాత్ర చిత్రణ గావింపలేదు. కథా ప్రారంభమున రుక్మిణి గావించిన వ్రతము నకే పుణ్యకమని పేరు పెట్టినాడు. కృష్ణుని అగ్రమహిషిగ, ప్రద్యుమ్నుని కన్న తల్లిగ సపత్నుల గౌరవమునకు పాత్రురాలైనదని, మహాత్మ, లక్ష్మీవనితావతారయను ప్రశస్తిని పొందినదని మాత్రము తెల్పినాడు.

తిమ్మన కావ్యము నందు కూడ రుక్మిణీ ప్రసంగము అత్యల్పముగనే కలదు. ఐనను ఆ కొలదిలోనే తిమ్మన రుక్మిణీ పాత్రను అత్యంత జీవకళలతో ఉట్టిపడునట్లు చిత్రింపగలిగినాడు.

రుక్మిణి ఇందిరా ప్రతినిధి, మహిమాన్విత, గంభీర స్వభావురాలు. ఒక్క సత్యభామ తప్ప తక్కిన సపత్నులందరును ఆమె యెడ గౌరవ భావముతో మెలగుదురు. రుక్మిణి పూజ్య పూజా పరాయణ, తన మందిరమున కరుదెంచిన నారదునామె భక్తితో సేవించినది. పారిజాతమును తన నెఱి కొప్పున తురుముటకు ముందు నారదునకు వినయముతో మ్రొక్కినది. ఆమె పరిచారికలు ఆమె కనుసైగల వెంటనే తమ తమ నియోగములను నిర్వహింతురు. ఆమె ప్రాభవమట్టిది. కాంతలందరకును సహజమైన సపత్నీమాత్సర్య దోషము నుండి మాత్రము ఈ సతీమణి పూర్తిగ విముక్తురాలు కాలేదు. ఈ విషయమున రుక్మిణి సత్యకంటె ఏమియు తక్కువకాదు. కులమును, రూపమును, మగని కూరిమియు గలదాననని సత్యకెంత గర్వము కలదో రుక్మిణికిని అంత గర్వము కలదు. అదే వారిరువురి మధ్య రవరవలకు కారణమైనది. కుల రూపముల మాట అటుంచి మగని కూరిమిలో సత్యతో తాను సమానురాలనని రుక్మిణి తలచుట ఆమె అమాయకత్వమే అననలెను. నారదుడు పారిజాత పుష్పము నీయగనే కృష్ణుని మనసులో మెదలినది ఎదుటనున్న రుక్మిణి కాదు, పరోక్షమందున్న సత్యయే. నారదుడు పుష్పమును రుక్మిణి కిమ్మని సైగ చేయునంతవరకు కృష్ణుడు ఆమెకు పుష్పము నీయలేదు. అయాచితోపపన్నముగ తనకు లభించిన దివ్య కుసుమ ధారణా దృష్టమునకు రుక్మిణి పొంగిపోయినది. నారదకృత రుక్మిణీ స్తుతియు, సత్యానిందయు ఆమెకుమరింత హర్షదాయకములైనవి. గంభీర స్వభావురాలగుటచే పెదవి మాత్రము విప్పలేదు. కాని తాను త్రిజగదధీశ్వరి నన్నంత గర్వము ఆమె కన్నులలో తొణికిసలాడుచున్నదని సత్యానాపి చెప్పినది కొంత అతిశయోక్తియైనను పూర్తిగ అసత్యము మాత్రము కాబోదు.

మరల రుక్మిణీ ప్రసంగము వచ్చునది గ్రంథాంతముననే. సత్యభామ ఆచరించు పుణ్యక వ్రతమును చూచుటకై ఆమె వచ్చినది. అప్పుడామె మొగమున కృత వికాస మచ్చుపడియున్నదట. అనితర దుర్లభమైన పారిజాతము తన సపత్నియైన సత్యకు లభించుటయు, ఆమె లోకోత్తరమైన పుణ్యకవ్రతము నాచరించుటయు, కృష్ణునిపై సర్వస్వామ్యములు తనకే కలవన్నట్లు అతనిని దానమొసంగుటయు, తిరిగి కొనుటయు రుక్మిణికి చాల మనస్తాపము కలిగించినవి. కాని ఏమి చేయగలదు. కృష్ణుడే సత్యతో చేరిపోయినాడామె. వివేకవతి గాంభీర్యవతియు నగుటచే ఆ మనస్తాప మును లోలోపలనే దిగమ్రింగి తెచ్చుకోలు సంతోషమును ముఖముపై పులుముకొని, 'రా...

దగవౌనని సత్యావ్రత మండపమున కరుదెంచినది. అప్పుడు కూడ ఆమె తన అగ్రమహిషీత్వపు టాధిక్యమును సాధ్యమైనంత వరకు ప్రదర్శించుచునే వచ్చినది. పదారువేల మంది సపత్నులకు వెంట నిడుకొని, తన ప్రభుత్వ మహిమ వెల్లడియగునట్లు కమల రాగమణీ శిబికాధి రూఢయై వచ్చినది. ఒకే ఒక పద్యపు పరిధిలో రుక్మిణీ మనోధర్మము నంతటిని ఇంత సహజముగను సజీవముగను స్పష్టముగను చిత్రింపగలిగిన తిమ్మన కవి శిల్ప ప్రతిభ అద్వితీయము.

## గరుడుడు :

హరివంశపు తొలి కథలో గరుడునికెట్టి ప్రత్యేకతయు లేదు. అందాతడు శ్రీకృష్ణునకు వాహనము మాత్రమే. సత్యా కృష్ణులను మణిపర్వతమును కూడ మోయగలిగిన బలశాలి, స్వర్గ మర్త్యలోకములను క్షణకాలములో చుట్టిరాగల జవశాలి మాత్రమే.

విష్ణు పురాణము నందలి గరుడుడు కృష్ణునకు వాహనమేగాక యుద్ధమున తోడుపడిన సంగడీడు కూడ. ఇతడు విశేషించి ఇంద్రుని వాహనమగు ఐరావతము తోనే పోరినాడు. దేవతా వీరులను చీల్చి చెండాడి భక్షించినాడు కూడ.

హరివంశపు మలికథలో కూడ గరుడుడు కృష్ణునకు వాహనముగను, సహసాంగ్రామికుడుగను సాయమొనరించినాడు. ఇతడు ఐరావతమును పారియాత్రముపై పోయిపడునట్లు ముక్కుతో విసరిన బలశాలి. ఇంద్రుని వజ్రాయుధమును గౌరవించి దాని వ్రేటునకు ఒక ఈకను మాత్రము రాల్చిన అతిలోక సత్త్వుడు. గరుడుని భారమునకు పారియాత్రము క్రుంగిపోయి శాణపాద మాత్రమైనదట.

రుద్రభట్టు చిత్రించిన గరుడుడును రోహణశైలమును మూపున నైచుకొని లోకాంతర యాత్రలు గావించినవాడే. ఈతని రెక్కల గాలి తాకిడికే ఐరావతము కొట్టుకొనిపోయి పారియాత్రముపై బడినది. ఇతడు స్వీయబల గర్వోద్ధతుడు. తనను కృష్ణుడు స్మరింపగనే వచ్చినాడు. వచ్చుచునే ఇట్లను చున్నాడు. "దిక్కుండాలములను కబళింతునో, దశదిశలను ఒకటిగా చేయుదునో, భూమ్యాకాశముల నేకముగావింతునో చంద్రాదిత్యులను మీటి వేయుదునో, సముద్రములు పీల్చి వేయుదునో, ఇంద్రాదులను పిసికి పిడుచగావింతునో, యక్షాధీశుని కట్టివైతునో, యముని ఎదమెట్టుదునో, శివుని

పరాభవింతువో- ఏమి గావింపు మందువో ఆజ్ఞాపించుము." (చూ.పు. 375) ఇంతటి దర్పాహంకారములు గలిగియుండియు గరుడుడు శ్రీకృష్ణుని యెడ అత్యంత వినయభావము గలవాడు. గరుడుని బలపరాక్రమమంతయు కృష్ణుడు పొగడగా అతడిట్లను చున్నాడు. "నాపరాక్రమమంతయు దేవర అనుగ్రహ విశేషమే. అర్క కాంత శిలలో ప్రకటమగు వేడి యంతయు నిజమునకు అర్కపాదముల నుండి లభించినదేగదా. నీది గాని పరాక్రమము నాలో వేరుగానే యున్నది?" (చూ.పు. 174) శ్రీకృష్ణుడాజ్ఞాపించిన పనిని దేనినైనను సరే మారు మాటలేక ఆచరించుటయే ఈతని లక్ష్యము. కనుకనే కృష్ణుడు కూడ తన అమరావతీ ప్రయాణమందలి ఆంతర్యోద్దేశమునుగాని, పారిజాతాపహరణము గావింపవలసి వచ్చిన పరిస్థితులను గాని ఇతనికి తెలుపనే లేదు. ఇట్లు రుద్రభట్టు చిత్రణలో గరుడుడు స్వీయవ్యక్తిత్వమనునదే మాత్రమును లేక శ్రీకృష్ణుని చేతిలోని ఒక బలమగు ఉపకరణము మాత్రమైనాడు.

తిమ్మన చిత్రణలో గరుడుడు పారిజాతాపహరణ నాటకమునకు పతాకా నాయకుడనదగి యున్నాడు. ప్రధాన నాయకుని కంటె కొంచెము తక్కువ వాడైన పీఠమర్దుడను నాయకమిత్రుని వలె తిమ్మన గరుడుని చిత్రించినాడు.

బలవేగములలో గరుడెవ్వరికిని తీసిపోడు. గరుడుని రెక్కల గాలి తాకిడి కోర్వలేక సూర్యరథ రజ్జువులైన పన్నగములు తేరిక్రిందికి జనినవి. ఇతడొక్క ఐరావతమునే గాక తదితర గంధ సింధురములను, హరులను, రథమును, వీరభటులను చీల్చి చెండాడినాడు. శ్రీకృష్ణుడు ఖండించియు కూల్పలేని అమరాస్త్రముల నీతడు తన రెక్కల గాడుపుతో చెదర గొట్టినాడు. కృష్ణుని బాణముల కంటె ముందుగానేగి వాని లక్ష్యములను తానే ఛేదించినాడు. ఇట్లు 'నిఖిలలోకాద్భుతావహ నిర్నిరోధ విక్రమ స్ఫూర్తి' యై ప్రకాశించినాడు ఈ ఖగరాజ చక్రవర్తి.

వైనతేయుడింతగా విక్రమించుటకు కారణము ఆతనికి స్వామి కార్యమేగాక స్వప్రయోజనము కూడ కలదు. చిన్నవాడు మాతృ దాస్య నిరాసనార్థము అమృతాహరణోద్యోగియైన తనపై వజ్రమును ప్రయోగించినాడని గరుడునికి దేవేంద్రునిపై నింకను కంటుగనేయున్నది. కనుకనే కృష్ణుడు తన అమరావతీ యాత్రోద్దేశమును తెలుపగనే గరుడుడు 'జాదులు ప్రసాదము నయ్యె' నని హర్షముతో పొంగిపోయినాడు. "ఆనాటి పగను నేడు నీ దయ వలన తీర్చుకొందు"నని

సంబరపడినాడు. స్వామి కార్యమును నెరవేర్చుచునే స్వకార్యమును సాధించు కొనుటలో ఈ గరుడుని నేర్పు మెచ్చదగినది, నెమ్మని పదములకు మ్రొక్కుటకై మిన్ను నుండి భూమిపై వ్రాలుచునే ఆ యదటుతో జాతిశత్రునైన పన్నగపతి తలలు చదియ బడజేసినాడు.[24]

శ్రీకృష్ణుడు గరుడునకు తన అమరావతీ ప్రయాణపు ఆంతర్యమును, దానికి కారణమైన సత్యా మానవృత్తాంతమును నారదాగమనమాదిగ సర్వము పూసగ్రుచ్చినట్లు తెలిపినాడు. మరెవ్వరికిని కృష్ణు డీవిషయములు తెలిపియుండలేదు. వాహన మాత్రునకీ రహస్యములను తెలుపవలసిన అవసరము లేదు. అట్టి యవసరమున్నదని కృష్ణుడు భావించినాడనగా గరుడుడు కేవల వాహన మాత్రుడు కాడన్నమాట. ఆతడు తనకు ఆప్త మిత్రుడు, నర్మసచివుడు, కార్య సహాయకుడు అని భావించి కృష్ణుడాతనిని గౌరవించినాడు. శ్రీకృష్ణుని పృష్ఠ భూమి క్రింద నుండవలసిన గరుడుడు తిమ్మన పోషణలో కృష్ణుని భుజముల ఎత్తునకు పెరిగినాడు.

## సత్యాదాసి :

నారదదత్త పారిజాతసుమమును కృష్ణుడు రుక్మిణి కొసగిన సమయమున అచట సత్యాదాసి యొకతె కలదు. అది యచటి వృత్తాంతము నంతటిని వెంటనే తన దొరసానికి చేరవేసినది. ఆ చేరవేయుటలో ఎంతో సొంత కవిత్వము కూడ చేర్చినది. ఈ దాసికి రుక్మిణి యన్న చెప్పరానంత అక్కసు. రుక్మిణి నటనలు పోయినదను ఒక్క మాటతో ఆ అక్కసంతయు వ్యక్తమగుచున్నది. రుక్మిణీ మహిమాతి శయమును గాంచి దీనికెంతగ కన్ను గుట్టినదో గాని, దాని కనుగవయందు ఎరసంజ పొడమెనది. ఇది సర్వవిధముల సత్యకు తగినదాసి. అహంకారమున ఇది సత్యతో సరితూగగలది. తనను చూచియైన నారదుడు సత్యానింద చేయకుండ నలసినదీని దానిబాధ. నే ననఁగాఁ బలికేనని దాని అక్కసు. నాట్యశాస్త్ర పరిభాషలో ఇది నీచపాత్ర. గుణమునకును అట్టిదే. రామాయణములోని మంథరకును దీనికిని చాల పోలిక కలదు. తాత్కాలికమగు కల్లోలమునకును, దీర్ఘ కాలికమగు లోక కల్యాణమునకును వీరిద్దరును పరోక్ష కారణములైనారు.

ఈ దాసి అచ్చముగ తిమ్మన సృష్టియే. సంస్కృత మూలము లో దీని

పాలకుపయే లేదు. రుద్రభట్టు కూడ దీనికొక అక్కనుగాని చెల్లెలినిగాని సృష్టించియుండలేదు. తిమ్మన యైనను దీనికి నామ కరణము గావింపలేదు. పేరు పెంపులు లేకున్నను అవి కల పాత్రలంకంటె ఈ అనామక దాసి పాత్ర జీవకళలో మిన్నయగునట్లు చిత్రించిన తిమ్మన ప్రతిభ వాచ్యాతో దర్శనీయము.

హరివంశ విష్ణు పురాణములు పాత్రల మూర్తులను బాడిస చెక్కడపు పనితనముతో వదలినవి. రుద్రభట్టు వాని మీద కొంత చిత్రిక పట్టినాడు. కాని తిమ్మన వాని మీద చూపిన సన్న పోగారు పనితనము అనితరసాధ్యమైనది.

ఇంతవరకు విపులముగా కావింపబడిన పాత్ర చిత్రణా తులనా త్మక పరిశీలన వలన తిమ్మన కైవాడము రుద్రభట్టునకబ్బ లేదనుట స్పష్టమైనది.

## ఛందోవైవిధ్యము

జగన్నాథ విజయ పారిజాతాపహరణములు రెండును చంపూ కావ్యములే వీనిలో గలగద్య పద్యముల సంఖ్య ఈ విధముగానున్నది.

| | పద్యములు | గద్యములు | మొత్తము | గద్యశాతము |
|---|---|---|---|---|
| జగన్నాథ విజయము | 2039 | 732 | 2771 | 26 % |
| జ.వి.లో పారిజాత కథా భాగము | 175 | 92 | 267 | 34 % |
| పారిజాతాపహరణము | 501 | 11 | 512 | 2 % |

గద్యము వ్రాయుట కంటె పద్యము రచించుటకు ఓర్పు, నేర్పు అధికముగ నుండ వలెననుట నిర్వివాదము. ఈ దృష్టితో చూచినపుడు రుద్రభట్టు కంటె తిమ్మన కావ్యరచనమున ఎక్కువ నేర్పును ఓర్పును ప్రదర్శించినాడని చెప్పక తప్పదు.

ఇది సాధారణ కథా కథనాత్మక వచనములను గురించియు. సంధివచనములను గురించియు చెప్పినమాట, ఇవి గాక పద్యతుల్యమో, పద్యము కంటె జటిలమో యగుశైలిలో విచిత్రగతులలో భాషాఘోష చేత భరతము త్రొక్కించుటకే కొన్ని చోట్ల కవులు గద్యరచన గావించుటయు కలదు. ఇట్టి గద్యలను బట్టియే 'గద్యం కవీనాం నికషం వదన్తి' అను అభియుక్తోక్తి ఏర్పడినది. సాధారణముగ వర్ణనా సందర్భములందు కవులిట్టి రచనలు గావింతురు.

తిమ్మన కావ్యమందలి 11వచనములలో సాంప్రదాయికమగు అభ్యుయ పరం పరాభివర్ధీత్యాది వచనము పోగా మిగిలిన పదివచనములలో ఐదు ఇట్టి వర్ణనాత్మకములే - చంద్రికా, మేరు, వైజయంత, రణరంగ, పుణ్యక వచనములు.[1] ఒకటి సంధి వచనము, నాలుగు కథానాత్మకములు రుద్రభట్టు పారిజాత కథా భాగమున రచించిన 92వచనములలో వర్ణనాత్మక, శైలీ గారభీర్యయుత గద్యలువ రెండే రెండు - ఒకటి అదితికృత శ్రీకృష్ణస్తవమగు 'ముక్త పదగ్రస్త చక్రవాళగద్య', రెండవది రణరంగ గద్య మిగిలిన వానిలో సుమారు 30 సంధి వచనములు, 60 కథా కథనాత్మకములు. ఈ దృష్టితో చూచినను కావ్యరచనలో తిమ్మన చూపిన ఓర్పు, నేర్పు రుద్రభట్టు చూపలేదన వలసియున్నది.

కథా కథనాత్మకములుగా తిమ్మన రచించిన నాలుగు గద్యలు పారిజాత ప్రదాన గద్య (I 52), ప్రయాణసన్నాహ గద్య (II 71), యుద్ధ సంరంభ గద్య (IV 66), ఫలసిద్ధి గద్య (V 53) కూడ పద్యముల వంటి శైలీనైగ నిగ్యమును, శయ్యాసౌ భాగ్యమును గలిగి చదువ వింపు గొలుపు చుండును. ఉదాహరణముగ పారిజాత వచనమునే పరికింపదగును.

'....... అవ్విరించినందనుండమందానంబు డెందంబునం గ్రందు కొన నిజవాసనా బిరుదగాథా కథన వందిబృందాయమా నేందిందిరంబును, నుచితో పయోగ జనితానంద బాష్పసందోహ శంకావహ మకరంద బిందుతుందిలంబును, నిఖిలమనోరథ ప్రదానకీర్తి శంకాకర విశద ప్రభా విచుళితంబును నగు పారిజాతంపు 'గ్రొన్నన మిన్నేటి పసిండి నెత్తమ్మి చిగురు టాకునం బొదివియిచ్చిన'. (I 52). ఇందలి శబ్దాలంకారముల వలన కలిగిన శ్రావ్యత, దీర్ఘ పంస్కృత సమాసత్రయమును చెప్పి, వెంటనే 'పారిజాతంపు 'గ్రొన్నన' ఇత్యాదిగా అలతి అలతి తెలుగు పదములను కూర్చుట వలన కలిగిన శయ్యాసౌ భాగ్యము వర్ణనాతీతము. గాంభీర్య లాలిత్యములకు రెంటికిని ఈ గద్యము కాణయాచి.

రుద్రభట్టు రచించిన కథా కథనాత్మక గద్యలలో నిట్టి శైలీ నైగనిగ్యము, శయ్యాసౌభాగ్యము మృగ్యములు. నిజమున కవి వట్టి వచనములే గాని కమనీయ గద్యలు కానే కావు. ఒకటి రెండు ఉదాహరణలను గమనింతము :

'ఎందదితి దేవి స్తుతిగెయ్యు, కళిపె, విహంగపతిపతాక వాకాశ దిం ద్వారావతి

గవతరిపిదాగళ్' (XII 57వ).

(అవి యదితి దేవి స్తుతి చేపి పంపగా, విహంగపతి పతాకు డాకాశము నుండి ద్వారావతి కవతరించినప్పుడు).

'ఆగళా వినోదనిళయదిం నైపథ్యసదనక్కె పసదనం గెయ్యలెందు పత్యభామె పోగె' (XIII 1).

(అప్పుడా వినోద నిలయము నుండి నైపథ్యసదనమునకు అలంకరించుకొన వలెనని పత్యభామ పోగా).

ఇట్టి చప్పిడి వచనములనే రుద్రభట్టు వ్రాసియున్నాడు. వచన రచనలో గూడ రుద్రభట్టు కంటె తిమ్మన అక్షరరమ్యత వెక్కువ పాటించినాడని పిండితార్థము.

ఇపుడు రుద్రభట్టు తిమ్మనలు వాడిన ఛందస్సులను పరిశీలింతము.

| ఛందస్సు | జగన్నాథవిజయము | | జ.వి.లో. పారిజాతకథ | | పారిజాతాపహరణము | |
|---|---|---|---|---|---|---|
| | సంఖ్య | శాతము | సంఖ్య | శాతము | సంఖ్య | శాతము |
| చంపకమాల | 294 | 14.4 | 22 | 12.6 | 104 | 20.3 |
| ఉత్పలమాల | 152 | 7.5 | 7 | 4 | 84 | 16.4 |
| మత్తేభము | 364 | 17.9 | 33 | 18.9 | 55 | 10.7 |
| శార్దూలము | 10 | 0.5 | - | - | 26 | 5.1 |
| స్రగ్ధర | 194 | 9.5 | 25 | 41.3 | - | - |
| కందము | 1006 | 49.3 | 89 | 50.9 | 133 | 26 |
| తేటగీతి | - | - | - | - | 38 | 7.4 |
| ఆటవెలది | - | - | - | - | 3 | 0.6 |
| సీసము | - | - | - | - | 48 | 9.4 |
| రగడ | 2 | 0.1 | - | - | 1 | 0.2 |
| ఇతరములు | 12 | 0.6 | - | - | 8 | 1.6 |
| మొత్తము | 2039 | | 175 | | 512 | |

ఈ పరిగణన వలన ఈ క్రింది విషయములను గుర్తింప గలము.

1. తిమ్మన మొత్తము పద్యములలో నాల్గవ వంతు మాత్రమే కందములు రచింపగా రుద్రభట్టు గ్రంథములో సగపాలు కంద పద్యమయము గావించినాడు. తెలుగులో వలెనె కన్నడములో కూడ 'కందము వ్రాసినవాడే కవి' యను నానుడి కలదు. రుద్రభట్టు కందముల నెక్కువగ వ్రాయుటచే మహాకవి యగుచున్నాడు.

2. తిమ్మన దేశి చంధస్సులలో 18% వరకు పద్యములు రచింపగా, రుద్రభట్టు 0.2% మాత్రమే వ్రాసినాడు. కన్నడములో తేటగీతి, ఆల వెలది, సీసము అను ఛందస్సులు వాడుకలో లేవనుట నిజమే కాని కన్నడ చంపూ కావ్యములలో ఇతర కవులు వాడుక చేసిన త్రిపది, త్రివడి, షట్పది, సాంగత్యము మొదలగు ఛందస్సులనైన రుద్రభట్టు వాడలేదు.

3. తిమ్మన ఒకే ఒకస్రగ్ధర (0.2%) రచించినాడు. రుద్రభట్టు కూడ గ్రంథము మొత్తము మీద 5స్రగ్ధరలు (0.2%) మాత్రమే రచించినాడు. కాని స్రగ్ధరకు ఈ షడ్భేదమగు మహాస్రగ్ధరలను గ్రంథము మొత్తము మీద 194 (9.5%), పారిజాత కథలో 25(14%) రచించినాడు. తెలుగు కవుల కంటె కన్నడ కవులు స్రగ్ధరాప్రియులు, తెలుగులో చంపకోత్పల మత్తేభ శార్దూలములను సాధారణవృత్తములని చెప్పుట కలదు. కన్నడమున ఈ నాల్గింటికి స్రగ్ధరా మహాస్రగ్ధరలను కూడ చేర్చి ఈ యారింటిని 'ఖ్యాత కర్ణాటకము'లని పిలుతురు. మరియొక విశేషమే మనగా తెలుగు కవులు సాధారణముగ వీర రౌద్ర రసస్ఫూర్తికై మాత్రమే స్రగ్ధరా మహాస్రగ్ధరలను రచించుచుందురు. రుద్రభట్టు శాంతమూర్తి యైన నారదుని, శృంగారమూర్తి యైన సత్యభామను కూడ మహాస్రగ్ధరలోనే వర్ణించియున్నాడు. ఇది తెలుగు వారికి వింతగ తోపకమానదు.

4. తిమ్మన చంపకోత్పల ప్రియుడు. ఈ రెండు ఛందస్సులలో అతడు 36.7% పద్యములు రచింపగా రుద్రభట్టు మొత్తము మీద 21.9% ఈ కథా భాగమున 16.6% పద్యములు మాత్రమే రచించినాడు. రుద్రభట్టు మత్తేభ ప్రియుడు. తిమ్మన 10.7% మత్తేభములను మాత్రమే రచింపగా రుద్రభట్టు మొత్తము మీద 17.9% ఈ కథా భాగమున 18.9% పద్యములను రచించియునాడు. అనగా తిమ్మన శైలి చంపకోత్పల కోమల మనియు, రుద్రభుట్టు శైలి మత్తేభగమన గంభీరమనియు పూర్వపక్ష భీతి లేకుండా చెప్పవచ్చును.

# చతుర్విధ కవితలు

తిమ్మన విస్తర కవిత్వమనదగిన పారిజాతాపహరణ కావ్యమును మృదుమధుర రసభావ భరితముగ రచించి, కట్టకడపట బంధగర్భ చిత్ర కవితలకు ఉదాహరణములుగా - నారదకృత శ్రీ కృష్ణస్తుతి రూపమున - పది పద్యములు వ్రాసియున్నాడు. (V 91-1) ఈపద్యముల రచనకు తిమ్మన తన మేనమామ రచించిన వరాహపురాణమునే ఆదర్శముగ తీసికొనినాడన వచ్చును. వరాహపురాణమున ప్రదర్శింపబడిన చిత్ర కవితలనే తిమ్మనయు ప్రదర్శించినాడు.

బంధ కవిత్వము: గోమూత్రికా, నాగ, ఛురికా, చక్రబంధములు (94-97).

గర్భ కవిత్వము: ద్వికంద క్రౌంచ పద వృత్తము, భుజంగప్రయాత గర్భస్రగ్విణి (99-101).

చిత్ర కవిత్వము: అనులోమ కందము, పాదభ్రమకము, ద్వ్యక్షరికందము (92,93,98).

అనువానిని తిమ్మన రచించియున్నాడు. ఈ కసరత్తు పద్యములు రుచింపని వారు తమపాలిటికి ఆ పద్యములు లేవనుకొని ఒక్కగంతుతో ఆవలకు చేరి రసవ ద్విస్తర కవితామృత వాహినిలో ఓలలాడుటకు వీలగునట్లుగనే - ప్రకరణ భంగము కలుగ కుండునట్లుగనే - తిమ్మన వీనివి రచించినాడు.

రుద్రభట్టు చిత్ర కవితారచనలు చేయలేదు. అట్టి రచనలు చేసియుండుట తిమ్మన యొక్క ఆధిక్యత కాబోదు. చేయకుండుట రుద్రభట్టు యొక్కలోటు కూడ కాదు. కావలెనన్నచో రుద్రభట్టు కూడ ఇట్టి కసరత్తు కవితలు చేయ గలిగియుండెడి వాడనుటలో సందేహము లేదు. కాని తెలుగులో వలె కన్నడ కవిపరంపరలో ఇట్టి చిత్ర కవితారచనా సంప్రదాయమేర్పడి యుండక పోవుట చేత రుద్రభట్టు ఆప్రయత్నము చేయ లేదు అది మేలేయైనది.

# శైలీవైశిష్ట్యము

వ్యక్తికి కంఠస్వరమెట్టిదో కవికి శైలియట్టిది. అదియాతని వ్యక్తిత్వములోని యొక భాగము; అతనికి విశిష్టమైన యొకలక్షణము "Style is the man" అను ఆంగ్లసూక్తి ఇదే భావములను వెల్లడించుచున్నది.

ఇప్పుడు రుద్రభట్టు తిమ్మనల శైలీ విశేషములను పరిశీలింతము. దేశ్యసంస్కృత పద ప్రయోగము, ప్రచలితాప్రచలిత పదప్రయోగము, క్లిష్టాక్లిష్ట సమాస కల్పనము, జాతీయ ప్రయోగము అను అంశములుగ శైలిని విభజించుకొనినచో ఆ పరిశీలనా కార్యము సులభము కాగలదు.

1. <u>దేశ్యసంస్కృత పదప్రయోగము</u> : రుద్రభట్టునకు తన పాండిత్య ప్రకర్షను ప్రదర్శింప వలెనను అభిలాష మెండు. దానికి తోడు సంస్కృత పదాడంబరము వలన గాని పాండిత్య ప్రకటన కాదను భ్రాంతి యొకటి. అందుచేత సంస్కృత పదభూయిష్టమైన శైలి నీతడు బలాత్కారముగ పట్టిలాగి కొని తెచ్చును. అందుచే నీతని పద్యము గతుకుల రాతినేల పై పరుగు లెత్తు ఇనుప చక్రముల శకటము వలెనడచును. దేశ్య పదముల నధికముగ వాడినప్పుడు మాత్రమీతని పద్యములు పాఠకునకు హాయిని గొలుపును. కాని అట్టి వాని సంఖ్యచాల తక్కువ. సంస్కృతము, కన్నడము కలగలుపుగా నున్న ఈ తని కొన్ని పద్యములు కలకండ పలుకులు, ఎండుద్రాక్షలు కలబోసినట్లుండును. కొన్ని వడ్లు పెరుగు కలిపి పిసికినట్లుండును.

ఈ క్రింది పద్యములో విభక్తిప్రత్యయములును ఒకటి రెండు చిన్న చిన్న పదములును మాత్రమే కన్నడము.

'బళి విధ్వంసిగె కొట్ట నాహవరస ప్రస్యందన స్యందనం
గళ నంగచ్ఛవి సత్త్వరూప శుభచేష్టా వాహంగళం
జళదశ్యామ సదాన గండరద నిర్భిన్నాగ నాగంగళం
విళసద్రత్న గణ ప్రభా పరికర వ్యాకోశ కోశంగళం.' (XIII 52)1

ఈ పద్యపు నడక అంత వికటముగ లేదు. సంస్కృత భూయిష్ఠమయ్యు సుగమముగనేయున్నది. కాని ఈ శయ్యామార్దవము అన్ని చోట్ల కానరాదు.

మరియొక పద్యము.

'పరశౌర్యోత్కర్షమం మాళ్పణ కద సుడిగళ్కర్ణమంతాగె కోప
స్ఫురిత భ్రూకోటియుం కంపిసు వధరముత్ఫుల్ల వాసాగ్రముం ని
ర్భర ఘర్మక్లిన్న గండ స్థళము మరుణ నేత్రాబ్జముం కణ్గగుర్వా
గిరె దైతేయాంతకం సంప్హాతి సమయ మహోగ్రాంతకాకారవాదం.[2]

పద్యపు నడక అంత సుగమముగ లేదు ఇది మహాస్రగ్ధర యగుటయు అందుకు కొంత వరకు కారణము కావచ్చును.

ఈ క్రింది పద్యము సమసంస్కృత కర్ణాటమై కర్ణాటమగుచున్నది.

'ఇదుకృతకాద్రి యప్పుదు; వనావళి యప్పుదు; పద్మషండవ
ప్పుదు; తళిరుయ్యెలప్పుదు; లతాగృహ వప్పుదు; రత్న దీపవ
ప్పుదు; మధుమాసవప్పుదు; నవోజ్జ్వల చంద్రికెయప్పు దింతిదా
గద తెఱవిల్లి దొందు కుసమం కుడుతిర్కు మభీష్ట సిద్ధియం.[3] (XIII68)

ఈ క్రింది పద్యము పై పద్య మిచ్చిన హాయినిచ్చుట లేదు.

'హరనేత్ర వహ్నియం సం
హరణాగ్నియు మిదఱ కాయ్పువోళ్ దొరెయక్కుం
దొరెయల్తు గర్జనాదం
బరదొళి దర్కొనిప వజ్రదిం వృషనిట్టం.[4] (XIII 105)

ఇట్టి సరళ సుందరము లైన పద్యములు వ్రాయగలిగియు రుద్రభట్టు విశేషముగ వ్రాయడు. "ఇతని శైలి అతిప్రౌఢము. దీర్ఘములైన సమాసపదములు, అపూర్వములైన సంస్కృత శబ్దములు ఇతని పద్యము నిండ మదపు టేనుగుల వలె తిరుగాడు చుండును. ఒక్కొక చోట మాత్రము తేటయైన కన్నడ పదములను వాడినాడు[5] మొత్తము మీద "సంస్కృత కన్నడ భాషల శబ్ద సంపత్తును యథేచ్ఛముగా ఉచితానుచిత ప్రశ్న లేక వాడినాడు. హెచ్చుగా సంస్కృత పద భూయిష్ఠ పదపుంజమును వాడి

పండితులను సవాలు చేయుట ఈతని కావ్యరీతి వైశిష్ట్యములలో నొకటి.[6]

తిమ్మన కూడ సంస్కృత పదముల నధికముగనే వాడినాడు. అచ్చతెలుగు పదములను కూడ అంత కంటె ఎక్కువగ వాడినట్లు కనుపించును.

'కొందఱకుఁ దెనుఁగు గుణమగు'ను. వారు 'పలుకునుడికారమునఁ దెల్గు భాష యంద్రు' 'కొందఱకును సంస్కృతంబు గుణమగు'ను. వారు 'ప్రౌఢిఁ బరికింప సంస్కృత భాషయంద్రు'. రెండుం గొందఱకు గుణములగు'ను. వారు 'కర్ణాట భాషా' ప్రియులు, అనగా పదముల తెనుగు తనమునకు గాని, సంస్కృతత్వమునకు గాని ప్రాధాన్య మీయక శ్రుతి సుభగత్వమును, సుబోధకత్వమును, అభిమానించు వారు. తిమ్మన వారి 'నందఱను అర్యెయ్యెడల' ఎట్లు 'మెప్పించె'నో గమనింతము.

ఈ అచ్చసంస్కృత పద్యము లెంత స్వచ్ఛమైన హోయి నొసంగు చున్నవో!

'దరదళ దంబుజముకుళో

దరదళ మిళ దళికులచ్ఛద ప్రహతి సర

త్సరస రజోధూసరి సరి

సర సరసీ తీర కుంజ సదవస్థలులన్' (V 103)

'మరకత గోమేదిక పు

ష్యరాగ విద్రుమ విదూర సంభవ ముక్తా

హరినీల వజ్ర కురువిం

దరత్నమయ కృతక భూమిధర కందరలన్' (V 104)

పై రెండు పద్యము లందును 'లన్' మాత్రమే తెలుగు, ఐనను ఇవి తెలుగు పద్యముల తేట దనమునే వెలార్చుచున్నవి.

తెలుగు పలుకుబడిలోని మెలకువ తిమ్మనకు తెలిసినంతగ మరి యెవరికిని తెలియదనవచ్చును. మృదుత్వము, కోమలత్వము, సౌకుమార్యము, లాలిత్యము ననునవి తెలుగు బాసకును తిమ్మనకును సహజమైన గుణములు. కనుకనే తిమ్మన

కవిత ఏటి నీటి కెదురెక్కు చేప వలె అచ్చ తెలుగులో చల్లగా పాగిపోవును. ఒక ఉదాహరణము.

'వలిమలయల్లు వాడు తలవాఁక దలిర్చిన పూవుగుత్తి,
వేల్పులగమి జీవిగఱ్ఱ, యుడివోవని చల్వల టెంకి, వెన్నెలల్
మొలిచిన పాదు, పాల్కడలి ముద్దులపట్టి, నరసింహ కృష్ణరా
యలఁ గరుణారసంబు నినుపారెడి చూపులఁ జూచుఁగావుతన్' (I 6)

ఈ నెలబాలుని పొగడ్తను చదువు చదువరికి వెన్నెలలో తేలిపోవు చున్నట్లనిపించును. కారణము ఈ పద్యము నిండుగ నావరించిన తెలుగు పలుకుల చలువదనమే. ఈ తెలుగుల మధ్య 'కరుణారసంబు' అనునొక సంస్కృత శబ్దము సందు చేసి కొనినది. మన మింతకు ముందు చూచిన రెండు అచ్చసంస్కృత పద్యములకు ముందు మచ్చున కోయన్నట్లొక అచ్చ తెలుగు పద్యమును ముచ్చటగా కూర్చినాడు.

'తలిరుల తుదఁ జినుకులు జల
జల వడియఁగఁ దడిసిమెలగు చలి కరువలి మ
ప్పొలపమున విరియు పరువపుఁ
దొలుమొగడల వలపుఁ దెలుపు తోటల లోనన్' (V 102)

ఈ క్రింది పద్యములలో అచ్చ తెలుగు పచ్చి కస్తురి గుబాళించుచున్నది. I49, 56, 64, 77, 97, 117, 118, 127, 130, II7, 37, 39, 45, 96, III16, 49, IV19, 32, 44, V27, 84

ఈ క్రింది పద్యములలో సంస్కృతము ప్రభుత్వము చేయుచున్నది. I39, II15, 20, 59,65, 68, 85, 91, 91, 95, 103, III43, 44, 45, 46, 46, IV65, 78, 35, 59, 60

ఈ క్రింది పద్యములలో తెలుగు సంస్కృతములు పాలుచక్కెర వలె కలసిపోయి కమ్మని మధుపాకముగా రూపొందినవి.

I1, 2, 3, 4, 5, 37, 42, 49, 61, 62, 66, 69, 82, 101, 108, 110, 125, 133, 134, II9, 10, 34, 35, 41, 42, 43, 44, 49, 50, 97, 99, 100, III7, 27, 42, 50, 55, IV18, 47, 77, 10, 32, 33, 48, 68, 70, 71, 79, 87, 107

మొత్తము మీద తెలుగు పలుకుల, వేలువు మినుకుల, మేలికలయిక తిమ్మన లక్ష్యము. దానికి తిమ్మన కావ్యమంతయు లక్ష్యమే.

2. ప్రచలితా ప్రచలిత పదప్రయోగము :- అప్రచలిత పదప్రయోగమను దోషము రుద్రభట్టు తిమ్మనలకిరువురకును ఆపాదింపరానిదే. తిమ్మన చిత్రకవితా పద్యములలో మాత్రము కేవలనిఘంటు శరణ్యములైన పదములు వాడినాడు. షష్ఠ్యంతములలో హిమగు, నేదిష్ఠ, తరస, తాయన, తాపని మొదలగు బహుప్రచలితములు కాని పదములు కొన్ని కనిపించుచున్నవి. కాని గ్రంథమంతట వాడుక చేయబడిన సంస్కృతాంధ్ర పదములన్నియు జనులనిత్య వ్యవహార మందలివో, బహుకవి ప్రయుక్తములో యగుటచే నిఘంటు సహాయము నపేక్షింపనివే. మొత్తము మీద రుద్రభట్టు ప్రయోగించు పదముల కంటె తిమ్మన ప్రయోగించునవి బహుప్రచలితములు.

3. క్లిష్టాక్లిష్ట సమాస కల్పనము :- రుద్రభట్టు సంస్కృత సమాస భూయిష్ఠమైన భాషనెక్కువగ వాడినాడు. అతని సమాసములు మిక్కిలి పొడవైనవి కావు. కాని సమాసఘటనము జటిల మనిపించును. లోగడ (పుట 348) సంస్కృత పద భూయిష్టమైన శైలికుదాహరణముగా చూపబడిన పద్యములందలి సమాసములివి: 'ప్రస్యందన స్యందనములు', 'అంగచ్ఛవిసత్త్వ రూపనిజ చేష్టావాహ వాహములు', 'జలదశ్యామ సదాసగండరద విర్భిన్నాగనాగములు'. ఈ సమాసములు అగుటకు సుబోధములే; కాని సుఖగమనము మాత్రము వీని యందు లేదు. శయ్యా సౌభ్యాము లోపించినది.

తిమ్మన కూడ సంస్కృత సమాసముల నధికముగనే వాడి నాడు. రుద్రభట్టు కంటె దీర్ఘ సమాసములను కూడ వాడినాడు. ఐనను అతని సమాసములు సుబోధములే గాక సుశ్రావ్యములు కూడ నగుటచే సుఖగమనము కలిగి యున్నవి.

'జీర్ణ పర్ణద్రు సంకీర్ణాహిమణి విభా
మాయా కిసల వంచ్య మాన పికము

శశి కాంతరుచి మృషా సలిల సంప్లావన
శ్లథ విషాణో ద్విగ్న సైరిభంబు
గోమేధిక ప్రభాంకూర మిథ్యామధు
ద్రవ లిలిక్షా మిళ ద్భల్లుకంబు
నీలగండ ప్రస్తరాళీక గజ భేద
శీర్యన్నఖక్షుబ్ధ సింహ కులము,
గారుడాశ్మ చ్ఛవిచ్ఛటా కపట యవస,
పూరికా చర్వణ వ్యగ్ర బాలమృగ వి
లంఘ్యమానాబ్జరాగ శిలా వితాన
కూట దావాగ్ని......' (III 86)

పై పద్యము నందలి సమాసముల దైర్ఘ్యము వలన వాని శయ్యా సౌభాగ్య మే మాత్రమును మందగింప లేదు. పద్యమంతయు నొకటే సమాసముగా మన్న పద్యములు (V 103, 104) చూచియున్నాము.

ఈ సమాసముల పొడవే వాని కొక అదనపుటందము నొసంగు చున్నదన్నను తప్పులేదు.

సంస్కృత వ్యాకరణ సాధ్యములైన సుభగం భావుక (I 25), కూలము ద్రుజ(I 28), ఆముష్యాయణ, తుంద పరిమృజ(I 29), వశంవద(I 65), అపలితంకరణ (II 34), అసూర్యం పశ్య(II 69), పశ్యతోహర(II 72), సర్వాంగీణ(IV87), పాణింధమ (IV 90), పతయాళు(V 35), ఏకచ్ఛత్రిత(V 107) ఇత్యాది పదములు కూడ తిమ్మన రచన కొక వింత సొబగును కూర్చుచున్నవి.

దేశ్య పద ఘటితములైన సమాసములు రుద్రభట్టు రచనలో అపురూపము. పూమళెయసేసె. (పూలవాన సేస), కుడు పుర్బి (వంకరబొమ), గెల్లపోలంగళు (గెల్పోటములు) ఇత్యాదిగా గల అచ్చిదక సమాసములు సాధారణముగ రెండే పదములతో నేర్పడి అతి ప్రాథమిక స్థితి యందున్నవి. ఇవి అత్యంత సరళ బంధయుతములైయున్నవి. కాని వీని వలన శైలికి రామణీయకత మాత్రము రాలేదు.

తిమ్మన కూర్చిన అచ్చిక సమాసములు అతని సాంస్కృతిక

సమాసములంతగా కాకున్నను తగు పాటి పొడగరులే. అవియును సుబోధములగుటయే గాక లలిత పద బంధయుతము లగుటచే శైలీ సౌకుమార్యమునకు కారణమగు చున్నవి.

వలి మలయల్లు వాని తలవాకఁ దలిర్చిన పూవుగుత్తి, వేల్పులగమి జీవగఱ్ఱ, ఉడివోవని చల్వలటెంకి, వెన్నెలల్ మొలచిన పాదు, పాల్కడలి ముద్దుల పట్టి (I 6), వేకువ పూవు బోఁడి (II 70), చుక్కల రాణి వాసము (V 10), క్రుంకు మెట్టడవి (III34), తెలివి వెన్నెల వెండి తీగెలు (II 37), ప్రామినుకుల పూఁబోఁడులు (II 5) ఇత్యాదులైన అచ్చ తెలుగు పలుకుల కూటమి పచ్చకప్పురపు పలుకుల చలువను వెదజల్లుచున్నది.

రుద్రభట్టు సంస్కృత సమాసములలో మృదుత్వము లోపించినది. అతని దేశి సమాసములలో మృదుత్వయున్నది, కాని అత్యల్పముగనున్నది. తిమ్మన సంస్కృత సమాసములు మృదువులు; అతని దేశి సమాసములు మృదుతరములు.

4. <u>జాతీయ ప్రయోగము</u> :- రుద్రభట్టు భాషలో జాతీయములు అతి విరళముగానున్నవి. 'ఎరడిల్ల' (రెండనువది లేదు) (నిమిటిదు' (ఏమిగొప్ప), 'ఏగణజదము' (ఏమి లెక్క), పొల్లమెయం బగెదుడు (కీడుతలచుట), పొఱమట్టుమ (బయలు దేరుట), రూపు గరెదు (దాగియుండి), మేణ్కాణలక్కుం (ఆమీద చూడ వచ్చును) ఇత్యాదులైన సంబంధములలో జాతీయ చ్ఛాయలు కొద్దిగా గోచరించుచున్నవి. కాని వాని వలన భాషకు రా దగినంత జీవకళ రాలేదు.

తిమ్మన భాష జాతీయమైన నుడి కారములకు గని. తిమ్మన తీర్చిన స్త్రీ పురుష పాత్రలందురను మాట కారులే, మరియు విశేషించి ఏ భాషయందైనను పలుకు బడిలోని మెలకువలు స్త్రీలకు తెలిసి నంతగ పురుషులకు తెలియవు. ఒక భాషయొక్క నుడికారపు సొంపును చూడ గోరినచో ఆభాషనాడు ఆడువారిలోనే చూడ వలెను. తిమ్మన చిత్రించిన సత్యయు, అతడు సృష్టించిన ఆమె దాసియు గొప్ప మాటకారి మగువలు. 'తిమ్మన ఆడు వారిని చంపిపుట్టిన వాడు.' ఆడు దాని నోటికి మాత్రపలవడగల నుడికారముల నాతడు కొల్లలుగా రాశి పోసినాడు. కనుకనే అతని భాష అత్యంత సహజమై సజీవమై యొప్పుచున్నది. ఔలెమ్ము, ఏమని చెప్పుదు ఎంతకు లేడు, ముల్లో కముతాన యేలుగతి, కన్నులఁగప్పు కొసంగ, తలలెత్తి చూడఁగా, సన్నలఁజాయలం

బ్రతుకుట, ప్రాణము లెంత తీపొకో, ఇంతగా నోచితిని, పూసలలో దారంబు, అనగి పెనగి, కలసిమెలసి, కూడి మాడి, ముళ్ళ మాటలు, దీని చందమొక ఇంచుక చూచెదను, పలుకుల తేనెలుట్టిపడు, కల్లదనంబులు నీవు పుట్టఁగా పుట్టినవి, మాయలు నీకు వెన్నతో బెట్టినవి, తలపూవాడక, విఱ్ఱవీగుట, మిన్నందుట, చెవి యొగ్గుట, ఇచ్చకములాడుట, మొగమిచ్చుమాటలు, ఫలంబిదె కల్గెను, ప్రాణంబు ప్రాణంబు, జాదులు ప్రసాదమునయ్యె అంతవాడవెకదా, తెకతేర, కన్నుల్గానడు, చుట్టపు మేలము ఎమ్మెలు పచరించుట మొదలగు జాతీయములు తిమ్మన కవితలో మారుల కొలదిగనున్నవి రుద్రభట్టు రచనలో ప్రౌఢత్వము, గాంభీర్యము, జటిలత్వము ప్రధాన లక్షణములు కాగా, తిమ్మన రచనలోల లాలిత్వము, మృదుత్వము, మాధుర్యము, సౌకుమార్యము ప్రధాన లక్షణములుగనున్నవి[7]

అప్ప కవి చేసిన పరిగణనమునను సరించి రుద్రభట్టు వాచక కవి యనియు, తిమ్మన రౌచిక కవి యనియు చెప్పనోప్పును[8]

'ముక్కు తిమ్మనార్యుముద్దు పలుకు' అనునది సార్థకమైన మాట. ముద్దు పలుకులకు ముక్కు తిమ్మన యనునది మారుపేరు.

## కావ్యగుణములు

గుణసహితము, దోషరహితము నైన రచనయే కావ్యనామమున కర్హమగును.[1] గుణములు కావ్యోత్కర్షహేతువులు. తిమ్మన రుద్రభట్టుల కావ్యములలో వ్యక్తములగు గుణ విశేషముల నారయుదము.

తిమ్మన కవి కావ్యకన్య సర్వసద్గుణ సంపన్న. విశేషించి ప్రసాద, మాధుర్య సౌకుమార్యములు తిమ్మన రచన యందలి ప్రధాన గుణములు, ఓజస్సు మెండుగనున్నను అర్థవ్యక్తి అణు మాత్రమేని లోపింపకుండుట తిమ్మన రచన యందలి విశిష్టత. ఇపుడాయా గుణములు ప్రస్ఫుటములగు కొన్ని పద్యములను గుర్తింతము.

ప్రసాదము : I 4, 56, 59, 71, 72, II 9, 12, 41, 96; V 102, 103,

మాధుర్యము :- I 56, 69; II 12; V 102, 103.

సౌకుమార్యము :- I 56, 59, 71, II 9, 12; III 43, 52; V 102, 103.

ముఖ్యముగ 'మగమిాలవగ జాలు.....' (I 56) అనుపద్యము, ఈ మూడు

ముచ్చటైన గుణములకు చక్కని యుదాహరణమైయున్నది.

ఓజస్సు :- I 95; II 53, 59, 86; III 43, 44.

అర్థవ్యక్తి :- I 38, 42, 56, 59, 71; II 12, 21; III 21, 52; IV 20; V 74.

సమత :- I 40, 42, 56 సంక్షేపము I 37.

శ్లేషము - I 76 కాంతి I 56.

ఔదార్యము I 60 ప్రేయస్సు I 43.

పై ఉదాహరణలు స్థాలీపులాకన్యాయమునకు ఉదాహరణములు. తిమ్మన కవితయందెచట పట్టిచూచినను ప్రసాద, మాధుర్య, సౌకుమార్య, అర్థవ్యక్తులు అనుభూయమానములు కాగలవు.

రుద్రభట్టు కవితలో ప్రసాద మాధుర్య సౌకుమార్యములు గల పద్యములు విరళము.

'ఇదు కృతా కాద్రి యప్పుదు.......' (XII 68)

'బందు మృదుయానదింద..........' ( - 83)

'మృగమదలలామ దిందం..........' (XIII 35)

మొదలగు పద్యములలో ఈ గుణములు గలవు. కాని రుద్రభట్టు కవితకు విశిష్టమైన గుణములు ఊర్జితము, ఓజస్సు, ఔదార్యము ఉక్తి అనునవి. ఈ గుణములకు రుద్రభట్టు రచనలో ఎన్నియైన ఉదాహరణలు లభింపగలవు.

ఉర్జితము :- XII 81, 87; XIII 50, 65,-72; 74, 89, 110

ఓజస్సు :- XII 52, XIII 50, 56, 62, 65, 67, 74, 89

ఔదార్యము :- XII50, 58, 62; XIII 45, 61, 67, 89.

ఉక్తి :- XIII 42, 78, 80, 86, 99

'స్తనకంపత్పృట్య దేకావళి' (XIII 50), భ్రుకుటీ బద్ధాంధకారం (-67), 'గుణటంకారవీద.....' (-89) ఇత్యాది పద్యములు ఓజో, ఊర్జిత, ఔదార్యములకు విదానములు, ఇవి రుద్రభట్టు సొంతగుణములు.

## వృత్తులు

వృత్తులు సాక్షాద్రసోపస్కారములు. కైశికి అత్యంత మృదు వృత్తి. శృంగార, హాస్య, కరుణ రసముల అభివ్యక్తి కై శికి వలననే సాధ్యము, తిమ్మన కావ్యము శృంగారరస ప్రధానమైనది; హాస్యముచే ఉజ్జీవితమైనవి. కనుక కైశికీవృత్తియే తిమ్మన కవితాకవ్యనైజవృత్తి. సాత్త్వతియు కొంత కలదు. వీర, రౌద్ర, భీభత్సరసస్ఫోరకమైన ఆరభటి తిమ్మన ప్రవృత్తికే విరుద్ధమైనది. ఆయాసందర్భములలో తిమ్మన ప్రదర్శించిన ఆరభటి తెచ్చికోలు ఆర్భటము మాత్రమే.

కైశికి- 'మగమీల....' (I 56), 'అచ్చర పువ్వుబోండ్లు' (II 96), 'మునిపతియానతిన్' (V 79) పద్యములు ముఖ్యముగా చూడదగినవి. ఇంకను I 69, II 14, 79, III 50, 56, IV 30, 58, V 80, 104, 105 ఇత్యాది పద్యముల నెన్నింటినైన ఉదాహరింపవచ్చును.

సాత్త్వతి- 'వజ్రంబునకు నీఁక.....' (II 72), 'పతగవిభుండు' (II 102), 'సురలోకాధిమత.....' (IV 53), 'బాహాసంభృత' (-80.81,82,84) ద్రష్టవ్యములు.

ఆరభటి:- 'చండస్థూల....' (IV 78), అర్వారోహణ' (-88), 'భుగ్నభ్రూకుటి' (V 32), 'శతధారా' (V 35) పద్యములలో తిమ్మన ఆరభటీ వృత్తిని ప్రదర్శించియున్నాడు.

రుద్రభట్టు కావ్యము వీర రసప్రధానమైనది. రుద్రభట్టు వీరము రౌద్రముతో తరచు సమ్మిశ్రణ మందు చుండును. రౌద్రమును వ్యక్త పరుపగలది ఆరభటి. కనుక రుద్రభట్టునకు ఆరభటి సహజ వృత్తియైనది. ఇతని రచనలో సాత్త్వతియు కొంత ఎక్కువగనే కలదు; కాని కైశికి అత్యల్పముగ మాత్రమే గోచరించుచున్నది.

'షోడశసహస్ర శశిగళ్' (XII 53), 'కుడువుర్విం' (XIII 3) ఇత్యాది పద్యములలో అత్యల్పముగ కైశికి కానవచ్చుచున్నది.

'పరమక్రోధాది దేవార్చన.....' (XII 81), 'ప్రీతియనీవ' (XII 77) 'ఎనెకేళ్గాసత్యభామె....' (XII 110), 'స్తనకంపత్పృట్య దేకావళి', (XIII 50) ఇకంను XIII51, 59, 81, 83,లలో సాత్త్వతీ వృత్తిని చూడగలము.

'పరశౌర్యోత్కర్షమం' (XIII 28), 'తవెదిక్కుండాలమం' (XIII 38),

'అసమక్రోధకృశాను' (-61), 'విళసద్ఘంటా' (-62) 'భ్రుకుటీబద్ధాంధ' (-67), ఇంకను XIII 29,30, 31, 32, 55, 56, 68 - 72 మొదలగు పద్యములు ఆరభటి తో బూరటిల్లుచున్నవి.

చిత్రమేమనగా ఆరభటీవృత్తి నవలంబింప వలసిన యుద్ధ సందర్భములలో కూడ తిమ్మన 'చుక్కలరాణివాసము' (V 10), 'అచ్చరలేమలెల్ల' (V 20) అని కైశికీవృత్తి నాశ్రయింపగా, కైశికీవృత్తిన వలంబింప వలసిన సత్యాకృష్ణుల సంభాషలో కూడ రుద్రభట్టు 'అడకిల్గోండూర్ధ్వలోకప్రతతి' (XIII 45) (65-73) మొదలుగా గల విధముగ ఆరభటీ వృత్తి నాశ్రయించినాడు. ఇట్లు తిమ్మన రుద్రభట్టుల వృత్తులు కేవల విరుద్ధ ప్రవృత్తిగలవియై యున్నవి.

## రీతుల రీతి

గుణముల సమష్టిరూపములైన వృత్తులను స్ఫుటీకరించునవిరీతులు.

శృంగారహాస్యములను, ప్రకటింపగల కైశికిని స్ఫుటీకరింపగలది వైదర్భీరీతి, కనుకనే తిమ్మన రచనలో ముక్కాలు భాగము వైదర్భీరీతికి ఉదాహరణయోగ్యముగా నుండును. మరి మువ్వీసముపాలు పాంచాలీరీతిలో నుండును, రౌద్రబీభత్స భయానకములకును, ఆరభటికిని అనువైన గౌడీరీతి తిమ్మన రచనలో ఒక వీసపు పాలైన ఉన్నదో లేదోయన్నట్లుండును.

పైన చెప్పినట్లు తిమ్మన పద్యములన్నియు దాదాపుగ వైదర్భీరీతికుదాహరణ యోగ్యము లేయైనను స్థాలీపులాక న్యాయమున కొన్నింటిని గుర్తింతము.

'ఆరమణీలలామల' (I 30), 'ఏయేవేళల' (-31), 'కులమును రూపమున్' (-42); 'మగమీల' (-56), 'సరసాలాపములన్' (II 3); 'అప్పుడుశౌరి 'జూచు' (III 11); 'చిలుకలువాఁడిచంచువుల' (IV 54); 'పరమముని' (V 80)లలో వైదర్భీరీతి పరాకాష్ఠనంది యున్నది.

'వెడవెడగన్నుమూయు' (I 101); 'నలినాప్తుండు' (II 54), 'తూగెం జల్లనిగాలి' (III 20), 'డాసి పురోహరిన్మణి' (IV 70), 'కులవసుధాధరావళికి (V 33)లలో సాత్త్వతిని సందర్శింప వచ్చును.

'శ్రీరంగేశ్వర' (I 18), 'చండసూ్థల' (IV 78), 'అర్వారోహణ' (IV 88), 'భుగ్నభ్రూకుటి' (V 32) 'శతధారా' (V 35)లలో గౌడీఛాయలున్నవన వచ్చును.

తిమ్మన రీతికి రుద్రభట్టు రీతి కేవల విరుద్ధము.

రుద్రభట్టు రచనలో ఎక్కువ పాలు గౌడీరీతినే అనుసరించి నది. 'సమసందొాల్మెగె' (XII 87), 'పిడివెం వజ్రము' (XII 26), 'పరశౌర్యోత్కర్షమం' (-28), 'నిజపక్షానిల' (-37), 'తవెదిక్కుండాలము' (-38) 'స్తనకంప' (-50), (-65-72) ఇత్యాదులు గౌడీరీతిలో నడచునవి.

'కెదతీర్దుత్తమ' (XII 62), 'ప్రాకృతమర్త్యనాద' (-58) ఇత్యాదులు పాంచాలీ రీతిలోనడచినవి.

'అలవడె పారిజాత దలరం' (XII 66), 'తలెదొాడవాయ్తు' (-70), 'బందుమృదుయూవ' (-83), 'సిందూరవసనమం' (-89), 'ఈదేవియ' (XIII 42), 'ఆవకవీచిరవం' (-44), ఇత్యాదులు వైదర్భీరీతిలో మన్నవి. ఐన ఇట్టి పద్యములు అపురూపముగా నున్నవి.

తిమ్మన మృదువినయ స్వభావమే అతని వాణియందు వైదర్భీరీతిగా వ్యక్తముకాగా, రుద్రభట్టు ఆడంబరౌద్ధత్యములే అతని కంఠము నుండి గౌడీరీతిలో వెలువడినవని చెప్పవచ్చును.

## పాకరుచులు

రసాస్వాద మందలి సుఖమును తెలుపునది పాకము. తిమ్మన ద్రాక్షాపాక శాసనుడు. అతని కవితలో ఎచ్చట పట్టినను రసముచిప్పిలు చుండును. ఆపాతమధురమైన తిమ్మన కవితా ధార మధుపాక మందు దింపబడినదని చెప్ప నొప్పియున్నది. దీనికిని తిమ్మన గ్రంథమంతయు ఉదాహరణయోగ్యమేయైనను స్థాలీపులాక న్యాయమున క్రింది పద్యములందలి ఆస్వాదసుఖము అనుభావ్యము.

'హరినరకాసురుంగెలిచి...........' (I - 37)
'కులముఃను రూపమున్...........' ( - 42)
'కమ్మకస్తురి గుళికలు.............' (II - 64)

'మలయసమీరణ ................' (III - 50)
'వదలిన నీవిబంధముల...........' (IV - 18)
'సతులు పదార వేవురును.......' (V - 74)

కదళీపాకమని చెప్పదగిన భాగము కూడ కొలదిగా తిమ్మన రచనలో లేక పోలేదు. ఈ క్రింది పద్యములందుకుదాహరణీయములు,

'ఏణీశాబవిలోలనేత్ర .............' (II - 91)
'మహిభృద్భేది ......................' (III - 45)
'గంధర్వోరగ ........................' (V - 41)

నారికేళ పాకము కూడ తనకు చేతవగునవి తిమ్మన షష్ఠ్యంతములను, చిత్ర కవితాపద్యములను వ్రాసి నిరూపించినాడు. కాని తక్కిన కావ్యమం దెచ్చటను ఇట్టి ప్రయత్నములు ఫలింప లేదు. ఇంద్రుని వజ్రప్రయోగ సందర్భమున పట్టు బట్టి పండ్లబిగువున వ్రాసిన 'భుగ్నభ్రూకుటి.....' (V 32), 'శతధారాజాయమాన (-35)లు కూడ నారికేళపాకమున పడలేదు.

రుద్రభట్టు రచన మొత్తము మీద కదళీపాకములోనున్న దన వచ్చును.[1] అది అప్పుడప్పుడు నారికేళపాకములోనికి జారు చుండుటయు కలదు. ద్రాక్షా పాకము కూడ కొంతకు కొంత కలదు.

ద్రాక్షా పాకమునకు ఈ క్రింది పద్యములు దాహరణీయములు.
'అళవడె పారిజాత...... ప్రణయప్రకోపమం' (౧౨-66)
'మృగమదలలామ.... అంబరదోళ్' (౧౩- 35)
'వెఱపల్ పూణ్కె...... అభిమతమం.' (౧౪- 1)
కదళీపాక మీక్రింది పద్యములలో లభించుచున్నది.
'బలివిధ్వంసిగె...... కోశంగళం.' (౧౨ - 52)
'అతివాతాఘాతదిం...... సకారుణ్యానాదం'. (౧౩-110)
'తళెవుత్తం...........ఉత్సాహదిందం'. (౧౪-3)

నారికేళపాకపు రుచి ఈక్రింది పద్యములలో కలదు.

'స్తవకంప త్పట్యత్.... బర్పందదిందం' (౧౩-50); విలసద్ఘంటా.....ద్విపేంద్రం (౧౪-52)

# సమకాలీన జీవనము

కవి కూడ సంఘము నందలి ఒక భాగమే. కనుక తాను ఏసంఘమునకు చెందియున్నాడో ఆ సంఘపు జీవిత విధానము, ఆచారవ్యవహారములు, అలవాట్లు, నమ్మకములు కవి రచనలో చోటు చేసికొని తీరును. తిమ్మన రుద్రభట్టుల రచనలలో వారి సమాకాలీన ప్రజాజీవితమెట్లు ప్రతి బింబించుచున్నదో గమనింతము.

దక్షిణ భారత చరిత్రలో శ్రీకృష్ణదేవరాయల వారి కాలము సువర్ణయుగముగా ప్రసిద్ధి చేందినది. తిమ్మన రాయల ఆదరాభిమానములకు పాత్రుడైన ఆస్థానికుడు. కనుక రాయలనాటి విద్యానగర రసిక ప్రభువుల జీవితమునకు పారిజాతాపహరణమొక దర్పణమై యొప్పుచున్నది.

రాయల వారి నివాస మందిరమునకు మలయకూట మనియు (II 1), సభా భవమునకు భువన విజయమనియు (V 110), పేళ్ళు, ఈ రెండు చోట్లను తిమ్మనకు సముచితమగు గౌరవము లభించెడిది. హజారమునను, అంత: పురమునను కూడ సమానమగు చనవు స్వాతంత్ర్యములతో సంచరింప గల వాడగుటచే ఈ అరణపు కవి జానపద కవుల కజ్ఞేయములైన ఆస్థానమర్యాదలను, అనితర గోచరములైన అంత: పురాచారములను కూడ పాఠకుల కన్నులకు కట్టినట్లు చిత్రింపగలిగినాడు. రాయలవెంట జైత్రయాత్రలలో కూడ పాల్గొను చుండిన వాడగుటచే (చూ.రాయవాచకము పుట 89). తిమ్మన నాటియుద్ధ పద్ధతులను కూడ నిపుణముగ వర్ణింప గలిగినాడు.

విద్యానగరమునకు చుట్టును ఎత్తైన కోటగోడ యుండెడిది.[1] (II 97). నగరము నందలి రాజవీథులు విశాలములై యుండెడివి. (III 22). వీథుల కిరుప్రక్కల ఉన్నత సౌధములు (III 11), సౌధ శిఖరములపై దుకూల పతాకములు (II 98) నుండెడివి. నాగరకుల విలాసమునకై పురోపవన వాటికలు, వానిలో చెంగలువ కొలనులు, వాని గట్టున చలువ చప్పరములు, చంద్రోపల వేదికలు (I 71) నుండెడివి. రాచనగరులో మణికాంచన సౌధములుండెడివి. (I 140). వానినంటి యున్న శృంగారవనములుండెడివి. (IV 27) కొలనులో చెంగలువ లెన్నియుండెడివోగాని ఉద్యాన భూభాగమంతయు వాని పుప్పొడితో పరచినట్లుండెడిది. (I 71). ఉద్యానములో గొజ్జగి, మాధవి, మాలతి మొదలైన పుష్ప జాతులు, దాడిమ, కదళ్యాది ఫలవృక్షములు ఎన్నియుండెడివో చెప్పలేము. వాని

పూవుల నుండి స్రవించు పూదేనియ కాలువలై, ఏరులై ప్రవహించెడిది (I 71). అట్టి చోట మధుపములైన అలికులములు, కిసలయఖాదులైన పికములు, ఫల భుక్కులైన శుకశారికాదులు గుంపులుగా నుండెడివి. వీని కలకల ధ్వనులన్నియుచేరి కోలాహలముగా నుండెడిది. వీనికి తోడు కేళి దీర్ఘికలలో నీదులాడు హంసల కూజితములు (II 103), మందిరమయూరముల క్రేంకారములు (I 106), సౌధవలభులందలి పారావతముల గళరవములు.

రాణులకు వేర్వేరు మందిరములుండెడివి. వారి ఇండ్లలో పాకశాలలు, పానశాలలు (II 53), చంద్రశాలలు, స్నానాగారములు (II 8), శయనాగారములే గాక, కోపాగారములు కూడ నుండెడివి. కోపాగారముల నాక్రమింపగల అధికారము కోమలులకు మాత్రమే యుండెడిది.

మందిరములలో రత్న సింహాసనములు, మణిమంచములు, హంస తూలికా తల్పములు, తూగుటుయ్యేలలు, చిత్రవిచిత్రము లైన తెరలు, నిలువుటద్దములు, పసిడివీవనలు, పైడిపాదుకలు మొదలగు భోగ పరికరములుండెడివి. భిత్తి చిత్రములు (III 41), ఫలక చిత్రములు (I 106) మందిర శోభనినుమడింపజేసెడివి. భవన గవాక్షముల నుండి అగరు ధూపములు నిరంతము వెలువడు చుండెడివి.

రాజవల్లభలు అసూర్యంపశ్యలుగా నుండెడి వారు (II 69). వారెక్కడికైన వెళ్ళ వలసి వచ్చినచో ముక్తా వినిబద్ధ పంజర యుతములగు పల్లకులో (V 72), కమలరాగమణీ శిబికలో (V 74) ఆధిరోహించి వెడలువారు. వారు కంకణములు, హారములు, కుండలములు, మేఖలలు, మెట్టియలు, అందియలు మొదలగు రత్న ఖచిత కనక భూషలు ధరియించెడి వారు. తాటియాకు తాటంకములు (II 88), నల్లని గాజులు (III 56), పుణ్యాస్త్రీ లక్షణములుగ నుండెడివి. వారు పన్నీట జలకమాడి, నుదుట మృగమద తిలకమును (I 24), సీమంత భాగమున కుంకుమమును (II 7), కనులకు కాటుక (II 46), కాళ్ళకు పారాణీ, చెక్కులకు మకరికా పత్రములు (III 12), శరీరమంతట కర్పూర, కస్తూరీ, సంకుమద మిశ్రిత చందన గంధమును అద్దు కొనెడివారు. (II 44). వీటికారు చులెప్పుడును వారి కెమ్మోవిని వదలకుండెడివి. (I 115) కమ్మకస్తురి గుళికలు చేర్చిన తములపు తమ్మ నిద్రించునపుడు కూడ వారి నోళ్ళలో నుండ వలసినదే పూవుటెత్తులు చిగురుటాకులలో పొదువబడి సుకుమారముగా నొసంగబడెడివి (I 52).

వన విహారములు, డోలారోహణములు, పుష్పాపచయము (V 16), దాగుడు మూతలు (I 95), వెన్నెలకుప్పలు (II 37), కందుకకేళి, మాధవీ పున్నాగ వివాహములు (I 95), పుష్పలతలకు దోహదములు, రూపచిత్ర చిత్రణములు, వీణా వినోదనము - ఇవి వారి వినోద కాలక్షేపములు. అన్నట్లానాడు వీణమెట్లను ఎప్పటికప్పుడు పాడుబోవు రాగమున కనుగుణముగ మేళవించు కొనవలసి యుండెను. (V 86) ఆడమగయను తేడా లేక అందరును కనులు కెంపెక్కునట్లు మద్యపానము గావించెడివారు. (I 29, 53, IV 70). సవతిపోరొక్కటి లేకున్నచో ఆ అంతఃపురకాంతల భోగము స్వర్గమును తలదన్నునదిగా నుండెను. కాని బహుకాంతావల్లభత్వ మానాటి శ్రీమంతుల మగసిరికి ప్రధాన లక్షణముగ నుండెడిది. భర్తృ వశీకరణమే అంతఃపురకాంతల ప్రధాన వ్యాసంగముగ నుండెడిది.

కనక పంజరశారికలకు చక్కెర పెట్టి చదివించుట, కరతాళగతులతో మందిర మయూరముల నాడించుట, క్రొవ్వాడి గోళ్ళతో తంత్రులు మీటి వీణియలు పలికించుట, కలికిరాయంచ బోదలనెలయించి నడిపించుట - ఇట్టివి అంతఃపుర పరిచారికల ముఖ్యకర్త వ్యములు. తమయజమానురాండ్రకు సపత్నుల పై కొండెములు చెప్పుట వారి ముఖ్య వృత్తిగ నుండెడిది, యాతాయాత పరిచారికాజనముతో అంతఃపురములు సందడిగనుండెడివి.

నాటి పురుషులు కూడా స్త్రీలతో పోటీపడినట్లు ఆభరణములు ధరించెడివారు; తలకట్టులు పెంచెడివారు; తలలో పూలుగూడ ధరించెడివారు (II 12, III 5) రసికులైన పురుషపుంగవులకు నిత్యము సంపెగనూనెతో తలయంటుట, వంటికి గంధామలకము పట్టించుట, జలకమాడించుట, చలువమడుపులు ధరింపజేయుట, తలదువ్వుట, పూల చేరులు చేర్చుట మొదలుగా గల సేవలన్నియు స్త్రీల చేతి మీదుగనే జరుగ వలసియుండెను (II 12). వారు పంచభక్ష్య పరమాన్నములను గారుత్మత రత్నపాత్రికలలో భుజించెడి వారు (II 18). నాగవల్లీ క్రముక కర్పూరతాంబూలములు జాలవల్లికలలో వారి కందించెడివారు. (II 21).

రసికుల అక్కర తీర్చుటకు నాటి సంఘములో వేశ్యల సంఖ్య అధికముగ నుండెడిది (III 3). వారికి సంఘములో చాల గౌరవప్రతిష్ఠలుండెడివి. వృద్ధ వేశ్యలు అపలితంకరణౌషధులను ఉపయోగించుచుండిరి (II 34). వేశ్యలు కాని జారిణులు

కూడ వాటి సంఘమున అధికముగ వేయుండెడి వారు. (II 35, 52).

ఆస్థానములలో వందులు, మాగధులు, కవులు, గాయకులు, వైతాళికులు (II 55), పౌరాణికులు, విచిత్ర కథేతిహాసజ్ఞులు, హాస్యరసాధి నాయకులైన విదూషకులు, ఇంకను వివిధోపయోగ్య కళలలో వారి తేరిన నిపుణులు నుండెడివారు. (II 93). గాయకులు మేళముగూడి తమ ప్రభువుల మీది గీతములు పాడుచుండిం (II 89). వెండిగుదెలు చేబూనినకంచుకులు ద్వార దేశమున బరాబరులు చేయుచుండిరి. (II 39). గుమిగూడి వచ్చు జనులను, మాతనాగంతుకులను వేత్రహస్తులు హుంకారములతో అదలించెడివారు (III 22).

ఆస్థానముల మొగసాలలో గడియారములుండెడివి. అచ్చటగడియగడియకు గంటలు కొట్టెడివారు (II 51). మధ్యాహ్న సమయ సూచనగ శంఖము లూదెడివారు. (II 3). రాజసేవలో భద్రగజములుండెడివి. వానికి యామ సేవలుండెడివి. (II 61). వాని కుంభస్థలములను సిందూరముతో అలంకరించెడివారు. అశ్వారోహణ నైపుణ్యము వీరపురుష విద్యలలో ప్రధానమైదిగనుండెను. (IV 92). గుఱ్ఱముల కాలికి కడియము, మెడలో గంటలు, పల్యాణము, పక్కెర, ఖలీనము (IV 77) - ఇవి వానియలంకృతులు. గజాశ్వపదాతి దళము లేగాక చతురంగబలములో మొదటి నైన రథములు కూడవాడు వాడుకలో నుండెను. రథములపై పతాకములుండెడివి. (I 104).

శస్త్రశాలలో కణయు, కంపణ, ముసల, ముద్గర, పరిఘ, పరశ్వధ, భిండివాలా ద్యాయుధములుండెడివి. ఖడ్గ, కోదండములు ప్రధానాయుధములుగనుండినను నాళముల నుండి ఉండలనూదెడు తుపాకులు, ఫిరంగులు నాటివారికి పరిచితము లైయుండెను. (II 37). బాణప్రయోగసమయమున చేతివ్రేళ్ళకు ఉడుముతోలు తొడుగు తొడిగి కొనెడి వారు. (V 4). యుద్ధ సూచకముగ హజారమున నిస్సాణములు మ్రోగించెడి వారు. (IV 64) ఆధ్వని వినగనే సైనికులు శస్త్రశాలల కేగి మైమరువులు తొడిగి శస్త్రములు గైకొని రణరంగమునకురికెడి వారు. (IV 67). ప్రభు భక్తికి తోడు మద్యపానపుటుద్రేకము (IV 70), యుద్ధమృతులైన వారికి దేవకాంతలు లభింతురను నమ్మిక (IV 91) వారికి యుద్ధోత్సాహము నొసంగెడివి. యుద్ధములలో పటహ, భేరీ, ఝల్లర్యాది వాద్యములను మ్రోగించెడివారు. రాజుల వెంట రాణులు కూడ జైత్ర యాత్రలలో పాల్గొనెడివారు. దండెత్తి పోయిన చోట శిబిర నిర్మాణములు గావించెడి వారు. (II 66). రాజు శిబిరము

వెత్తి వేసిన తరువాత శిబిరాంగణమున పావకజ్వాలలను రగుల్కొలిపెడివారు. (II 66). రణములోగాయపడిన వారిని ఫలకగర్భములకు దార్చి తత్కార్యనియుక్తులైన సేవకులు చికిత్సకై సురక్షిత స్థానములకు గొనిపోయెడివారు (V 13). సెలలకు జలగలను పట్టించుట వాటిచికిత్సా విధానములో భాగమైయుండెను. (II 30).

దారిదోపిడిగాండ్ర భయము వలన కాబోలు పాంథులు పాథేయములుగొని జట్టుగా పోయెడి వారు (II 90).

వ్రాతకు తాటియాకులనుపయోగించెడి వారు. (II 88). బాలబాలికలు పలకలపై వ్రాసికొనెడి వారు. (I 24). స్త్రీలు విద్యా వతులైయుండిరి. (I24, II88). వీరులు తమవిజయములను జయస్తంభముల పై లిఖింపజేయుచుండిరి. (IV 33). వానిని చదువుట కై వానికి మషీలేపము గావించుచుండిరి. (II 34). విదేశ వాణిజ్యము విస్తారముగ సాగుచుండెడిది. ద్వీపాంతరముల నుండి నౌకల మీద సంభారములు దిగుమతి యయ్యెడివి. (V 65) ఆనౌకలు తెడ్లతో నడుపబడు చుండెడివి (I 24).

వైష్ణవుడైన రాయల సామ్రాజ్యమందు త్రిపుండ్రాంకితులు, కుండలధారులు, శిరోవేష్టన భూషితులు, సంబంధ్ధాపిధేనులు నైన శివధ్యాన పరాయణులు రాయల పరమత సహిష్ణుత మూర్తీభవించినట్లుండు వారు. (II 91).

వివాహములలో వధూవరులు ఒక రొకరి పై తలంబ్రాలు పోసికొనెడి వారు. (I2, III53). పురిటింటికి గందపు జట్టలను చరచెడివారు. (II 39). పసి బిడ్డలను జోలలు పాడి నిద్రబుచ్చెడి వారు. (II 65). జనులు విశేషముగ వ్రత దానాదుల నాచరించు చుండిరి. దేవతాప్రీతికై జంతు బలులనొసంగు చుండిరి. (III 41). పెద్దలకు నమస్కరించుండిరి. (III 4). బావలను చూచి మరదండ్రు సిగ్గుతో తప్పుకొనెడి వారు. (II 41). ఆవలింత వచ్చినప్పుడు చిటికెలు వేయుచుండిరి. (II 67), తెల్లని వస్త్రము పై పాములను మసకలాడించుట స్త్రీ వశీకరణ తంత్రములలో నొకటిగ నుండెను. (I 22) అరటి చెట్టు తూర్పువైపు గెల వైచుట సంపత్కరమని జనులు నమ్మిరి. (II 42). జలపూర్ణ కలశములు మంగళప్రదములుగ భావింపబడెడివి. (II 41).

చేతివనులు నాడు అభివృద్ధి పొంది యుండెను. కనుసాలులు క్షుద్రలోహముల పై బంగరు జలపోత పోయగలిగి యుండిరి (II 52). కమ్మచ్చుల

నుండి వెండి తీగెలను తీయుచుండిరి (II 37). రత్నములు, ముత్యములు, పగడములు వాడనేర్చి యుండిరి. లక్కగూడు గల కుండలములను నిర్మించుచుండిరి. (II 46).

వ్యవసాయమునకు చక్కని నదుపాయములుండెడివి. నీటి పారుదల నదుపాయములున్నను, వ్యవసాయ భూములలో అధికభాగము దేవమాతృకములే. కనుకనే జనులు వర్షర్తువుతోనే మాత్ర వర్షారంభమును గుర్తించెడివారు. (III43, 44). వసంతోత్సవము నాటి ప్రధానమైన పండుగలలో నొకటిగా నుండెను.[2] రాజులు వసంతోత్సవ సందర్భముగ కవితా గోష్ఠులను నిర్వహించుచుండిరి. (I 139). ఆనాడు నాటక ప్రదర్శనములు నుండెడివి. (I 89). జనుల జీవితము భోగవిలాసమయమై యుండెడిది.

రాయల వారి దిన చర్య ఇట్లుండెడిది. వేకువనే వైతాళికుల ప్రభాత గీతములతో ఆయన మేల్కొనెడివాడు. (II 71). ఆహర్ముఖోచిత కృత్యములు నిర్వర్తించి దేవ తార్చన గావించెడి వాడు. వేంకటేశ్వరుడాయన ఇష్టదైవము (IV 1). ఐనను ఆయన శివుని కూడ సేవించెడి వాడే. (V 109). పిదప పురోహిత వృద్ధా మాత్యసహితముగ ఆస్థానమండపమున కరిగి రాజకార్యముల చక్క బెట్టెడి వాడు. (II 71) చారుల వలన వార్తలు వినెడు వాడు. (I 138). అపరాహ్ణమున మరల జలకమాడి (II 6) భుజించువాడు. (II 19). అంతఃపురకాంతలతో జూదమాడుచు కొంత కాలము గడపెడివాడు (II 29). సందెవేళల ఉద్యాన వన విహారముగావించెడివాడు (II 42). ప్రొద్దుపోయిన తరువాత రాణీవాసమున సుఖ నిద్రనందెడివాడు. (II 53). చైత్ర యాత్రలకేగునప్పుడు తగు వారికి పట్టణ రక్షణ బాధ్యతల నప్పగించి వెడలువాడు (II 76).

తిమ్మన కావించిన పై వర్ణనలో కొంత కవిత్వాంశ - కవిసమయానుసారి యైన అతిశయోక్తి - చేరియుండ వచ్చును. మూలము నుండి అనువదించిన వివరములును కొన్ని లేక పోలేదు. కాని అట్టివి చాల అల్పము, ఎక్కువపాలాతడు కన్నులారా కాంచిన విషయములనే వర్ణించినాడన వలెను. సమకాలికులైన బుడతకీచుల, తురుష్కుల వ్రాతలు తిమ్మన వర్ణనను సమర్థించుచున్నవి.

మరొక్క విషయము. తిమ్మన ఎంత సేపటికిని రాజుల, రాణుల, ప్రభువుల, శ్రీమంతుల జీవితమునే వర్ణించినాడు గాని సాధారణ సంసారుల, పేదసాదల బ్రతుకులను

వర్ణించిన వాడు కాడు. అతని కనుగప్పిరైన మధ్య తరగతి, దిగువ తరగతుల ప్రజల జీవితములందలి ముచ్చట యొకటైనను అతని కావ్యమున చోటు చేసికొన లేక పోయినది. తిమ్మన ఎన్నుకొనిన ఇతివృత్తము దానికి కొంత కారణము. లోకము నందలి చీకు చింతలతో నిమిత్తము లేక సుఖైక భాజనులనుగా తన అస్థాన కవులను పోషించిన రాయల విద్యా వ్యసనము కూడ కొంత కారణము.

## రుద్రభట్టు చిత్రించిన సమాజము

రుద్రభట్టు రచనలో కూడ ప్రాసాదములు, వనములు, కృతకాద్రులు, పద్మషండములు, దీర్ఘికలు, తలిరుయ్యేలలు, సింహాసనములు, పర్యంకములు, దుకూలములు మున్నగు రాచరికపు భోగముల ప్రసంగము కలదు. శుకశారికలు, హంసలు, పారా వతములు రుద్రభట్టు రచనలో కూడ కలవు. రుద్రభట్టు చిత్రించిన స్త్రీలు కూడ ఏకావళి, మేఖల, మంజీరములు, కటక, కేయూర, హార, కుండలాదులైన మాణిక్య, రత్నముక్తా, విద్రుమ ఖచితకనక భూషలు ధరించు వారే. కస్తూరీ, కర్పూర, ఘుసృణ, చందన గంధములలదు కొనువారే. వారి ఇండ్లను కుంకుమ, రంగవల్లీ, ధ్వజ, తోరణాదులతో అలంకృతములే. కోపాగారముల నలంకరించుట రుద్రభట్టు చిత్రించిన స్త్రీలకును తెలియును. వారును వ్రతోత్సవములను వేడుకతో నాచరించువారే. సవతి పోరు వలన సంకటపడిన వారే. రక్త వస్త్రములు, కచమాల్యములు, కర్ణోత్పలములు సంప్రదాయము ననుసరించి అభిమానించు వారే. వారి పురుషులు యుద్ధములలో ఖడ్గ బాణగదా ద్యాయుధములను, చతురంగబలమును, శంఖకాహాళ భేర్యాది వాద్యములను ఉపయోగించువారే. తిమ్మన రుద్రభట్టు లిరువురును చేసిన ఈ వర్ణన గతానుగతికము, కవిసమయానుసారి అనినను అది కొంత వరకు సత్య దూరము కాబోదు.

రుద్రభట్టు రచనలో కొన్ని వాస్తవిక సమాజము నుండి సేకరించిన వివరములతో గూడిన వర్ణనలు కూడ కలవు. రుద్రభట్టు దేవాలయమును, అందలిశివలింగమును, దీపారాధనలను, జలధారాభిషేకమును వర్ణించుట (XIII 45) అతడు స్వయముగ చూచి చేసినదే. ఒకచోట 'పూరిగుడిసె' తగులబడు ప్రసంగమును రుద్రభట్టు తెచ్చియున్నాడు.[3] (XIII 65). తిమ్మన లోకములో పూరిగుడిసెలే లేవు రుద్రభట్టు స్వయముగ చూచిన ఏదో అగ్నిప్రమాదమే ఈ సందర్భమున అతని మనసున మెదలుచుండి యుండును.

ఒకటి రెండు సాంఘికాచారములు కూడా రుద్రభట్టు రచనలో ఈ కథా భాగమున తెలియ వచ్చుచున్నవి.

'కృష్ణుడింక రుక్మిణినే గాని సత్యభామను మరచియైన మన్నింపడని నేను ప్రతిన చేసి దివ్యము నెత్తు కొనుచున్నాను. కాదనగల వారుండిన వారును దివ్య మెత్తి కొందురుగాక.' అని నారదుడు పలికిన మాటలలో (XII 74) 'దివ్య' ప్రమాణమను ప్రాచీనాచారముస్మరింపబడియున్నది. తప్తలోహ, తప్త తైలాదులతో ప్రమాణమును గావించి సత్య నిరూపణగావించు ఆచారము రుద్రభట్టు కాలమున బహుళముగా వ్యాప్తియందుండి యుండును.

నారదుడు సత్యా మందిరమున కృష్ణునితో ప్రసంగించుచు 'దేవేంద్రుడు ఈ రాతిరి జరుపబోవు మహేశ్వర పూజామహోత్సవమునకు నన్నా హ్వానించినాడు. అతడు నాకొసంగిన నిమంత్రణపుష్పమే నేను నీకీ ఉదయము సమర్పించినది, 'అని పలుకును (XIII 5). వివాహాదిశుభకార్యములకును, ఉత్సవములకును అతిథులను, బంధుమిత్రులను నిమంత్రించునపుడు ఒక పుష్పము నొసంగుట ఒక చక్కని ప్రాచీనాచారము.[4] ఈ పట్టున ఈ ప్రాచీనా చారమును స్మరింపజేయుచున్నాడు.

తిమ్మన రుద్రభట్టు లిరువురును తాము మెలగు చుండిన సమాజపు స్వరూపమును తమ తమ కావ్య దర్పణములందు ప్రతిఫలింపజేసినారు. తిమ్మన సంచరించినది కేవల భోగవిలాసమయమైన ఉన్నత వర్గపు సమాజములో, ఆసమాజపు తీరు తెన్నులను అతని వలె నిపుణముగనిరూపింప గలిగిన వారు మరి లేరు, మధ్య, దిగువ తరగతుల సమాజపు చాయలైన తిమ్మన రచనలో కనుపింపవు.

రుద్రభట్టు సమాజములో మధ్య తరగతికి చెందిన సాధారణ గృహస్థుడై యుండును. అతని కాశ్రయదాతయైన వీర బల్లాలుడు కృష్ణరాయల వంటి సమ్రాట్టు కాడు; అంతటి విద్యా పోషకుడునుకాడు. కనుకనే రుద్రభట్టు కలిమిలేములను రెంటిని 'సమపాళము'గ అనుభవించిన వాడైయుండును. అందుచేతనే అతని రచనలో ఉచ్చ, మధ్య, నీచవర్గముల ప్రజాజీవనచ్ఛాయలు గోచరించుచున్నవి.

# ప్రభుకీర్తిగానము

ప్రాచీన రాజన్యుల యశశ్శరీరములు క్షణభంగురములైన భౌతిక శరీరముల వలెగాక అజరామరములై ఆచంద్రార్కము నిలచియుండగలుగుటకు కవీంద్రుల వాక్సుధాసేచనమే కారణము.[1] శ్రీ రామచంద్రుని కీర్తికి వాల్మీకి మహర్షికవితా మాహాత్మ్యము, యుధిష్ఠిరుని యశస్సునకు వ్యాసభగవానుని వచో మహిమయు నిదానములైనట్లు[2] రాజరాజనరేంద్ర మనుమసిద్ధినృపాలుర ఖ్యాతి నన్నయ తిక్కనల ప్రసాదమేయైనట్లు, అరికేసరి, సత్యాశ్రయ జనపతుల ప్రసిద్ధి పంపరన్న కవీంద్రుల అనుగ్రహమేయైనట్లు[3], కృష్ణరాయల కీర్తి చిరంజీవమగుటకు పూర్తిగ కాకున్నను కొంత వరకైన పెద్దన తిమ్మనల కవితామృత శక్తి కారణమనుట సత్య దూరము కాదు. మరి వీర బల్లాల ప్రభు విఖ్యాతికిని రుద్రభట్టు కవితాశక్తి దోహదము చేసియే తీరినది.

తిమ్మన తన కావ్యమును ఆంధ్ర కవి సంప్రదాయమునను సరించి తన కాశ్రయదాతయైన ఆంధ్ర భోజున కంకితము గావించినాడు; ఆతని గుణగణములను, విజయములను నోరార పొగడినాడు. కన్నడమున ఆంధ్రమున వలె కావ్యముల నంకితమొసంగు సంప్రదాయము లేదు. అందుచే రుద్రభట్టు తన కావ్యమును వీరబల్లాలు నకంకితమని చెప్పలేదు. కాని కన్నడ కవి సంప్రదాయము ననుసరించి అభేదాధ్యవసాయము చేసి శ్లేష శక్తితో కొన్నియెడల నాతనిని స్తుతించియున్నాడు.

రుద్రభట్టు జగన్నాథ విజయ కావ్యమునందెచ్చటను వీరబల్లాలుని పేరును విప్పిచెప్ప లేదు. కాని గ్రంథ ప్రారంభమున గల మంగళ పద్యములలో శివస్తుతి పరమగు దానిని శ్లేషవలన వీరబల్లాలునకును వర్తించునట్లు చెప్పినాడు.

> 'అరికామధ్వంసి, నాగవ్రజమయకటకం, రాజరాజ ప్రతిష్ఠా
> నిరతం, లీలాక్రమోదంచిత నిరవధిగాంగేయకం, ద్విట్పురధ్వం
> సరతక్రోధం, వృషాంకం, విబుధనుతం, ఉమాకామినీ జీవితేశం,
> పరమైశ్వర్యాస్పదం, రక్షిసునె వసుధెయం, యుద్ధరంగత్రిణేత్రం.' (I 3)

పైస్తుతిలో అరికామధ్వంసి, రాజారాజప్రతిష్ఠా నిరతుడు, ఉమాకామినీ జీవితేశుడు ననుపదములు వీరబల్లాలుని చరిత్ర యందలి విశేషములను

సూచించుచున్నవి. వీరబల్లాలుడు ఉచ్చంగికోట పాలకుడైన 'కాముని' జయించి చెరగొన్న వాడగుటచే అరికామధ్వంసియైనాడు; రాజరాజనామకుడైన చోళరాజునకు యుద్ధమున సాయమొనర్చి 'చోళరాజ్య ప్రతిష్ఠాపనాచార్య' బిరుద విభూషితుడగుటచే రాజరాజ ప్రతిష్ఠానిరతుడైనాడు; ఉమాదేవియను పేరు గల భార్యగల వాడగుటచే ఉమా కామినీ జీవితేశుడైనాడు. ఈ పైన చెప్పబడిన విషయములు అనేక శాసనాధారముల వలన నిరూపితములైనవే. ద్విట్పు రధ్వంసకుడనుట ఆతడు ఉచ్చంగికోటను నిర్మూలించుటను సూచించుచున్నది. నాగవ్రజమయ కటకుడనుటచే వీరబల్లాలుడు సమధిక గజసైన్య సమన్వితుడనియు, లీలాక్రమోదంచిత నిరవధి గాంగేయకుడనుటచే కార్తికేయ, భీష్మసదృశుడైన పరాక్రమ వంతుడనియు, వృషాంకుడనుటచే వృషభలాంఛన వంతుడనియు, విబుధనుతుడనుటచే పండితపోషకుడనియు, పరమైశ్వర్యాస్పదుడనుట చే అపరిమిత సంపదలుగల వాడనియు, యుద్ధరంగత్రినేత్రుడనుటచే మహా వీరుడనియు స్తుతింపబడినాడు.

కావ్యశరీర మందుకూడ రుద్రభట్టు ఇట్టి శ్లేషమహిమచే తన ప్రభువును స్తుతించియున్నాడు. దేవేంద్రుని పరాజయానంతరము కృష్ణునెదుట సాక్షాత్కరించిన బిల్వోదకేశ్వరుని రుద్రభట్టు వర్ణించినాడు.

'శ్రీదసఖం పురరిపు బి
ల్వోదకపతి నామవల్లి సన్నిధనాగిర్దు........' (XIII 1).

శ్రీదసఖుడనుటచే కుబేరుని మిత్రుడగు శివుడే గాక కుబేరుని పేర్లలో నొకటియగు 'రాజ రాజ' నామధారియగు చోళరాజ మిత్రుడనియు, పురరిపుడనుటచే త్రిపురారియైన ఈశ్వరుడే గాక ఉచ్చంగికోట నిర్మూలకుడనియు కూడ అర్థములు ధ్వనించి వీరబల్లాలుడు శ్లేషమహిమ వలన స్తుతింపబడినట్లయినది.

ఇక తిమ్మన తనకాశ్రయదాతయైన కృష్ణదేవరాయని గుణగానము గావించిన విధము నరయుదము.

కృష్ణరాయని అశేషగుణగణములో తిమ్మన చే అధికముగ ప్రశంసింపబడిన దాతని పరాక్రమము. కృష్ణరాయడు కోదండ ద్రోణుడు (I 30), సమర్దక్షముడు (II104), అర్చిష్మత్ప్రతిమప్రతాపుడు (III 59). ఇట్లు తన ప్రభుని ప్రతాపమును ప్రశంసించు

తిమ్మన ఉత్సాహము వర్షాగిరి సరిత్తువలె ఉప్పొంగినది; ఉరకలు వేసినది; దీర్ఘతర సమాసములతో పరుగులు తీసినది; పరవళ్ళుత్రొక్కినది. కృష్ణరాయని చేత వనిలోన మించు కాక్షేయకంబు వర్ణన ఒక నిండు సీసపద్యము నాక్రమించినది. (I 24) అట్టి కృష్ణరాయడు విభుడై రాజ్యసింహాసనం బారోహింపగా విరోధులు గహన శైలారోహము గావించిరి. (I 16). పరవర్గపు దుర్గములు పట్టుకొని (I 17) రాయడు భూభృ దుద్ధరణ విస్ఫూర్తి వహించినాడు. (I 19).

కృష్ణరాయని సుగుణసంపదలో ప్రతాపమునకు తర్వాత తిమ్మన ప్రశంసకు అధికముగా పాత్రమైనది ఆతని దాతృత్వము. కృష్ణరాయడు రాధా తన యాధారితగాథా ధఃకరణనిపుణ కరశయుడు (I 26), త్యాగవిద్యానిషద్యాయిత ప్రాభవుడు. (II 105), మౌక్తికతులాభార ప్రదానోన్నతుడు (V 107).

రాయల సద్గుణమణీ హారమునకు నాయకమణి యాతని దైవభక్తి రాయలు వైష్ణవ మణియయ్యు ఈశ్వరారాధకుడు గూడ నైన వాడు. ఆతడు శ్రీవేంకట గిరి వల్లభ సేవా పరతంత్ర హృదయుడు (IV 1). చిత్తజ భిదంఘ్రియుగ చింతన కళాశీలి (V111)

రాయలకీర్తిని స్తుతించుటకు ఎన్నిమాటలైన చాలవు. అతడు పారయశస్సాంద్ర దిశాంతుడు. (I 138), ఆగామిగతాధునిక నృపాలయశః శ్రీగుంభహసిత హిమగు దిశాగజతను కటజ నైల్యసంభారుడు (I 127).

రాయల బిరుదములు కూడ తిమ్మన చే గ్రంథస్థము గావింపబడినవి. రాయలు రాజకంఠీరవుడు (III 105), మూరు రాయరగండడు (IV 93), మండలీక భాస్కర బిరుదాంకుడు (III 60), బాసదప్ప వరగండాంకుడు (II 105).

ఇట్లు తిమ్మన కృష్ణరాయని ఉత్తమ నాయకగుణములను తనివితీర కొనియాడి ఆతని కీర్తిని అజరామరము గావించినాడు.

తమకాశ్రయదాతలైన ప్రభువులను తమ కావ్యనాయకులతో అభేదము చేసి కావ్యరచన చేయుట కన్నడ కవులలో గల యొక ప్రాచీనాచారము.[4] రుద్రభట్టు తన ప్రభువునిట్లు కావ్యనాయకుడైన శ్రీకృష్ణునితో అభేదము చేయక. శివునితో మాత్రమే అభేదము చేసియున్నాడు.

తిమ్మన రచింపబూనిన కృతి పారిజాతాపహరణము అది శ్రీకృష్ణనాయకము. అదృష్టవశమున దానికి కృతిపతియు శ్రీకృష్ణుడేయగుట తటస్థించినది. శ్రీకృష్ణుడే శ్రీకృష్ణదేవరాయడై యవతరించినాడని నాటి ప్రజలు చెప్పు కొనుచుండిరి.[5] తిమ్మన కూడ ఈ అభిప్రాయమును తన గ్రంథములో నిబంధించినాడు. శ్రీకృష్ణ శ్రీకృష్ణ దేవరాయాభేదము ధ్వనించునట్లే ఆతడు గ్రంథరచన సాగించినాడు. పాఠకునకు శ్రీకృష్ణుని వెనుక లీలగా శ్రీకృష్ణదేవరాయల స్వరూపము భాసించుచునే యుండును. రుక్మిణీ సత్యభామా సమేతుడైన శ్రీకృష్ణుడు తిరుమల దేవీ, చిన్నా దేవీ సమేతుడైన శ్రీకృష్ణ దేవరాయడే యను ధ్వని స్పష్టముగ గోచరించుచునేయుండును. ముఖ్యముగ సత్యా పాదప్రహార ఘట్టమున శ్రీకృష్ణదేవరాయడు శ్రీకృష్ణునిలో తననే స్పష్టముగ దర్శించి యుండునమట యథార్థము ఐనను తిమ్మన ఈ అభేదమును ధ్వనింపజేసిన తీరు విశిష్టమైనది. అతని రాజభక్తి వెఱ్ఱితలలు వేయలేదు. హితము, మితము, సముచితము నైనరీతిలోనే ఆతడీ అభేదమును ధ్వనింపజేసినాడు.

తిమ్మన శ్రీకృష్ణావతార చర్యలను శ్రీకృష్ణదేవరాయ జీవిత చరిత్ర విశేషములతో శ్లేషమహిమ వలన పరిపోల్చి ఆదినారాయణుడు నాడు శ్రీకృష్ణుడుగను నేడు శ్రీకృష్ణదేవరాయడుగను అవతరించినాడని చమత్కరించినాడు.

చక్రవర్తి మహాప్రశస్తి నాడును నేఁడు
    చెలఁగి ధర్మక్రమ స్థితి ఘటించె
భూభృదుద్ధరణ విస్ఫూర్తి నాఁడును నేఁడు
    గోరక్షణ ఖ్యాతిఁ గుదురు పఱిచె
సాధుబృందావన సరణి నాఁడును నేఁడు
    వంశాను రాగంబు వదలఁడయ్యె
సత్యభామా భోగసక్తి నాఁడును నేఁడు
    నాకల్పమనని నింపార నిలిపె
నాఁడు నేఁడును యాదవాన్వయము నందు
జనన మందెను వసుదేవమనుజ విభుని
కృష్ణుఁ డనుపేర నరపేంద్రు కృష్ణదేవ
రాయఁడను పేర నాదినారాయణుండు. (I19)

అంతేగాక కృష్ణావ తారములో తనకు కలిగిన లోటులను తొలగించుకొనుటకే ఆతడు కృష్ణదేవరాయావతారము నెత్తెనని చమత్కరించి కృష్ణావతారమున కంటె కృష్ణదేవరాయవతారపుటాధిక్యతను ఆలంకారికముగ నిరూపించినాడు.

యాదవత్వమున సింహాసనస్థుఁడు గామి
సింహాసనస్థుఁడై చెన్ను మెఱయ
గొల్లయిల్లాండ్రతోఁ గోడిగించుటఁ జేసి
పరకామినీ సహోదరతఁ జూప.
మఱి జరాసుతునకై మధుర డించుటఁ జేసి
పరవర్గ దుర్గముల్ బలిమిఁ గొనఁ గఁ
బారిజాతము వానపడి పట్టి తెచ్చుట
నౌదార్యమున దాని నడుగువఱుసఁ
గోరి తొలుమేనఁ దనకైన కొదువలెల్ల
మాన్పు కొని వచ్చి భువనైక మాన్యలీల
నవతరించిన కృష్ణుఁ డౌనన గ మించె
నరసవిభు కృష్ణరాయ భూనాయకుండు. (I17).

అవతారికా భాగములో చమత్కృతి కొరకై చేసిన ఈ కల్పనలకు మించి కథాభాగము నందెచ్చటను తిమ్మన ఇట్లు వాచ్యముగ కృష్ణ, కృష్ణదేవరాయా భేదమును చెప్పలేదు.

కృష్ణరాయనికి కృష్ణునికి అభేదమును ధ్వనింపజేసిన కవులును లేక పోలేదు. కన్నడ కవియైన కనక దాసును, తెలుగు కవియైన రాధామాధవ కవియును ఇట్టి ప్రయత్నము చేసినారు. కనక దాసు తన 'మోహనతరంగిణి' యందు పలుతావులందు కృష్ణుడు అనుటకు మారుగ 'కృష్ణరాయ', 'దేవరాయ', 'దొరెరాయ శ్రీకృష్ణ', 'దేశాధిప కృష్ణరాయ' అని ప్రయోగించియున్నాడు. అవతారికా భాగములో తన గ్రంథము 'కృష్ణరాయన చరితె', 'కృష్ణరాయన మహిమె' అని తెలిపియున్నాడు. రాధామాధవ కావ్యమునను ఇట్టి ప్రయోగమొకటి కలదు.

'మఱచిరి గృహ కృత్యంబులు

మఱచిరి లజ్జా భయములు మఱరి మగలన్
మఱచిరి సర్వము గోపిక
లతి మురి శ్రీకృష్ణరాయఁడాత్మ 'గలంపన్'

తిమ్మన మాత్రము కరథా భాగము వందెచ్చుటను ఇట్టి మితి మీరిన ప్రభుభక్తి ప్రదర్శింపలేదు.

రుద్రభట్టు అనుసరించిన మార్గము కంటె తిమ్మన అనుసరించిన మార్గము సరసముగన్నది.

## మహాకావ్యత్వము.

రుద్రభట్టు తిమ్మన లిరువురును ఆశ్వాసాంతగద్యలలో తమ గ్రంథములను 'మహాప్రబంధము'లనియే చెప్పికొన్నారు. ఈనాడు మనము ప్రబంధశబ్దమునకు ఏమి అర్థము చెప్పికొన్నను వారిరువురును 'ప్రబంధ' శబ్దమును 'కావ్య' శబ్దపర్యాయ వాచకముగనే యున్నారు. 'ప్రబంధము' 'సర్గబంధము' 'మహాకావ్యము' అనునవి పర్యాయ పదములనియే లాక్షణికులు చెప్పియున్నారు.[1] కనుక మహాప్రబంధమనగా మహాకావ్యమనియే యేర్పడుచున్నది. రుద్రభట్టు తిమ్మనల కావ్యములు మహాకావ్యములను పేరున కెంత వరకు తగియున్నవో పరిశీలింతము.

ముందుగా మహాకావ్య లక్షణములను స్మరింతము:

"సర్గబంధమే మహాకావ్యము. దానికి వేలుపేని, సద్వంశ్యుడైన క్షత్రియుడేని ధీరోదాత్త గుణాన్వితుడు నాయకుడు; లేక ఒకే వంశమందు జన్మించిన ఉత్తమ కులజులు పలువురు రాజులైన నాయకులు కాదగుదురు. శృంగార శాంతవీరములలో నొకటి అంగిరసము కాదగును. తక్కిన రసములన్నియు అంగములగును. నాటక సంధులన్నియు నుండును. ఇతి వృత్తము ఇతిహాస జన్యమైనది గాని, సజ్జనాశ్రయమైన ఇతరము గాని కాదగును. పురుషార్థములు నాలుగు నుండును; అందొకటి ఫలమగును. ప్రారంభమందు నమస్కారము గాని, ఆశీస్సుగాని, వస్తునిర్దేశముగాని చేయ దగును. అక్కడక్కడ దుర్జన దూషణ, సజ్జన గుణకీర్తనము చేయదగును, ఎనిమిదికి మించిన సర్గలుండ వలెను. అవి మరియు చిన్నవి గాక మరియు పెద్దవిగాక ఒకే వృత్తములతో గూడి అంతమందు

అవి మరియు చిన్నవి గాక మరియు పెద్దవిగాక ఒకే వృత్తములతో గూడి అంతమందు వేరువృత్తములు గలిగి యుండవలెను. నానావృత్తమయమైన సర్గము కూడ యొకటి కనుపించుచున్నది. సర్గాంత మందు భావిసర్గ కథాసూచనము చేయదగును. సంధ్యా, సూర్య, చంద్ర,రజనీ, ప్రదోష, ధ్వాంత, వాసర, ప్రాతర్మధ్యాహ్న, మృగయా, శైల, ఋతు, వన, సాగర, సంభోగ, విప్రలంభ, ముని, స్వర్గ, పుర, అధ్వర, రణ, ప్రయాణ, ఉపయమ (వివాహ), మంత్ర పుత్రోదయాదులు యధాయోగము సాంగోపాంగముగా వర్ణనీయములు.[2]

ఉపర్యుక్త మహాకావ్యలక్షణములు దాదాపుగ అన్నియు జగన్నాథవిజయ, పారిజాతాపహరణములకు చెల్లుచున్నవి. ఉభయకావ్యము లందును నాయకుడు శ్రీకృష్ణుడు-దివ్యా దివ్యుడు, ఉత్తమ వంశజుడు, క్షత్రియుడు, ధీరోదాత్తుడు, దక్షిణుడు, ఇతివృత్తము ఇతిహాసమైన భారతపు ఖిల గ్రంథమైన హరి వంశమునుండియు, పురాణమైన విష్ణుపురాణము నుండియు గైకొన బడినది. జగన్నాథవిజయమున వీరరసము, పారిజాతాపహరణమున శృంగార రసము అంగిరసముగను, ఇతర రసములు అంగరసములుగను పోషింపబడినవి. పురుషార్థములు కలవు జగన్నాథవిజయమున దుష్ట శిక్షణ శిష్టరక్షణాత్మకమైన ధర్మమును, పారిజాత హరణమున పారిజాత లాభాత్మకమైన అర్థమును ఫలములైనవి. ఉభయకావ్యము లందును ప్రారంభమున ఆశీర్వాదరూపమైన దేవతాస్తుతి కలదు. అక్కడక్కడ శ్రీకృష్ణస్తుతి రూపమైన సజ్జన గుణకీర్తనము కలదు. జగన్నాథ విజయమున అనేక రాక్షస నిందాత్మక దుర్జన దూషణమును కలదు. సంధ్యా, సూర్యాది వర్ణనలు చెప్పబడిన వానిలో పారిజాతాపహరణ మందు ఒకటి రెండు లోపించినను జగన్నాథవిజయమందన్నియు కలవు. పారిజాతప హరణమున సర్గలు (ఆశ్వాసములు) ఎనిమిదికి తక్కువగ నున్నవి; కాని జగన్నాథవిజయమున పదునెనిమిది ఆశ్వాసములున్నవి. అది దాదాపు 2800 గద్యపద్యములు గల బృహద్గ్రంథము. ఈ ఉభయకావ్యములకును వర్తించని లక్షణ మొక్కటి మాత్రముకను పించుచున్నది. అది సర్గములు ఏకవృత్త మయము లైయుండ వలెనంట, కన్నడమున గల షట్పదీ త్రిపదీ, రగళె, కావ్యములు, తెలుగున గల ద్విపద కావ్యములు, శతకములు తప్ప దాదాపుగ ప్రాచీన కార్ణాటాంధ్ర సాహిత్యమంతయు చంపూ కావ్యమయమే. చంపూ కావ్యములు సంస్కృతమున గూడ వివిధ

వృత్తమయములే. వానిని మహాకావ్యములు కావన్నచో సంస్కృత చంపూరామాయణము, కన్నడ పంప భారతము, ఆంధ్ర కవిత్రయ మహాభారతము కూడా మహాకావ్యములు కావన వలసివచ్చును. కనుక ఏకవృత్తమయత అపరిహార్య లక్షణము కాజాలదు. ఇట్లు చూడగా జగన్నాథ విజయము మహాకావ్యమనుట కెట్టి యాక్షేపణయు లేదు; ఆక్షేపించిన వారును లేరు.

"పారిజాతాపహరణము మహాకావ్యము కానేకాదు. అదియొక ఖండకావ్యము మాత్రమే."[3] అని శ్రీవెంపరాల సూర్యనారాయణ శాస్త్రిగారు విమర్శించి యున్నారు. ఈ విమర్శ ఎంత వరకు సమర్థనీయమో విమర్శింప వలసియున్నది. ముందు॥ం మహాకావ్య లక్షణములలో పారిజాతాపహరణమునకు వర్తించుట లేదని ఇప్పుడే మనము గుర్తించిన 'లోపములు' నిజముగ 'లోపములేనా?' యనిత పరిశీలింతము (1) తిమ్మన కావ్యములో దుర్జన దూషణ లేదు. తిమ్మన పరమ సౌజన్యమూర్తి. పరదూషణ ఒతని స్వభావమునకే విరుద్ధము. కనుకనే సంప్రదాయికమగు 'కుకవినింద' కూడ అతడు గావించలేదు. ఇదియాతని కావ్యమందలి మహోత్తమగుణమే యగును గాని లోపము కాబోదు. (2) తిమ్మన ఆశ్వాసములను ఏకవృత్త మయములుగ రచింపలేదు. ఏకవృత్తమయత అపరిహార్యలక్షణము కాజాలదని చెప్పికొనియే యున్నాము.[4] (3). ఇక మిగిలినది తిమ్మన కావ్యమున ఎనిమిది సర్గలైన లేవనునది. తెలుగు కావ్యములకు సంబంధించినంత వరకైన ఇదియు అరిహార్య లక్షణము కాదు. మను చరిత్ర, వసుచరిత్ర, విష్ణుచిత్తీయము, శృంగార నైషధము, కాశీ, భీమఖండములు - అన్నియు అష్టమ్యాశ్వాసయుతములే. ఆలెక్కన ఇవన్నియు మహాకావ్యములు కావన వలసి వచ్చును. కనుక ఎనిమిదా శ్వాసములు లేకుండునంత మాత్రమున పారిజాతాపహరణము మహాకావ్యము కాక పోదు.

ఇక ఖండకావ్యమన నేమో కూడ విచారింప వలసి యున్నది. "మహాకావ్యము యొక్క ఏకదేశాను సారియైనది ఖండకావ్యము. ఉదా: మేఘదూతము."[5]

మహాకావ్య లక్షణములో "వేలుపేని క్షత్రియు దేని సద్వంశ్యుడు నాయకుడు ధీరోదాత్తగుణాన్వితుడు; ఇతిహాసోద్భముగాని, సజ్జనాశ్రయమైన ఇతరముగాని ఇతి వృత్తము; ఆదియందు నమస్కారమేని, ఆశీస్సేని, వస్తునిర్దేశమేని; శృంగార వీరములలో నొకటి అంగిరసము. "అనునంత వరకు మేఘదూతమునకును వర్తించుచున్నది. మిగత

- ఆద్యంతము నిండియున్నది. ఇతర రసములు లేవు. పురుషార్థములలో కామము ఒక్కటి మాత్రమే లభించుచున్నది. నాటక సంధులు కాన రావు. రెండే సర్గములు, వర్ణ్యములని చెప్పబడిన వానిలో సగముపైగ నామ మాత్రమైన లేవు. ఆయా కారణముల వలన మేఘదూతము మహాకావ్యమనిపించుకొన లేదు. ముఖ్యముగ ఇతి వృత్తము యొక్క ఏక దేశీయతయే దీనిని ఖండ కావ్యమనుటకు కారణము. కావ్యమంతయు యక్షుడు మేఘునుద్దేశించిపలికిన ప్రేమోన్మత్తా లాపములతోనే నిండిపోయినది. అతని సుదీర్ఘప్రసంగమునకు ముందు గల మొదటి సర్గలోని తొలి ఐదు శ్లోకములలోనైన అతనికి శాపము సంప్రాప్తమైన విధముగాని, అతని రామగిర్యాశ్రమ జీవితముగాని వివరింపబడ లేదు, ఇక మేఘుడు తన సందేశ వాహకత్వమును నిర్వహించుటయు, యక్షుని శాపమోక్షమును రెండే రెండు శ్లోకములలో[6] అతిసంగ్రహముగా చెప్పబడినది, పూర్వమేఘ మందలి తొలిఐదు శ్లోకములను, ఉత్తర మేఘమందలి చివరి రెండు శ్లోకములను కొన్ని సర్గలుగా విస్తరించుటయు, యథాలాభముగ సంయోగ శృంగారమును, శృంగారేతర రసములను పోషించుటయు, సందర్భానుసారముగ కొన్ని వర్ణనీయ వస్తువులను వర్ణించుటయు చేసియున్నచో నాటక సంధు లేర్పడి మేఘ దూతము కూడ మహాకావ్యమయ్యెడిది.

పారిజాతాపహరణము నందు నాయకుడైన శ్రీకృష్ణుని చరిత్ర సంపూర్ణముగ చెప్పబడ లేదు. అనుబంధప్రాయమైన పుణ్యకవ్రత వృత్తాంతమును విడచినచో మిగిలిన ఇతివృత్త మంతయు మూడు నాళ్ళ ముచ్చటయే. నారదాగమన, పారిజాతపుష్పప్రదాన, సత్యామాన, తదనునయము లొకదినము; అమరావతీగమన, అదితి సందర్శన, నందనవన విహారాదులొకదినము; పారిజాతాపహరణ, యుద్ధ, ద్వారకా ప్రత్యాగమన, పారిజాతప్రతిష్ఠ లొకదినము- ఇట్లు మూడే మూడు దినముల చరిత్ర గలదగుటచే ఇది ఖండకావ్యమని విమర్శకుల అభిప్రాయమై యుండనోపును. కాని సంస్కృతాంధ్రము లందలి దృశ్యశ్రవ్య మహాకావ్యములలో చాలభాగము నాయకుని జీవితము నందలి ఏక దేశమును చిత్రించునవే; రామాయణ భారతాది ఇతిహాసముల వలె నాయకుని సంపూర్ణజీవితమును జన్మప్రభృతి మృతి పర్యంతము చెప్పునవి కావు. శాకుంతల, ఉత్తర రామచరిత్ర, వేణీ సంహారాది దృశ్య కావ్యములును, కుమారసంభవ, కిరాతార్జునీయ, శిశుపాలవధ, నైషధీయ, విష్ణు చిత్తీయ, వసుచరిత్రాది శ్రవ్యకావ్యములును నాయక

చరిత్రలోని ఏకదేశ చిత్రణ మాత్ర పర్యాప్తములే, కథాకాల దైర్ఘ్యము మహాకావ్య లక్షణములలో నొకటిగ చెప్పబడి యుండలేదు.

కృష్ణుని సంపూర్ణ జీవిత చరిత్రమైన జగన్నాథ విజయములో పారిజాతాపహరణ కథ ఏక దేశీయమనుటయు నిజమే. కాని ఈ మాట ఉత్తరరామ చరిత్ర, కిరాతార్జునీయ, శిశు పాలవధాదుల విషయములో గూడా నిజమే. వానిని మహాకావ్యములు కావని ఎవరును అనలేరు.

జగన్నాథవిజయ, పారిజాతాపహరణములు రెండును మహాకావ్యములే మహాప్రబంధములే.

## ఇష్టపదాంకము

కొందరు కవులకు కొన్ని పదముల మీద ప్రత్యేకమైన ప్రీతి యుండుట కలదు. ఆ పదముల నాకవులు తరచుగ ప్రయోగించు చుందురు. కొందరు ప్రతి సర్గము లేక ఆశ్వాసము కడపటిశ్లోకము లేక పద్యములో తమకిష్టమైన ఒకానొక పదమును నియతముగా ప్రయోగించుచుందురు. ఇట్లు మాఘకావ్యము శ్రీపద లాంఛితమును, భారవి కావ్యము లక్ష్మీ పదలాంఛితమునునైనవి. హర్షనైషధ కావ్యము ఆనంద పదాంకితము. తిక్కన భారతము కూడ ఆనందపదాంకితమే సింహాసన ద్వాత్రింశిక స్వరూప పదాంకితము. రుద్రభట్టు తిమ్మనలు ఇట్లేదైన పదమునభిమానించిరేమో పరిశీలింతము.

రుద్రభట్టు ఆశ్వాసాంత పద్యములన్నింటిలోను ఏదేని యొక పదమును తప్పని సరిగా ప్రయోగించు నియమమును పాలింపలేదు.

తిమ్మన కూడ ఆశ్వాసాంత పద్యములలో ఏయొక్క పదమును నియతముగా ప్రయోగింప లేదు.[1] నాలుగాశ్వాసముల కడపటి పద్యములలో (I 138, III59, IV92, V109) 'యశః' పదము కనుపించుచున్నది. ద్వితీయాశ్వా సాంత పద్యములలో కూడనీ యశః పదమున్నచో పారిజాతాపహరణము యశః పదాంకితమై యుండెడిది.

తిమ్మన 'సౌఖ్య' ప్రియుడు. గ్రంథము మొత్తము మీద 12 తావులందీతడు 'సుఖ' లేక సౌఖ్య పదమును ప్రయోగించియున్నాడు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| I | ఆశ్వాసము | 4వ | పద్యము | - | సుఖాంబుధినిచ్చలునోలలాడు |
| ” | ” | 37 | ” | - | సౌఖ్యరసైకలోలుఁడై |
| ” | ” | 40 | ” | - | సౌఖ్యాబ్ధినోలాడు |
| ” | ” | 46 | ” | - | సుఖాసీనుండయి |
| III | ” | 27 | ” | - | సౌఖ్యము నొందుదు. |
| V | ” | 49 | ” | - | సుఖాలాపరచన మెఱయ |
| ” | ” | 53 | వచనము | - | సౌఖ్యవర్థిష్ణువులగు |
| ” | ” | ” | ” | - | సుఖోపవిష్టుండై |
| ” | ” | 62 | పద్యము | - | సుఖములందుదురు. |
| ” | ” | 103 | ” | - | సౌఖ్యరసైకలోలుఁ డై |
| ” | ” | 107 | ” | - | సౌఖ్యాంబుధి నోలాడు చుండె |
| ” | ” | 111 | ” | - | సుఖితాళి రవ మాన్యగృహ. |

పై పదర్భములలో వెచ్చటను మాతృకలందు ఈ 'సుఖ' లేక 'సౌఖ్య' శబ్దములు ప్రయోగింపబడియుండ లేదు. ఇన్ని మారులు తనకు తానై ఈ పదమును ప్రయోగించుట వలన తిమ్మనకీ పదము వెడ గల మిక్కిలి మక్కువ వ్యక్తమగుచున్నది. ఆంధ్ర భోజుని చల్లని పాలనలో ఇహలోకముననే స్వర్గ సుఖము లనుభవింప నోచుకొనిన కవివతంసుని వాణిలో కూడ 'సుఖము' అధికముగ వ్యాపించియుండుట సహజమే గదా.

ఇందొక విశేషము కూడ కలదు.

పారిజాతాపహరణ కథా ప్రారంభము ప్రథమాశ్వాసపు 37వ పద్యముతోనే. అది 'సౌఖ్యరసైకలోలుడై' అని ముగియుచున్నది. పుణ్యకవ్రతా చరణముతో సహ కథా భాగమంతము పూర్తియైన పిదప V 103 మరల 'నిరంతర సౌఖ్యరసైకలోలుఁడై' అని ముగియుచున్నది. అనగా నీ నడుమగల కావ్య శరీరమంతట కథా నాయకుడైన శ్రీకృష్ణుడును, అతని యందు ఆరోపితుడైన కృతిపతియగు శ్రీకృష్ణదేవరాయడును నిరంతరముగ సౌఖ్యరసైకలోలు రై యుండిరన్నమాట.

కథా ప్రారంభమున I 40లో నాయకుడగు శ్రీకృష్ణుడు 'సౌఖ్యాబ్ధినోలాడు' చున్నాడు. కథాంతమున చిట్ట చివరి దగు V 107 లోగూడ ఆతడు 'సౌఖ్యాంబుధినోలాడు

చుండె'. గ్రంథారంభము I 4లో ఇందిరారమణి కూడ 'సుఖాంబుధి నిచ్చలు నోలలాడు' చున్నది. ఇట్లు కావ్యమంతమునోక 'సౌఖ్యాంబుధి'యని గమ్యమాన మగుచున్నది. గ్రంథ మందలి చిట్ట చివరి దగు V 111 పద్యము 'మంగళమహాశ్రీ' అని ముగియుటకు ముందు 'సుఖితాళిరవ మాన్యగృహా' అని కడపటి సారిగా సుఖపదము ప్రయోగింపబడి యున్నది. ఇట్లు పారిజాతాపహరణము 'సుఖపదాంక' మన దగియున్నది.

ఇతివృత్త నాయకుడైన శ్రీకృష్ణునకును, కృతినాయకుడైన శ్రీకృష్ణదేవరాయల కే గాక పాఠకలోకమున కంతటికిని పారిజాతాపహరణము సౌఖ్యాబ్ధియే. నాయకునికిని, కవికిని, శ్రోతకును అనుభవము సమానము[2] కనుకనే 'దీని యందు నీవు సుఖపడుదువు.'[3]

# సింహావలోకనము

ఈ సిద్ధాంతవ్యాసము ఇరువురు మహాకవులు సమానేతివృత్తమునుగొని కావించిన రచనల తులనాత్మక పరిశీలన. ఈ ఇరువురును భిన్నభాషలవారు, భిన్నకాలములవారు, భిన్నప్రాంతములవారు; కనుక వారి అనుభవములు భిన్నములగుట, వారి దృక్పథములు భిన్నములగుట సహజము.[1] ఐనను ఈ భిన్నత్వమునందును కథాగత మైన ఏకత్వము ఉండనే ఉన్నది. ఇది గాక ఆసేతుశీతాచలము వ్యాపించియున్న పరంపరాగతమగు భారతీయ సంస్కృతి ఏకావ్యప్రపంచమున రూపొందుటను నిరూపింపగల సాహిత్య శాస్త్రపుటేకత్వమున్నది. త్రివిధములగు ఈ ఏకత్వమును ప్రాతిపదికగగ్రైకొని, సహృదయుతా ప్రమాణముతో ఈ ఉభయరచనలను తులనాత్మకముగా పరిశీలించు ఒక ప్రయత్నము ఈ సిద్ధాంతవ్యాసమున చేయబడినది.

మొదటి భాగమున తిమ్మన రుద్రభట్టుల స్థలకాలవంశాదికమును గూర్చిన పరిశీలన చేయబడినది.

తెలుగు పారిజాతాపహరణ రచయిత యైన తిమ్మన కౌశిక గోత్రుడైన ఆరువేల నియోగి బ్రాహ్మణుడు; సంగీత సాహిత్యములకు తరతరములుగ ప్రసిద్ధమైన వంశమున జన్మించిన వాడు. తిమ్మన ఇంటి పేరు 'నంది'. ఐనను అతడు 'ముక్కు తిమ్మన' అను పేరిట ప్రసిద్ధుడైనాడు. తిమ్మన నివాసస్థానము మైసూరు రాష్ట్రము నందలి కోలారు జిల్లా చిక్కబళ్ళాపురము తాలూకాకు చేరిన 'నంది' గ్రామమై యుండును.

అతని పారిజాతాపహరణ కావ్యము శ్రీకృష్ణదేవరాయల కంకితమొసగబడినది. ఈ కృతిసమర్పణోత్సవము శా.శ. 1437 యువసంవత్సర ఫాల్గుణ శు. ౧౫లకు సరియగు 16-2-1516 A.D. తేదిన జరిగియుండునని ఊహించుటకు వీలగుచున్నది. కన్నడ జగన్నాథవిజయ రచయితయైన రుద్రభట్టు బ్రాహ్మణుడనుటను మించి అతని వంశ, గోత్రాదులేమియు తెలియ వచ్చుట లేదు. 1172-1219 మధ్య ద్వార సముద్రము నేలిన హొయ్సలవంశీయుడైన ద్వితీయ వీరబల్లాలునకు రుద్రభట్టు ఆశ్రితుడైయుండునని ఉహింపవీలగుచున్నది. అతని నివాసము మైసూరు రాష్ట్రమందలి చిక్కమగళూరు జిల్లా దేవనూరు గ్రామమైయుండునని కూడ ఉహచేయవీలగుచున్నది.

'పారిజాతాపహరణము'నకు 'హరికథాసారము', 'జగన్నాథవిజయము', అను కన్నడగ్రంథములు మాతృకలని కొందరు పండితులు చెప్పినారు. కాని కన్నడములో 'హరికథా సార' మను గ్రంథమే లేదు. తిమ్మన రుద్రభట్టు ఇరువురును హరివంశ, విష్ణుపురాణముల ననుసరించియే తమకావ్యములను రచించియున్నారు. కనుక కథాంశములలోను, భావములలోను, పదబంధములలోను కొన్ని పోలికలు కనుపించుట సహజము. కాని వీని కన్నింటికిని మూలములు హరివంశమందో, విష్ణుపురాణమందో, లేక మరొక ప్రాచీన కావ్యమందో కనుపించుచున్నవి. రుద్రభట్టు కావించిన సొంతకల్పనలలో ఒక్కటియైనను తిమ్మన స్వీకరింపలేదు, రుద్రభట్టు విస్మరించిన అనేకాంశములను హరివంశ విష్ణుపురాణముల నుండి తిమ్మన స్వీకరించియున్నాడు. కనుక తిమ్మన జగన్నాథవిజయమును కాక హరివంశ, విష్ణుపురాణములనే అనుసరంచినాడని చెప్పగలుగుచున్నాము.

తిమ్మనచే రచింపబడిన పారిజాతావహరణమే సంస్కృతీకరింపబడి హరివంశమున ప్రక్షిప్తముగావింపబడియుండుననువాదము కూడ కలదు. కాని తిమ్మన కంటెను రుద్రభట్టు కంటెను పూర్వమే 3వ శతాబ్దినుండి యే ఈ పారిజాతాపహరణ కథ దేశమున వ్యాపించియున్నదనుటకును క్రీ.శ. 1100 ప్రాంతమున బిల్వోదకక్షేత్ర ప్రాంతీయుని చే ఈ ప్రక్షిప్త భాగరచన జరిగియుండునని ఊహించుటకు తగిన సాక్ష్యాధారములున్నవి. కనుక ఈ వాదము నిరాధారమని తేలుచున్నది.

తిమ్మన రసవంతమైన కథా సందర్భములను, వర్ణనలను విస్తరించియు నీరస భాగములను సంగ్రహించియు అనుచితములు, అసంగతములునైన భాగములను

పరిహరించియు లేక సముచితముగ మార్పు గావించియు, రమ్యము లైన నూతన భావములను, అలంకారములను, కథాంశములను కల్పించియు మూలమున కంటె ఎన్నియోరెట్లు రమణీయముగ రచించియున్నాడు. రుద్రభుట్టు కూడ ఈ విధానములన న్నింటిని అనుసరించినను ఆతనికి తిమ్మన వంటి సమ్యగ్దృష్టి ఏర్పడినట్లు లేదు. అతడు కొన్నిచోట్ల నీరస సందర్భములను విస్తరించుటయు, సరసములగు సందర్భములను సంగ్రహించుటయు, విస్మరించుటయు, అనుచితములగు మార్పులను చేయుటయు వలన అతనికావ్యమున రామణీయకత కొంతలోపించినది. మొత్తము మీద రుద్రభట్టు రచన కూడ సంస్కృతమాతృకల కంటె సుందరముగ నున్నదనుటలో సందేహము లేదు. అతడు కావించిన కొన్ని విస్తరణలు, పరివర్తనలు, కల్పనలు మిక్కిలి రమ్యములుగ నున్నవి. కాని తిమ్మన కలవడిన నేర్పు రుద్రభట్టునకు అనువాదప్రక్రియలో అలవడ లేదనియే చెప్పవలసియున్నది.

హరివంశ విష్ణుపురాణములందు భిన్నముగనున్న కథాంశములను సమన్వయ పరచుటలో రుద్రభట్టు కంటె తిమ్మన ఎక్కువ నేర్పును ప్రదర్శించియున్నాడు. ముఖ్యముగా నరకునిచే అపహరింపబడిన అదితి కుండలములను ఆమెకు సమర్పించు వంకతో కృష్ణుడు అమరావతికేగి పారిజాతము నపహరించినాడని తిమ్మన చేసిన కథాంశ సమన్వయము గొప్ప నేర్పరి తనమును సూచించుచున్నది. రుద్రభట్టు సమన్వయమును సాధింప లేక కృష్ణునిచే రెండు పర్యాయములు అమరావతీ యాత్ర చేయించినాడు.

రసపోషణలో తిమ్మన రుద్రభట్టు లిరువురును సిద్ధహస్తులే. వీర రౌద్ర రసపోషణలో రుద్రభట్టు ప్రతిభ బాగుగగోచరించు చున్నది. శృంగార హాస్యరసపోషణలో తిమ్మనకు రుద్రభట్టు సాటిరాలేడు. ఇతర రసముల పోషణ ఇరువురును నామ మాత్రముగనే చేసినారు.

రుద్రభట్టు శబ్దాలంకార ప్రియుడు. తిమ్మన అర్థాలంకార ప్రియుడు. తిమ్మన దాదాపు ప్రతి పద్యమునను ఏదో యొక అర్థాలంకారమును నిక్షేపించును. చాల పద్యములలో రెండు మూడలంకారములు కూడ పరస్పరానుప్రాణితములై యుండును. ఇరువురి అర్థాలంకృతులును రమణీయార్థ ప్రతిపాదకములే. కాని రుద్రభట్టు రచనలో అవి అతి విరళములు.

తిమ్మన ఒక్కొక్క వర్ణనను అనేక పద్యములలో చేయగా రుద్రభట్టు వర్ణనలు సాధారణముగా ఒక పద్యమును మించియుండువు. తరచుగా అవి ఒకటి రెండు పద్యపాదములకే పరిమితమైయుండను. తిమ్మన వర్ణ్యవస్తువును బహుముఖ పరిశీలన గావించును. రుద్రభట్టు వర్ణ్య వస్తువు యొక్క ఏదేనొక్క విశేషమును మాత్రము వర్ణించి తృప్తి చెందును. తిమ్మన తన కావ్యము నందలి మొత్తము 512 గద్యపద్యములలో దాదాపు 260 గద్య పద్యములు వర్ణనలకై వినియోగింపగా అదే కథాభాగము గల 265 గద్య పద్యములలో రుద్రభట్టు 50పద్యములను మాత్రమే వర్ణనలకై వినియోగించినాడు. అనగా తిమ్మన వర్ణనలు విస్తృతములును, రుద్రభట్టు వర్ణనలు సంగ్రహములును అన్నమాట. కాని ఉన్నంతలో ఇరువురు చేసిన వర్ణనలును హృదయంగమముగనేయున్నవి.

తిమ్మన కవిసమయములను కొల్లలుగా వాడుట వలన అతని కావ్యము అత్యంత రమణీయమైనది. రుద్రభట్టు కవిసమయములను అతి విరళముగ ఉపయోగించుట వలన అతని కవిత్వములో రమణీయత తక్కువైనది.

ఔచిత్య నిర్వహణలో ఇరువురును సమస్కంధులే. ఇతివృత్త, వర్ణనాదులలో ఇరువురును చక్కని ఔచితిని పాటించినారు. తిమ్మన చేసిన అనౌచిత్యదోషములలో రుక్మిణి ఎదుట నారదుని చేత ఆమె యొక్క సురతమును గూర్చిన ప్రసంగము చేయించుట ఎన్న దగియున్నది. రుద్రభట్టు నారదుని కేవలము మచ్చవాలుక వానివిగ చిత్రించుట అతని అనౌచిత్య కల్పనలలో ఎన్నదగినది. శృంగార రసపోషణలో ఇరువురును ప్రదర్శించిన నిగ్రహము అత్యంతప్రశంసనీయముగ నున్నది.

తిమ్మన రుద్రభట్టు లిరువురును తమ కావ్యములను శ్రవ్యములుగ రచించినను, దృశ్యకావ్య లక్షణముల కనుగుణముగనే రచించినారు. ఇరువురి కావ్యములందును నాయకైక్య, రసైక్యములు పాలింపబడినవి. రుద్రభట్టు వస్త్వైక్యమును కూడ పాటించినాడు. తిమ్మన కావ్యములో పుణ్యకవ్రత కథనము వలన వస్త్వైక్యము కొలదిగ దెబ్బతిననది. నాటకీయ సంభాషణలకు రుద్రభట్టు ఇచ్చిన ప్రాముఖ్యమును తిమ్మన ఈయలేదు. తిమ్మన కార్యావస్థాపంచకమునే ఆశ్వాసపంచకముగ విభజించినాడు. రుద్రభట్టు అట్టి విభజన చేయలేదు. అర్థ ప్రకృతులను, సంధులను సంధ్యంగములను కూడ తిమ్మన కావ్యములో స్పష్టముగ గుర్తింపవీలగుచున్నది. రుద్రభట్టు కావ్యమున ప్రాప్త్యాశయను కార్యావస్థలేదు. నియతాప్తి అత్యల్పము,

అర్థప్రకృతులలో పతాకాప్రకరులు కూడ రుద్రభట్టు ప్రణాళికలో లేవు. మొత్తము మీద రుద్రభట్టు కంటె తిమ్మన నాటకీయత నెక్కువగ పాటించినాడని చెప్ప వచ్చును.

పాత్రచిత్రణలో రుద్రభట్టు తిమ్మనకు చాలదు. ఇరువురును శ్రీకృష్ణుని మహావీరునిగను, రసికునిగను చిత్రించినారు. రుద్రభట్టు కృష్ణుని క్రోధా విష్టునిగను, ఉద్రిక్త స్వభావునిగను చిత్రింపగ తిమ్మన ప్రశాంత గంభీరవీరునిగ చిత్రించినాడు. శృంగారనాయకుడుగ కూడ తిమ్మన చిత్రించిన కృష్ణుడు నెరజాణయనదగియున్నాడు. సత్యను ఇరువురు కవులను శృంగారనాయికగా, సపత్నీమాత్సర్యగ్రస్తగా, అభిమాన శాలినిగా చిత్రించినారు. కాని తిమ్మన చిత్రణలో సత్యాపాత్రకు లభించిన శృంగార రససామ్రాజ్ఞీత్వము రుద్రభట్టు రచనలో లభింపలేదు. తిమ్మన నారదుని పాత్రను పారిజాతా పహరణ కథా నాటక సూత్రధారునిగ చిత్రించినాడు. తిమ్మన చిత్రించిన నారదుడు కలహప్రియుడైనను గంభీరుడు. రుద్రభట్టు నారదుని కేవలము మచ్చ నాలుక వానినిగ చిత్రించి విరూప పరచినాడు. ప్రతినాయకుడైన ఇంద్రుని ఇరువురును ధీరోద్ధతునిగ చిత్రించినారు. ఈ ఔద్ధత్యమును తిమ్మన కంటె రుద్రభట్టు మరింతగ వ్యక్తము గావించినాడు. తిమ్మన గరుడుని పతాకానాయకునిగ చిత్రింపగ రుద్రభట్టు సేవక మాత్రునిగ చిత్రించినాడు. రుక్మిణి, శచి, సత్యా దాసి పాత్రలను తిమ్మన అత్యల్పావకాశములోనే అత్యంత సుందరముగ జీవకళలుట్టిపడు నట్లు చిత్రించినాడు. రుద్రభట్టు శచీ పాత్రను తీవ్ర రోషశాలినిగా చిత్రించినాడు. రుక్మిణి పాత్రలో వ్యక్తిత్వమే లేదు. సత్యా దాసి పాత్రను రుద్రభట్టు సృష్టింపనే లేదు. పాత్రచిత్రణలో తిమ్మన చూపిన శిల్ప ప్రతిభను రుద్రభట్టు దాపుల కైన సమీపింప లేక పోయినాడనుట అతిశయోక్తికాదు.

తిమ్మన కంటె రుద్రభట్టు వచనములనెక్కువగ రచించినాడు. ఆవచనములైనను తిమ్మన రచించిన వానివలె శైలీరామణీయతకత గలిగినవి కావు. వృత్తములలో తిమ్మన చంపకోత్పల మాలికలను విశేషమభిమానింపగా రుద్రభట్టు మత్తేభములను, మహాస్రగ్ధరలను అభిమానించినాడు. తిమ్మన శైలి చంపకోత్పలకోమల మనియు, రుద్రభట్టు శైలి మత్తే భగమన గంభీరమనియు ఇందు వలన చెప్పుటకు వీలగుచున్నవి.

తిమ్మన శైలిమృదుమధురమై అతనికి 'ముక్కు తిమ్మనార్యు ముద్దు పలుకు' అను కీర్తిని తెచ్చి పెట్టినది. రుద్రభట్టు శైలి దీనికి సర్వథావిరుద్ధము. అతని రచనలోను

అప్రచలిత పదములు లేవు; కాని సమిసకల్పన క్లిష్టము; జాతీయములు విరళము, శైలివిషమము, పరుషమును, తిమ్మనను రొచిక కవి మనియు, రుద్రభట్టును వాచక కవియనియు చెప్పవచ్చును.

తిమ్మన కొన్ని యెడల దీర్ఘ సంస్కృత సమాస భూయిష్ఠములైన పద్యములు రచించినాడు; కొన్ని యెడల తేట తెలుగులను కులికించినాడు. చాల వరకు తెలుగు సంస్కృతములను 'సమపాళము'గా కలబోసి కూర్చినాడు. సంస్కృతములైనను, తెలుగు లైనను తిమ్మన బహుప్రచలితములైన పదములనే వాడినాడు. అక్లిష్టమగు సమాసగ్రథనము కావించినాడు. మొల్లల వంటి జాతీయములను కొల్లలుగా రాశి పోసినాడు.

కావ్యగుణములలో ప్రసాద, మాధుర్య, సౌకుమార్య, అర్థవ్యక్తులు తిమ్మన కవితకు లక్షణములు, ఓజో, ఊర్జిత, ఔదార్యములు రుద్రభట్టు కవితాలక్షణములు, తిమ్మనది కైశికీ వృత్తి, వైదర్భీరీతి, ద్రాక్షాపాకము, రుద్రభట్టుది ఆరభటీ వృత్తి, గౌడీరీతి, నారికేళపాకము, తిమ్మనది మృదుశయ్య, అలరుపానుపు; రుద్రభట్టుది గతుకులరాతినెల.

శ్రీకృష్ణ దేవరాయల కాలపు విజయనగర రసిక ప్రభువుల భోగమయ జీవితమునకు పారిజాతాపహరణమొక దర్పణము. కాని సాధారణప్రజల, పేదసాదల జీవిత విశేషములు ఒక్కటైన తిమ్మన కావ్యమున చోటు చేసికొన లేక పోయినవి. రుద్రభట్టు రచనలో ఉన్నత వర్గపు జీవితముతోపాటు మధ్య తరగతి, పేద తరగతికి చెందిన సాధారణ ప్రజాజీవితపు ముచ్చట్లు కూడ అటనట కానవచ్చుచున్నవి.

తిమ్మన తన ప్రభువగు శ్రీకృష్ణదేవరాయని వంశమును, అతని పరాక్రమౌ దార్యాదిగుణ గణములను తనివి తీర పొగడినాడు; అతని కీర్తిని అజరామరము గావించినాడు. శ్రీకృష్ణరాయడు శ్రీకృష్ణుని అవతారమేయని తిమ్మన తన కావ్యము అవతారికాభాగమున నేర్పుగా నిరూపించినాడు. ఇట్లు తన కావ్యమున నిబంధింపబడుచున్నది కృష్ణరాయని చరిత్రయేయని ధ్వనింప జేసినాడు. రుద్రభట్టు తన ప్రభువు పేరును స్పష్టముగ తెలుపలేదు. కాని శ్లేష మహిమవలన తన ప్రభునైన వీరబల్లాలుని ఈశ్వరునితో అభేదము చేసి చెప్పినాడు. ఇది ప్రాచీన కర్ణాట కవి సంప్రదాయమునననుసరించి చేయబడినది. ఐనను అతడు తన ప్రభువును కథానాయకుడైన శ్రీకృష్ణునితోనే అభేదముచేసి యుండవలసినది. అతడట్లెందుకు

చేయలేదో తెలియదు. రుద్రభట్టు తన ప్రభువును ఈశ్వరునితో అభిన్నునిగా చెప్పిన శ్లేష కంటె, తిమ్మన తన ప్రభువును కథానాయకుడైన కృష్ణునితో అభిన్నునిగ ధ్వనింపజేసిన విధము రమ్యముగనున్నది.

రుద్రభట్టు తిమ్మన లిరువును తమగ్రంథములును మహాప్రబంధములనియే పేర్కొనివారు. జగన్నాథవిజయ, పారిజాతాపహరణములు రెండును మహాకావ్యములే. తిమ్మన రుద్రభట్టు లిరువురను మహాకవులే పారిజాతాహరణము మహకావ్యము కాదని, అది యొక ఖండకావ్యము మాత్రమేయని కొందరు వెలిబుచ్చిన అభిప్రాయము సహేతుకము కాదు. పారిజాతాపహరణము సలక్షణమగు మహాకావ్యము.

రసస్రష్టలైన మహాకవుల కావ్యములను పఠించుట వలన రసరూపమైన అలౌకిక సుఖము లభించును. జగన్నాథ విజయ పఠనము వలన కంటె పారిజతాపహరణ పఠనము వలన పాఠకునకు అత్యధికమగు సుఖము లభించుచున్నది.

'కవి హృదయ పరిజ్ఞాతుః

పదే పదే సంభవన్తి సౌఖ్యాని.'

# విశేషసూచనలు

## అమవాద విధావము

1. 'పారిజాతాపహరణము'. భారతి. 1941 జులై.
2. విశ్వనాథ సత్యనారాయణ-పారిజాతాపహరణ పీఠిక- ఎమెస్కో-ప్రచురణ పుట. XXXXXX
3. ఈ వ్యాసుడు భగవంతుడైన కృష్ణద్వైపాయనుడుకాడు. ప్రక్షిప్త భాగరచయితయైన ఒక అనామక వ్యాసుడు.
4. కన్నడ చంపూ కావ్యములను ముద్రించునపుడు తెలుగులో వలె గద్యపద్యముల కన్నింటికిని వరుస సంఖ్య నిచ్చువాడుక లేదు పద్యములకు మాత్రమే సంఖ్యలనిత్తురు. వచనములకు సంఖ్యాపరిగణన లేదు. ఇచట 28 పద్యముల మధ్య 13 వచనములున్నవి.

## అలంకారములు

1. దిక్పాలకుల పేర్ల పట్టికల నొసంగునపుడు తిమ్మన రెండుసార్లు వారి పేర్లన్నియు ఒకే అక్షరముతో ప్రారంభమగునట్లు వేర్వేరుపదములతో కూర్చినాడు. 'అంత్యానుప్రాస' సామ్యమును బట్టి దీనికి 'ఆద్యనుప్రాస' అను పేరు కల్పింబడినది.
2. శ్రీనాథుడు కూడ దిక్పాలురను 'పాకశాసన, పావక, పరేతరాజ, పలలాశి, పాశి, పవన, పౌలస్త్య, పశుపతులు' (కాశీఖండము 9) అని చెప్పియున్నాడు కాని భీమఖండము (IV47) హరవిలాసము (III 9) శృంగార నైషధము (IV19)లలో కూడ ఇవే పదముల పునరుక్తులు కనుపించుచున్నవి.
3. తిమ్మన ఈ పద్యమంతట సంస్కృత సమాసములే కూర్చుటచే గుణిత క్రమమున హ్రస్వవక్రములను కూర్చలేదు. మరివట్రున సుడినెందుకు కూర్చలేదో?
7. షోడశ సహస్ర శశిగళ్

   మూడిద నభమెనె గుహాగ్రగతముఖతతియిం

   కూడిమణిశైల మెసెదిరె

   నోడిద రచ్యుతన నఖిల సురకన్యకెయర్" (XII53)

8. XIII 34, 36 చూడుడు పుటలు. 106, 107.

9. 'అసుర యమదండ మెనలు
ర్విసుప మహోగదె. . . ' XIII 84.

10. 'దీప్రతరం తృతీయనయనార్చి కిరీట భుజంగ భోగర
త్నప్రకరార్చియంతె, విటల త్రిపతాకె కరత్రిశూలహే
తిప్రతిబింబదంతె, తను దీధితి రౌద్రరసాంబు రాశిఫే
నప్రభయంతె. అగుర్విసువ శాక్కర వాహననీతనీశ్వరం' (XIII, 72)

11. 'పీతాంబరధరనం పురు
హూతశిలీముఖనికాయమెఱుగిదు దినిసం
పూత నవ కర్ణికారకు
జాతదొళెఱగి శిలీముఖాళియ తెఱదిం. ( XIII. 90)

12. 'ఆనక వీచిరవం ధ్వజ
మీనం శేషాక్షతాంబుకణ మెసెప ధరాం
భోనిధియిం ఖగరాజం
మైనాకం నాగదత్తలొగెదం తొగెదం' (XIII. 44)

13. 'నల్లరదేం పెండిరనల్లి లోకరపహాస్యం గెయ్యుదం కేళ్వరే' (XII.- 103)

14. 'పెండిరాదరిసుత్తిర్ప పదార్థమం సుభట రన్యర్గీయలేం బల్లరే (XII.- 17)

<u>వర్ణనా నైపుణి</u>

1. 'కవనీయం కావ్యమ్,'-లోచన.

2. 'వర్ణనా నిపుణః కవిః' - భామహాలంకారము.

3. 'దర్శనా ద్వర్ణనాచ్చాథ రూఢాలోకే కవిశ్రుతిః' భట్టతౌతుడు.

4. 'లోకోత్తర వర్ణనా నిపుణకవికర్మ కావ్యమ్,' కావ్యప్రకాశము.

5. 'ఇతివృత్త వశాయాతాం త్యక్త్వాననుగుణాం స్థితిమ్. . .
'న తు కేవలయా శాస్త్ర స్థితి సంపాదనేచ్ఛయా - ధ్వన్యాలోకము.

6. 'న్యూనమప్యత్ర యైః కైశ్చిదంశైః కావ్యం న దుష్యతి
యద్వ్యపాత్తేషు సంపత్తి రారాధయతి తద్విదః - కావ్యాదర్శ 20

7. 'తిమ్మావఝ్ఝుల కోదండరామయ్య-కవిరాజ శిఖామణి. పుట. 56

8. 'యస్తు పరిదద్రి సాగర పురతురగ రథాదివర్ణనేయత్నః'
కవిశక్తి ఖ్యాతిఫలో వితత ధియాం నో మనస్స ఇహ-,' కావ్యమీమాంసలో ఉద్ధృతమైన 'అపరాజితి' అభిప్రాయము.

9. 'మజ్జనపుష్పా పచయన సంధ్యాచంద్రోదియాది వాక్యమిహ
సరసమపి నాతి బహుళం ప్రకృతిరస సమన్వితం రచయేత్' - పై వలెనే.

10. శృంగారరసాత్మకమైన ఈ పద్యమునకు రుద్రభట్టు మహాస్రగ్ధరా ఛందస్సు నెన్నుకొనుట మాత్రము ఆంధ్రపాఠకులకు విడ్డూరముగ తోచవచ్చును. స్త్రీ సౌందర్యమును మహాస్రగ్ధరలో వర్ణించిన ఉదాహరణలు ఆంధ్ర వాఙ్మయములో ఒకటి రెండు మాత్రమే. ఎఱ్ఱాప్రగడ 'రామాయణము'లో సీతాసౌందర్యమును శూర్పణఖ రావణునితో మహాస్రగ్ధరలో వర్ణించి చెప్పినది. (చూడు వేటూరి ప్రభాకరశాస్త్రి - 'ఎఱ్ఱాప్రగడ రామాయణము' - రెడ్డి సంచిక)
శ్రీనాథుడు కూడ దమయంతీ సౌందర్యమును మహాస్రగ్ధరలో వర్ణించినాడు. (శృం. నై IV44).

11. తత్తద్భూమిపతిః పత్న్యై దర్శయన్ ప్రియదర్శనః
అపిలంఘితమధ్వానం బుబుధే న విచక్షణః - రఘువంశము 47.

## కవిసమయములు

1. 'కవీనాం సమయే ఖ్యాతే గుణః ఖ్యాత విరుద్ధతా,' సా. కు. 22.
2. పైన చెప్పిన దేవతలు నలుగురును నల్లని వారే అను విషయమును వ్యాఖ్యాత లెవ్వరును గుర్తింప లేదు, కనుక ఈ కల్పన యందలి చమత్కారము లోని సగపాలు ఇంత వరకు అచుంబిదముగనే ఉండి పోయినది.
3. ఈ విషయము కూడ వ్యాఖాతల దృష్టిని ఆకర్షింప లేక పోయినది. అందు చే ఈ ధ్వని ఎవరికిని వినిపింప లేదు.
4. సంపెంగలలో కొన్ని తెగలు కలవు. హేమ చంపకము అనునది మాత్రమే తుమ్మెదలకు గిట్టదని వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారు చెప్పుచున్నారు. చూ. కకుమారి వడ్లమూడి జయశ్రీ - 'చంపకమూ - చంచరీకమూ' - ఆంధ్రప్రభ 4-7-71. ఈ కవి సమయము నాశ్రయించి రచింపబడిన ఒక పద్యము. వలననే నంది తిమ్మన ముక్కు తిమ్మన యైనట్లు పుక్కిటి పరాణము. చూ.పు.ట. 15

5. 'ప్రతిభావ్యుత్పత్తీ మిథ: సమవేతే శ్రేయస్యౌ' ఇతి యాయావరీయ:- కావ్యమీ మాంస.

## ఔచిత్య పోషణ

1. "ఔచిత్యం రససిద్ధస్య స్థిరం కావ్యస్య జీవితమ్" క్షేమేంద్రుడు.
2. "అనౌచిత్యాదృతే నాస్తి రసభంగస్య కారణమ్" ధ్వనికారుడు. ఉదాహరించినది III 14.
3. రతిశ్రమ స్వేద వినాశ హేతు ర్నవోద భారానయనే చ హేతు:
   న మారుతస్స్యాద్యది చారుగాత్రి న మేఘకాలో మమ వల్ల భస్స్యాత్.
   రతిశ్రమ స్వేదహర స్సుగంధి: తత: పరం కిం సుఖమస్తి లోకే
   ఏవం విధేషు ప్రియసంగమేషు రతావసానే యదుపైతి వాయు:
   ఉమాస్తన ద్వంద్వ సమర్పితానన: తయా సమాశ్లిష్య నిపిడితాధర:
   ఖడ్గాంబువిక్షాళిత చంద్ర శేఖర: తాంచాపి వీక్షన్ బహుశస్తదా శివ: - పరిమళోల్లాస పీఠిక పుట.16.
4. విశ్వనాథ సత్యనారయణ సారస్వత నీరాజనము - పీఠిక - పుట 7
5. కావ్యపరిమళము, పుట 61. చిలుకూరి నారాయణరావు గారు కూడ ఈ 'చనవు' అభిప్రాయమును తెలిపియున్నారు. చూ. పారిజాతా పహరణము.' భారతి - 1941 జులై
6. టేకుమళ్ళ అచ్చుతరావు - వి.న. ఆం. వా. చరిత్ర సంపుట2. పుట 265
7. పుట్టపర్తి నారాయణాచార్యులు - 'తిమ్మన' విజ్ఞాన సర్వస్వము 4. పుట 820
8. అన్యా సంగమ చిహ్నై ర్భైర్గురు మాన: ప్రజాయతే పాద ప్రణా మానన్నై రసనేయో భవేదసౌ - శృంగారమృత లహరి
   'మాన :- స హి ప్రేయాంసమస్యా : పాద పతనాది పూజాయాం
   ప్రయోజయతి' :- సరస్వతీ కంఠాభరణము
   'సామో భేదోథ దానం చ నత్యుపేక్షా రసాంతరమ్
   తద్భంగాయ పతి: కుర్యాత్......'
   'తత్రయుక్త రూపేణ సామ్నా పాదపతనేన వా ప్రసన్నమనాస్తామనున-యమ్నుపక్రమ్య శయన మరోహయేత్' - వాత్స్యాయనీయము.
9. కయా స కామిన్ సురతాపరాధాత్

పాదానతః కోపనయావధూతా' - కుమారసంభవము III 8.
'రాజా (దుష్యన్తః) శకున్తలాయాః పాదయోః ప్రణిపత్య' శాకుంతలము VII అంకము.
'రామ :- (సీతాయాః పాదౌ శిరసి కృత్వా) అయం పశ్చిమస్తే రామస్య శిరసా పాదపంకజస్పర్శ - ఉత్తరామ చరిత్ర I అంకము.
'చరణే రచితప్రణిపాతం' - గీతగోవిందము 20వ అష్టపది.
'కరకమలేన కరోమి చరణమహం' - గీతగోవిందము 23వ అష్టపది.
'క్రీతే దాస ఇవోపసేవిత పదాంభోజే కుతస్సంభ్రమః'- గీత గోవిందము XIసర్గ - 5శ్లో
క్లిష్టోహస్తావలగ్నః చరణ పతితో వేక్షితః- ...... అమరుకము - శ్లో 2
చరణ పతన ప్రత్యాఖ్యాతనాత్ప్రసాద పరాఙ్ముఖే ...... 19
తస్యాః సాంద్ర విలేపన .... చరణావతికర వ్యాజేన ..... 24
కోపో యత్ర.... త్వం పాదాంతే లురసి ...... 33.
'ప్రాణేశు నొసలి లాక్షాంకంబు పొడగాంచి
ముసిముసి నవ్వుతో మోముమలచు......
రాజుచేఁ జికురభారము పెజ్జ మోవంగ
మ్రొక్కించుకొమఁ బాదములకు వలిగి" శృం.నై. VII 191
'దీవ మార్చిన యప్డు దీప్తిఁ జూపిన కల్ల
మౌళిరత్నము మ్రొక్కి మాన్పుకొనియె' శృం,నై. VII 192
'దాస్యము నిన్న రే కుసుమధన్వుఁ డొకండును సాక్షిగా పరో
జాస్య వహించినాడు, నిను మప్పుడు మ్రొక్కుట లేదు, నీకు వి
శ్వాస్యుఁడఁ గాన మ్రొక్క ఁగొను స్వస్తటినీ సలిలాభిషేక పా
రస్య పవిత్ర మస్తకము వ్రాల్చెద నీ పద యుగ్మకంబుపై' శృం.నై. VII 44
'ప్రణయ కోప ప్రశాంతికై పాదపతితు.
నిన్ను నే పువ్వుఁబోడి మన్నింపపదయ్యే'..... హరవిలాసము III 46.
'జగతీనాథవతంసమానత శిరస్సమ్మేళనన్ నెయ్యపుం
జగబంబుల్ ప్రియమొప్ప మాన్పెడు తరిన్ జంచత్కిరీటాగ్రర
త్నగణ స్పర్శనహంబుగావలసియోఁనా గొర్కి దైవార న
వ్నగువం బాద తలంబు పట్టి సనెకల్ మట్టించె మోదంబునన్.' మన V 15

"....పతి నాతి పదాబ్జముఁ బట్టె, బట్టినన్ - కళాపూర్ణోదయము VII 230
"ఆమందాకిని మౌళితీ, బూని సమసర్ధాంగీకృతం జేసి
'నా మేల్పేలని యార్య యల్గఁ బ్రణతుండై తత్పదాంభోజ యో
గామర్షంబున గంగయున్మొఅయ"- వసు చరిత్ర I 5.
తేర్పఁగా ( దొడ ( గె ( బాదనతిన్ గుపితా ప్రియారతిన్' -పాండు 313
'పాలకయ్యంబులఁ గల్లు ముద్దుటలుకన్ బుష్పాయుధారాతి మ్రొ
క్కుల ( దీర్పన్ దలమీఁద గావనగునీ క్రొమ్మెను పుణ్యాంగనా
తిలకంబైన భవాని పాదనఖపంక్తిం జెంద డెందంబులన్
దలఁతో చుక్కలతోడి మక్కువలు చంద్రా రోహిణీ వల్ల భా' - రావిపాటి తిప్పన
- చంద్ర తారావళి.

10. పుట్ట పర్తి నారాయణా చార్యులు - విజ్ఞాన సర్వస్వము, Vol.4 పుట 820.
11. ఈర్ష్యా మానస్తు యః కోపః ప్రియే జ్ఞాతాన్య సంగమే
అభాషణముపాలంభో భర్త్సనం తాడనం యథా.
వైముఖ్య మశ్రుచామర్ష ఇత్యాద్యైరను భాష్యతే...
సతర్జ్యని విష్ఠురం రోషాదధీరా తాడయేద్ద్రుఢమ్. (రసార్ణవసుదాకరము)
క్రోధవశాత్తస్య శిరసి తాడన మపి న దోషాయ, సౌభాగ్య చిహ్నం తదితి
నాగరకవృత్తా:- వాత్స్యాయనునకు జయమంగళుని వ్యాఖ్య.
12. సాలక్తకం శతదలాధిక కాంతిరమ్యం
రాత్రౌ స్వధామ వికబారుణ నూపురాంకం
క్షిప్తం భృంశం కుపితయా తరలాయతాక్ష్యా
సౌభాగ్య చిహ్నమివ మూర్ధ్ని పదం విరేజే - అమరుకము
తతశ్చాభిజ్ఞాయ స్ఫురదరుణ గండస్థలరుచా
మనస్విన్యా రూఢప్రణయ సహసోద్గదగిరా
అహో చిత్రం చిత్రం స్ఫుటమితి నిగద్యాశు కలుషం
రుషా బ్రహ్మాస్త్రం మే శిరసి నిహితో వామచరణ:- అమరుకము
శంకర శిరసి నివేశిత పదేతి మా గర్వముద్వహేందులతే
ఫలమేతస్య భవిష్యతి తవచండీ చరణరేణుమృజా - జగన్నాథ పండితరాయలు
మృషా కృత్వా గోత్ర స్థలన మథ వైలక్ష్యవమితం

లలాటే భర్తారం చరణకమలే తాడయతి తే
చిరాదన్తశ్శల్యం దహనకృత మున్మీలితవతా
తులాకోటిక్వాణై : కిలికిలిత మీశానరిపుణా - జగద్గురు శంకారాచార్యులు సౌందర్య లహరి శ్లో. 61.

13. మండలెముల వేంకటశాస్త్రి - 'ముక్కు తిమ్మన' - భారతి 1925 ఎప్రిల్
14. శిష్టా లక్ష్మీకాంత శాస్త్రి - విజయనగర ఆంధ్ర కవుల చరిత్ర పు.ట. 208
15. పుట్టపర్తి నారాయణా చార్యులు - 'తిమ్మన' - విజ్ఞాన సర్వస్వము. సం.4. పుట 815
16. విశ్వనాథ సత్యనారాయణ - ఏకవీర విశ్వనాథ సత్యనారణ - సంగ్రహ ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము పుట 772
17. తాపీ ధర్మారావు - పారిజాతాపహరణము - అకాడమీ చురణ పీఠిక.
18. తాపీ ధర్మారావు - 'సత్య భామ కృష్ణుడిని తన్నిందా?' సాహిత్య మొర్మరాలు P. 15.
19. సాలక్తకేన నవ పల్లవ కోమలేవ
పాదేవ మావురవతా మదలాలసేన
యస్తాడ్యతే దయితయా ప్రణయాపరాధాత్
సోంగికృతో భగవతా మకరధ్వజేన - అమరుకము. శ్లో. 101
'కామపురషార్థస్య ఉపాదేయత్వ ముక్తం భవతి' - పైశ్లోకమునకు పెదకోమటి వేమారెడ్డి వ్యాఖ్య - శృంగారదీపిక.
20. 'దాసే కృతాగసి భవత్యుచితః ప్రభూణాం
పాదప్రహార ఇతి సుందరి నోస్మి దూయే
ఉద్యత్కఠోర పులకాంకుర కంటకాగ్రైః
యద్భిత్యతే మృదుపదం నను సా వ్యథాయే' - సాహిత్య దర్పణము. ఉదా: X 32
రక్తాశోకశ్చల కిసలయః కేసరశ్చాత్ర కాంతః
ప్రత్యాసన్నౌ కురవక వృతేర్మాధవీ మండపస్య.
ఏకః సఖ్యాస్తవసహ మయా వామ పాదాభిలాషీ
కాంక్షత్యన్యో వదన మదిరాం దోహద చ్ఛద్యనాస్యాః- మేఘదూతము I 17.
స్మరగరళ ఖండనం మమ శిరసి మండనం.

దేహి పదపల్లవ ముదారం - గీత గోవిందము, 19వ అష్టపది.

నమోవాకం బ్రూమో నయనరమణీయాయ పదయోః

తవాస్మై ద్వంద్వాయ స్ఫుట రుచిర సాలక్తకపోలే

అసూయత్యత్యన్తం యదభిహననాయ స్పృహయతే

పశూనామీశః ప్రమదవన కంకేళి తరవే - శంకరులు - సౌందర్యలహరి 85.

'.....కాం, తావర పాద ఘాతము ముందబిడు నీకటు నాకశోకమా

నీవును నేముఁ దుల్యులము.....' కావ్యాలంకార సంగ్రహము P 65.

21. నాగ పూడి కుప్ప సామయ్య - పరిమళోల్లా సవ్యాఖ్య - పుట 69.

22. 'మన్నించి యిట్లు నన్నుం దన్నియశోకుఁడుగఁ జేయు దలపది యొప్పున్' - కవి కర్ణరసాయనము IV 155.

23. కావ్య పరిమళము. పుట. 70 (విశ్వనాథసత్యానారాయణ)

24. 'ఏకో హి దోషో గుణసన్ని పాతే

నిమజ్జతీందోః కిరణేష్వివాంకః' - కుమారసంభవము I 3.

25. అదితిరువాచ :- 'నమస్తే పుండరీకాక్ష.....' (విష్ణుXXX అధ్యా 6. శ్లో)

26. '........ వవన్దే తం తదాచ్యుతః సభార్యో విబుధ శ్రేష్ఠం నరశ్రేష్ఠోజనార్ధన' (హరి.64 అధ్యా 52అశ్లో)

## నామౌచిత్యము

1. రుద్రభట్టు కూడ 'పారిజాతహరణ' మనియే పేర్కొని యున్నాడు.
2. 'పారిజాతో' శబ్దము పుంలింగము 'పారిజా' శబ్దము స్త్రీలింగము, కాని పారిజాతమును పారిజాతలత యని స్త్రీలింగముగ చెప్పుట కూడ కలదు.
3. ఈశ్లేషలు తిమ్మన ఉద్దేశించినది కాకను పోవచ్చును.
4. 'పారిజాతాపహరణము పీఠిక' - ఎమెస్కో ప్రచురణ. పుట.
   ఈ కావ్యమున శృంగార రసప్రాధాన్యమే లేకుండుట వలన 'సత్యభామ సంసారము' అను పేరు తగియుండునని శ్రీసత్యనారాయణ గారి అభిప్రాయము.
5. తెలుగు మెఱుఁగులు - 'ఆంధ్రకవిత-ప్రబంధయుగము' పుట 89.
6. డా. చిలుకూరినారాయణరావు గారును ఈ పేరును సూచించియున్నారు. చూ. 'పారిజాతాపహరణము', భారతి-1941 జులై. 'నరకవధ' పారిజాతాపహరణము'లను చేర్చి 'సత్యభామా విజయము' అనుపేర 'శేషకవి' ద్విపంప్రబంధము రచించినాడు.

## నాటకీయత

1. ఈ భాగమున 'నాటక' పదము రూపకమను సాధారణార్థమున వాడబడినది.
2. ఈ అంకము ద్వారకలో ప్రారంభమై అమరావతిలో ముగియుచున్నది. అంకము ఏకాహచరితమైయుండ వలెనని కాలైక్యమును నిర్దేశించిన మన ఆలంకారికులు స్థానైక్యమును నిర్దేశింప లేదు గనుక ఇది దోషము కాదు. సంస్కృత నాటకములలో ఇట్టి సన్నివేశములు బహుళములు. ఉదా:- శాకుంతలము సప్తమాంకము
3. యుద్ధమును రంగముపై ప్రదర్శింపరాదు కనుక నేపథ్యము నందు నడుచుచున్న యుద్ధమును రంగము నందున్న నారదుడు చూచి వర్ణించుచు 'కుంచియదీచి నటించుట' సంభాష్యము.
4. పూర్తి కన్నడ పద్యములను వాని తెలుగు అనువాదములను వెనుక పుటలలో చూడనగున.
5. కన్నడ పద్యముల పూర్తి పాఠము, తెలుగు అనువాదము, ఈ క్రింది పుటలో చూడనగును.
6. పూర్తి పద్యములు, అనువాదము ఈ క్రింది పుటలలో చూడనగును 86-89, 92-97, 42-46
7. విజ్ఞాన సర్వస్వములో 'III ప్రబంధయుగము' పుటలు 610, 611
8. పోణంగి శ్రీరామ అప్పారావు - నాట్య శాస్త్రము - పుట 563
9. ఈ భాగముననీయబడిన లక్షణములు శ్రీమాన్ చెలంచర్ల రంగాచార్యులుగారి 'ఆంధ్ర ప్రతాపరుద్ర యశో భూషణము' నుండి గైకొనబడినవి.
10. పోణంగి శ్రీరామ అప్పారావు - నాట్య శాస్త్రము. పుట 563
11. దూరాను వర్తిని స్యాత్తస్య ప్రాసంగికేతి వృత్తేతు కించిత్తద్గుణహీనః సహాయ ఏవాస్య పీఠమర్ధాఖ్య - సాహిత్య దర్పణము III 39.
12. సన్నిధానం సూర్యనారాయణ శాస్త్రి-కావ్యాలంకార సంగ్రహము పుట. 58
13. పోణంగి అప్పారావు - నాట్య శాస్త్రము. పుట 563.
14. కట్ట మంచి రామలింగా రెడ్డి - కవిత్వ తత్త్వ విచారము. పుట 52.

## పాత్ర చిత్రణ

1. "స్వమానభంగా దపి మానభాజాం

దారావమాన స్ఫుతరామసహ్మాం." - కవిరాజ పండితుడు

పారిజాతాపహరణము జ॥ సర్గ.

2. యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్త దేవేతరోజన: - భగవద్గీత III 21.

3ఎ. ప్రాకృత కావ్యములు చదివి ఆనందించుట, కుందపుష్పములు మాలగ్రుచ్చుట, కుపితయైన ప్రియురాలిని బుజ్జగించుట తెలిసిన అదృష్టశాలురు కొందరేనట - ఒక ప్రాకృత గాథ.

3. విశ్వనాధ సత్యనారాయణ -కావ్య పరీమళము. పుట 70.

4. శృంగార రసపర్వస్వం శిఖి పింఛ విభూషణం
అంగీకృత నరాకారం ఆశ్రయే భువనాశ్రయమ్. - శ్రీ కృష్ణ కరామృతము I 92

5. తాపీ ధర్మారావు - పారిజాతాపరహరణ పీఠిక - అకాడమీ ప్రచురణ. పు.

6. పుట్టపర్తి నారాయణాచార్యులు - 'తిమ్మన' -విజ్ఞాన సర్వస్వము IV పు. 820.

7. యస్వీ జోగారావు - ఆంధ్ర యక్షగాన వాఙ్మయచరిత్ర II భా. పు. 32.

8. ఎన్. అనంతరంగాచార్ (సత్యళ నిర్మాణపు ఆంధ్రరదే ఆగిరువుదురు విశేష) 'తెలుగు సాహిత్య చరిత్ర' ప్రబుద్ధ కర్ణాటక-జనవరి 1957.

9. యస్వీ జోగారావు - ఆంధ్ర యక్షగాన వాఙ్మయచరిత్ర II భా.పు. 32.

10. ఆరుద్ర - సమగ్రాంధ్ర సాహిత్యం - VII భా.పు.143.

11. ఆరుద్ర - సమగ్రాంధ్ర సాహిత్యం - XI భా.పు.184.

12. (ప్రౌఢా) దీరా ధీరాతు సోల్లుంఠ భాషితైః ఖేదయత్యముం.
తర్జయేత్తాడయే దన్యా.' సా.ద. III 63, 64.
'ప్రియం సోత్ప్రాస వక్రోక్త్యా మధ్యా ధీరా భవేద్రుషా
ధీరాధీరా తురుదితైరధీ రాపరుషోరాక్తి భిః' సాహిత్య దర్పణము III 61.

13. పుట్టపర్తి నారాయణాచార్యులు -'తిమ్మన'- విజ్ఞాన సర్వస్వము IV భా.పు.815.

14. శృంగార నైషధము - VIII 42.

15. ఎన్. అనంతరంగాచార్ - "తెలుగు సాహిత్యచరిత్ర ' - ప్రబుద్ధ కర్ణాటక -సంపుటి 29, సంచిక 1.

16. కె.వి.ఆర్. నరసింహం, - ఆంధ్ర ప్రబంధ వికాసము - పుట. 39.
17. 'మమ్ము(దలంప(గనేల' I84, 'మాచవిగావు ' I126, 'మాకువెక పక్కెము ' I128
18. 'పుట్టపర్తి నారాయణాచార్యులు - 'తిమ్మన' - విజ్ఞానసర్వస్వము IV126,
19. విశ్వనాథ సత్యనారాయణ - ఏకవీర - సంగ్రహ ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము. పు. 772.
20. 'అవాచ్యతా దారజనాదవాప్తం, కృతంమయా సాహసమేత దుగ్రం'ం- కవిరాజ పండితుని 'పారిజాతాపహరణము X సర్గలో ఇంద్రుని వాక్యము
21. మాయాపరః ప్రచండశ్చపలోహంకార దర్పభూయిష్ఠః ఆత్మశ్లాఘానిరతో ధీరైః ధీరోద్ధతః కథితః - సాహిత్య దర్పణము III33.
23. వెన్నెలకంటి సూరన - విష్ణు పురాణము - VIII 139..

## ఛందోవైవిధ్యము

1. ఎఱ్ఱన నృసింహ పురాణము నందలి 'స్తంభోద్భవ వచనపు' నామసౌమ్యమున ఆయా వర్ణనలు గల వచనముల కాయా పేర్లు పెట్టుటయైనది.

## శైలీవైశిష్ట్యము

1. పోల్చిచూచు కొనుటకై కన్నడ విభక్తి ప్రత్యయములను, పదములను తెలుగు చేసినచో ఈ పద్యమిట్లుండును.

'బలివిధ్వంసికొసంగె నాహవరన ప్రస్యందన స్యందనం
బుల నంగచ్ఛ వినత్నరూప నిజచేష్టా వాహవాహంబులన్
జలదశ్యామ సదానగుండ రదనిర్భిన్నాగ నాగంబులన్
విలస ద్రత్న గణప్రభాపరికర వ్యాకోశ కోశంబులన్.

కన్నడ పద్యములకు యతి మైత్రినియమ ముండదని గ్రహింపవలెను.

2. 'పరశౌర్యోత్కరమం గీడ్పఱచు నడిమడుల్ కర్ణమున్ సోక కోప
స్ఫురిత భ్రూకోటియుం గంపిలునధరముత్ఫుల నాసాగ్రమున్ వి
ర్భరఘర్మక్లిన్న గండ స్థలము నరుణ నేత్రాబ్జముం జూడ(గా భీ
కరు(డై దైత్యారియున్ సంహృతి సమయ మహోగ్రాంతకాకారు(డయ్యెన్'

3. ఇది కృత కాద్రియయ్యెడు; వనావళియయ్యేడు; పద్మషండ
మయ్యెడు; తలిరుయ్యెలయ్యెడు; లతాగృహమయ్యెడు; రత్నదీప
మయ్యెడు; మధుమాస మయ్యెడు; నవోజ్జ్వల చంద్రికెయయ్యెడిట్లుకా
వది యనీ రీతి లేదు; కుసుమంబిడు చుండునభీష్టసిద్ధులన్'

4. 'హరనేత్ర వహ్నియున్ సం
హరణాగ్నియు దీని వేడిమికి పరిపోలున్
సరి కావు గర్జవాడం
బరముగ నన నొప్పు వజ్రముగ వృషుడేసెన్'.

5. విమర్శ కాగ్రేసర నరసింహాచార్ - 'రుద్రభట్టు' - ప్రబుద్ధ కర్ణాటక - (సంపుటి 31; సంచి4)

6. చంద్రశేఖర్ ఐలాళ - రుద్రభట్టు - పుట 78

7. 'శైలీ ప్రామాణ్యము విషయములో ముక్కుతిమ్మన మ మించిన కవి కాన్పింపడు' వేకుమళ్ళీ అచ్చుతరావు - విజయనగర మందలి ఆంధ్ర వాఙ్మయ చరిత్ర Vol., II P.173

'లాలిత్యమను ధర్మమును ఇంతగా సాధించిన కవి మరి లేడు... ముక్కుతిమ్మన కవిత్వమునకు మాధుర్యమే శరీరము'. పుట్టపర్తి నారాయణాచార్యులు 'తిమ్మన' విజ్ఞాన సర్వస్వము Vol. 4 పుట 814 - 820

8. '....బహుతరాను ప్రాస పదబంధ నియమంబు
వదలక కృతిసేయు వాచకుండు
మృదమధురోక్తుల వెదకి కావ్యం బెల్ల
రచియించుఁ బదపడి రొచికుండు.......'

## కావ్యగుణములు

1. 'తదదోషౌ సగుణౌ ననలంకృతీపునః క్వాపి' - కావ్యప్రకాశము I4

## పాకరుచులు

1. పూర్వము వరపరీక్షలో రుద్రభట్టు పద్యములకు అర్థము చెప్పుట యొక ప్రధాన భాగముగ నుండెడిదట.

## సమకాలీన జీవనము

1. తిమ్మన వర్ణించిన ద్వారకా, అమరావతీ నగరముల విశేషములు నిజమున కాతడు చూచియున్న విజయనగరపు విశేషములే.
2. నికోలోకొంటీయను పోర్చుగీసు యాత్రికుడును, కనకదాసు అను కన్నడ కవి (మోహనతరంగిణి కావ్యమున) వసంతోత్సవమును వర్ణించినారు.
3. 'జగమిారేళుమదొందు పుల్గడిసిలంతళ్కాడె కల్పాంతదొళ్......'
(అగ్ని దేవుడు కల్పాంత సమయమున ఈ రేడు జగములను పూరిగుడిసెను వలె వహించును).
4. ఆంధ్ర దేశమును ఈ ఆచారము దాదాపుగ అంతరించినది. కన్నడ దేశమున నేటికిని వివాహాహ్వాన పత్రికలతో పాటుగ నియంత్రణాక్షతల నొసంగు చుందురు.

## ప్రభుకీర్తిగానము

1. 'అదిరాజయశోబింబ మాదర్శం ప్రాప్యవాఙ్మయమ్.
తేషామసన్నిధానేపి నస్వయంపశ్యనశ్యతి'. కావ్యాదర్శ I5
2. వల్మీక ప్రభవేణ రామన్నపతిర్వ్యాపేన ధర్మాత్మజో
........ఖ్యాతింయాన్తినరేశ్వరాః స్ఫారైర్నభేరీనైః
3. పంపని 'విక్రమార్జున విజయము' నందు కీర్తితుడు
రన్నని' సాహసభీమ విజయము' నందు కీర్తితుడు
4. తెలుగుకవులలో నన్నె చోడుడొక్కడు మాత్రమిట్టి అభేదకల్పన చేసినాడు. అతడు తన గురువును, కృతిపతియునగు జంగమ మల్లికార్జునుని శివునితో అభేదముగానించి కుమారసంభవ కావ్యరచన చేసియున్నాడు.
5. 'దేవర వారు ఆ అవతారములోనే కాదు; ఈ అవతారములో కూడ పాండవపక్షపాతులే'. అనురాయలకు పీనన వేయు మడివేలుపు పలుకులు ఇట ననుసంధేయములు.

## మహాకావ్యత్వము

1. ప్రబంధ ఎవ సర్గ బంధ స్స్యాత్ - శృంగార ప్రకాశము.
   సర్గబంధోమహాకావ్యం - సాహిత్య దర్పణము. VI 315
2. మను చరిత్ర (వేంకట రామ&కోప్రచురణ) పీఠిక . పుట. 28.
3. ఆశ్వాసాంతము లందు తిమ్మన గుండ వివిధచ్ఛందోమయ వృత్తములు కూర్చినాడు.
4. " 'ఖండకావ్యంభవేత్కావ్యస్యైక దేశానుసారిచ' - యథా మేఘదూతాది." సా.ధ. VI 329
5. ఆ రెండుశ్లోకములు ప్రక్షిప్తములని కేంద్ర సాహిత్య అకాడమీచే ప్రచురింపబడిన ప్రతిలో కలదు.

## ఇష్టపదాంకము

1. ఐదు ఆశ్వాసముల అంతమందు గల మొత్తము 16 పద్యములలో 'యశః' పదమును నాలుగుసార్లు (I 138, III 59, IV 92, V 109), 'క్షమా' శబ్దమును నాలుగుసార్లు (II 104, 106, IV 92, V 109), 'కళా' శబ్దమును మూడుసార్లు (III 59, IV91, V 111), 'ఉదయ' శబ్దమును మూడుసార్లు (I 38, V 111), 'ఉదయ' శబ్దమును మూడుసార్లు (I 138, III 60, V 109), త్యాగ (II 106, III 59), భోగ (II 106, III 59), దయా (I 138, V 111), ప్రతాప (III 59, V 109) పదములను రెండేసి సార్లు తిమ్మన ప్రయోగించి యున్నాడు. ఇవన్నియు అతనికి ప్రియమైన పదములే.
2. 'నాయకస్య కవేః శ్రోతుః సమానోత భవస్తతః'
3. కవిసమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణ. - పారిజతాపహరణ పీఠిక-ఎమెస్కో ప్రచురణ. పుట.

## సింహావలోకనము.

1. 'పుసపిపుంపి విశేషేణ కాపి కాపి సరస్వతీ' - శారదాతనయుని భావప్రకాశము

అనుబంధము - 1

## తిమ్మన పారిజాతాపహరణ కావ్యమందలి కథ

కృష్ణుడు నరకాసురుని సంహరించి అతని చెరలోనున్న పదునారువేలమంది కన్యలను పెండ్లియాడి ద్వారకలో సుఖజీవనము చేయుచుండెను. ఒకనాడు రుక్మిణీమందిరమున ఆమెతో వినోదముగా జూదమాడుచున్న కృష్ణుని నారదుడు దర్శించి ఒక పారిజాతపుష్పమును కానుకగా నొసంగెను. కృష్ణుడు దానిని చేతబూని సత్యభామను తలచుకొనుచుండగా నారదుడు పుష్పమును రుక్మిణికిమ్మని సైగచేసెను. కృష్ణుడు చేయునదిలేక అట్లే గావించెను. అంతట నారదుడు పారిజాత పుష్పమహిమను ప్రశంసించువానివలె రుక్మిణీ మహిమను కొనియాడుచు మాటలోమాటగా సత్యను తూలనాడెను. ఇదిఅంతయు గమనించుచున్న సత్యాపరిచారిక యొకతెపోయి ఈ విషయమంతయు తన దొరసానికి అతిశయోక్తులతో తెలిపెను. సత్య రోషముతో మండిపడుచు కోపాగారమున ప్రవేశించెను.

కృష్ణుడు సత్యామందిరమున కరుదెంచి ఆమె నెన్నోవిధముల అనునయింపసాగెను. ఆమె ఎంతకును శాంతింపకుండుటచే ఆమె పాదములకు మ్రొక్కెను. ఆమెయు తన వామపాదముతో అతని శిరమును దూరముగా త్రోసివైచెను. కృష్ణుడామె పాదము నొచ్చెనేమోయని బాధపడెను. సత్య పెద్దపెట్టున ఏడువసాగెను. అంతట కృష్ణుడు పారిజాతవృక్షమునే తెచ్చియిత్తునని ప్రతిన గావింపగా ఆమె సంతోషించెను.

ఇంతలో నారదుడు సత్యామందిరమున కరుదెంచెను. సత్యాకృష్ణులు నారదున కాతిథ్యమొసంగిరి. నారదుడు సత్యను దీవించెను. తిరిగి దేవలోకమునకరుగనున్న నారదునితో కృష్ణుడు 'నరకుని సంహరించి, వాడపహరించిన అదితిదేవి కుండలములను ఇంత

వరకు నాయొద్దనే యుంచుకొంటిని. దేవేంద్రుడు వానికొరకై నన్నేల అడుగడు ? రేపు నేనే అమరావతికరుదెంచి వానిని సమర్పింతునని దేవేంద్రునకు చెప్పుము'. అని చెప్పి పంపెను.

మరునాటి యుదయము కృష్ణుడు బంధుమిత్రాదులకు తన ప్రయాణవార్త తెలిపి, వారి యనుమతిగొని గరుడు నధిరోహించి సత్యాసహితుడై అమరావతికరిగెను; ఇంద్రాదులచే సత్కృతుడై అదితికి నమస్కరించి కుండలములు సమర్పించెను. ఆమెచే స్తుతింపబడి, వైజయంతమున విడిదిచేసి, నందనవనమున కొంతతడవు వినోదముగా విహరించెను. నాటిరాత్రి వైజయంతమున నిద్రించి మరునాటి యుదయము మరల సత్యతో నందనవనమున కేగి పారిజాతమునుత్పాటించి గరుడుని స్కంథముపై నుంచెను. అది గాంచిన వనపాలకులరుదెంచి కృష్ణుని ధర్షించిరి. సత్య కృష్ణుని సమాధానము చెప్పనీయక తానే ముందున కరుదెంచి 'మీ శచీదేవి వీరపత్నియైనచో తన భర్తను పంపి యుద్ధమున గెలిచి పారిజాతమును కొనిపొమ్మనుడు' అని ప్రగల్భోక్తులాడెను.

వనపాలకులు శచీసహితుడైన ఇంద్రునకీవార్తను తెలిపిరి. ఇంద్రుడు క్రోధావిష్టుడై, దిక్పాలురను, దేవతాసైన్యమును సమీకరించుకొని కృష్ణునిపైకి యుద్ధమునకేగెను. కృష్ణుని పరాక్రమము నెదుట నిలువజాలక దేవతావీరులందరును పలాయితులైరి. ఇంద్రుడు ప్రయోగించిన అస్త్రములన్నియు కృష్ణుని శరీరములో లీనమయ్యెను. చివరకాతడు తన అమోఘమగు వజ్రాయుధమును ప్రయోగించెను. కృష్ణుడు దానిని కేళీవిలాస పద్మమునువలె పట్టుకొనెను తన ముఖ్యాస్త్రమిట్లు నిర్వీర్యము కాగా ఇంద్రుడు 'నేనపరాధిని' అని కృష్ణునకు సాగిలిబడి మ్రొక్కెను. కృష్ణుడాతనికి వజ్రమును తిరిగి యొసంగి పారిజాతమును కూడ ఈయజూపెను. కాని పశ్చాత్తప్తుడైన

ఇంద్రుడు 'నీవు భూలోకమున నుండునంత కాలము పారిజాతముకూడ భూమిపైనుండగల'దని పలికెను. సత్యాకృష్ణులు ద్వారకకరుదెంచిరి. కృష్ణుడు పారిజాతమును సత్యపెరటిలో నాటెను. పారిజాతసౌరభావేశము వలన ద్వారకయందలి రోగులు, వికలాంగులు స్వస్థశరీరులైరి. జనులందరు సిరిసంపదలతో తులతూగుచుండిరి.

పిమ్మట నొకదినమున నారదుడు మరల సత్యామందిరమున కరుదెంచి పారిజాతలాభమునకు తగినట్లుగ పుణ్యకవ్రతమాచరింపుమని సత్యను ప్రోత్సహించి తద్వ్రతవిధానముపదేశించెను. సత్య యథావిధిగ పుణ్యకవ్రతము నాచరించి, వ్రతోద్యాపనవిధి ననుసరించి కృష్ణుని పారిజాతమునకు కట్టివైచి నారదునకు దానమొసంగెను. నారదుడు వినోదార్థము కృష్ణుని సేవలు గైకొనెను. పిమ్మట సత్య తన నగల నన్నింటిని నిష్క్రయముగ నారదున కొసగి కృష్ణుని తిరిగి పొందెను. నారదుడు కృష్ణుని స్తుతించి యరిగెను. కృష్ణుడు పత్నులతో సుఖముగా నుండెను.

అనుబంధము - 2

## రుద్రభట్టి జగన్నాథవిజయము నందలి పారిజాతాపహరణ కథ

[12, 13, 14 అశ్వా.]

శ్రీకృష్ణుడు నరకుని సంహరించి వాని చెరలోనున్న పదునారువేలమంది కన్యలను పెండ్లియాడి వారిని ద్వారకకు పంపివేసెను. తాను సత్యాద్వితీయుడై అమరావతి కేగి అదితికి కుండలములు సమర్పించి ద్వారకకరుదెంచి భార్యలతో సుఖముగా నుండెను. రుక్మిణ్యాదులకు ప్రద్యుమ్నాది కుమారులు కలిగిరి. తరువాత నొకప్పుడు రుక్మిణి పుణ్యకవ్రతము నాచరించుచుండగా కృష్ణుడామెకు సన్ని

హితుడై యుండెను. ఆ సమయమున నారదుడరుదెంచి కృష్ణున కొక పారిజాత పుష్పమును కానుకగా నొసంగెను. కృష్ణుడు దానిని రుక్మిణి కొసగెను. ఆమె దానిని ధరించెను. అపుడు నారదుడు రుక్మిణి అదృష్టమును ప్రశంసించుచు సత్యను తీవ్రముగాదూషించెను. ఈ వార్తను వినిన సత్య కోపించి కోపగృహమును ప్రవేశించెను. కృష్ణుడు సత్యామందిరమున కేతెంచి ఆమె నెన్నోవిధముల ననునయించెను. చివరకు 'ఇంద్రుని గెలిచియైన పారిజాతమునుకొని తెచ్చి యొసంగెద'నని ప్రతిన గావించినమీాదట సత్య శాంతించెను.

అంతలో నారదుడు సత్యామందిరమున కరుదెంచెను. కృష్ణుడు, సత్య అతసిని పూజించిరి. నారదుడు నాటిరాత్రి దేవేంద్రుడు గావింపనున్న శివపూజామహోత్సవమును చూచుటకు తాను పోవలసియున్నానని తెలిపి, ఆ ప్రసంగవశమున 'నేను ఈ ఉదయము నీకొసంగిన పారిజాతము ఇంద్రుడు నాకొసంగిన ఉత్సవనిమంత్రణ పుష్పమే'నని తెలిపెను. అంతట కృష్ణుడు ఆ పుష్పము కారణముగను, ఆ సమయమున నారదుడాడిన మాటల కారణముగను సత్య అలుగుట, తానామెను అనేక విధముల ననునయించుట, చివరకు పారిజాతమును తెచ్చియిచ్చెదనని సత్యకు వాగ్దానము చేయుట మొదలగు విషయములన్నియు నారదునకు వివరముగ తెలిపెను. 'నీవట్లు ప్రతిన చేసియుండరాదు. ఇంద్రుడు పారిజాతము నొసంగడు. పూర్వమొకప్పుడు పరమేశ్వరుడే కోరినను ఇంద్రుడు పారిజాతము నొసగలేదు' అని నారదుడనెను. ఇంకను ఇంద్రుని గర్వమును, అతనికి కృష్ణునెడగల తిరస్కార భావమును అతిశయోక్తులతో చెప్పి కృష్ణునకు తీవ్రమగు రోషమును తెప్పించెను. కృష్ణుడు 'అట్లయినచో రేపటి యుదయమే నేను ఒంటరిగానే నందనవనమున కరుదెంచి పారిజాతము నపహరింప బోవుచున్నాను. ఈ విషయమును నీవుముందుగ నేగి ఇంద్రునకు తెలిపి, తన బలమునంతటిని సమీాకరించుకొని

నన్నెదిరించుటకు సిద్ధముగ నుండునట్లు చెప్పు'మని కృష్ణుడు నారదుని పంపివేసెను.

మరునాటి యుదయము కృష్ణుడు సత్యాద్వితీయుడై గరుడు నెక్కి నందనవనమున కేగి పారిజాతమును పెల్లగించి గరుడునిపై నుంచెను; అడ్డగించిన వనపాలకులను చీల్చిచెండాడెను. హతశేషులైన వనపాలకులు ఈ వార్తను శచీదేవికి తెలిపిరి. ఆమెయు కొలువుకూటమందున్న ఇంద్రుని సమీపించి పారిజాతాపహరణ వార్తను తెలిపి కృష్ణునితో యుద్ధమునకై ఆతనిని ప్రోత్సహించెను. 'పరమేశ్వరుడైన కృష్ణునితో విరోధము వలదు. అతనికి పారిజాతమును సమర్పించుటే మేలు' అని బృహస్పతి ఇంద్రునకు హితవు తెలిపెను. కాని నారదుడు అత్యంత తీవ్రములగు పౌరుషోక్తులతో శచీంద్రులను ప్రేరేపింపగా ఇంద్రుడు యుద్ధమునకే సిద్ధపడెను. దిక్పాలురును, తదితర దేవతావీరులందరును ఇంద్రునకు సాయముగా యుద్ధమున కరుదెంచిరి.

కృష్ణుడు పరాక్రమమున చెలరేగి సురవీరులను చెల్లాచెదరు గావించెను. నారదుడు మింటిపైనుండి దేవేంద్రుని పురికొల్పి ఆతనిని మరల యుద్ధోన్ముఖునిగావించెను. ఇంద్రుడు కృష్ణునిపై ప్రయోగించు అస్త్రములనన్నింటిని కృష్ణుడు ప్రత్యస్త్రశస్త్రములతో వమ్ము గావించుచుండెను. ఈలోగా శచీసత్యలు కొంత వాగ్యుద్ధము గావించిరి. అందు శచికే పరాజయము ప్రాప్తించెను. అంతట ఇంద్రుడు కృష్ణునిపై తన వజ్రాయుధమును ప్రయోగించెను. కృష్ణుడు దానిని మిణుగురుపురుగును పట్టినట్లు పట్టివేసెను. ఇంద్రుడు అప్పటికిని వెనుదీయక ఐరావతమును కృష్ణునిపైకితోలెను. గరుడుని రెక్కల గాడ్పునకు ఐరావతము పారియాత్రముపై పోయి పడెను. అంతట ఇంద్రుడు దీనుడు కాగా కృష్ణుడు సకారుణ్యదయ్యెను.

అపుడు బిల్వోదకేశ్వరుడను శివుడు సాక్షాత్కరించి 'సుర రక్షకుడవు కావలసిన నీవు సురలతో పోరాడుట తగవు కాదు' అని కృష్ణుని మందలించి 'షట్పురాసురులనువధించి సురలకు మేలుచేయుమ'ని ఆదేశించెను. కృష్ణుడందుల కంగీకరించి పారిజాతముతో ద్వారక కరుదెంచెను.

అనుబంధము - 3

## పారిజాతకథా పరిణామము

పారిజాతాపహరణమును ఇతివృత్తముగాగొని సంస్కృతము లోను, తెలుగులోను, కన్నడములోను ఎందరో కవులు ఎన్నో పురాణములను కావ్యములను రచించియున్నారు. వీరిలో కొందరు రుద్రభట్ట తిమ్మనలకంటె ప్రాచీనులు, కొందరు అర్వాచీనులు. పారిజాత కథ కాలక్రమమున అనేకములగు మార్పులకు, చేర్పులకు లోనగుచు వచ్చినది. ఇప్పుడు ఆయాభాషలలో వెలువడిన పారిజాతకథా కథనాత్మక గ్రంథములను, పారిజాతకథలో కాలక్రమమున కలిగిన పరిణామమును పరిశీలింతము. ఆయాకృతులకును రుద్రభట్ట తిమ్మనల కృతులకును గల సంబంధమును - అనగా తమకంటె ప్రాచీనములైన పారిజాతకథాకృతులను వీరిరువురు ఎంతవరకనుసరించియున్నారు ? వీరి కావ్యములను వీరితర్వాతి కవులెంతవరకు అనుసరించియున్నారు ? అను అంశమును కూడా పరామర్శింతము.

సంస్కృతము

### 1. హరివంశము తొలికథ

(విష్ణుపర్వము - 64వ అధ్యాయము)

శ్రీకృష్ణుడు సత్యభామాసహితుడై ప్రాగ్జ్యోతిషనగరమున కేగి నరకుని సంహరించి వాని చెరలోనున్న పదునారువేలమంది

గంధర్వకన్యలను ద్వారకకు పంపి, తాను సత్యాసహితుడై అదితికి కుండలములు సమర్పించుటకై గరుడారూఢుడై అమరావతి కేగెను. ఇంద్రాదులచే సత్కృతుడై, అదితికి నమస్కరించి కుండలముల నొసగి. ఆమెచే దీవింపబడి కృష్ణుడు సత్యాసహితుడై నందన వన విహారము గావించెను. అచటగల పారిజాతవృక్షమునుగాంచి కృష్ణుడు వెంటనే దానిని పెల్లగించి గరుడునిపై నిడుకొని ద్వారకామార్గము పట్టెను. నందనవన పాలకులీ వార్తను దేవేంద్రునకు తెలిపిరి. దానికి ఆ దేవేంద్రుడు, 'కృష్ణుడు మనకు చాలా మేళ్ళు చేసియున్నవాడు అని చెప్పి కృతజ్ఞతాగుణబద్ధుడై కృష్ణుని అడ్డగింపక మిన్నకుండెను. కృష్ణుడు పారిజాతముతో సుఖముగా ద్వారక చేరెను.

మహాభారతము (VII-౧౦-22, 23) లో కూడా పై కథయే 1 శ్లోకములో అత్యంత సంగ్రహముగా నున్నది.

## 2. హరివంశము మలికథ

(విష్ణు పర్వము - 65-81 అధ్యాయములు)

ఒకప్పుడు రుక్మిణి ఏదో ఉపవాసవ్రతము నాచరించు చుండెను. కృష్ణుడు ఆమె ఇంటనే ఉండెను. అప్పుడు నారదుడరు దెంచి కృష్ణునకొక పారిజాత పుష్పము నొసగెను. కృష్ణుడు దానిని రుక్మిణి కొసగెను. ఆ సందర్భమున నారదుడు రుక్మిణిని పొగడుచు కొలదిగ సత్యను నిందించెను. ఈ సంగతిని వినిన సత్య కుపితయై కోపాగారమును ప్రవేశించెను. కృష్ణుడు సత్యామందిరమున కేగి ఆమెను ఎన్నోవిధముల అనునయించెను. చివరకు పారిజాతవృక్ష మునే తెచ్చి యొసంగుదునని వాగ్దానము గావించిన పిదప సత్య శాంతించెను. అంతలో నారదుడు కూడ సత్యామందిరమున కరు దెంచెను. కృష్ణుడు నారదున కాతిథ్యమొసగెను. పిదప నారదుడు ఆరాత్రి దేవలోకమున జరుగనున్న మహేశ్వర పూజోత్సవమును దర్శించుటకై తానేగుచున్నానని తెలిపెను. మాటలో మాటగా

తాను తెచ్చిన పారిజాతపుష్పము తనకింద్రుడొసగిన నిమంత్రణ పుష్పమేయని చెప్పెను. పారిజాత వృక్షోత్పత్తిని, తన్మహిమను వర్ణించి ఆ వృక్షముతో అదితి. శచి మొదలగువారు పుణ్యకవ్రత మాచరించిరనియు తెలిపెను. కృష్ణుడు తన భార్యలు కూడ పుణ్యక వ్రతము నాచరింపగోరుచున్నారు గాన తనకు పారిజాతవృక్షము నొసంగుమని దేవేంద్రునకు తన సందేశమును గొనిపొమ్మని నార దుని కోరెను. 'దేవేంద్రుడు వృక్షమునీయ'డని నారదుడనెను. 'అట్లైన ఇంద్రుని వక్షమును నా గదతో మోది పారిజాతమును గైకొని వత్తు'నని కృష్ణుడు ప్రతిన గావించెను. కృష్ణునకు పారిజాతము నొసగుమని నారదుడు చేసిన హితోపదేశమును ఇంద్రుడు తిరస్కరించెను. ఆ సంగతిని నారదుడు మరల ద్వారకకు వచ్చి కృష్ణునకు తెలిపెను.

మరునాటి ఉదయము కృష్ణుడు మృగయావ్యపదేశమున రైవతకాద్రికేగి అటనుండి సాత్యకిప్రద్యుమ్న సహితుడై అమరావతి కేగెను. కృష్ణుడు సాత్యకి గరుడుని అధిరోహింపగా, ప్రద్యుమ్ను డొకరథమెక్కి వారిననుసరించెను. వారు నందనమును ప్రవేశించిరి. కృష్ణుడు పారిజాతమును పెకలించి గరుడునిపై నిడుకొని అమరావతికి ప్రదక్షిణ మాచరింపసాగెను. ఈ సంగతిని వనపాలకులు ఇంద్రునకు తెలిపిరి. ఇంద్రుడు జయంతుని, ప్రవరుడనునొక బ్రాహ్మణవీరుని సహాయముగగొని ఐరావతారూఢుడై యుద్ధమున కరుదెంచెను. ఇంద్ర కృష్ణులకు, ప్రద్యుమ్న జయంతులకు, సాత్యకి ప్రవరులకు యుద్ధ మయ్యెను. ఇంద్రుడు గరుడుని వజ్రముతో పలుమార్లు కొట్టెను. గరుడుడు ప్రేటునకొక ఈకను రాల్చెను. గరుడుడు ముక్కుతో విదిలింపగా ఐరావతము పోయి పారియాత్ర పర్వతముపై పడెను. కృష్ణుడు గరుడునితో పారియాత్రముపై వ్రాలగా గరుడుని భారము నకు పారియాత్రముక్రుంగిపోయి శాణపాదమాత్రమయ్యెను. కృష్ణుడు

గనుడుని ఆకాశమున నిలిపి, ప్రద్యుమ్నుని రైవతకాద్రికి పంపి దారుకసారథికమగు తన రథమును తెప్పించుకొనెను. మరల కొంత యుద్ధము జరిగిన పిమ్మట సూర్యాస్తమయమయ్యెను. 'ఐరావతము అలసియున్నది గాన నేటికి యుద్ధము విరమించి, రేపటి యుదయము తిరిగి యుద్ధమారంభింత'మని చెప్పి కృష్ణుడు ఇంద్రుని పంపివైచెను.

వాటిరాత్రి కృష్ణుడు పారియాత్ర పర్వతముపై బిల్వోద కేశ్వరుడను ఈశ్వరుని పూజించెను. ఈశ్వరుడు 'నీకు పారిజాతము లభింపగల'దని వరమొసగి, 'షట్పురాసురులను రాక్షసులను వధించి దేవతలకు మేలుచేయు'మని కృష్ణునాదేశించెను. మరునాటి ఉదయము తిరిగి ఇంద్రోపేంద్రులు యుద్ధసన్నద్ధులై నిలచిరి. ఇంతలో బృహస్పతి వలన ఈ వృత్తాంతమును తెలిసికొనిన అదితికశ్యపులు అడ్డుపడి యుద్ధమును విరమింపజేసిరి. 'పారిజాతమును కొనిపోయి నీ భార్యలచే పుణ్యకవ్రతము నాచరింపజేసిన తరువాత, దానిని తిరిగి నందనమున తెచ్చి స్థాపింపు'మని అదితి కృష్ణునాదేశించెను. కృష్ణుడందులకంగీకరించెను. ఆరాత్రి త్రివిష్టపమున ఇంద్రున కతిథియై యుండి, మరునాడు సత్యకొరకై శచీదేవి యొసంగిన ఆభరణములు గైకొని కృష్ణుడు ద్వారక కరుదెంచెను. పారిజాత సౌరభావేశము వలన ద్వారకయందలి వికలాంగులు, రోగులు స్వస్థశరీరులైరి. వృద్ధులు తరుణులైరి.

సత్యభామ పుణ్యకవ్రతమాచరించెను. కృష్ణుని పారిజాత వృక్షమునకు కట్టివైచి నారదునకు దానమొసగెను. మరల నారదునకు ఒక కపిలధేనువును, వత్సమును, తిలకాంచనయుతముగ కృష్ణాజినము నొసంగి కృష్ణుని తిరిగి పొందెను. రుక్మిణ్యాది మహిషులును నారదుని వలన పుణ్యకవ్రతమాహాత్మ్యమును తెలిసికొని తాము

కూడ ఆ వ్రతము నాచరించిరి. ఒక సంవత్సరమైన పిమ్మట కృష్ణుడు పారిజాతమును అమరావతికి గొనిపోయి దానిని నందనవనమున యథాస్థానమున పునః ప్రతిష్ఠించెను.

## 3. హరివిజయము

౭వ శతాబ్ది వాడైన సర్వసేనుడు అను రాజకవి రచించిన హరివిజయమను ప్రాకృత కావ్యములో కృష్ణుడు పారిజాతము నపహరించుటకు కారణము తన భార్య కోరిక తీర్చుటయే అను విషయము తొలిసారిగా కనిపించుచున్నదని 'ఆనందవర్ధన అభినవ గుప్తులు తెలిపియున్నారు. కావ్యమలభ్యమగుటచే ఇంతకంటె వివరములు తెలియవు.

## 4. విష్ణుపురాణము

[పంచమాంశ, 29, 30, 31 అధ్యా]

కృష్ణుడు నరక వధానంతరము వాని చెరయందున్న పదునారు వేలమంది కన్యలను ద్వారకకంపి, అదితికి కుండలముల నొసంగుటకై తాను సత్యాసహితుడై గరుడు నధిరోహించి అమరావతి కేగెను; ఇంద్రాదులచే సత్కృతుడై అదితిని దర్శించి నమస్కరించి ఆమెకు కుండలములు సమర్పించెను. అదితి కృష్ణుని స్తుతించి సత్యాకృష్ణులను దీవించెను. పిదప శచీదేవి తన కతిథియైన సత్యభామను యథార్హముగా గౌరవింపదయ్యెను. పారిజాత పుష్పములతో తాను అలంకృతయగుచు 'మనుష్యకాంత యగుటచే సత్య ఈ దివ్యపుష్ప ధారణకు అనర్హు'రాలని పలికెను. తరువాత సత్యాకృష్ణులు నందన విహారముచేయుచు పారిజాతవృక్షమును గాంచిరి. సత్యభామ తన సపత్నులకంటె తన ఆధిక్యము వెల్లడియగుటకై తనకా వృక్షము కావలెనని కోరెను. కృష్ణుడు దాని నుత్పాటించి గరుడునిపై

నుంచెను. ఇంతలో నందనవనపాలకు లరుదెంచి కృష్ణుని బెదరింప సాగిరి. సత్య తానే వారికి తగుసమాధాన మొసంగి 'శచీదేవి తన భర్త చేత పారిజాతమును విడిపించుకొనుగాక' యని పంతగించి పలికెను. వనపాలకులు శచీదేవి కావృత్తాంతమును తెలిపిరి. ఆమె ఇంద్రుని యుద్ధమునకై ప్రోత్సహించెను. ఇంద్రుడు దిక్పాలక సమేతుడై వచ్చి కృష్ణునితో పోరసాగెను. కృష్ణుని పరాక్రమము నెదుట నిలువలేక సురవీరులు పారిపోయిరి. అంతట ఇంద్రుడు కృష్ణునిపై వజ్రాయుధమును విసరెను. కృష్ణుడు దానిని సవిలాసముగా పట్టివేసెను. తన ప్రధానాయుధము నిర్వీర్యమగుటతో పలాయన పరాయణుడైన ఇంద్రుని సత్యభామ పరిహసించి, శచీదేవి గర్వము నణచుటకే తానిట్లు గావింపవలసివచ్చినదని తెలిపి, పారిజాతమును తిరిగి ఈజూపెను. కృష్ణుడు కూడ ఇంద్రుని క్షమాపణకోరి వజ్రమును తిరిగి ఇచ్చివేసి పారిజాతమును కూడ ఈయజూపెను. కాని దేవేంద్రుడు పారిజాతమును తిరిగి గైకొనక 'నీవు భూలోకమునందుండునంత కాలము పారిజాతము కూడ భూమిపైననే ఉండగలదని చెప్పెను.

కృష్ణుడు సత్యాపారిజాతసహితుడై ద్వారక కరుదెంచి పారిజాతమును (సత్యా) గృహోద్యానమున ప్రతిష్ఠించెను. జనులందరు పారిజాతమును గాంచి యానందించిరి. దానిని సమీపించిన వారందరకు పూర్వజన్మస్మృతి కలిగెను.

తరువాత కృష్ణుడు ఏకకాలమున పదునారువేలమంది కన్యలను పెండ్లియై సుఖముగా నుండెను.

భాగవతమందీ కథ సంగ్రహముగా మూడు శ్లోకములలో నున్నది. (X-౫-౬-39-41) శచీకృతసత్యావమానము, సత్యాగర్వోద్ధతోక్తులు ఇందు లేవు.

## 5. పద్మపురాణము

ఉత్తరఖండము (౨౭౬-74-111)

పద్మపురాణమున పారిజాతాపహరణ కథ సంగ్రహముగా 38 శ్లోకములలో చెప్పబడియున్నది. ఇందలి కథ విష్ణుపురాణపు కథయే. సత్య నందనవనపాలురతో గర్వోద్ధతోక్తులు పలుకుటయు, పలాయమానుడగు ఇంద్రుని పరిహసించుటయు అను సంశము లిందు లేవు. ఇంద్రుడు ఓటమి యనంతరము "దివ్యమహీరుహముఃను భూలోకమునకు గొనిపోవుట నీకు సంభావ్యమా ?" అని కృష్ణుని ప్రశ్నింపగా, శచీదేవి సత్యకు గావించిన అనుమానమునకు ప్రతీకారముగ తానీపని చేయవలసివచ్చినదనియు, తాను సత్యకు పారిజాతమును వాగ్దానము గావించియుండుటచేత దానినిపుడు తిరిగి ఇంద్రున కొసంగుటకు వీలులేదనియు, తాను స్వర్గమున కేగిన పిమ్మట ఇంద్రుడు పారిజాతమును తిరిగి తీసికొని పోవచ్చుననియు కృష్ణుడుసమాధానము చెప్పినట్లు పద్మపురాణము చెప్పుచున్నది. మన కవులిరువురును చెప్పిన కథావిధానమును బట్టి వారు ఈ కథ ననుసరింపలేదనుట స్పష్టము.

## 6. భాగవతము (అధిక పాఠము)

'విజయ ధ్వజతీర్థ' (15వ శతాబ్దం-ఉత్తరార్ధము) అను మాధ్వయతి భాగవతమునకు 'పదరత్నావళి' అను వ్యాఖ్యను రచించి యున్నారు. (1) వారు స్వీకరించిన భాగవత పాఠములో పారిజాతకథ

---

(1) "పదరత్నావళీ" సహిత భాగవత హస్తలిఖిత ప్రతియొకటి తంజావూరు సరస్వతీమహల్ గ్రంథాలయములో Des. Cat. No. 9939గా ఉన్నది. అందలి దశమస్కంధ ఉత్తరభాగము 65, 66, 66 అధ్యా. లలో ఈ కథ కలదు.

3 అధ్యాయములుగా (65, 76, 67) 153 శ్లోకములలో విస్తరింపబడి యున్నది. విష్ణుపురాణ మునందున్న విశేషాంశములన్నియు ఇందును చెప్పబడినవి. సత్యభామ శ్రీకృష్ణుని చేతినుండి శార్ఙ్గమును తీసికొని కొంతసేపు తానే దేవేంద్రునితో పోరాడినట్లు ఇందొక నూతనాంశము కూడ చేరియున్నది. మనకవులిరువురు ఈనూతన కల్పనను స్వీకరించినవారు కారు.

## 7. కార్తీక మహాత్మ్యము (1, 2 అధ్యా.)

'పద్మపురాణము నందలి బ్రహ్మఖండాంతర్గత మయిన కార్తిక మహాత్మ్యము' అని యొక గ్రంథము కలదు. ఇందు పారిజాతాపహరణా సంగర వృత్తాంతమిట్లున్నది : పారిజాతమును కృష్ణుడు సత్య పెరటిలో నాటిన తరువాత ఆమె అతని నిట్లడిగినది 'ఏ పూర్వపుణ్యముచేత అనితరలభ్యమైన పారిజాతము నాకు లభ్యమైనదో దయచేసి నాకు తెలుపుము' అపుడు శ్రీకృష్ణుడు ఆమె పూర్వజన్మవృత్తాంతము నిట్లు తెలిపినాడు "కృతయుగాంతమున మాయాపురమున ఆత్రేయ గోత్రజుడు, సూర్యోపాసకుడునగు దేవశర్మ అను విప్రుడుండెను. అతడు తన ఏకైక కుమార్తెయగు గుణవతిని తన శిష్యుడైన చంద్ర శర్మ కిచ్చి వివాహము గావించి కూతును, అల్లుని తనయింటనే యుంచుకొనెను. ఒకనాడు అడవిలో ఇధ్మసేకరణ గావించుచున్న మామఅల్లుండ్ర నిరువురను ఒక రాక్షసుడు భ్రమింగెను. వారికి వైకుంఠము లభించెను. పిదప గుణవతి వారికి అపరకర్మలు గావించి, కార్తికవ్రతములు గావించుచు వృద్ధురాలై గంగలో స్నానము గావించువేళ మరణించెను. ఆమెకును వైకుంఠము లభించెను దేవశర్మయే సత్రాజిత్తుగను, గుణవతియే నీవుగను, చంద్రశర్మయే

అక్రూరుడుగను జన్మించియున్నారు. ఆ జన్మలో నీవు నా ఆలయ ప్రాంగణములో నాటిన తులసిమొక్కయే పారిజాతము" (2)

మన కవులిరువురును ఈ చిత్రమైన కథను చూచియుండరు అథవా చూచియున్నను దానికి తమ కావ్యములో స్థానమొసగుటకు ఒప్పరైరి.

## 8. భోజుడు (836 A. D. - 885 A. D.)

తన శృంగార ప్రకాశికలో 'పారిజాతాపహరణము' నుండి ఒక శ్లోకము నుదాహరించినాడు. ఆ కావ్యరచయిత ఎవరో తెలియదు. కావ్యమలభ్యము.

## 9. కవిరాజపండితుడు (1195 ప్రాంతము)

పారిజాతాపహరణము :

ఇతని నిజనామధేయము మాధవభట్టు. జయంతిపురమును పాలించిన కాదంబవంశీయుడైన కామదేవుని (1182 - 97) ఆస్థానమందుండినవాడు. ఇతడు 10 సర్గలలో పారిజాతాపహరణ మహాకావ్యమును రచించియున్నాడు. (3)

కవిరాజపండితుడు విష్ణుపురాణోక్తకథనే అనుసరించినాడు. అతడు వర్ణనల పెంపకము గావించినాడే గాని కథలో చెప్పదగిన చేర్పులను గాని మార్పులనుగాని చేసియుండలేదు. సత్యాకృష్ణులు

---

(2) ఈ కార్తిక మహాత్మ్యపు వ్రాత ప్రతియొకటి తంజావూరు సరస్వతీమహల్ లైబ్రరీలో Des. Cat. No. 9597 గా నున్నది.

(3) ఈ గ్రంథపు శిథిలహస్తలిఖిత ప్రతియొకటి మదరాసు ప్రాచ్యలిఖిత గ్రంథాలయమునR. No. 2961 గా నున్నది.

అమరావతిలో ఒకరోజు నిద్రించిరనుట కవిరాజపండితుని కల్పన. 6వ సర్గ నంతటిని ఆక్రమించిన సూర్యాస్తమయ, అంధకార, చంద్రోదయ, సూర్యోదయ వర్ణనలకు అవకాశము కలిగించుకొనుటకై అతడీ పెంపకము గావించియున్నాడు.

రుద్రభట్టు కవిరాజపండితుని గ్రంథమును చూచియున్నట్లు లేదు. గరుడునిపై నెక్కి అమరావతి కేగుచు వియత్పథము నుండి భూమిని సత్యకు చూపుచు కృష్ణుడు 'ఈ విశ్వమంతయు నాసృష్టియే' అని చెప్పినట్లు రుద్రభట్టొక పద్యమును వ్రాసియున్నాడు. ఈ పద్యమునకు స్ఫూర్తిని రుద్రభట్టు కవిరాజు కావ్యమున ప్రథమ సర్గాంతమున గల 'కృష్ణుడు సత్యకు భూమిని చూపి వర్ణించు' సందర్భము నుండి పొంది యుండునను ఊహకు అవకాశము కలదు. కాని కవిరాజు కావించిన వర్ణనలలో దేనిని గాని రుద్రభట్టు స్వీకరింపలేదు. రుద్రభట్టు కృష్ణునిచే చెప్పించిన 'ఈ విశ్వమంతయు నా సృష్టియే' అను భావము కవిరాజు కావ్యములో లేదు. అందుచే ఆ పద్యము రుద్రభట్టు సొంతకల్పనయే యనియు, అతడు కవిరాజు కావ్యమును చూచియుండడనియు నమ్మవలసియున్నది.

తిమ్మన తన కావ్యమునకు ఇతివృత్తమును హరివంశ విష్ణు పురాణములనుండి గైకొనినను, వర్ణనలకు స్ఫూర్తిని ఈ కవిరాజ పండితుని గ్రంథము నుండియే పొందియున్నట్లు తోచుచున్నది. కథ ఎత్తుగడలోనే ఇరువురికి స్పష్టమగు పోలిక కనుపించుచున్నది. 'హరి నరకాసురుం గెలిచి......' (I 37) అనుచు తిమ్మన కథను ప్రారంభించినాడు. కవిరాజ పండితుని కథా ప్రారంభము కూడ సరిగ నట్లే యున్నది. ఆతని కావ్యమందలి తొలి శ్లోకమిది :

'అథాజభూమా భువనైక భీమం విజిత్య భౌమం సహసత్యభామః
సురప్రసూతిం మణికుండలాభ్యాం దేవీం పరిష్కర్తుమియేష శౌరిః'
(I 1)

శ్రీకృష్ణుడు సత్యకు మేరువును, అమరావతిని చూపి వర్ణించుట, అమరావతీ పౌరకాంతలు నగర ప్రవేశముచేయు కృష్ణుని గవాక్షముల నుండి చూచుట, వారి విభ్రమచేష్టలు, సత్యాకృష్ణుల నందనవన విహారము, జలక్రీడ-అన్నియు తిమ్మన గ్రంథములో నున్న స్థానముననే ఈ కావ్యము నందును కలవు. సూర్యాస్తమయ, అంధకార, చంద్రోదయ, నిద్రావర్ణనలు, వైతాళికుల ప్రభాత గీతములు కూడ తిమ్మన గ్రంథములో వలె ఇందును ఒకే తావున చేయబడినవి. ఐన తిమ్మన గ్రంథములో ఈ వర్ణనలు కృష్ణుని అమరావతీ యాత్రకు క్రిందటిరాత్రి ద్వారకలో చేయబడగా, కవిరాజుకావ్యములో అమరావతిలో సత్యాకృష్ణులు విడిసిన నాటిరాత్రి చేయబడినవి. కవిరాజు అనుసరించిన కథాప్రణాళికలో దానికి అంతకంటె స్థానము లేదు. తిమ్మన ప్రయాణమునకు పూర్వపురాత్రి వర్ణనలు (II 29-76) విపులముగా చేసి, తరువాతి రాత్రి వర్ణనను సంగ్రహముగ (IV 42-49) చేసినాడు.

తిమ్మన వర్ణనాంశములకును, వర్ణన విధానమునకును కవిరాజునుండి స్ఫూర్తిని పొందియున్నను, అతని భావములను గాని, కల్పనలను గాని గ్రహింపక అన్నింటివి తన సొంతములనే కూర్చుకొనినాడు. ఐనను ఒకటి రెండుతావుల కొంత భావసామ్యము గోచరించుచున్నది.

1) కృష్ణునకు ఇంద్రుడు స్వాగతము చెప్పు సందర్భమున కవిరాజిట్లు ఉత్ప్రేక్షను కూర్చినాడు :

"వికీర్యమాణాంబుజ పత్ర విభ్రమైః
విలోచనై రచ్యుత మర్చయన్నివ". (III సర్గ.)

తిమ్మన కూడ ఇదే భావమును చెప్పియున్నాడు :

"... ... ... ... ... ... అంచితా
మోదవికాసవన్నయన ముగ్ధసరోరుహపంక్తిఁబూజల
త్యాదరలీలఁ జేయునమరాధిపు........." (III 6)

2) ఇంద్రుడును కృష్ణుడును కౌగిలించుకొనుట హరివంశ విష్ణుపురాణములలో చెప్పబడలేదు. కవిరాజు చెప్పియున్నాడు :

"ద్వయేన దోర్ణ్ణో ర్జగృహే జగత్పతిం
ససంభ్రమం జంభనిషూదనో ముదా" (III సర్గ)

తిమ్మన కూడ ఈ కౌగిటిని చెప్పినాడు :

"ఆదనుజాపహర్తయు...అమరాధిపుఁగౌఁగిటఁజేర్చె"
(III 6)

3) సత్యాకృష్ణులు దర్శించువేళకు అదితి మునిపత్నులచే సేవింపబడుచున్నదని కవిరాజు చెప్పుచున్నాడు.

"తత్రానువృత్తి చతురై ర్మునిబృందదారైః
ప్రస్తూయమాన బహుపుణ్య కథావినోదైః
ఆసేవ్యమానచరణా మరణిం సురాణాం
ప్రత్యర్ప్య కుండలయుగం ప్రణనామ శౌరిః" (III సర్గ)

హరివంశ విష్ణుపురాణములలో లేని ఈ మునిపత్నుల సేవను తిమ్మన కూడ చెప్పినాడు.

"పనిఁబూని యంతంత వినయావనతవృత్తి
సప్తర్షి కాంతలు సంచరింప" (III 24)

కవిరాజు కల్పించిన 'కథావినోదము' కొరకై తిమ్మన సరస్వతీదేవిని కొనివచ్చినాడు.

"పార్శ్వభాగంబునఁ బంకేరుహాసను
కామినీరత్నంబు కతలుసెప్ప"

అదితిని కవిరాజు 'సురాణాం అరణిం' అని వర్ణించినాడు. తిమ్మన కూడ 'అమరమహాక్తికశుక్తి' అని దాదాపు అదే భావమును వెల్లడించినాడు.

4) అదితి కొసంగవలసిన కుండలములను కృష్ణుడు భద్రముగా ఉత్తరీయపు కొంగున ముడివైచికొని తెచ్చినాడని కవిరాజు కల్పన :

"బద్ధగ్రన్థిం సుచిరవిరహాత్ కించిదాసార్ద్రపాలిం (?)
ప్రత్యాముక్తం......తాటంకయుగ్మం." (III సర్గ)

తిమ్మన కూడా ఇట్లే చెప్పియున్నాడు.

"...భౌమనిశాటాహృత కుండల ద్వయము నాత్మసువర్ణ చేలాగ్రబంధనమునీడ్చి యొసంగ......... (III 25)

5) కవిరాజు కూర్చిన వైతాళిక గీతములలో నొకటిట్లున్నది :

ఏషోదరోచ్ఛ్వసిత కుట్మల జాలమార్గైః
అంభోజినీ సృజతి సంప్రతి భృంగమాలాం
రాత్రే రతీత ఘటికాగణనాయ పూర్వాం
పుంజీ కృతామివ పురందర నీలమాలామ్. (VI సర్గ)

తిమ్మన కూర్చిన వైతాళిక గీతములలో నొకటిట్లున్నది :

"కమ్మ కస్తురి గుళికలు తమ్మిలేదు
నిదురమంపునఁ బుక్కిట నించిమేలు
కాంచి వేకువనుమిసెనాఁ గమలముకుళ
కోటరంబుల నెలదేఁటికొదమలెగసె" (II 64)

కమలమును స్త్రీగా చెప్పువరకును, అందుండి తేంట్లు బయట పడుచున్న వన్నంతవరకును ఇరువురకును భావసామ్యము కలదు. ఆపైన గల ఉత్ప్రేక్షలు భిన్నములు.

6) పారిజాతోత్పాటనమును కవిరాజిట్లు వర్ణించినాడు :

"నిపీడ్య దోర్భ్యాం దృఢమాంసలాభ్యాం
గోవర్ధనోన్మూలన శిక్షితాభ్యాం
పురేవ కంసద్విప దన్తకాండం
శౌరిక్షితేరుర్వీరుహాజ్జహార." (VII సర్గ)

తిమ్మన కూడ ఈ సందర్భమున గోవర్ధనోన్మూలనమును స్మరించినాడు.

"... ... ... పారిజాతధరణిజాతంబు గోవర్ధనో
ద్ధరణ ప్రస్తుతమైన హస్తమునసుత్పాటించి..." (IV 53)

కంస ద్విపదంత కాండోత్పాటనమును తిమ్మన స్మరింపలేదు.

ఇట్టివే మరికొన్ని భావసామ్యములు కూడ కలవు. కనుక తిమ్మన ఈ కవిరాజపండితుని గ్రంథముచే వర్ణనలకు స్ఫూర్తిని పొందియుండునని నమ్మవీలగుచున్నది.

## 10. నారాయణ పండితుడు (1250 - 1350)

(పారిజాతహరణము) (4)

ఇతడు యమకభూయిష్ఠమును, అతిజటిలమునైన శైలిలో 'పారిజాతహరణము' అను మూడాశ్వాసముల కావ్యమురచించినాడు. ఇతడును విష్ణుపురాణకథనే అనుసరించినాడు. యమకచమత్కృతి

(4) ఈ గ్రంథము పూనాలో ముద్రితమైనదట. దీనికి టీకమాత్రము గల యొక శిథిలతాళపత్ర ప్రతి మదరాసు ప్రాచ్యలిఖిత గ్రంథాలయమున D 11860 గా నున్నది;

యున్నంతగా కథావర్ణనా చనుత్కృతిలేని ఈ క్లిష్టకావ్య ప్రభావము రుద్రభట్ట తిమ్మనలపై ఏమియునున్నట్లు కన్పట్టదు.

## 11. ఉమాపతి ఉపాధ్యాయ

(పారిజాతహరణము) (5)

ఇతడు హిందూపతి హరిహరుని (1304-1324) ఆస్థానకవి. మైథిలీ సంస్కృత మిశ్రభాషలో పారిజాతహరణమను ఏకాంక నాటికను రచించియున్నాడు. రుక్మిణీ మందిరమునకు నారదాగమనముతో కథను ప్రారంభించి పుణ్యకవ్రతముతో ముగించియున్నాడు.

రుక్మిణికి కృష్ణునిచే నారదుడు పారిజాతము నిప్పించు సమయమున అచటికి స్వయముగ సత్యయే అరుదెంచి చూచి, అలుకతో మరలిపోయినదని ఇతడు కల్పించినాడు. కోపాగారమున పవళించిన సత్యకు కృష్ణుడు పాదసంవాహన గావించును. సత్యా పాదప్రహారము లేదు. హరివంశములోవలె ఇందు సత్య తపస్సునకై కృష్ణుని అనుజ్ఞను కోరదు. పారిజాతమును తెచ్చి యొసంగనిచో చనిపోవుదునని బెదరించును. తరువాత హరివంశమందు వలెనే నారదదౌత్యము, ఇంద్రతిరస్కృతి కలవు. శ్రీకృష్ణుడు సాత్యకి ప్రద్యుమ్నసహితుడైగాక అర్జునసహితుడై అమరావతిపైకి దండెత్తిపోయి, ఇంద్రుని ఓడించి పారిజాతమును గైకొనివచ్చును. చివరకు సత్యతోబాటుగ సుభద్ర కూడ పుణ్యకవ్రతము నాచరించును. ఇవి ఈతడు గావించిన నూత్నకల్పనలు. శ్రీకృష్ణుని మూల్యముగ సత్య నారదునకు గోవు నొసంగినట్లు గల హరివంశ కథాంశమునే ఇతడును చెప్పినాడు.

(5) Jourual of the Bihar and Orissa Research Society, 1917 మార్చి సంచికలో SIr George Grierson K. C. I. E. గారి ఆంగ్లానువాదముతో ప్రకటింపబడినది.

ఉమాపతి రుద్రభట్టునకు అనంతరికుడు. కనుక ఈతనిని రుద్రభట్టు అనుసరించు ప్రశ్నయే లేదు. ఈతడు రుద్రభట్టును అను సరించిన సూదనలు కూడ కానరావు.

సత్య చనిపోవుదునవి బెదరించుట, కృష్ణుడు సత్యకు పాద సంవాహనము గావించుట అను అంశములలో తిమ్మన కావ్యమునకీ నాటికతో అల్పమైన భావచ్ఛాయాసామ్యము గోచరించుచున్నది. కాని అంతమాత్రమున తిమ్మన ఈ నాటిక ననుసరించినాడని చెప్ప లేము. మైథిలీ మిశ్రితమైన ఈ నాటికను తిమ్మన చదివియుండు అవకాశము తక్కువ. అత్యల్పమైన ఈ భావసామ్యమునకు 'సంవాదిన్యో మేధావినాం బుద్ధయః' అనునదే కారణము కావచ్చును.

## 12. కవికర్ణపూరుడు

(పారిజాతహరణము) (6)

ఇతని కాలము స్పష్టముగ తెలియదు. కాని 1498 లో హుసేన్‌షా వలన నాశనము గావింపబడిన కామాట పట్టణావైభవము నీతడు ప్రశంసించుటచే అంతకు పూర్వమే ఈ కావ్యరచన జరిగి యుండునని ఊహింపబడుచున్నది. ఇతడు 'పారిజాతహరణము'ను 18 సర్గల మహాకావ్యముగా రచించినాడు. ఇతడును హరివంశకథనే చాలావరకు అనుసరించినాడు.

కృష్ణునకు యుద్ధములో సహాయకుడుగ అర్జునుని చెప్పు చున్న ఈ కావ్యముపై ఉమాపతి ఉపాధ్యాయుల నాటిక ప్రభావము

---

(6) ఈ కావ్యమును దర్భాంగలోని Mithila Institute of Post-Graduate studies and Research in Snaskrit Learning వారు 1956లో ప్రకటించినారు.

కలదనునది స్పష్టము. కృష్ణుడు అమరావతిపైకి నౌకాసైన్య సమేతుడై దాడివెడలినాడనునది కవికర్ణపూరుని కల్పనలలోని కెల్ల ప్రధానమైనది. పారిజాతమును కోరుమని నారదుడే సత్యను ప్రోత్సహించుట, సాత్యకి దౌత్యము, హరివంశమందలి అదితి కశ్యపులకు మారుగ బ్రహ్మాదులు అడ్డుపడి ఇంద్రోపేంద్రుల యుద్ధమును నివారించుట అనునవి ఈతడు చేసిన ఇతరకల్పనలు.

రుద్రభట్ట తిమ్మనల పద్యములతో భావసామ్యము గల శ్లోకములు ఈ కావ్యములో చాలా కనుపించును. అంతమాత్రము చేత రుద్రభట్టు కావ్యమును కవికర్ణపూరుడనుసరించెనని గాని, లేక ఇతని కావ్యమును తిమ్మన అనుసరించెనని భావింపనక్కరలేదు. ఏల యనగా ఈ కావ్యత్రయమునకును సామాన్యములైన ఈ భావముల కన్నికట్కిని మూలములు హరివంశములో కలవు.

## 13. గోపాలదాసు (పారిజాతహరణము) (7)

'ఛందోమంజరి'ని రచించిన 'గంగాదాసు' తన తండ్రియైన గోపాలదాసు పారిజాతహరణ నాటకమును రచించినాడని తెలుపుకొనినాడు. కాని గ్రంథము అలభ్యము.

## 14. దివాకరుడు (పారిజాతహరణము) (8)

ఇతడు మొదట ప్రతాపరుద్రగజపతి ఆస్థానము నందును. తరువాత శ్రీకృష్ణదేవరాయల ఆస్థానమందును ఉండినవాడు.

---

(7) M. Krishamachriar, History of Classical Sanskrit Literature - Para 234.

(8) పైవలెనే

ప్రతాపరుద్రునిచేత 'కవిచంద్రరాయ' అను బిరుదమును పొందిన వాడు. ఇతడును ఒక 'పారిజాతహరణ' నాటకమును సంస్కృతములో రచించినాడట. ప్రస్తుతము గ్రంథము అలభ్యము. ఇతడు ప్రతాపరుద్రగజపతి కుమార్తెయైన అన్నపూర్ణాదేవి అరణపు కవిగనే కృష్ణదేవరాయల కొలువును ప్రవేశించియుండునని ఊహించుట సంభావ్యముగ నున్నది. అనగ రాయల కటకవిజయము పూర్తియైన తరువాతనే ఇతడు రాయల కొలువులో ప్రవేశించుటయు, ఈ నాటకమును రచించుట జరిగియుండవలెను. తిమ్మన కావ్యము కటక విజయము పూర్తికాక పూర్వమే రచింపబడినదని కాలనిర్ణయము గావించియున్నాము. (చూపుట (9) అయినచో ఈ దివాకరుని కృతి తిమ్మన కావ్యమునకు సంస్కృత నాటకీకరణమై యుండునని ఊహించుట సత్యదూరముకాబోదు.

## 15. శ్రీ కృష్ణదేవరాయలు - సత్యవధూప్రీణనము

తిమ్మన కాశ్రయదాతయైన ఈ ఆంధ్రభోజుడు తాను 'సత్యవధూప్రీణన'మను గ్రంథమును రచించియున్నట్లు ఆముక్తమాల్యదావీఠిక (I, 13)లో చెప్పికొనియున్నాడు. పేరునుబట్టి అది పారిజాతహరణకథయేయైయుండునని ఊహింపవీలగుచున్నది. గ్రంథమలభ్యమగుటచే ఊహయే శరణ్యము. రాయలకు పారిజాతహరణ కథపై మిక్కిలి ప్రీతికలదనుటకు ఆముక్తమాల్యదయందలి ఈ క్రింది పద్యము తార్కాణ. ఇది గోదాదేవితో ఆమె చెలికత్తెలు పలుకు మాట :

'దివిజద్రుప్రసవంబు గాంచిన సపత్నిం జూచి చూపోపకం
తపు జిల్గుంబనియంత సేసి మది నీర్ష్యాక్రోధముల్సందడిం
ప విరింబోక ద్రుమంబుగైకొని పతిన్మందన్నద్రమానెల్లఁ దే
నవధింబెట్టిన సత్యవీవహహా కాదా భామినీ-నాపుడున్( V74)

ఈ మాటకు ద్రావిడప్రబంధమునగాని, దివ్యసూరి చరిత్ర మున గాని ఆధారము లేదు. మరియొకసారి కూడ రాయలు, '...గోత్రభిద్ధ్రి మహారిదోశ్చండి మోత్పులకీ కృతాంగక సత్య...' (IV 288) అని ప్రయోగించియున్నాడు. తిమ్మన చిత్రించిన సత్యా పాత్ర సౌందర్యమునకు ముగ్ధుడైన రాయలీకల్పన గావించియుండును. 'సత్యావధూప్రీణనము' తిమ్మన కావ్యమునకు సంస్కృతీకరణమే మైయుండునని కూడ ఊహింపదగియున్నది. 'సత్యావధూప్రీణన' రచనా కాలమును గురించి మనకు ఇతమిత్థమని తెలియదు. కనుక రాయల కావ్యమే పూర్వరచనయై, తిమ్మన కావ్యమే దానికి అను వాదమో, అనుసరణమో యైయుండరాదాయని ప్రశ్న ఉదయించు అవకాశము లేకపోలేదు. కాని తిమ్మన తన ప్రభుని కావ్యమునే అనువదించియున్నచో అ విషయమును తప్పక చెప్పియుండెడివాడు. కృష్ణరాయలకే అంకితము గావింపబడిన పారిజాతాపహరణ కావ్య ములో అట్టి ప్రశంస తప్పక యుండెడిది. తిమ్మన అట్లు తెలిపి యుండకపోవుటచే రాయల కావ్యము కంటె తిమ్మనదే ముందరి రచన యనియే ఊహింపవలసియున్నది. కవితామాధుర్యమును బట్టియే గాక తన కాపురము నందలి కలతను పరిష్కరించుటకు కారణభూత మగుటచేత కూడ రాయలకీ కావ్యముపై ప్రత్యేకాభిమానమేర్పడి యుండును. కనుకనే ఈ 'అమ్మ తెచ్చిన విద్వాంసుని' (ఆముక్త మాల్యద (IV 69) కావ్యమును తాను స్వయముగ శ్రవ్యకావ్యముగ సంస్కృతీకరించి, తన ఆస్థాన కవియైన దివాకరునిచే దృశ్యకావ్యముగ సంస్కృతీకరణము గావింపజేసి యుండునని నమ్మదగియున్నది.

## 16. రఘునాథనాయకుడు - పారిజాతహరణము

ఇతడు తంజాపురము నేలిన (1600 - 1631) మరియొక శ్రీకృష్ణదేవరాయలు. ఈతడు ఆశువుగా పారిజాతహరణ కావ్య

మును చెప్పి తండ్రిచే కనకాభిషేకము చేయించుకొనినాడట, దానిని వ్రాయుటకు వ్రాయసగాండ్రకు చేతనైనది కాదట, [9] మన దుర దృష్టవశమున ఈ విద్వత్ప్రభుని కావ్యము కూడ నష్టమైనది.

## 17. కృష్ణాధ్వరి - నైషధపారిజాతము

ఇతడు రఘునాథనాయకుని ఆస్థానకవి. ఇతడు తెలుగులో రచించిన నైషధపారిజాతీయమను ద్వ్యర్థి కావ్యావతారికలో తానది వరకే మరియొక నైషధ పారిజాతీయమును రచించినట్లు చెప్పి యున్నాడు. అందుచేత అది అతడు సంస్కృతములో రచించినదై యుండునని ఒక ఊహ కలదు. గ్రంథమలభ్యము.

## 18. నవల్పాకం తాతాచార్య - పారిజాతహరణము

ఇతడు రఘునాథ నాయకుని గురువు. ఇతడు 5 అంకము లలో 'పారిజాతహరణ' నాటకమును రచించినాడు. [10] ఆ నాటక ప్రణాళిక ఇది :

ప్రథమాంకము : విష్కంభములో నారదుడు ప్రవేశించు చునే 'భూమండలం యుద్ధసంకులం భూయాత్' అని ప్రార్థన చేయును. కృష్ణునకును ఇంద్రునకును యుద్ధము కల్పింపవలెనని అతడు ఆలో

9 ఇది సంస్కృత కావ్యమేనా అనునది సందేహము. కృష్ణమాచారి మాత్రము ఇది సంస్కృతమేననుచున్నాడు.
చూ. History of Sanskrit Literature P. 237

10 తంజావూరు సరస్వతీమహల్ లైబ్రరీ జర్నల్ సంపుటి IX సంచికలు 1-5 లలో ప్రకటింపబడినది.

చించుచుండుననంతలో పారిజాతహరణము వలన యుద్ధము సంభవింప గలదని అశరీరవాణి పలుకును. బహుకాంతా వల్లభుడైన కృష్ణునకు ఒక్క పారిజాతపుష్పము నొసంగి కలహబీజమును నాటవచ్చునని అనుకొనుచుండునంతలో కృష్ణుడు రుక్మిణితో జూదమాడి సర్వస్వమును ఓడిపోయి, రుక్మిణీ మనోరథ పూరణమును పందెముగా నొడ్డి మరల ఓడిపోయియున్నట్లు కృష్ణుని తాంబూలకరండ వాహిని వలన తెలిసికొనును.

అంకములో నారదుడు కృష్ణుని కొక పారిజాతపుష్పమును సమర్పించును. కృష్ణుడు సత్యభామను తలచుకొని భయపడుచు, ఒకే పుష్పమును తెచ్చియిచ్చిన నారదుని లోలోపల శపించుకొనుచు, పందెము గెలుచుకొనియున్న రుక్మిణికి పుష్పము నొసగును. కొంత హాస్యప్రసంగము నడచిన పిమ్మట నారదుడు మాధ్యందిన స్నానపు నెపమున సత్యభామకు కోపము తెప్పించుటకై బయలుదేరును.

ద్వితీయాంకము : కృష్ణుడు సత్య ఇంటికి వచ్చుచు దారిలో సత్యాకరండవాహినియగు మదనమంజరి వలన సత్యాక్రోధ వృత్తాంతమును తెలిసికొని ప్రమదవన లతామండపములో మాలతి, మాధవి అను చెలికత్తెలచే శుశ్రూషింప బడుచున్న సత్యను శాంతింప జేయుటకై విదూషక సహితుడై బయలుదేరును.

సత్య తన చెలికత్తెలతో చేయు సంభాషణను విదూషక సహితుడైన కృష్ణుడు పొదరింట దాగియుండి వినుచుండును. సత్య తన పూర్వ ప్రణయ గాథలను స్మరించుచు సపత్నీనింద చేయును. ప్రసంగమున చెలి 'మాధవ' నామస్మరణ గావింపగనే కృష్ణుడు వారి యెదుటకు వచ్చును. ఆమె కోపకారణమును గ్రహించిన కృష్ణుడు రుక్మిణి యొద్ద నుండి పుష్పమును తెచ్చియిత్తుననును. సపత్నీ ఆముక్త పుష్పదాన ప్రసంగ కుపితయైన సత్య ముఖమును వస్త్రాచ్ఛాదితము

గావించుకొని సకుచోత్కంపముగా రోదించును; కృష్ణుడామెను కౌగిట జేర్చుకొని పారిజాత వృక్షమునే తెచ్చియిత్తునని వాగ్దానము చేయును. సత్య శాంతించును. ఇంతలో కంచుకి యరుదెంచి 'మహర్షులు తమ దర్శనార్థము వేచియున్నా'రని కృష్ణునకు తెలుపును.

తృతీయాంకము : కృష్ణుడు మునుల వలన నరకుని దుండగములు తెలిసికొని నరకవధను వాగ్దానము చేసి వారిని పంపివేయును. ఇంతలో నరకుని చెరలోనున్న యువతులచే పంపబడిన 'రాజహంసు' డను దూత వారి సందేశ పత్రికను చిత్రపటములను తెచ్చియిచ్చును. కృష్ణుడు మోహావిష్టుడగును. ఇంతలో మాధవి వచ్చి వెంటనే పారిజాతమును తేనందుకు సత్య పంపిన ఉపాలంభన పత్రిక నొసంగును. అంతలో సత్య స్వయముగనే వచ్చి తొందరచేయును. వెంటనే కృష్ణుడు సత్యాసహితుడై ప్రాగ్జ్యోతిషమున కేగుటకు నిర్ణయించుకొని నౌకాసైన్యపు ఏర్పాటున కాజ్ఞయొసంగును. ఒక నౌకలో సత్యా కృష్ణులు, విదూషకుడు నరకుని నగరమును చేరి సముద్రతీరమున విశ్రమింతురు.

చతుర్థాంకము : కృష్ణ నరకుల యుద్ధమును లంబకేశ, లంబాధర, శూర్పకర్ణులను రాక్షసులు వర్ణించుచుచుందురు. కృష్ణుడు నరకుని సంహరించును. దేవతలు కృష్ణుని స్తుతింతురు. కృష్ణుడు నరకుని చెరయందలి యువతులను విడుదల గావించును.

పంచమాంకము : గరుడునిపై సత్యాకృష్ణులును, మాయారథముపై ప్రద్యుమ్నుడును అమరావతికేగి, ఇంద్రుని ఓడించి పారిజాత సహితులై తిరిగివచ్చుచుందురు. ద్వారకకు చేరి కృష్ణుడు రాజకన్యలను పెండ్లియై నారదునిచే స్తుతింపబడును.

విష్ణుపురాణ హరివంశ కథలను సమన్వయపరచుటకు చేసిన ఒక ప్రయత్నము ఈ కథాప్రణాళికలో కనుపించుచున్నది. నరక

సంహారమునకై ఏగుచున్న కృష్ణుని సత్యభామ అనుసరింప నేల ? అను ప్రశ్నకు కూడ ఈ కథాప్రణాళిక చక్కని సమాధానము నొసగు చున్నది. నరకుని చెరలో నున్న రాజకన్యలు కృష్ణునకు ప్రణయ సందేశమును పంపుట. ఆ సందేశవాహకుని పేరు 'రాజహంసు'డగుట స్పష్టముగ కృష్ణాధ్వరి 'నైషధపారిజాతీయ' ద్వ్యర్థి కావ్య ప్రభావమే. సత్యాకృష్ణులు నరకునిపై దాడివెడలి నౌకాయానము గావించుట కవికర్ణపూరుని కావ్యప్రభావము కావచ్చును. ఇక విదూషక సహితు డైన కృష్ణుడు పొదలమాటున దాగియుండి సత్య తన చెలులతో గావించు సంభాషణను వినుచుండుట, 'మాధవ' నామస్మరణముతో వారి యెదుటకు ప్రవేశించుట వసుచరిత్ర ప్రభావమును సూచించు చున్నవి. సత్య చెలికత్తెయైన 'మాధవి' పేరు వలన అప్పటికే కూచి పూడి భాగవతుల భామాకలాపము బహుళవ్యాప్తినందినట్లు తెలియు చున్నది. తిమ్మన కావ్య ప్రభావమీనాటకముపై స్పష్టముగ కను పించుచున్నది.

ముఖ్యముగా నారదుడు వచ్చువేళకు కృష్ణుడు రుక్మిణితో జూదమాడుచుండెనను కల్పన తిమ్మనదే.

తిమ్మన పద్యములకు కొన్నింటికి భావసామ్యము గల శ్లోకములను గూడ ఈ నాటకమున గుర్తింపగలము.

సత్య కృష్ణునితోడి తన ప్రణయ గాథలను స్మరించుచు ఇట్లనుచున్నది :

"నీల స్తంభ నిలీనో ఘనాంధకారే గూహన వివరే
యద్గృహీతో ఝటితి మయా మమ కరసంస్పర్శ రోమహర్షైః"

(2వ అంకము)

పై శ్లోకమునకు స్ఫూర్తి నొసగినది తిమ్మన సీసపద్యపాదము.

"కృతకాద్రి కందరాకేళీ నిగూహన
వేళాపరస్పరాన్వేషణములు." (పారి. I 95)

గూహన, నిగూహన శబ్దముల సామ్యము గూడ గమనింప దగినది. ఇదే సందర్భమందలి మరియొక శ్లోకము :

"పాదాహతావపి మమైవ పదప్రమాద
మాశంక్య యేన పదసంవహనం కృతం యత్
తన్మామతి త్రపయతే సఖి, తస్య దాసీ
పాదాభిఘాత సుఖితా (?) సవిధే పరాసాం."

పై శ్లోకము నందలి 'పాదాహతి' ప్రసంగమునకు మూలము ప్రసిద్ధమగు 'జలజాతాసన...' పద్యమేననుట స్పష్టము. ఇక కృష్ణ కృత సత్యాపాద సంవహనమునకు స్ఫూర్తి నొసగినది 'నను భవదీయ దాసుని...' అను పద్యమందలి 'నీపద పల్లవంబు ... నొచ్చునంచు నే ననియెద...' అను కృష్ణుని వాక్యమే.

'అహో తస్యా రుక్మిణ్యా మాయా' అను సత్యావాక్యము

'మరచెనో గాక రుక్మిణిమాయఁ దగిలి' అను పద్యపాదపు ప్రతిధ్వనియే.

తన కోపకారణమును అభిమానవతియైన సత్య వాచ్యముగ చెప్పక -

"పారిజాత పరిమలాధివాసితే అన్యప్రసంగాసహానే తస్మిన్నేవ గృహే"

అని పారిజాతనామ గ్రహణము చేసి వ్యంగ్యముగాసూచించును. ఈ నేర్పు తిమ్మన కూర్పు నందలి -

'...ఇపుడు నీవిట వచ్చుట పారిజాతవా
సనఁ బ్రకటించి నాకు నెకసక్కెము సేయన కాదె ?
చెప్పుమా' ( I 128)

అను పద్యభాగము నుండి నేర్చుకొనినదే.

విజయనగరమున విరిసిన తిమ్మనగారి పారిజాతపు పరిమళములు తంజనగరమున ఎట్లు గుబాళించినవో తెలిసికొనుటకు ఈ రాజగురు రచిత నాటకమొక చక్కని తార్కాణ.

## 19. దిట్టకవి (వెలుకుదురుపల్లి) విశ్వనాథం
(పారిజాతహరణము)

17 వ శతాబ్ది ప్రారంభమున పెద్దాపుర ప్రాంతమున నివసించిన ఇతడు సంస్కృతములో నొక పారిజాతాపహరణ కావ్యమును రచించినాడట. [11] కావ్యమలభ్యమైనను ఆంధ్రుడైన ఇతడు రచించిన కావ్యముపై తిమ్మన కావ్యప్రభావము అధికముగనే యుండి యుండునని యూహించుట సత్యదూరము కాబోదు.

## 20. శేషకృష్ణ - పారిజాతహరణము

రాజా తోడర్‌మల్ కుమారుడైన గోవర్ధనధారికి ఆశ్రితుడగుటచే ఇతడు 16, 17 శతాబ్దుల సంధికాల మందలివాడు. కాశీ నగర నివాసి. సుప్రసిద్ధుడైన భట్టోజీ దీక్షితుడీతని శిష్యుడు. అన్నం భట్టు, జగన్నాథపండితరాయలు ఈ శేషకృష్ణుని కుమారుడైన శేష వీరేశ్వరుని శిష్యులు. శేషకృష్ణుడు 5 ఆశ్వాసముల కావ్యముగా పారిజాతహరణమును రచించియున్నాడు. [12] రుక్మిణీవ్రత ప్రభృతి సత్యా పుణ్యకవ్రత పర్యంతము గల హరివంశకథను ఈతడు తు చ తప్పకుండ అనుసరించినాడు. బిల్వోదకేశ్వర పూజా వృత్తాంతము మాత్రము చెప్పలేదు. సత్యామాన ఘట్టములో చాలభాగము రుద్రభట్టు తిమ్మనల కావ్యములతో భావసామ్యము కలిగియుండుటచే ఆ

---

11 ఆరుద్ర - సమగ్ర ఆంధ్రసాహిత్యం. X Vol. పుట 224

12 ఇది చౌఖంబా పబ్లికేషన్స్. వారణాసివారిచే ప్రకటించబడినది.

కావ్యముల ప్రభావము ఈ కావ్యముపై గలదని భ్రమ కలిగించు అవకాశము కలదు. కాని మూలమగు హరివంశమునే ఇతడనుసరించి నట్లు ప్రవరుని వృత్తాంతము, పారియాత్రము క్రుంగుట, అదితి కశ్యపుల మాధ్యస్థము మొదలగు కథాంశముల వలన తెలియగలము. రుద్రభట్టు సొంతకల్పనలగు సత్యాశచీ వాగ్వాదాదికములనుగాని, తిమ్మన సొంతకల్పనలగు సత్యాపాద ప్రహారాదికములను గాని స్పృశింపక పోవుటచేత శేషకృష్ణుని కావ్యగ్రంథముల పరిచయము లేదనియే నిశ్చయింపవచ్చును.

ఇతడు గావించిన ఒక స్వతంత్ర కల్పన రమణీయమైనది కలదు. కథాప్రారంభమున నారదుడు కైలాసము నుండి ఇంద్రలోకమున కరుదెంచుసరికి శచీదేవి ఏదియో వ్రతమాచరించుచుండును. భూలోకమున తన తోడికోడలైన రుక్మిణీ వ్రతమాచరించుచుండుటచే తానును ఆచరించుచుంటినని తెలిపి రుక్మిణి కొసంగుమని ఒక పారిజాత పుష్పమును శచీదేవి నారదున కొసంగును. దానినే తెచ్చి నారదుడు రుక్మిణీ మందిరమున గల కృష్ణున కొసంగును.

## తెలుగు కావ్యములు

1) తిక్కన :- పారిజాతాపహరణ కథను తొలిసారిగా పేర్కొనినవాడు తిక్కన.

సత్యభామకుఁ బారిజాతంబుపై గల
కోర్కి దీర్చిన రసికుండితండె.

2) ఎఱ్ఱాప్రెగ్గడ - హరివంశము :- పారిజాతాపహరణ కథను తెలుగులో తొలిసారిగా విస్తరించి చెప్పినవాడు ఎఱ్ఱాప్రెగ్గడ.[13] ఇతడు ప్రధానముగ హరివంశమందలి తొలికథనే అనుసరించిన

---

13 హరివంశము - ఉత్తరభాగము - IV 202 - 232.

వాడయ్యు కొంత విష్ణుపురాణాంతర్గత కథను కూడ సమన్వయము గావించుటకు ప్రయత్నించినాడు.[14] కనుకనే

"...(దేవేంద్రుడు) తత్కృతంబు తగనోడబడియున్ (IV 221)

మనసు పట్టలేక యనిమిషకోటితో
నరిగి యతనిఁ దాకి యని యొనర్చి
వజ్రమతని మీఁదవైచి తద్వేగ సం
స్తంభనమున మదము దక్కి స్రుక్కి ... (222)

"అమ్మహాత్ముతోఁ దదీయనివృత్తి పర్యంతంబు పారిజాతంబు మహీతలస్పర్శిగా నొడంబఱచి..." అని విష్ణుపురాణోక్త కథ ననుసరించినాడు. మరల

"...పారిజాతంబు నవతారితంబుసేయఁ బ్రద్యుమ్ను నాజ్ఞాపింప నతండయ్యుత్తమ తరువునంతఃపురంబునకుఁ గొనిపోయె." (231)

అనుచోట హరివంశపు ప్రక్షిప్త కథాభాగమును స్మరింప జేయుచున్నాడు. పారిజాతమును స్మరించిన వారికి జాతిస్మరత్వము లభించుననిమాత్రమే విష్ణుపురాణము చెప్పుచుండగా ఎఱ్ఱన

'అత్తఱి సత్యభామ తన నాది సురాంగన గాఁదలంచుచున్ (-217)

అని సత్యభామ పారిజాతమును కోరుటకు కారణమును కల్పించినాడు.

ఎఱ్ఱన కావ్యమును తిమ్మన బాగుగ అధ్యయనము గావించి వాడనుటకు ఈ క్రింది సంవాదము తార్కాణ. 16000 మంది కన్యలను ఎఱ్ఱన ఇట్లు వర్ణించినాడు.

"...పొదివిన యెలజవ్వనములఁ బొలివోవక యిం
పొదవెడు వారిని ... ... ... ... ..." (191)

14 ఈ విషయమై ఇంతకుముందు నపులముగా చర్చింపబడియున్నది. చూ. పుట. 98

తిమ్మన ఈ పదబంధమును యథాతథముగా స్వీకరించినాడు :

"...ఎలజవ్వనముం బొలివోని వారి..." (I 37)

హరివంశ విష్ణుపురాణ కథలను సమన్వయపరచి పారిజాతాపహరణమును రచింపదగునను ఊహ కూడ తిమ్మనకు ఎఱ్ఱన వలననే లభించియుండును.15

2. మడికి సింగన-పద్మపురాణము-ఉత్తరఖండము : ఇతడు సంస్కృత పద్మపురాణమును యథామూలముగ అనువదించినవాడగుటనే ఇతడు చెప్పిన పారిజాత కథలో (దశమాశ్వాసము) చెప్పదగిన విశేషము లేదు.

3. పోతన-భాగవతము : సంస్కృత భాగవతమందు వలెనే పోతనామాత్యుని అంధ్రీకరణమందుకూడ ఈ కథాభాగము అత్యంత సంగ్రహముగా చెప్పబడినది. 'పారిజాతహరణ' మనుటకు మారుగా 'పారిజాతాపహరణ' మనుట తప్ప తిమ్మనపై ఈ భాగపు ప్రత్యేక ప్రభావమేమియును లేదు.

4. చరిగొండ ధర్మన్న-చిత్రభారతము : ఇతడు పూర్తిగా విష్ణుపురాణోక్త కథనే అనుసరించినాడు. విష్ణుపురాణములో శచీకృత అవమానమునకు సత్య రోషపడినదే గాని ఏడువలేదు. నగలు తీసివేయలేదు. కాని ధర్మన్న సత్యచే ఈ పనులు చేయించినాడు.

"ఈసునఁ గోపమున్మది వహించి పులోమజవేఁడి మాటకై
గాసిలి మేనసొమ్ములిడిపి కన్నులఁ గ్రమ్మెడిసీట ... (V 91)

15 తెలుగు 'పారిజాత' కథలపై దేనిపై గూడ రుద్రభట్టు ప్రభావము లేదు. పునరుక్తి నివారణకై ఆ విషయము ప్రత్యేకించి పేర్కొనబడుట లేదు.

5)

...ఏడిచెన్, గోమలనూతన స్వరము గ్రోలుచుఁ గోయిలపిల్ల మో
యనన్ (94)

ఈ పెంపకము హరివంశపు మలికథ యొక్క ప్రభావమై యుండును. సత్యారోదన ధ్వనిని కోయిల కూతతో పోల్చుటయు, ఈసును' 'గాసిలి' అను ప్రాసస్థానమందలి పదములును తిమ్మన ఈతని రచనచేత గూడ ప్రభావితుడైనట్లు నిరూపించుచున్నవి.[16]

5. తాళ్ళపాక పెదతిరుమలయ్య - ద్విపదహరివంశము : తిమ్మనకు సమకాలీనుడే అయిన పెదతిరుమలయ్య (1460 - 1547) ద్విపదగా హరివంశమును రచించినాడు, అందు పారిజాతకథను ఎట్లు చెప్పియున్నాడో పరిశీలింపవలసియున్నది.

6. వెన్నెలకంటి సూరన - విష్ణుపురాణము : తిమ్మనకు తరువాత కొలదికాలముననే ,(1530 - 55) విష్ణుపురాణము నాంధ్రీకరించిన సూరన అమూలకమైన ఒక కథాంశమును కల్పించినాడు. శ్రీకృష్ణుడు సుదర్శనమును చేబూనునంతతో శచీదేవి 'వినయ వినమితోత్తాంగయై' భర్తృభిక్ష యాచించినదని. తిమ్మనచే సూరన ప్రభావితుడైన సూచన లేమియు కానరావు.

7. భావనారాయణ - విష్ణుపురాణము : 16 వ శతాబ్ది ఉత్తరార్ధపు వాడైన ఇతడును విష్ణుపురాణము నను వదించినాడు.

16 ధర్మన్న తిమ్మన్నలు సమకాలికులు. ధర్మన్నకు ఆశ్రయ దాత యైన చితాపుఖాను(సీతాపతిరాజు)ను కృష్ణరాయలు కంబముమెట్టు యుద్ధములో నిర్జించినాడు. కంబముమెట్టు విజయమును తిమ్మన పారిజాతాపహరణ అవతారికలో పేర్కొనియున్నాడు. (I 23) కనుక తిమ్మన కావ్యముకంటె ధర్మన్న కావ్యమే ముందు రచింపబడి యుండునని తేలుచున్నది.

కాని ఇతని గ్రంథములో నాలుగంశములే లభించినవి. పారిజాత హారణ కథ గల పంచమాంశమింతవరకు లభింపలేదు.

8. నేమాని భైరవకవి - హరివంశము - ఉత్తరభాగము : 18వ శతాబ్ది ఉత్తరార్ధమున జీవించిన ఈతడు ఎఱ్ఱన అనువదింపక విడచిన కొన్ని కథలను చేర్చి హరివంశ ఉత్తరభాగము రచించినాడు. పారిజాతాపహరణ కథను ప్రక్షిప్త భాగము ననుసరించి యథా మూలముగ ననువదించినాడు.[17] ఇతనిపై తిమ్మన ప్రభావమును గుర్తింపనైనది కాదు.

9. శేషకవి - సత్యభామా విజయము : సత్యా వివాహ, నరకాసుర సంహార, పారిజాతహరణ కథలను చేర్చి శేషకవి సత్య భామా విజయమను పేర ద్విపద కావ్యమును రచించినాడు.[18] ఇత డును పారిజాతహరణహరణ కథను విష్ణుపురాణోక్త ప్రకారమే చెప్పి నాడు. తిమ్మన పదబంధములను భావములను యథేష్టముగ వాడు కొనినాడు. ఈ పోలికలను గమనించునది :

1. విమల చింతామణీమయ వేదిమీఁదఁ
గల్పక లతాంత కల్పిత తల్పసీమ
నధివసించిన ... ... (అదితి)...' (పారి. III 24)
విమల చింతారత్న వేదికాకల్ప
సుమదళాకల్పభాసురశయ్యసీమ
చెలువుమీఱఁగ వసించిన...(అదితి)...' (సత్య.విజ.)

---

17 ఈ గ్రంథము విషయమై ఇంతకుముందే చర్చించియున్నాము.
18 శేషకవి కాలము తెలియదు. 'సత్యభామా విజయము' తాళ పత్ర ప్రతియొకటి తిరుపతి ప్రాచ్యపరిశోధనా సంస్థలో R. 871 బి సంఖ్యతో నున్నది.

2. '... ... ... ... ... ... ఆనందనం
దనుదీవించుచు చెంగటన్నిలిపెఁ జింతారత్నపీఠంబువన్
మేనిమిరి శిరసు మూర్కొని
దానవ పరిపంథియెంత ధన్యనో నియత
ధ్యాన పరులైన మునులుం
గానని నినుఁగంటి మంటి గతకల్మషనై,"
(పారి. III 25, 26)

సమ్మదంబున శిరఃస్థలము మూర్కొనుచు
ప్రేమ చింతారత్న పీఠంబుమీాద
నామహాత్ముని నిలిపి యనఘులోకేశ
నేనెంత ధన్యనో నెఱి యోగివరులు
గాంచంగ రాని నీఘనమూర్తిఁ గంటి.

3. 'వరభక్తి దేవకీ వసుదేవులకు మ్రొక్కి' (పారి. V 49)
'దేవదేవుండట దేవకీ సతికి
నా వసుదేవున కలరార మ్రొక్కి' (సత్య. విజ,)

4. 'విననేర్చిరి బధిరులు గను
గొననేర్చిరి యంధకులు లఘుత్వము మీాఱన్
జననేర్చిరి వికలాంగకులు... ' (పారి. V 48)
'...వృద్ధాలికిన్ మరలం బ్రాయము వచ్చె...'
(పారి. V 47)

'వరుస వృద్ధులకు యౌవనము వాటిల్లె
వినఁగన జననేర్చె విరివిగా బధిర
జనులు నంధక పంగు జనులు నావేళ...'
(సత్య. విజ.)

9. కృష్ణాధ్వరి - నైషధపారిజాతీయము : [19] తంజావూరు రఘునాథ నాయకునికి అంకితమైన ద్వర్థి కావ్యము.

నైషధ కథతో పొత్తు కలిగించుకొనుటకై కృష్ణాధ్వరి పారిజాత కథను త్రిప్పిన మలుపులలో హరివంశ విష్ణుపురాణముల కథల సమన్వయ ప్రయత్నము కనిపించుచున్నది. కథాప్రణాళిక తిమ్మన కథాప్రణాళిక కంటె భిన్నమైనది. ఐనను తిమ్మన కావ్య ప్రభావము దీనిపై కనుపింపకపోలేదు.

10. పిసుపాటి చిదంబరశాస్త్రి - శ్రీ మదాంధ్ర పద్మ పురాణము : ఆధునికులైన శ్రీశాస్త్రిగారి ఆంధ్రీకరణకు మూల మైన సంస్కృత పద్మపురాణ ప్రతి కొంత భిన్నమైన పాఠముగలది వలె కానవచ్చుచున్నది. ఇందలి పారిజాతాపహరణకథ ఇట్లున్నది : (ఉత్తర ఖండము। 308 - 328)

"నారదుడు కానుకగా నొసంగిన పారిజాత పుష్పములను కృష్ణుడు తన పత్నుల కందరకు నొసంగెను. కాని సత్యను మాత్రము మరచెను. అందులకు సత్య దుఃఖించెను. (కోపాగార మును ప్రవేశింపలేదు.) కృష్ణుడామె నోదార్చి పారిజాత వృక్షమును తెచ్చియిత్తునని వాగ్దానమొనర్చి సత్యాసహితుడై గరుడారూఢుడై తిన్నగా నందనవనమున కేగి పారిజాతమును పెల్లగించెను. అంతలో ఇంద్రుడు వచ్చి గరుడుని మీద వజ్రము ప్రయోగింపగా అతడొక ఈకను రాల్చెను. ఆ వజ్ర ప్రహారము వలన మయూర, కుక్కుట, చాషములను మూడు పక్షులు జనించినవి. కృష్ణుడు సత్య పెరటిలో

---

19 కృష్ణాధ్వరి సంస్కృత నైషధ పారిజాతీయము రచించియుండునను. ఊహను గుర్తించియున్నాము. చూ. అను. పుట 35 ఇది తెలుగు కావ్యము

పారిజాతమును స్థాపించును. పిమ్మట సత్య "జన్మజన్మములందును నాకు ఇట్టి భర్తయే లభింపవలెననిన ఏ వ్రతము చేయవలె"నని నారదుని ప్రశ్నించును. నారదుడు తులాపురుషదానము నుపదేశించును. సత్య 'కల్పతరు కృష్ణులకుఁ దూగు కాంచనమును' నారదున కొసంగును" పిదప సత్య అడుగగా కృష్ణుడామెకు ఆమె పూర్వజన్మ వృత్తాంతమును కార్తికవ్రత మహాత్మ్యమును తెలుపును."[20]

## నాటకములు :

తిమ్మన కావ్యమందలి ఇతివృత్తము నాధారముగ గొని తెలుగులో అనేక స్వతంత్ర నాటకములుదయించినవి.

'పారిజాతాపహరణము' అను పేరటనే శ్రీ చిలకమర్తి లక్ష్మీనృసింహం, శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రి, శ్రీ విశ్వనాథ నరసింహం, B. A., నాటకములు రచించియున్నారు.

శ్రీ మరింగంటి వేంకటనరసింహాచార్యులు, శ్రీ పారనంది జగన్నాధస్వామి, M.A., L.T., శ్రీ ముత్తంరాజు సుబ్బారావు, M.A. శ్రీ ద్రోణంరాజు సీతారామారావు, శ్రీ జొన్నలగడ్డ మృత్యుంజయ శర్మ, శ్రీ ధర్మవరం రామకృష్ణమాచార్యులు, శ్రీ నేదునూరి గంగాధరం, శ్రీ K. సూర్యప్రకాశరావు పుణ్యకవ్రతపు కథకు మరి కొంత కల్పనను జోడించి 'శ్రీకృష్ణతులాభారము' అను పేర నాటకములను రచించియున్నారు.

---

20 ఈ కార్తిక మహాత్మ్యపు మూలమును మనము గుర్తించియే యున్నాము. చూ. అను. పుట. 13

ఇవి అన్నియు తిమ్మనగారి పారిజాతపు పరిమళములను కొలదిగనో గొప్పగనో ఎరవుగొని పరిమళించుచున్నవే ఒకటి రెండు ఉదాహరణలను పరిశీలింతము.

నారద : "పార్వతి దాల్చిన యవతంస చంద్రకళవలె నీమె యాదల నీ పుష్పంబు విరాజిల్లుచు నీ కల్యాణికి వర్ణనా దుస్సాధ్యమగు సౌందర్యమొకండు దెచ్చెను."

"సత్యభామ జగత్త్రియంబున గల కాంతలలో దానె చక్కదనంబున కిక్కననియు గర్వంబున విఱ్ఱవీగుచుండును.

(చిలకమర్తి పారిజాతాపహరణము)

నారద : 'నేనె యందగత్తె నేనెలే జవ్వని
నేనె పతికిఁ గూర్చుదాననను చు
నింతదనుకను తెగనీల్గెడు నాసత్య...'

సత్య : 'ఆ గోచిపాతరాయనికి మమ్ముతలంపవలసిన పని యేమి ? దానిని వినుచు నాపసులకాపరియామోదమందు టేమి ?'

కృష్ణ : 'నను నీదాసుని నిట్లు తన్నితనుచున్ దా మానసంబందునే కినుకంబూన నిదెంతొ గౌరవము ... ...'

(మారేపల్లి వారి పారిజాతాపహరణము)

కృష్ణ : సత్యా, మనోవాక్కాయ కర్మంబుల నిన్నుదక్క నేనన్య కామినుల గామించువాడనా ? మెఱమెచ్చులకు వారి నించుక గారవముతో జూచెదగాక.

సత్య : ఈ నయనగారపు బలుకులు నీ తెచ్చుకోలువలపులు నీకు వెన్నతో బెట్టిన విద్యలు గదా.

నారద : ఆహా, ఏమి ఈ దేవదేవుని విచిత్రవర్తనము. నాడు బలిని గట్టినవాడు, జితేంద్రియులగు తపోధనుల మానసాలాన బంధనమున నేని గట్టుపడనివాడు, నేడొక యబలచేత భారి జాతవృక్షమున నొకపూలదండచేత గట్టంబడియె.

సత్య : తుభ్యమహం సంప్రదదే నమోనమః

(ముత్తరాజువారి శ్రీకృష్ణతులాభారము)

ఇన్ని నాటకములకు మాతృక కాగలిగిన తెలుగు ప్రబంధము మరియొకటి లేదు. తిమ్మన కావ్యమునకు గల లోకప్రియత మరి ఏ కావ్యమునకును లేదనుటకిది యొక తార్కాణ.

## యక్షగానములు

తిమ్మన పారిజాతాపహరణము రచించిన తర్వాత తెలుగులో వచ్చిన పారిజాతములకు లెక్కలేదు. దాదాపుగా ఇవి యన్నియు యక్షగానములే. వీనియన్నిటిపైనను ప్రత్యక్షముగనో, పరోక్షముగనో, కొలదిగనో, గొప్పగనో తిమ్మన కావ్యపు ప్రభావము ఉండియే తీరినని.

భాగవత కథలలో పారిజాతాపహరణ కథ హృద్యతరమగుటచే దానికి ప్రచారమెక్కువయ్యెను. అది హృద్యతరమగుట కందలి సవతుల కయ్యపుబట్టు ప్రధాన కారణము. దీనిని బట్టి యక్షగాన సామాన్యమునకు పారిజాతములనియు పేరయ్యెను."21 "ఆ సవతి కయ్యపు కథ పట్టునకు కావ్యత్వ ప్రతిష్ఠ తిమ్మనగారి పెట్టుబడి. దానిపై సిద్ధేంద్రుని కలము తునకాలుగా కూచిపూడి భాగవతులు భామాకలాభము దీసిరి. అనేక యక్షగానముల కదే కథావస్తువో

21 వేటూరి ప్రభాకరశాస్త్రి - సుగ్రీవ యక్షగాన పీఠిక.

రొక ప్రధాన సన్నివేశమో యుయివది. అంతటితో సరిపోలేదు. తత్సదృశకథలకును పారిజాతపు వాసన తగిలినది. సత్యా రుక్మిణుల తర్వాత సవతుల కయ్యమునకు పేరుబడ్డ జంటలు గంగా గౌరులు. వారి కయ్యమునకు పారిజాతమునే నిమిత్తమొనర్చి కొందరు కవులు శివపారిజాతములను సృష్టించుట విశేషము."[22] కొరవంజులు గొల్ల కలాపములు, భామాకలాపములు అను యక్షగాన కృతులన్నియు ఇట్లు పరంపరిత పారిజాత ప్రభావమునకు లోనైననే.

ఇప్పుడు కొన్ని ముఖ్యమైన పారిజాతములను గూర్చి కొలదిగ తెలిసికొందము.

1. నారాయణ తీర్థులు : శ్రీకృష్ణ లీలాతరంగిణీ కర్తగా ప్రసిద్ధికెక్కిన నారాయణతీర్థ యోగీంద్రుడు (1580 - 1680) తెలుగులో పారిజాతాపహరణ యక్షగానమును రచించి యున్నాడు.[23] గ్రంథారంభమున తీర్థులవారు కథాసంగ్రహమును ఐదు శ్లోకములలో చెప్పినారు.

పారిజాతాపహరణాఖ్య ప్రబంధమభినీయతే
ఆదౌ కృష్ణ స్తథా భైమీ సత్యభామా తతస్సఖీ
నారదాగమనం పశ్చాత్ పారిజాత సమర్పణమ్
తతః శ్రీకృష్ణసంవాదౌ రుక్మిణీ సత్యభామయోః

22 యస్వీ జోగారావు - ఆంధ్ర యక్షగాన వాఙ్మయచరిత్ర II భా. పుట 92.

23 తంజావూరు సరస్వతీమహల్ గ్రంథాలయములో దీని అసంపూర్ణ తాళపత్ర ప్రతియొకటి గ్రంథలిపిలో నున్నది. [డి. నెం. 544]

కృష్ణేనాపి కృతం సత్యభామాయాః శ్చిత్తరంజనమ్
సత్యయా వైనతేయేన గమనం గగనే పథి
సత్యభామాం పురస్కృత్య నరకాసుర మంథనమ్
నందనోద్యాన గమనం పారిజాతసమర్పణమ్.
ఇంద్రస్తుతః తతః సత్యభామాయాశ్చ గృహాంగణే
పారిజాతతరుం సమ్యగారోప్య కృతకృత్యతా
ఇత్యేవం సంగ్రహం శాస్త్రం చరిత్రం సముదీరితం

దీనిని బట్టి తీర్థులవారి కథాప్రణాళిక తెలియుచున్నది. తీర్థులవారి రచనపై తిమ్మన ప్రభావమెంతవరకు గలదో గుర్తించుటకు వీలైనది కాదు. ఏలన, లభించిన భాగమత్యల్పము. ఉపలబ్ధ భాగములో చివరి వాక్యము లిట్లున్నవి :

'అంతట నీలాగు రుక్మిణీ అమ్మవారు చేత సత్యభామ అవమానంబు పొంది తన ఇంటికి వచ్చి కోపాగారమందు ప్రవేశించేటప్పుడు ఏమి ప్రలాపిస్తున్నది.

దరువు : ఏమిసేతునే, ఓయమ్మా, బంగారుబొమ్మా, ముద్దులగుమ్మా'

హరివంశ విష్ణుపురాణ కథలను సమన్వయపరచు ప్రయత్నము తీర్థులవారి ప్రణాళికలో కనుపించుచున్నది. నారదాగమనముతోనే కథా ప్రారంభమగుటచే అది తిమ్మన కావ్యప్రభావమేయై యుండును.

2. సిద్ధేంద్రయోగి : ఈయన నారాయణ తీర్థులవారి శిష్యుడని ప్రతీతి. గోల్కొండను పాలించిన తానీషా (1672-85) నుండి కుచేలపురాగ్రహారమును సంపాదించినాడు. ఈయన రచించిన 'పారిజాత' యక్షగానము దాని తొలిస్వరూపములో ఇప్పుడు లభిం

చుటలేదు. సిద్ధేంద్రుని రచనగా లభించుచున్న నేటి 'భామా కలాపము'లో సత్యభామ ప్రవేశించుచునే ఇట్లు చెప్పుచున్నది :

భామనే సత్యభామనే ॥
భామనే పదియారువేల కోమలులాలందరిలోనా
శ్రామరో గోపాలమూర్తికి ప్రేమభామనైన ముద్దుల ॥భామనే॥
అట్టహాసము జేసి సురల నట్టె గెలిచీ పారిజాతము
చెట్టు తెచ్చీ నాదు పెరట గట్టిగా నాటించుకొన్న ॥భామనే॥

దీనివలన పారిజాతాపహరణ మప్పటికే జరిగియుండుట స్పష్టము. నేడు భామాకలాపము కథాపరముగాక, అష్టవిధ నాయికలు, ముగ్ధామధ్యాప్రౌఢా ధీరాధీరాది భేదములు, దశవిధమన్మథావస్థలు మొదలగు నంశములతో సంయోగ విప్రలంభాత్మకమైన శృంగారరస సర్వస్వమునకు లక్ష్యముగా రూపొందినది. ఈనాడు స్పష్టముగ గుర్తించుటకు వీలుగాకున్నను, సిద్ధేంద్రుని రచనపై తిమ్మన కావ్యము యొక్క ప్రభావముండితీరుట సంభవము.

3. నరుకూరి నారాయణ : 'ఆట భాగవతం సత్యభామ వేషకథ'[24] అను పేరుతో ఇతడొక యక్షగానమును రచించినాడు. ఇతని రచనపై తిమ్మన ప్రభావము కలదనుటకీ క్రింది పట్టులను పరిశీలించిన చాలును.

"వ॥ అని సత్యభామ వామపాదంబున నతండు మ్రొక్కిన హారితల తలంగ ద్రోసిన నతండిట్లనియె.
దరువు॥ ముద్దుచెలినే నీకు ప్రియపడి మ్రొక్కినందుకు వామపాదము
కొద్ది తన్నిన తన్ను నాకొక కోటిసేయు

24 దీని హస్తలిఖిత శిథిలప్రతియొకటి మదరాసు ప్రాచ్యలిఖిత గ్రంథాలయములో D. 1899 గా ఉన్నది. ఈ గ్రంథము 1882, 1906లలో రెండుమారులు ముద్రితమైనదట.

తన్నినందుకు ఎగ్గులేదు కృతార్థుడనైతి తలపైనున్న మకుటము
సోకి మృదుపదమొత్తెనట వే."

కృష్ణుడు చేసిన శపథపు పలుకుబడి తిమ్మన పలుకుబడిని అనుసరించియుండుట గమనింపడగియున్నది :

'పనిబూని ఇంద్రుని పట్టణంబేగి
ఘన పారిజాత వృక్షముగొనవచ్చి
వనితనీ శృంగారవనము లోపలను
ఆనువగు కనకంపుటరుగుల నడుమ
పెరటిచెట్టుగ నాటి పెంపొనరింతు"

కథాప్రణాళిక మాత్రము కొంత భిన్నముగ నున్నది. అమరావతికి సత్యభామ శ్రీకృష్ణుని అనుసరింపదు, కృష్ణుడు చక్రమును, ఇంద్రుడు వజ్రమును చేబూనునంతలో శివుడడ్డుపడి సంధి కుదుర్చును.

4. మాతృభూత కవి : తంజావూరు నేలిన అమరసింహుని (1787-1798) కంకితముగ ఇతడు పారిజాతాపహరణమను యక్షగానమును రచించినాడు. కథాప్రణాళికనే గాక, భావములను పదబంధములను. పద్యపాదములను పాదములుగానే తిమ్మన పారిజాతాపహరణము నుండి మాతృభూతన సంగ్రహించినాడు. కొన్ని ఉదాహరణములు చూచినచాలును.

కృష్ణ : 'సురమునివర మీరిటకును
అరుదెంచిన మాత్రమున కృతార్థుడనైతిన్' (I అం. 83)

నారద : పౌలోమి పార్వతి పద్మ పద్మజురాణి
యాలక్ష్మియును దాల్తురదిశిరంబునను

నరులకు ధరియింప వలవియేకాదు
హరికిబహిః ప్రాణమాటచే నీవు
ఇరవొందగా నొక్క ఇందిరవగుట
ధరియింప యోగ్యవు తామరసాక్షి
నీవు దాల్చుటచేత నీ కుసుమంబు
పావనం బయ్యెను పరమ కల్యాణి
రమణి నీ పతి నీవు రతిసేయువేళ
ఘనతరోల్లాసంబు గలుగజేయు
కఠురతిశ్రమ చేత బొడమిన చెమటలు
తొలగింప సురటియై మెలగుచుండు (పుట 88)

వెతలను జెందె లక్షణయు, విన్ననయయ్యెసుదంత, భద్రకున్
ధృతిసెడె, మిత్రవిందకు మతిభ్రమ పుట్టెను, సూర్యపుత్రికిన్
హితవని లేదు, జాంబవతి కేమియు దోచదు, సత్యభామవే
వితములనాడు నెచ్చెలియు వేగమెరాదని చింతచేయుచున్

వారిలోపల వన్నెయు వాసి గలిగి
యారూఢికెక్కిన యల సత్యభామ (పుట 91)
గొల్లవాడపీవేమెఱుగుదువిక కొమ్మల మరియాద. (పు.119)

మాటికి కోపమున్ మదిని మానినికిన్ మితిమీఱె నింకిటన్
మాటలచేత దీరదను మర్మమెఱింగి విరాళిచే జగ
న్నాటక సూత్రధారి లలనామణికిం బ్రణమిల్లె నంతన
బ్బోటియు దన్నె వామపదముంగొని కృష్ణుని మస్తకంబునన్

పులకలు కంటకంబులనఁ బుట్టిన నాదు శరీరమందు నీ
తలిరుల వంటి పాదములు తాఁకినయంతనె యెంత నొచ్చెనో
చిలకల కొల్కి నీవు దయచేఁ గడకన్నుల చూడకున్న నీ
వలపెటు సైతునే వికచవారిజలోచన మాటలాడవే. (పు. 241)

ఇట్లు సత్యాకృష్ణుల అమరావతీ యాత్ర వరకు గల కథను 273 పుటలు సాగించి, మిగత కథను కట్టెకొట్టె తెచ్చెనని పది పంక్తు లలో మాతృభూతన తేల్చివేసినాడు.

మాతృభూతన కృతి తిమ్మన కృతికి ప్రత్యంతరము మాత్రమే.

5. తరిగొండ వేంగమాంబ : (1840 ప్రాంతము) శ్రీ వేంకటాచల మాహాత్మ్యాద్యనేక గ్రంథరచయిత్రియగు నీ విదుషీమణి 'విష్ణుపారిజాత'మను పేర పారిజాతాహరణ యక్షగానమును రచించినది. ఈమె 'శివపారిజాతము'ను గూడ రచించియుండుటచే దీని స్పష్టత కొరకై 'విష్ణుపారిజాతమ'ని పేరిడినది.

శ్రీ కృష్ణుడు సత్యభామకు పారిజాతమును వాగ్దానము చేసిన దగ్గర నుండి కథాప్రారంభము చేయబడినది. సింహావలోకన క్రమమున నారదాగమన ప్రభృతి నడచిన కథ తెలుపబడినది. ఈమె రచనయు అడుగడుగున తిమ్మనను తలపింపజేయుచునే యుండును. కథాప్రణాళిలో కొంతవరకు నారాయణతీర్థుల ననుసరించినట్లు కాన వచ్చును. సత్యకు పారిజాతము వాగ్దానము చేసిన తరువాత కృష్ణుడు సత్యాసహితుడై ప్రాగ్జ్యోతిషమున కేగి, నరకుని సంహరించి, అట నుండియే అమరావతి కేగి, అదితికి కుండలములు సమర్పించి, నందన వనము ప్రవేశించి పారిజాతము నపహరించును. ఇంద్రుడు వజ్రమును, కృష్ణుడు చక్రమును చేబూనునంతలో శివుడడ్డుపడి సంధికుదుర్చును.[25]

ఇంకను ముద్రితములు అముద్రితములు నైన అనేక యక్ష గానములు పారిజాతము, భామాకలాపము, శివపారిజాతము మొదలగు

---

25 నరుకూరి నారాయణ కథ కూడ ఇట్లే ముగిసినది.

పేర్లతో లభించుచున్నవి.[26] వీనియన్నింటిపైన కొలదిగనో, గొప్పగనో, ప్రత్యక్షముగనో, పరోక్షముగనో తిమ్మనగారి పారిజాతాపహరణపు ప్రభావము కలదనుట స్పష్టము.

## ముద్రితములు

| | | | ముద్రణ సం, |
|---|---|---|---|
| 1. | పారిజాతాపహరణము | K- S. సూర్యనారాయణసూరి[27] ... | |
| 2. | పారిజాతము | భారతుల శ్రీరంగకవి ... | 1881 |
| 3. | శ్రీకృష్ణపారిజాతాపహరణము | కంతేటి రాఘుపయ్య ... | 1903 |
| 4. | పారిజాతము అను భామాకలాపము | భమిడిపాటి అప్పకవి ... | 1906 |
| 5. | పారిజాత ప్రబంధము అను శ్రీకృష్ణచిద్విలాసము | కందాళ సింగరార్యుడు ... | 1906 |
| 6. | సత్యభామవిలాసము అను పారిజాతము | మంగు వెంటజగన్నాథరావు ... | 1913 |
| 7. | నత్యభామా మానసోల్లాసము అను పారిజాతము | మగుఘూరి తాతాచార్యులు ... | 1910 |
| 8. | శ్రీకృష్ణ తులాభారము | గోపాలుని హానుమంతరామశాస్త్రి ... | 1927 |
| 9. | పుణ్యక వ్రతము | కీర్తి మల్లప్ప ... | 1928 |
| 10. | శ్రీకృష్ణ తులాభారము | పెరంబుదూరు వెంకటనరసయ్య ... | 1941 |

---

26 ఈ భాగము నందలి గ్రంథముల వివరములు డా॥ యస్వీ జోగారావుగారి 'ఆంధ్రయక్షగాన వాఙ్మయచరిత్ర' నుండి గ్రహింపబడినవి.

27 ఈ గ్రంథము లండన్, బ్రిటిష్ మ్యూజియం లైబ్రరీలో కలదట.

| | | | ముద్రణ సం. |
|---|---|---|---|
| 11. | శివపారిజాతము | లింగమూర్తి కవి ... | 1944 |
| 12. | శ్రీకృష్ణతులాభారము | చెర్విరాల భాగయ్య ... | 1951 |
| 13. | శ్రీకృష్ణపారిజాతము | చెర్విరాల భాగయ్య ... | 1954 |

## అముద్రితములు

| | | | | |
|---|---|---|---|---|
| 1. | పారిజాతము ... | పురిజాల లక్ష్మీనారాయణ | ప్రా.లి.పు.భాం.[28] | R. 438 |
| 2. | పారిజాతము ... | నందవరము సింగన | ,, | D. 1901, 1902 |
| 3. | పారిజాతము ... | పేరు తెలియదు | ,, | D. 1903, 1904 |
| 4. | పారిజాతాపహరణము ... | పేరు తెలియదు | ,, | D. 1905 |
| 5. | భామాకలాపము ... | ,, | ,, | R. 429 |
| 6. | ,, ... | ,, | ,, | R. 481 |
| 7. | ,, ... | ,, | ,, | D. 1916-1918 |
| 8. | ,, ... | ,, | ,, | D. 1919 |
| 9. | శివభాగవతము (పారిజాత కథయే) ... | వీరభద్రకవి | ,, | R. 800 |
| 10. | పారిజాతము ... | భారతి రామరాజు | ఆం.సా.ప.[29] | 4120 |
| 11. | పారిజాతాపహరణము... | శ్రీనివాసకవి | ,, | 184 |
| 12. | పారిజాతము లేక భామాకలాపము ... | పేరు తెలియదు | ,, | 173 |

28 ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము, మదరాసు

29 ఆంధ్ర సాహిత్య పరిషత్తు, కాకినాడ

| | | | | |
|---|---|---|---|---|
| 13. | భామాకలాపము ... | పేరు తెలియదు | ఆం. సా. భా. | 274 |
| 14. | పారిజాతము ... | చల్లా నారాయణకవి | ,, | 1650 |
| 15. | పారిజాత నాటకము ... | జ్యోతి రామయ్య | ,, | 1743 |
| 16. | కృష్ణవేషము ... (పారిజాత కథయే) | పేరు తెలియదు | ,, | 3062 |
| 17. | కృష్ణపారిజాతము ... | ,, | ,, | 4527 |
| 18. | పారిజాతము లేక భామాకలాపము ... | ఉప్పులూరి వీరరాఘవుడు గంగాధరుడు | ,, | 4527 |
| 19. | దివ్వెపురి భామాకలాపము | లక్ష్మీవరదాసుడు | ,, | 4120 |
| 20. | అయినవరం భామాకలాపము | పేరు తెలియదు | ,, | ,, |
| 21. | ధర్మపురి భామాకలాపము | ,, | ,, | ,, |
| 22. | వేదాచల భామాకలాపము | ,, | ,, | ,, |
| 23. | తిరుపతి భామకలాపము | ,, | ,, | ,, |
| 24. | శివపారిజాతము | తరిగొండ వేంగమాంబ | ,, | 2175-2177 |
| 25. | శివకేశవపారిజాతము | శేషము రంగాచార్యులు | ,, | 3139 |
| 26. | భామాకలాపము | గుడిమెట్ల రామయ్య | ఆం.ఇ.ప.[30] | 13 |
| 27. | శివపారిజాతము | వెంకటకృష్ణా జెట్టి | తం.స.మ.కే.[31] | 636, 637 |
| 28. | సతీపతి దానవిలాపము | శహాజీ | ,, | 644-650 |
| 29. | పారిజాతము | చెంగల్వారాయుడు | ,, | 484 |
| 30. | రుక్మిణీ సత్యభామా సంవాదము | శహాజీ | ,, | 583-586 |

ఈ లెక్కలోని కెక్కనివి ఇంకెన్నో.

29 ఆంధ్ర ఇతిహాస పరిశోధక మండలి, రాజమండ్రి.

30 తంజావూరు సరస్వతీమహాల్ గ్రంథాలయపు కేటలాగు.

ఏ యొక్క ప్రబంధము నాధారముగ గొనినైయెనను ఇన్ని గ్రంథములు పుట్టియుండవనుట సాహసోక్తి కాబోదు. పండిత పామరుల కందరకును సమానముగ ప్రీతిపాత్రము కాగలుగుట పారిజాతాపహరణపు విశిష్టత.

## స్త్రీల పాటలు

పారుజాత పల్లవి : కవి పేరు, కాలము తెలియదు. తిమ్మన భావములను, పదబంధములను లెక్కకు మిక్కిలిగా వాడుకొనినాడు. '(నారదుడు) కుసుమపువ్వు చిగురాకున పొదిగి ఇచ్చెనూ'; '(రుక్మిణి) మిన్నందీ వేగమునా ... కొవ్వున ముడుచుక ...', 'తన దేహం ఒక వింతాచాయలు మెరయగనూ' — ఇత్యాదులు గుర్తించదగినవి. శ్రీకృష్ణుడు సత్య పాదములకు నమస్కరించును. సత్య కృష్ణుని తన్నలేదు. స్వయముగ కృష్ణునికి స్నానభోజనాదులు చూచినది. చివరకు

'పారిజాతపు చెట్టు సత్యభామ పెరట వేయుటే గాని
పూచిన పూవులన్నీ రుక్మిణి పైనే వ్రాలే'

తెలుగు తెఱవలకు ప్రేమ సత్యయందు, భక్తి రుక్మిణి యందు. ఇంకను సత్యభామ సరసము, రుక్మిణీ సత్యభామా సంవాదము, తులసిదళము మొదలగు పాటలపై గూడ 'పారిజాతాపహరణ'పు ప్రభావము కనుపించుచున్నది.

## కన్నడ కృతులు

విష్ణుపురాణము : 1700 ప్రాంతమున జీవించిన 'చిక్కుపాధ్యాయ' పండితుడు యథామూలముగ సంస్కృత విష్ణుపురాణము ననువదించినాడు. వనపాలురతో సత్యాగర్వోద్ధతోక్తులు (7 పద్యములు) పలాయమానుడగు దేవేంద్రుని సత్య పరిహాసించుట (6 పద్య

ములు) మూలము కంటె విపులపరచి వ్రాసినాడు. రుద్రభట్టు ప్రభావమీతనిపై చాల కలదని కన్నడ సాహిత్య విమర్శకులను చున్నారు.[31] కాని పారిజాత కథలో అట్టి ప్రభావమేమియు కనుపించుటలేదు.

భాగవతము : దీనిని నిత్యాత్మశుకయోగి రచించినట్లు గ్రంథమందున్నది. కాని కృష్ణరాయల ఆస్థానకవి యగు చాటువిఠలనాథునిచేని రచితమైనట్లు వాడుక కలదు. పారిజాతాపహరణ కథా సందర్భమున నితడు 'విజయధ్వజ' రచించిన 'పదరత్నావళీ' వ్యాఖ్యయందు గల 3 అధ్యాయముల అధిక పాఠమును స్వీకరించి రెండధ్యాయములుగ అనువదించినాడు.[32] ఇతనిపైనను రుద్రభట్టు ప్రభావము కనుపించుటలేదు.

## వ్యాఖ్యలు

జగన్నాథ విజయము జటిలమగు శైలి కలదు. కన్నడ కావ్యములలో నారికేళపాకమునకు ఉదాహరణీయమైనది. కనుక దానికి సుబోధమగు వ్యాఖ్య యుదయించుట యెంతయు అవసరమైయున్నది. కాని 'పంచ పాషాణము'లను పేర కావ్యాది యందలి మంగళాచరణ పద్యపంచకమునకు ఎవరో పేరు తెలుపని పండితుడు రచించిన సంస్కృత వ్యాఖ్యానము తప్ప వేరు వ్యాఖ్యానము ఇంతవరకును వెలువడలేదు. జగన్నాథవిజయము పేరు ఆధునిక పండితులకే చాల మందికి అపరిచితము సాధారణ జనుల సంగతి చెప్పపనిలేదు. కనుక వ్యాఖ్య ఉదయింపగల ఆశయు లేదు.

---

31 'ఈతన (చిక్కుపాధ్యాయ') మేలే రుద్రభట్టర ప్రభావ బహుళ యిదె.' మరియప్పభట్టు - కన్నడ సంస్కృతి.

32 ఈ అధిక పాఠ భాగవతము విషయమై లోగడ చెప్పికొని యున్నాము. (అను. 12)

పారిజాతాపహరణము అత్యంత సరళమగు శైలి కలది. తెలుగు కావ్యములలో ద్రాక్షాపాకమునకు ఉదాహరణీయమైనది. కనుక ఒక పాటి సాధారణ విద్యావంతులు కూడ దీనిని వ్యాఖ్యా నిరపేక్షముగ పఠించి యానందింపగలరు. ఐనను సాధారణ పాఠకుని అవగాహనకు మీరిన కొలదిపాటి సంస్కృతపదములు, శ్లేషలు, అసంఖ్యాకములగు కవిసమయములు, వ్యంగ్యములు పూర్తిగ బోధ పడుటకు వ్యాఖ్యానము లవసరమగుచున్నవి. ఇట్టి వ్యాఖ్యానము లింతవరకు మూడు వెలువడియున్నవి.

1. శ్రీ వాగపూడి కుప్పుసామయ్యగారి 'పరిమళ' వ్యాఖ్య. 1929లో ప్రకటితము.
2. శ్రీ తాపీ ధర్మారావుగారి 'భావప్రకాశిక'. 1929 'సమదర్శిని'లో ప్రకటితము.
3. శ్రీ దూశి రామమూర్తిశాస్త్రిగారి 'సురభి' వ్యాఖ్య. 1933 లో ప్రకటితము.

విద్వద్వర్యులైన ఈ పండితత్రయ వ్యాఖ్యలు తిమ్మకవి చంద్రుని కావ్యసుధామాధుర్యమును చాలావరకు సాధారణ పాఠకునికి ఆస్వాదయోగ్యము కావించినవి. ఐనను ఈ పండితత్రయపు టాలోకమున బడక మిగిలిపోయిన, మరుగునడియున్న మెరుగులింకెన్నియో ఈ కావ్యగర్భమందడగియున్నది. వానినన్నింటిని వెలువరించి సంపూర్ణరసానందమును సంపన్నము చేయగల సమగ్రవ్యాఖ్య మరియొకటి ఉదయింపవలసిన ఆవశ్యకత యున్నది.[33]

---

31 కాలమనుకూలించినచో అట్టి వ్యాఖ్యను వెలువరించు కోరిక ఈ వ్యాసకర్తకు కలదు.

## వచనానువాదములు

జగన్నాథ విజయమునకు సంపూర్ణ వచనానువాదము వెలువడలేదు. 'చంద్రశేఖర ఐతాళ' అనువారు రచించిన 'రుద్రభట్ట' అను చిన్న పుస్తకములో అతిసంగ్రహముగా 'జగన్నాథ విజయ' కథ తెలుపబడినది.

తెలుగులో పారిజాతాపహరణమునకు నాలుగు వచనానువాదములు వెలువడినవి. 1. కమలాసనుడు, 2. పున్నమరాజు నాగేశ్వరరావు, 3. కంభంపాటి రామగోపాలకృష్ణమూర్తి, 4. నరసింహదేవర ఉమామహేశ్వరశర్మ అనువారు విడివిడిగా పారిజాతాపహరణ వచనానువాదములు రచించినారు. 'ఎమెస్కో' వారు ప్రకటించిన పారిజాతాపహరణమునకు పీఠికలో కవిసమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారొసంగినకథ సంగ్రహమయ్యు రమ్యముగా నున్నది.

అనుబంధము - 4

## పూర్వకవి ప్రయోగములు

తిమ్మనకు ప్రాచీన సంస్కృతాంధ్ర మహాకవుల కావ్యములన్నియు కంఠస్థములు. కనుక ఆతని వాక్కులో పూర్వకవీశ్వర ప్రయోగములు అప్రయత్నముగ ప్రతిధ్వనించుచుండును. ఇదియు నొక సత్కవిలక్షణము. ఈ 'పూర్వకవీశ్వర వాక్ప్రయోగదక్షత'[1] తిమ్మనలో వెల్లడియగుచున్న విధమును దిఙ్మాత్రముగ పరిశీలింతము.

వాల్మీకి :

'నాగకన్యేవ నిఃశ్వస్య దీర్ఘముష్ణంచ భామినీ' (అయోధ్య ౧౦-౩)

1. అప్పకవీయము - I 44

'అన విని వ్రేటువడ్డ యురగాంగనయుంబలె' (పారి. I 82)
'...లతాంగి...నాగతరుణియుఁ బోలెన్' (పారి I 98)

కాళిదాసు :

1. 'ఆ సీత్కల్పతరుచ్ఛాయా మాశ్రితా సురభిః పధి. (రఘు. I 75)
'పచ్చికఁ దెండియున్నయది భామిని వేలుపుటావుఁ జూచితే'
(పారి. II 96)

2. 'పపావనాస్వాదితపూర్వమాశుగః
కుతూహలేనేవ మనుష్యశోణితమ్' (రఘు. III 54)
'భిన్నాసురాస్త్రముల చవి
గన్న మురాహిత శిలీముఖము లపుడనిలో
మున్నెఱుఁగని సురవీరుల
క్రొన్నెత్తురు చవియు నెఱిఁగి క్రోలఁదొడంగెన్ (పారి. V 6)

3. 'స సేనాం మహతీం కర్షన్ పూర్వసాగర గామినీమ్
బభౌ హర జటాభ్రష్టాం గంగామివ భగీరథః', (రఘు. IV 32)
'... ... నిర్గమించె సురవల్లభు సేనలు భర్గజూటకాం
తారముఖంబు నన్వేడలు దైవతసింధు ఝురంబులోయనన్'.
(పారి. IV 90)

4. ... ... ... నారాచ దుర్దినమ్...' (రఘు. IV 41)
'... ... ... బాణ, వర్ష సమ్మర్ద దుర్దిన వ్యాప్తి...'
(పారి. V 9)

5. 'అయమపిచగిరం నః త్వత్ప్రబోధ ప్రయుక్తా
మనువదతి శుక స్తే మంజువాక్పంజరస్థః ' (రఘు. V 74)
'మేల్కనుము దేవ యివె రా
చిలుకలు కనుమొగిచియున్న చెలువలుఁ దమకుం
బలుకులు నేర్పఁగ ముద్దులు
గులుకెడు పలుకులను మేలుకొలిపెడు కృష్ణా.' (పారి. II 58)(61)

6. 'ప్రాయోవిషాణ పరిమోక్ష లఘూత్తమాంగాన్
ఖడ్గాంశ్చకార నృపతిర్నిశితైః క్షురప్రైః' (రఘు. IX 67)
'నిర్భిన్నశృంగుఁడై నిజవాహనముఁ దాను
వైవస్వతుఁడు లాఘవంబు నొందె'. (పారి. V 12)

7. షడృతు యుగపత్ స్థితిః మేఘు. II 2, పారి. III 45, 46

8. 'ఆసేవన్తే మధురతిఫలం కల్పవృక్ష ప్రసూతమ్.' (మేఘ. II 5)
'...కల్పవృక్షాసవపాన మత్తుఁడ వ్రుతాంధసుఁడొక్కఁడు,...
(పారి. IV 70)

9. 'వాసశ్చిత్రం...ఏకః సూతే సకలమబలా మండనం కల్పవృక్షః'
(మేఘ. II 13)
'...కల్పవృక్ష దుకూలాంశుకములు గట్టి...' (పారి. IV 40)

10. తాలైః శిఞ్జావలయ సుభగైర్నర్తితః కాంతయా మే
యా మధ్యాస్తే దివసవిగమే నీలకణ్ఠః సుహృద్వః'
(మేఘ. II 18)
'కరతాళ గతుల మందిర మయూరంబుల
నాడింపరేలొకో యతివలిపుడు.' (పారి. I 106)

11. 'పృచ్ఛన్తీవా మధుర వచనాం శారికాం పంజరస్థాం'
(మేఘ. II 24)
'కనక పంజర శారికలకుఁ జక్కెరవెట్టి
చదివింపరేలొకో సకియలిపుడు. (పారి. II 16)

12. 'మధుద్విరేఫః కుసుమైకపాత్రే
పపౌ ప్రియాం స్వామను వర్తమానః' (కుమార. III 36)

'తనుఁ గనుఁ బ్రాబి యొండొక లతం బతి వేఱొక తేఁటిబోటి పో
త్తున విరిదేనె గ్రోలగ... ...' (పారి. III 57)

13. 'ఆవిర్భూతే శశిని తమసా ముచ్యమానేవ రాత్రిః
'మాత్సర్య ఘనమేఘ మాలికాపగమ ప్ర
కాశిత హిమధామకళ యనంగ

మాఘుడు :

1. 'రణద్భిరాఘట్టనయా నభస్వతః
పృథగ్విభిన్నశ్రుతిమండలై స్స్వరైః (శిశు I 10)
'సరిగమ పధనిస సంజ్ఞస్వరంబుల
మహతి నభోవాయు నిహతి మొరయ' (పారి. I 44)

2. విభ్రాన్త మచ్ఛ స్ఫటికాక్షమాలయా (శిశు. I 12)
ప్రణవ మంత్రావృత్తి పావనస్ఫటికాక్ష
వలయంబు కర్ణ శష్కులిక వ్రేల (పారి. I 44)

భవభూతి :

కిమపి కిమపి మందం మందమాసత్తి యోగాత్
అవిరళకపోలం జల్పతోరక్రమేణ (ఉ.రా.చ. III 20)
మనోజ వికారంబులనవిరళకపోలంబుగా జెప్పికొనుచు
(పారి. II 53)

నన్నయ :

'కృతకాద్రి కందర క్రీడా గృహాంగణ
వివిధరత్నోపల వేదికలను' (ఆది IV 216)
'కృతకాద్రి కందరా కేళీనిగూహన
వేళా పరస్పరాన్వేషణములు' (పారి. I 95)

తిక్కన :

1. చకోరముల వెన్నెల విందు : నిర్వచనోత్తర రామాయణము
VI 46-48, పారి. II 49)

2. '...పడతుక లలితాంగ యష్టి పదనికి రాఁబుల్
గడిగినమరుఖడ్గలతిక
వడువున మోహన విలాస వైభవమందెన్'
(నిర్వ. ఉ. VIII 18)

'పదనికి రాఁబులు గడిగిన
మదనాస్త్రము రేఖగలిగి మానిని...' (విరాట. V 355)

.... .... .... ........ .... ఉత్తర చనుదెంచె
నలరు విలుతు పువ్వుటమ్ముఁబోలె' (విరాట. I 245)

'కలకంఠకంఠి యాగతిఁ
బులు కడిగిన ముత్తియంపుఁ బొలుపొందంగా' (పారి. I 57)

'రాజబింబాస్య రుక్మిణి తేజరిల్లె
సానఁ బట్టిన మకరాంకు శస్త్రమనఁగ' (పారి. I 78)
(VI 38, 40)

3, 'ఎవ్వాని వాకిట నిభమదపంకంబు
రాజభూషణ రజోరాజినడఁగు' (విరాట. II 191)

'ఎవ్వాని విజయంబు లెఱిఁగించు శాసన
స్తంభంబు లాశాంతశైల వితతులు' (పారి. I 12)

4. '...నే వోసిన యగ్నిభంగి...' (ఉద్యోగ. II 243)
'నేయివోయ భగ్గన దరికొన్న భీషణ హుతాశన కీలయనంగ'
(పారి. I 83)

8)

5. ‘వెడవెడ నిద్రవోంది కనువిచ్చిన పాంథులమీద’
‘వెడవెడ గన్ను మూయుఁ గను విచ్చు నగుం దలయూఁచు’
(పారి. I 101)

6. ‘...త్రిగర్తేశుండు చే వీచుడున్’ (విరాట. III 133)
‘హరిహయుఁడు...సేనకుఁ జేయివీచినన్’ (పారి. V 14)

7. ‘...నారదుఁడు వేడ్కఁ గుంచె సారింపఁగన్’ (విరాట. III 182)
‘..................... రణాశన పూని నింగిపైఁ
కుతుక రసాతిరేకమునఁ గుంచియ వీచి నటించెదనయ్యెడన్’
(పారి. V 29)

ఎఱ్ఱన :

1. ‘శేష భోగాస్పదంబయ్యు నశేషభోగ నివాసంబును.... [2]
‘గ్రావ బద్ధంబయ్యు నగ్రావబద్ధంబై, గవయ స్థానంబయ్యు
నగవయ స్థానంబై ... ... ... ’ (పారి. II 88)

2. ‘...కడలొత్తు కరమూల ఘనకాంతి చూపఱ
డెందంబుతో నిక్క డెక్కొనంగ’ (నృసింహ. II 81)
‘వినిర్మల దోర్మూలరుచుల్వెలిం బొలయ...’ (పారి. II 11)

3. దిక్పాలురు (నృసింహ. II 116-123), (ఆది IV 89-85)

4. దశావతార వర్ణన (నృ. పు. III 34-36) (పారి. 28.37)

5. ‘...విశ్వములు తామరపాకున నీరువోలె నొం
డొండ చలించె ... ...’ (నృసింహ. IV 182)
‘జలజ దళోదరోదకము చాడ్పున నల్లలలాడె లోకముల్’
(పారి. V 33)

---

2 ఇట్టి వర్ణనలు ప్రాయికముగ ప్రాచీనకావ్యములన్నింట కాననగును

6. '...ఎలజవ్వనముం బొలిపోవక యిరి
పొదవెడు వారు...' (హరివంశము, ఉత్తరభాగము. IV 91)
'...ఎలజవ్వనముం బొలిపోని వారి...' (పారి. I 37)

భాస్కర రామాయణము :

1. '(కైక)...కోపగృహంబుఁ జొచ్చి మలినాంబరంబుగట్టి...'
(అయోధ్య. 67)
'మాసిన చీరఁగట్టి..............., (పారి. I 99)
2. 'ఒరులు తలయెత్తి చూడఁగ..., (అయోధ్య. 173)
'...వారు ననుం దలయెత్తి చూడఁగా...' (పారి. I 88)
3. 'సురలకు గుండెతల్లడము. శూరుల డెందములోని కొల్కు,
శోకములకు గుండెతల్లడము కైరవమిత్రుఁడుతోఁచెఁ దూర్పునన్'
(పారి. II 41)

నాచనసోముడు :

1. కోపాటోప గజంబు మానససరః కోలాహలోత్సాహిగాన్'
(ఉ. హ. I 99)
క్రోధదంతావళక్షోభ విభ్రమ పున
స్సంజాత నైర్మల్య సరసియనఁగ' (పారి. II 15)
2. 'పాయుతోలంగు' (ఉ. హ. I 123)
'పాయుతోలంగు మంచు' (పారి. III 10)
3. 'భారతంబునుం బోలె శతపర్వ సనాథంబై ....'
(ఉ. హ. II 110)
'భారతంబునుబోలె శతపర్వ చమత్కృతంబును' (పారి. II 88)

4. '.... చట్రాతిపై పోఁకలై' [ఉ. హ. III 30]
'చట్టుపై పోఁకలై చనిరి గంధర్వులు' [పారి. V 37]
5. 'తామరపాకు నీరువలెఁ దల్లడ మందిరి పౌరులందఱున్'
[ఉ. హ. I I 35]
'జలదళోదరోదకము చాడ్పున నల్లలలాడె లోకముల్'
[పారి. V 33]
6. 'కణయ కంపణ ముసల ముద్గర పరిఘ పరశ్వథ....'
[ఉ. హ. IV 213]
'కణయ కంపణ ముసల ముద్గర పరిఘ పరశ్వథ' [పారి. IV 67]
7. 'ఇతని కితండె సాటియగు నీతని కీతఁడె సాటివచ్చు'
[ఉ. హ. IV 257]
'ఇతని కితండె సాటియగు నీతనికీతఁడె సాటివచ్చు'
[పారి. V 29]
8. 'మురళి భంజలికా సుడాలవల్గితములు....' [ఉ.హ. I 183]
'.... భంజలికా మురళీ సుడాలవ, ల్గితముల....' [పారి. II 102]
9. 'అంగుళిత్ర గోధాకలనంబు' [ఉ. హ. V 240] [పారి. V 4]

శ్రీనాథుడు :
1. 'హంస సంస దాలాప' [శృం. నై. I 99]
'హంసి సంస దారవ' [పారి. II 103]
2. 'కర్ణశష్కులి' [శృ. నై. II 7]
కర్ణశష్కులిక' [పారి. I 44]
3. 'ఆవహ సంవహాద్యనిల ఘట్టనముల
శతతంత్రి మూర్ఛనా స్వరములీన' [శృం. నై. III 6]
'మహతి నభోవాయు నిహతి మొరయ' [పారి. I 44]

4. 'ముక్కంటి దరహాసమున కనుప్రాసంబు' (భీ. ఖం. I 54)
'మహానట వికటాట్టహాస భాసంబుల కనుప్రాసంబులై'
(పారి. II 53)

5. '...కనుగానక దక్షుఁడు...' (భీ. ఖం. II 9)
'కన్నుల్ గానఁడు యాదవుండు...' (పారి. IV 63)

6. '...కల్పలతా ప్రసూన మాధ్వీమద చిత్తవృత్తులు...'
(హర. VI 4)
'కల్పవృక్షాసవ పానమత్తుఁడు...' (పారి. IV 70)

నంది మల్లయ, ఘంట సింగయ :[3]

1. 'శ్రీరామామణి సీత నాథుని యురస్సీమన్నిజచ్ఛాయఁ గ
న్నారంగన్గొని యాత్మనన్యవని తేర్ష్యంబూనఁ (శృంగారషష్ఠము
ఔదలగంగందననీడఁదానకని మూర్ధ్యంబొప్పవేఱొక్కతో
య్యలియంచున్నది నెంచుపార్వతి యసూయావాప్తికి'
(పారి. I 2)

2. 'కనుపట్టె నొక-చోట గండ భేరుండంబు
లొకవంక శరభంబు లుద్భవిల్లె' (వరాహ. I 146)
'కనుపట్టె నొక-చోట ఘనఘనా ఘనరంగ
విద్యున్నటీ నాట్య విలసనములు' (పారి. III 46)

3. 'దర్పంబు మాని యథాయథలైరి ని
లింపులు సిద్ధులు కింపురుషులు' (వరాహ. III 59)
'తలలు వీడంగ విద్యాధరుల్ పఱచిరి
గగ్గులకాం డైరి ఖచరవరులు' (పారి. V 37)

---

3 ఘంట సింగయ (మలయ మారుతకవి) తిమ్మన మేనమామ. ఈ మేనమామ మేనల్లుండ్రకు మధ్యగల పోలికలు లెక్కకు మిక్కిలి

4. '...సరసిజాక్షులు కొందఱు పళ్ళెరంబు నె
ట్టితిమని పిల్వఁగా...భుక్తిశాలకున్' (వరాహ. IV 132)
'...సఖిమణు లిద్దరు పళ్ళెరంబు నె
ట్టితిమని విన్నవించిన ... భుక్తిశాలకున్' (పారి. II 17)

పోతన :

'...సరోజాక్షుఁడు మేఘుంబుగాఁ దా విద్యుల్లతభంగి...'
(భాగ. X ఉ. 182)
'...తటిల్లదయుం జలదంబు...' (పారి II 17)

పిల్లలమఱ్ఱి పినవీరన :

'... ... ... ... ... ... ... ... బాలపల్లవా
స్వాద కషాయకంఠ విలసత్కలకంఠ కలస్వనంబులన్'
(శ. ప. III 195)
'... ... ... ... ... ... బాలపల్లవ
గ్రాసకషాయకంఠ కలకంఠ వధూకలకాకలీధ్వనిన్'
(పారి. I 133)

## కన్నడ తిమ్మణ్ణ - తెలుగు తిమ్మన

'తిమ్మన తనతో పాటుగ శ్రీకృష్ణదేవరాయల ఆస్థానము నలంకరించిన కన్నడకవియగు 'తిమ్మణ్ణ' రచించిన 'కృష్ణభారతము' నుండి కూడ కొన్ని భావములను సంగ్రహించియున్నా'డని తెలుపుచు టేకుమళ్ళ అచ్యుతరావు, నిడదవోలు వేంకటరావుగార్లు ఈ క్రింది యుదాహరణము నొసంగియున్నారు.[1]

1 విజయనగర సామ్రాజ్యము నందలి ఆంధ్ర వాఙ్మయచరిత్ర Vol.2 పుట. 218., [ఆంధ్ర కర్ణాట సారస్వతములు-పరస్పర ప్రభావము- పుట. 127.

1. మిరుగుతిహ వరసింధువసనద
సెరగ విష్ణుగె హాసి భూవధు
వొరగి దళు భుజదల్లి నరసయ కృష్ణభూవరనా
ఎరక వొబ్బరమేలె యిరలద
నరియదే కామినిగె యొలిదవ
నర వరహనె యప్పుదనె యభినైసిదను చక్రీ.

2. జనపనరసయ కృష్ణరాయన
వనజగృహె నచ్చిరలు విరహది
ననవరత హరి సిరియ కొరలెణె యెనుత శంఖవను
ఘన జఘన చక్రక్కె చక్రవ
మినుగు తిహ దంతక్కె కౌస్తుభ
వను భుజాలింగనకె వనమాలెయును ధరిసిదనూ'.

(1. భూవధువు మెరయుచున్న తన వరసింధు వసనపు చెరగును విష్ణువునకు పరచి (ముసుగువైచి) నరసయ్య కృష్ణభూవరుని భుజముపై ఒరగినది. మరియొకనిపై ప్రేమయుండుట నరయక కామినిని వలచు నరుడు వరాహమే యగుననుటను చక్రి అభినయించెను.

2. వనజగృహ (లక్ష్మి) జనపుడైన నరసయ కృష్ణరాయని నచ్చియుండగా, హరి అనవరత విరహముతో సిరియొక్క కంఠముతో సమానమని శంఖమును, ఘనజఘన చక్రమునకు సమమని చక్రమును, మెరయుచున్న దంతములకు సమమని కౌస్తుభమును, భుజాలింగనమునకు మారుగ వనమాలను ధరించెను.)

పై షట్పదుల భావమును తిమ్మన అనుకరించినాడని వీరు తెలిపిన తెలుగు పద్యము.

'యాదవత్వమున సింహాసనస్థుఁడు గామి
సింహాసనస్థుఁడై చెన్ను మెఱయ
..........................................................
అవతరించిన కృష్ణుఁడౌ ననఁగ మించె
నరస విభు కృష్ణరాయ భూనాయకుండు' (పారి. I 17)

శ్రీ మహావిష్ణువు యొక్క ఇల్లాండ్రయిన భూదేవియుఁ శ్రీదేవియు ఇరువురును తమ భర్తను వదలి కృష్ణరాయని వలచి అతని నాశ్రయించియున్నారనియు, పాపము విష్ణువు తన ఇల్లాండ్రు పరపురుషాసక్తలైన విషయము నెఱుగక ఇంకను వారిపై తనకు గల ప్రేమను వదలలేకున్నాడనియు కన్నడ తిమ్మన్న తెలిపియున్నాడు. తెలుగు తిమ్మన శ్రీ కృష్ణుడే శ్రీ కృష్ణరాయలై జన్మించినాడని చెప్పినాడు. ఈ ఇరువురు తిమ్మనలు వెల్లడించిన భావనల మధ్య సాదృశ్యచ్ఛాయ లైన లేదనుటకు సహృదయులే ప్రమాణము.

## సమకాలీనుల, అనంతరికుల అనుకరణాలు

పారిజాతాపహరణ మందలి భావములను, పదబంధములను తమ కావ్యములలో ఉపయోగించుకొని, దాని శ్రేష్ఠతను పరోక్షముగ ప్రకటించిన వారిలో ప్రథముడు, ఆంధ్రకవితా పితామహుడైన అల్లసాని పెద్దన్నగారు. సాహిత్యరసపోషణుడు రామరాజభూషణుడు ద్వితీయుడు. ప్రధానులు ధూర్జటి, అయ్యలరాజు, సంకుసాల, తెనాలి, చేమకూర కవులు. ఈ వరుసలో వారు కామేశ్వరకవి, (సత్యభామా సాంత్వనము), చెంగల్వ కాళకవి (రాజగోపాలవిలాసము) ముద్దుపళని (రాధికా సాంత్వనము) మొదలగు దక్షిణాంధ్ర కవులు పారిజాతమునకు తీసిన నకళ్ళు లెక్కకు మిక్కిలి.

'అనుకరణ ఉత్తమ ప్రశంస' (Imitation is the best form or flattery')